శ్రీరస్తు

# శ్రీ శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్యసంవాదము.



ఇది

శ్రీమదన్నంరాజు రామయోగి యతీంద్రులవారిచే

రచియింపఁబడిన

శ్రీ శుద్ధాద్వైతప్రబోధ గురుశిష్యసంవాద కందార్థములను

నీ గ్రంథమునకు

శ్రీ ధూళిపాళ్ళ గోపాలకృష్ణయోగి యతీంద్రులవారిచేత

తాత్పర్యము వ్రాయఁబడి

తచ్ఛిష్యులును బుధజనవిధేయులును అగు

బొబ్బా సుబ్బారెడ్డి, ఆ కోటిరెడ్డి, ఆ కాశిరెడ్డి

అను వారల ద్రవ్యసహాయంబున నీ గ్రంథరాజమును

అచ్చు వేయించబడి

ప్రకటింపబడియె.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

1924.

సీ. బొబ్బాకులాబ్ధిని బొడమిన సోములై
యలరారు నట్టి పెద్దంకిరెడ్డి
కొడుకు సుబ్బారెడ్డి కొమరొప్పవోబుళ
రెడ్డిపుత్రుడు కోటిరెడ్డిమరియు
ఘనకీర్తిపరుడు వెంకటరెడ్డి కొమరుండు
కాశిరెడ్డి యనంగ గలరు ముగురు
భవ్యమూర్తులుధూళి పాళ్లకృష్ణాభి ద
యోగికి శిష్యులై యుండి యిపుడు
తత్కృతాద్వైతబోధ కందార్థములను
సరస తాత్పర్యయుతముగా సంగ్రహించి
యచ్చునొత్తించి తమ కీర్తి యవనియందు
నిల్పుకొని కృతకృత్యులై నిలచి రహహ
వారి ధార్మికగుణమెన్న దరమెవిధికి.

క. హితసజ్జన బుధవర్యుం
డతిరాచకులావతంసుడైన గుణాఢ్యుం
డతులమతి గురవదాసుడు
నతతంబా యోగిసేవ సల్పుచునుండున్.

శ్రీ గురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్య సంవాదము.

## పూర్వభాగవిషయ ప్రబోధిక.

శ్రీమత్పరాత్పరాఖండ సచ్చిదానంద స్వరూపాత్మానుభవాద్వైత సిద్ధాంత సర్వోపనిషత్సారభూత పరబ్రహ్మాత్మైక్య సర్వజీవన్ముక్త సంసిద్ధ్యాత్మకంబును కేవల నిర్వికల్పాచల బ్రహ్మసుఖానందపరవశానుభవంబును శ్రీమత్సమస్త నిగమాగమయోగ శాస్త్ర పురాణేతిహాసప్రతిపాదకంబును శ్రీమత్పరబ్రహ్మ విద్యాధికార గురుసాంప్రదాయకంబును నగు మదీయ్య దేశికేంద్ర శ్రీమదాది నారాయణగురు చిదానందస్వాములవారికిని యోగసాధనచతుష్టయ సంపద్విశిష్టాధికారియగు వివేకనిధియను నొక బ్రాహ్మణోత్తమునకు పూర్వము జరిగియుండెడు శుద్ధాద్వైతప్రబోధ సంవాదమనెడు నీకథను నిప్పుడు స్వపరకృతార్థోపయోగముగ నెల్లరకు ప్రబోధపడునటుల నాంధ్ర భాషలో పూర్వభాగ ఉత్తరభాగములను రెండు భాగంబులుగా నొనర్పం బడియె. అందు నీ పూర్వభాగంబున శ్రీగురుధ్యాన మహాసాధుజనప్రార్థన గ్రంథయుపన్యాస సూచన నిజగురు పరంపరాభివర్ణన గురుమందిరాగమ వివేకనిధికథావిధాన గురుశిష్య ప్రథమ సమాగమవిధాన భక్త శరణాగత నిరూపణ విధాన తారకయోగోపదేశ విధాన జ్ఞానాజ్ఞానపరామర్శ సాంఖ్యయోగవిధాన రాజయోగామనస్క సమాహిత మహావాక్యార్థోపదేశ విధాన జీవబ్రహ్మైక్యోపదేశ విధానములు తేటపడుకథలతో షట్ప్రకరణంబులు కల్పింపబడియె.

### ఉత్తరభాగంబున.

శ్రీమత్పరబ్రహ్మ విద్యాత్రయాంతర్గత భూమవేద విద్యాప్రతిపాదక అచల బ్రహ్మమూల మంత్రార్థోపదేశవిధాన సర్వాలంకారరహిత పరిపూర్ణాలంకారాన్విత పరసత్య సూచనవిధాన పరిపూర్ణబోధవిధాన అఖండభ్రమవిసర్జన విధాన బ్రహ్మబుద్ధి నిరూపణ విధాన మహదానంద పరవశవైభవ విధానాదులు తేటపడుకథలతో షట్ప్రకరణంబులు గల్పింపబడియె. ఏతద్ద్వాదశ ప్రకరణంబులు సర్వవేదాంతసారసంగ్రహంబులుగ శ్రీగురు శిష్యసంవాద ప్రబంధముగ సర్వ సాధుజనాళులకు సత్ప్రబోధనీయ్యముగ సులభ మృదుమధుర వాక్యార్థ సంశీలితో కందార్థములుగ రచియింపంబడియె.

దీనిని ముముక్షు లత్యంతాపేక్షచే సావధానంబుగ శ్రవణపఠనాదు లొనర్చి మదీయ సర్వాపరాధంబులు క్షమించి రక్షింపవలయునని ప్రార్థించెద.

ఇట్లు, బుధజనవిధేయులు,

అన్నంరాజు రామయోగి

# విషయసూచిక.

సంపూర్ణము.

శ్రీ

గురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైతప్రబోధ గురుశిష్య సంవాదము.

## పూర్వభాగము.

### ప్రథమ ప్రకరణము.

శ్లో॥ ఆదినారాయణబ్రహ్మ సత్యం సత్యం సదాశివం ।
సత్యం సత్యం పునస్సత్యం సత్యమేవగురోః పదం॥

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥

శ్లో॥ అఖండాచలరూపాయ అఖండాద్భుత హేతవే ।
ఆదినారాయణాద్వైత శ్రీగురుబ్రహ్మణేనమః॥

శ్రీ నిజగురుస్మరణ కందార్థములు.

శ్రీ మహితమోక్షలక్ష్మీ । న్యామోహితనిజపదాబ్జ వైభవసరస । ద్వ్యోమాతీత పరాత్పర । ధామా మహనీయ్య దివ్యతారకనామా । మద్గురు సార్వభౌమాశ్రిత కామా । కామాది శత్రువిరామసూనృత గుణ । స్తోమ పరిపూర్ణాబ్ధిసోమ సుందర దివ్యతారకనామ । మద్గురు సార్వభౌమాశ్రితకామా॥

తా. శ్రీ మోక్షలక్ష్మిచే కోరబడిన, వైభవకరమైన, పాదారవిందములు కలవాడా. ఆకాశాతీతపరమునకు పరమందుండువాడా, తారకనామా, ఆశ్రితుల కోరికెలు దీర్చువాడా, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను, శత్రులను నిర్మూలముచేయువాడా, సూనృతగుణములు కలవాడా, పరిపూర్ణమహాసముద్రమందు చంద్రుడా, నా యొక్క సద్గురు రాజేంద్రా యని శిష్యుడు స్మరించుచున్నాడని భావము.

కం. శరణుమహేశ్వర గురుభూ। భరణాబ్జభవాది దివిజ భవ్యహృ
దంతః। కరణస్థిత త్రిభువన సం। చరణా ప్రణతార్తిహరణ
సద్గురు నాథా। కరుణించు నిర్గుణతత్వబోధా। శరణు శ్రితశరణ
భవహరణ మృదుచరణ శ్రీ। పరతత్వనిర్వాణ ప్రణవనిర్గుణాకార
సద్గురునాథా। కరుణించు నిర్గుణతత్వబోధా. 2

తా. గురుపరమేశ్వరా, బ్రహ్మాది దేవతల హృదయములం దుండువాడా, త్రిభువనములందును సంచరించువాడా ప్రణుతుల యొక్క యార్తిని పోగొట్టువాడా, సద్గురువరా, శరణు జేయుచున్న వాడను, పాపములను పోగొట్టు పరతత్వరూపా, పరిణామాత్మకా, నిర్గుణస్వరూపా, నాకు నిర్గుణతత్వ బోధను కరుణింపుము, వందనము లర్పించు చున్నానని భావము.

మహాసాధుజన ప్రార్థనామహిమా.

చామరవృత్తము. మహాజన స్తవం బఖండయోగమాన సాద్భుతం
బహో। మహాజన స్తవం బభేదమోదమానసాన్వితం బహో।
మహాజన స్తవం బపారతత్వమర్మధర్మమంచునే। మహాజన స్తవం
బొనర్తు ముందు మత్కృతార్థసిద్ధికై. 3

తా. మహాజన స్తవము వలని నఖండయోగము లభ్యమగు ననియు, భేదరహితమైన మనసానందము గలుగుననియు, పారము లేనిపరిపూర్ణతత్వ మర్మము యొక్క ధర్మమనియు నెంచి, నేనుకడ తేరుటకై ముందుగా మహాజన స్తవం బాచరించెదనని భావము.

మహాదోష్యనమః.

సాధుజనప్రార్థనాపూర్వక గ్రంధారంభ కందార్థములు.

కం. మహనీయ్యులార శ్రీగురు। మహనీయ్య కటాక్షలబ్ధ మహి
మాద్భుతస। న్మహనీయ్య విబుధ సమితికి। మహిలో సద్భక్తి
మొక్కి మనవి యొనరింతూ। వివేకవనధి మహిమవర్ణింతూ।

యహరహమాత్మ సన్నిహితాచలానంద । బహుళవిధిజ్ఞ సద్విహి
తసంతతికెదుట మనవియొనరింతూ।వివేకవనధిమహిమవర్ణింతూ. 4

తా. శ్రీ గురుని కరుణ వలన బొంద బడిన మహనియ్యము గలయట్టియు, సర్వకాలములయందును నాత్మసన్నిహితమైన అచలానందముచే నొప్పియుండునట్టియు, మహనియ్యులగు, యాత్మవేత్తల బృందమునకు సద్భక్తిచే మ్రొక్కి వివేకవనధియనువాని మహిమను వర్ణించి మనవిచేయుచున్నానని భావము.

కం. మీసన్నిధిలో బ్రహ్మవి । లాసముగ వివేకనిధివిలాసము సుమ
నో । ల్లాసముగ మనవిజేసెద । మా సర్వమహాపరాధములను
క్షమించి । వినవలయు విశ్వాసముగాంచి । భాసిల్లు మీముఖ్య
దాసకోటిలో నొక్క । దాసుగా నెంచి మద్దోష మహాపరాధము
లను క్షమించి । వినవలయు విశ్వాసముగాంచీ. 5

తా. తమయొక్క సన్నిధిలో మనోల్లాసము కలుగునట్లు బ్రహ్మవిలాసముగా, వివేకనిధివిలాసము మనవిజేయుచున్నాను. మీప్రియదాసులలో నన్నొకదాసునిగా నెంచి నా మహాపరాధములు క్షమించి నాయందు విశ్వాసముంచి వినవలయునని భావము.

కం శృతిశాస్త్రార్థ పురాణ । ప్రతతులు నేనెరుగలక్ష్యపదగణఛంద।
స్థితిగతులొక్కటి నెరుగను । మతిహీనుడగనుక కరుణమానకు
డయ్యా । భవదియ్య సంతతివాడనయ్యా । గతిమీరేయని సత్య
గతికి పాల్పడివిన్య । చతురత లేక నీకథ దెల్ప బూనితి మానకు
డయ్యా । భవదీయ్య సంతతి వాడనయ్యా. 6

తా. శృతి శాస్త్ర పురాణాదులేవియు నేనెరుగను,ఛందోలక్షలక్షణముల స్తితిగతులేమో నాకు తెలియదు, తెలివిలేనివాడను, తమయొక్క సంతతివాడను, తమరే గతి యని నమ్మినాడను గనుక, నాయందు కరుణించవలయును, విద్యావిహీనుడనయ్యును, నీకథ దెల్పుట కుపక్రమించితిని, వినవలయునని భావము.

కం, ముద్దుగ తమతమ బిడ్డలు । వద్దికి నేతెంచి మాటవచ్చియు
రాక౯ । యద్దద్దని పలికినవిని । తద్దయుమురిపెమును విడిచితను
మగగలరా । చెంతకుచేర వద్దనగలరా । పెద్దలుమీరటుల రద్దిశా
యక తిప్పు । దిద్ది సవరించినా పద్దుగెలిపింపక తరుమగ గలరా ।
చెంతకు చేరవద్దనగలరా. 7

తా, తమతమ బిడ్డలు తమ తల్లిదండ్రులవద్దకు మురిపెములు జూపుచూ వచ్చిరాని మాటలతో అద్దద్ద యని మాట్లాడి నట్టియున మురిపెమును వదలి దగ్గరకు రానియ్యకుండా దరుమగలరా ? తరుమ లేరు, అటులనే నాత్మవేత్తలగు తమరు నేను జేసిన గ్రంధము ను సవ రించి నాపద్దుగెల్పించెదరు గాని రద్దుజేసి తరుమగలరా ? తరుమ లేరని భావము,

కం, ఇదిసాంగముగనువిని నె । మ్మదిగను సవరింపుడనుచు మరియున
వలెనే । యదురుపడి నినుముపరుసపు । గదిసినను౯ స్వర్ణమయ
ముగను జేయుమనునే । సన్నిధినుంటే కుదురుతనుతానే । పాద
తెల్పునే తల్లికొదగి శిశుసాకటి । విధిలేనిపనివెంట నొదలకత
ము బాగు । గను జేయుమనునే । సన్నిధినుంటే కుదురుతను
దానే. 8

తా, లోకములో నినుముపరిశవేది సాన్నిధ్యమునకు బోయి నన్ను స్వర్ణముగా జేయుమని యడుగునా ? తల్లితావుకు పోయి శిశువు పాలియ్యమని యడుగవలెనా ? పరిశవేధి సన్నిధిన నినుముండిన తత్క్షణమే బంగారమవును తల్లిసన్నిధిన శిశువుండిన తానే స్తన్యమిచ్చును. ఇదివిధిలేని పనిగానున్నది. అటువలెనే నీ గ్రంధమును సాంగముగ చదివి సవరించమని నేనడుగవలెనా ? పెద్దలసన్నిధి నుంటే వారే సవరించెదరని భావము.

కం, చెలులుతముబెంచు చిలుకలు । పలికిన మురిపెముల ముద్దుపలు
కులటంచు౯ । చెలగునటుల మీపెంపక । ములలో నేనటులచాలా

ముద్దుగబలుకా । వినకెటుకలుగు కలకచేలిలుకా । తెలిసితెలి యక నేను తెలిపినవాటిలో । తెలివిలేనివిదిద్ది । తెలిసేవి నిలుపుడు ముద్దుగబలుకా । వినకేటు గలుగు కలకచేసలుకా. 9

తా. స్త్రీలు తాముపెంచు చిలుకలు పిల్లివచ్చె కొత్తమని మురిపెముగా బలికినట్టియున ముద్దుపలుకులని సంతసించెదరు. అటు వలెనే తమచే బెంచబడిన శిష్యుడనగు నాముద్దు పలుకులు విని సంతోషపడుదురు గాని నాయందు కోపమెందుకు గలుగును. తెలిసి తెలియక నేను పలికినవాటిలో తెలివిలేనివినవరించి తెలిసేవి నిలువు మని భావము.

కం. మునులార యీప్రబోధను । పునరుక్తుల నేకగతుల బుట్టెను వీటికి । విని యాగ్రహింతురేమో । కనుపించితి యర్థభేదగతు లతో నేనూ । యెరిగెరిగికల్పనజేసినానూ । నెనరుగల తలిదండ్రు లనిశము పసిబిడ్డ । లను పునరుక్తుల వినగోరునటుల సంగతులతో నేనూ । యెరిగెరిగి కల్పనజేసినానూ. 10

తా. మునులారా నీ గ్రంథమందనేక పునరుక్త లున్నవి. వానినిజూచి కోపపడెదరేమో । తలిదండ్రిల ముందర పసిపిల్లలనేక పునరుక్తులు మాట్లాడినను వాని వినగోరుదురు గాన వానినే నెరిగియు నర్థభేదములు గాగనుపించితినని భావము.

కం. ఘనసంస్కృతాది భాషల ♦ బెనగగకల్పించు కృతులుబెట్టని యిదియుక్ । వినపేల్వంబగు తెలుగని । పనికేరాదనకు డితర భాషవ్యర్థమెగా । చదివిననరులకైన నర్థమెగా । జననభాషలలో నేజనులాత్మ స్థితిగతులు । గను శక్తిలేనపుడు మనసు కందని యితరభాష వ్యర్థమెగా । చదివిన నరులకైన నర్థమెగా.

తా. సంస్కృతాది భాషలలో కల్పించు కృతులు వినుటకు బెట్టుగాను శ్రావ్యముగానుండును. ఇది వినుటకు పేల్వముగానుండు

తెనుగు కవిత్వము పనికిరాదని తమరనకుడు. సంస్కృతాది భాషలు చదివిన వారికే నవియర్థగ్రాహ్య మగును గాని చదువని వారికి భ్రాంతిగా తెలియదు. జననభాషలోనే నాత్మస్థితి గతులు గ్రహించ లేనిజనులకు సంస్కృతాది భాషలెట్లు తెలియును. మనసు కందని భాషవ్యర్థమేనని భావము.

క. ఈచిట్టిపొట్టి కథలో । నేచిత్రిములున్నవంచు నెంచక తుదకుఁ । జూచిననిజ పరమార్థము । గోచరమగు గురుతదియ్యకోటికి నెపుడూ । పరధనమిందూదాచితీ చూడూ । సూచనగను గురుచే చందమున నాదు । వాచకుడై పల్కె నాచందమిదె గురుకోటికి నెపుడూ । పరధనమిందు దాచితిచూడూ. 12

తా. ఈకొద్దిపాటి కథలో నేచిత్రములున్నవని నెంచక గురుపుత్రులీగ్రంథమును కడవరకు జదివిన నిజమైన పరిపూర్ణార్థము కనుపడును. పరిపూర్ణధనమిందు దాచితిని. నాసద్గురు స్వామినావాక్కున నుండి యేప్రకారము పలికించెనో నా ప్రకారము యిట్లు పలికితినని భావము.

శ్రీనిజగురుపరంపరాభివర్ణనము.

క. ధరనాచంద్రార్కస్థితి । బరగిన సద్గురు ప్రవర్గపరతత్వ పరం । పరలకు ప్రణమిల్లి మహా । పరిపూర్ణాఖండ భక్తిప్రస్తుతి జేతూ । గురువర మూలపురుషులదలతూ । గురుమూల మెరుగక పరమూలమెట్లెరుగు । పరమూలాధారము గురుమూలమేగనుక ప్రస్తుతి జేతూ । గురువర మూలపురుషుల దలతూ. 13

తా. భూమియందాచంద్రార్కస్థితిగా నుండిన నాగురుపరంపరలకు ప్రణుతులొనర్చి పరిపూర్ణ ఖండభక్తిచే ప్రస్తుతించి నాసద్గురుని మూలపురుషుల జెప్పుచున్నాడను । గురుమూల మెరుగక పరమూలమెట్లు తెలియును. పరిపూర్ణ మూలాధారము గురుమూలమేనని భావము.

కం. శ్రీమద్ఘన పరిపూర్ణ మ । హామహిమాఖండ గురుగుహాంతర్వి
ద్యా । ధామపరబ్రహ్మంబున । శ్రీమత్పర శివుడుగలిగె శ్రీకరుడ
నగా । పరతత్త్వాబ్ధి శశధరుడనగా । ఆమహేశుని కాత్మప్రేమ
శిష్యుడు బ్రహ్మయామహాత్మునకు శిష్యు । డమరె శ్రీఋభు బ్రహ్మ
శ్రీకరుడనగా । పరతత్త్వాబ్ధి శశధరుడనగా. 14

తా. పరిపూర్ణాఖండ గురువిద్యయగు ధామపరబ్రహ్మంబునందు పరిపూర్ణా మహాసముద్రమున చంద్రునివలె పరశివుడు బుట్టెను. ఆ మహేశునాత్మయందు ప్రియశిష్యుండై బ్రహ్మజన్మించె నా బ్రహ్మకు ఋభుబ్రహ్మ ప్రియశిష్యుడాయెనని భావము.

క. శ్రీమద్వేదాంత మహా । ధీమణియగు ఋభునిశిష్యవరుడు నిదా
ఘుం । డామానికి వాసిష్టుం । డా మహనీయ్యునకు శుకుడాయె
శిష్యుడుగా । నామహానీయ్యు డఖిలభూతుడుగా । శ్రీమీరశుకు
నకు ప్రేమసాందీపకు । డా మానికి కృష్ణుడతని కుద్ధవునాముడాయె
శిష్యుడుగా । నామహనీయ్యు డఖిలభూతుడుగా.

తా. వేదాంతధీమణియగు నా ఋభుమహర్షికి నిదాఘుడుశిష్యు డాయె నామహాత్మునకు విశిష్టమహర్షి శిష్యుడాయె. ఆమహనీయ్యునకు శుకులవారు ప్రేమశిష్యుడాయె. నాశుక బ్రహ్మకు సాందీపుల వారును వారికి శ్రీకృష్ణమూర్తియు, శ్రీకృష్ణునకుద్ధవులవారును శిష్యులైరని భావము.

కం. ఆయుద్ధవునకునచల । శ్రీయుతసంసిద్ధయోగి శిష్యుండయ్యె ।
యీయోగికాత్మదర్శను । డాయెను నిజశిష్యుడగ్ర్యధీమణియనగా,
యోగాంతర్విధాయకుడనగా। ఆయాత్మదర్శనుకాయె శ్రీధర స్వామి।
యాయోగికిని శివరామయోగి శిష్యుడాయెనయముగా । యో
గాంతర్విధాయకుడనగా. 16

తా. ఆయుద్ధవులవారి కచలానుభవులైన సంసిద్ధయోగిశిష్యుం

డయ్యెను. ఈ సంసిద్ధయోగికి యోగాంతర్విధాయకుడైన యాత్మదర్శనుడును, ఆత్మదర్శనునకు శ్రీధరస్వాములవారును, శ్రీధరస్వామికి శివరామయోగియు శిష్యులైరని భావము.

కం. ఆశివరామసుదీక్షిత। దేశికునకు స్వప్రకాశధీమణులప్పా। ఖ్యేశ శ్రీరామకృష్ణ మ। హేశ సదానందభూసురేంద్ర పంచకమూ। శిష్యకోటిభాసించె జగము। ఆశిష్యులఖిలప్రదేశములలో బ్రహ్మ। దేశికమణులై ప్రకాశించిరటుభూసురేంద్రపంచకమూ। శిష్యకోటిభాసించెజగమూ. 17

తా. ఆ శివరామదీక్షితులవారికి స్వప్రకాశభాస్కరుడు, అప్పారావు, రామకృష్ణయ్యగారు, మహేశ్వరుడు సదానందులను నైదుగురు భూసురోత్తములు శిష్యులైరి. ఈ అయిదుగురు బ్రహ్మవేత్తలును సర్వదేశములలోను బ్రహ్మదేశిక మణులై ప్రకాశించిరని భావము.

కం. ఆసాధులకగ్రజుడై। భాసిల్లెడు స్వప్రకాశభాస్కరునకు యో। గాసక్తుడతనికచల వి। లాసాఖ్యుడుశిష్యుడాయె లావణ్యముగనూ। గురుసంతతిభాసిల్లెధరమా। ఆసర్వసమునకు భాసుబ్రహ్మణ్య। భూసురు డొకశిష్యుడాసక్తిప్రబలెను। లావణ్యముగనూ! గురుసంతతి భాసిల్లెధరనూ. 18

తా. ఆబ్రహ్మవేత్తలలో మొదటివాడైన స్వప్రకాశభాస్కరునకు యోగాసక్తుడును, వీరికి నచలవిలాసుడును, అచలవిలాసునకు త్రిపురారిభట్ల సుబ్రహ్మణ్యేశ్వరుడును, శిష్యులై యీప్రకారము భూమియందు గురుసంతతివృద్ధియై ప్రకాశించెనని భావము.

కం. గురులోక కళానిధియై। సారదిణ త్రిపురారిభట్లసుబ్రహ్మణ్యే। శ్వర బ్రహ్మదేశికాఖ్యుడు। స్థిరముగ స్వానుభవవిభవ సిద్ధాంతిఘనగా। ప్రబలెనుపరమ గురుతిలకమనగా। వారికి వ్యాకరణ

వరకులాబ్ధి హిమ । కరు డాదినారాయణమూర్తి శిష్యుడై సిద్ధాంతియనగా । ప్రబలెను పరమగురుతిలకమనగా. 19

తా. ఈత్రిపురారిభట్ల సుబ్రహ్మణ్యేశ్వరుడు గురువులలో నగ్రగణ్యుడై స్వానుభవపరిపూర్ణసిద్ధాంతియని వినుతికెక్కి ప్రకాశించెను. వారికి వ్యాకరణవంశపయఃపారావారసుధాకరులుగా నాదినారాయణమూర్తి శిష్యుడయ్యెనని భావము.

కం. ఆమునివరలోకైకశి । ఖామణియె మదీయదేశికాగ్రణి భాస్వ । ద్ధీమణి భక్తహృదబ్జ। వ్యామోహావికర్తనుండై వాసికెక్కెనుగా। ఆదినారాయణబ్రహ్మమనగా । ఆమహాత్మునికృప నామదిలోనిలచి। భూమిని కందార్థస్తోమమువిరచించె వాసికెక్కెనుగా । ఆదినారాయణబ్రహ్మమనగా. 20

తా. లోకమందలి బ్రహ్మవేత్తలకెల్లను శిఖామణియగు నామహామహుడే నాయొక్క దేశికస్వామివారు. భక్తుల హృదయములందుండువ్యామోహమునుపోగొట్టునట్టి ఆదినారాయణబ్రహ్మమని వినుతికెక్కెను. ఆమహాత్మునికృప నాహృదయమందు నిలచి యీకందార్థములు రచించెనని భావము.

కం. బ్రహ్మకులాగ్రణియై త । ద్బ్రహ్మవిలాసకు డఖండప్రాభవఘనన। ద్బ్రహ్మపదపీఠనివసిత । బ్రహ్మశిఖామణియనంగ ప్రబలెగుసస్వామీ । బ్రహ్మాండభాండ బహిరంతర్యామీ । బ్రహ్మయోగియాదినారాయణపర । బ్రహ్మఖ్యచే వేదబ్రహ్మభవనములోన ప్రబలెగురుస్వామీ । బ్రహ్మాండభాండబహిరంతర్యామీ. 21

తా. బ్రహ్మవిలాసముచే నొప్పియుండు నాపరంధాముడు బ్రహ్మాండభాండముల వెలుపల లోపల నిండి వేదములను బ్రహ్మభవనములో బ్రహ్మపదపీఠమందునివసించి ఆదినారాయణపరబ్రహ్మయోగియనిపిలువబడి బ్రహ్మవేత్తలకు శిఖామణిగా ప్రకాశించె నని భావము.

కం. ఈ రేడగుజగములకు । న్నారాయణు డెట్లుకారణాత్మక సర్వా ।
ధారకుడగునటులను మ । త్కారణగురుమూర్తి వెలసె ఘనయో
గప్రభగా । ఆదినారాయణబ్రహ్మమనగా । శ్రీరాజయోగవిశార
దచ్ఛిష్యపరి । వారములెల్ల విస్తారతదనుగొల్వ ఘనయోగప్రభ
గా । ఆదినారాయణబ్రహ్మమనగా. 22

తా. ఈజగత్తుకెల్లనుశ్రీమన్నారాయణమూర్తి సర్వాధారుడై కారణుడుగానుండి నట్లు రాజయోగాభ్యాసులుగానుండు శిష్యసమూహములు తననుగొల్చుచుండగా కారణగురుమూర్తి యాదినారాయణపరబ్రహ్మము పరిపూర్ణయోగప్రకాశముగా ప్రకాసించెనని భావము.

కం. వరసాధురక్షణార్థము । పరహితమోక్షాదిదానపరధర్మనవ । స్ఫు
రణనవరత్నకంకణ । వరకలితప్రశస్తహస్తవైభవుడగుచూ ।
త్రిభువనమోహనగురుడగుచూ । ధరవిస్తరిల్లిభాసురశిష్యనక్షత్ర ।
పరివేష్టితహిమకరుడగుచు । వరదివ్యవైభవుడగుచూ॥ త్రిభువ
నమోహనగురుడగుచూ. 23

తా. నాసద్గురుస్వామి పరమునపేక్షించు సాధులను రక్షించుటకై ముముక్షులుకోరు మోక్షాదిదానము చేయుదునని పరిపూర్ణస్ఫురణయను నవరత్నకంకణమును తనహస్తమునధరియించి, ధరయందు వ్యాపించి శిష్యులను నట్టినక్షత్రములచే చుట్టబడిన గురుచంద్రుడుదివ్య వైభవముగలవాడై యొప్పియుండెనని భావము.

కం. ఈరీతిబ్రహ్మసభలం । దారూఢిగ శిష్యగణముకాత్మైక్యసుఖాధా
రపరిపూర్ణబోధల । కారణగురుడాజ్ఞయొసగు కాలములోనూ । గు
రుమహిమచేకూరె వేరుగను । ధారుణిను వేకధీరుశాస్త్రగురుని । జే
రవచ్చేటికథ । యూరికెనోనరెయూకాలములోనూ । గురుమహి
మచేకూరె వేరుగనూ. 24

తా. ఈవిధముగా నాకారణగురుడు బ్రహ్మసభలయందు శిష్యగణముల కాత్మైక్యసుఖాధార పరిపూర్ణబోధ లనుగ్రహించుకాలము

లో గురుమహిమవలన కాకతాళీన్యాయముగా నీభలో గురుమూర్తి సన్నిధికి. వివేకధీరుడను బ్రాహ్మణుడొచ్చినకథ సమకూరెనని భావము

— వివేకనిధికథాప్రారంభము —

కం. అవనిస్థలిలోన సదా । శివపురివెల్గొందు గుణవిశిష్టత్వమహా
సువివేకాఖ్యునుగృహమై. భవ సతిసుత బాంధవులతో ప్రబలెభూసు
రుడూ । సంసారసమ్మోహపరవశుడూ । అవివేక కామక్రోధాది
నివహములతో । తవిలి బహుకాలము వివిధదుష్కృతములప్రబలె
భూసురుడూ । సంసారసమ్మోహపరవశుడూ.

తా. భూలోకమందు సదాశివపురియను నొకపట్టణంబుగలదు. ఆపురియందు వివేకనిధియను బ్రాహ్మణుడు సతి సుత బాంధవులతో కూడి కాపురముండెను. ఆయన కామ క్రోధాది అవివేకవర్గములలో దగులుకొని బహుకాల మనేకవిధములగు దుష్కార్యము లొనర్చుచు సంసార మోహపరవశుడై యుండెనని భావము.

కం. గతసకలజన్మదుష్కృత । వితతమహాక్రూరకర్మవిధులనువిప్రుం ।
డతులితవర్గత్రయముల । మతిహీనత వేదశాస్త్రమంత్రతంత్రము
లూ । చదివెనుబహుగతులసంగతులూ । వ్రతజపోపవాసక్రతు
తీర్థస్నాన స । త్కృతులు జేసి యాత్మహిత మెందుగుదరక మం
త్రతంత్రములూ । చదివెను బహు గతుల సంగతులూ. 26

తా. ఆబ్రహ్మణుడు పూర్వ జన్మమందు చేసినదుష్కృతక్రూరకర్మల విధివశముచే వర్గత్రయములచే మతిచెడి, వేదశాస్త్రపురాణాదులుచదివి, అనేకవ్రతములు, జపములు, తపములు, ఉపవాసములు, తీర్థస్నానములు, మొదలగుసత్కార్యములు జేసి, దేనివలననునాత్మహితము కుదురకుండెనని భావము.

కం. ఇటుజరిపెడివిప్రుడుమది । చిటిలిమహారణ్య పుణ్యక్షేత్రాదులునం ।
తట తిరిగితిరిగి మరి వేస । టచేనొకనాఁడుబల్కె సహజముగానూ ।

పూర్వపుణ్య ఫలసిద్ధితోనూ । ఎటులైననిదిదుర్ఘటకర్మకడి తేర
భటువుదెట్లొటి గురుడుఘటియించునోలేదో । సహజముగానూ
పూర్వపుణ్యఫలసిద్ధితోనూ. 27

తా. ఈవిధముగానుండువిప్రుడు మదికుదరక మహారణ్యములు పుణ్యక్షేత్రాదులునంతటతిరిగితిరిగి మనస్సువిసిగి నొకానొకనాడు తన పూర్వజన్మఫలపరిపాకమువలన నేనిప్పుడుచేయుచున్నకర్మ మహాదుర్ఘటముగానున్నది. నేనుకడతేరుమార్గముగుపడలేదు. నన్నుకడతేర్చొటి గురుడునాకు ఘటియించునోఘటియింపడోనని వ్యాకులపడెనని భావము.

కం. అనియిటుభూదేవకులుం। డనుపము దైవజ్ఞకాముహితుశ్రోత్రియు
సజ్జనమణియు నయాచితుడగు । ఘనతర సద్బ్రహ్మనిష్ఠు గనుగొన
దలచీ । ఇలువిడచీ జనపదములుగడచీ । తనివిదీరగ స్వేచ్ఛాజని
చనియొకనాటి । దినమందు నీసభగని నంతసిలి జేరె గనుగొన
దలచీ । ఇలువిడచీ జనపదములుగడచీ. 28

తా. వివేకనిధి యీప్రకార మనుకొని అనుపముడైన దైవజ్ఞుడును, శ్రోత్రియుడును, సజ్జనశ్రేష్ఠుడును, అయాచితుడును, నగు బ్రహ్మవేత్తదర్శనము చేయగోరి, యిల్లు విడచి తనివిదీరు నట్లనేక, పల్లెలు, పట్టణములు, తిరిగితిరిగి యొకనాడీ బ్రహ్మసభను జూచి సంతసించి జేరెనని భావము.

కం. వచ్చితనుబ్రహ్మసభలో । జొచ్చిమహాజనుల మధ్యచారువిభాస్వ।
త్సచ్చరితు దేశికుని గని । యచ్చెరువుగ నతని మహిమ నాత్మ
నుతిజేసీ । మోహౌనత్తిహెచ్చి కనుమూసీ । ముచ్చట సాష్టాంగ
ముగ వందనము జేసి । నిశ్చయసద్భక్తి సచ్చరిత్రుని మహిమ ।
నాత్మనుతి జేసీ । మోహౌనత్తి హెచ్చి కనుమూసీ.

తా. ఈరీతినాబ్రాహ్మణుడీ సభజేరి మహాజనులమధ్య ప్రకాశించు, మహామహులైన గురుసార్వభౌముని దర్శించి, వారి మహాత్మ్య

నాత్మయందు స్తుతించి, మోహాసక్తి హెచ్చి కనులుమూసి, నిశ్చల భక్తిచే సాష్టాంగవందనము లిట్లాచరించెనని భావము.

భుజంగప్రయాతము. నిజగురుప్రార్థన.

శ్లో॥ నమస్తె నమస్తె నమోకారణాయ । నమస్తె నమస్తె నమోచిద్ఘనాయ । నమస్తె నమస్తె నమోశాశ్వితాయ । నమోశ్రీగురుబ్రహ్మరూపాయతస్మై॥

శ్లో॥ శ్రీమత్రిభువనా ఖండ । గురుభూమండలాంతరం । ఆదినారాయణం నిత్యం, నమామిగురు మద్వయం । నమో బ్రహ్మస్వరూపాయ । నమోబ్రహ్మకళాత్మనే । నమస్తెకారణేశాయ । గురూణాంగురు వేనమః॥ 30

సంధి కందార్థములు.

కం. ధ్యానార్చనాది క్రియలిటు । మానసమున జేసి బ్రహ్మమానీంద్ర సభా । స్థానముఖమందు నిలచిన । వానిగనెఁ గురుడఖండ వైభవముతోనూ । అంతలొశిష్యాగ్రణి తా నిట్లనెనూ । దీనదయానిధేస్వానుభవా ఖండ । జ్ఞానభిక్షాం దేహి మాంరక్షయని ప్రొక్కినై భవముతోనూ । అంతలొశిష్యాగ్రణి తానిట్లనెనూ.

తా. ఈవిధముగా ధ్యానార్చనాది క్రియలు మానసికమున జేసి బ్రహ్మవేత్తల సభాస్థానముఖమున నిలచియున్న భక్తుని మహావిభవముచే నొప్పియున్న సద్గురు చంద్రుడాదరమున జూచెను. అంతలో వివేకనిధి సాష్టాంగ నమస్కారములు జేసి దీనదయానిధే స్వానుభవాఖండజ్ఞాన భిక్షాం దేహి, మాంరక్ష యనియనెను. అనగా దీనులయందు దయగల స్వామీ, స్వానుభవముచే నొప్పియుండు పరిపూర్ణజ్ఞాన భిక్ష నిడి నన్ను రక్షింపుడని వేడుకొనెనని భావము.



శ్రీగురుభ్యోనమః.

శ్రీశుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్యసంవాదము.

పూర్వభాగము-శరణాగతప్రకరణము.

ద్వితీయ ప్రకరణారంభము.

---

కం. గురునాథనీదు మహిమలు । గురుతెరుగక నామమూర్ఖ కుటిల విచిత్ర । స్ఫురణయను చిత్తవిభ్రమ । మరుదుగజనె కాలకర్మ మదియేమనుకొందు । ప్రారబ్ధానుభవము విడదెందు । గురుతర మోహసాగరమునబడి పొరలు । నరుడ పామరుడ దుష్కరుడ పరహీనుడనదియేమనుకొందు । ప్రారబ్ధానుభవము విడదెందు.

తా. గురురాయా నాయొక్క మూర్ఖకుటిల విచిత్రమైన స్ఫురణయనే చిత్తభ్రాంతిచే తమ మహిమలు దెలియజాలక వృధాగా నింతకాలము జరిగె నేనేమనుకొందును. నా ప్రారబ్ధానుభవ మిట్లుండెను. పారములేని మోహసాగరమందుపడి పొరలెడి పామరుడను దుష్కార్యముల జేయువాడను. తెలివితక్కువ వాడనైన నన్ను రక్షింపుమని భావము. 2

కం. తెలియక జనుకాలము నీ । తలపున నే తలచబడక తలచిన దెన । త్ఫలకాలమనుచు సౌఖ్యము । చెలగునహో యిపుడు గురుని చెంతలో నిలచి । కలవలె పూర్వకథలెల్ల మరచి । తెల్విగల్గిన మీద తెలివిలో తెలివింక । తెలియుమింతేచాలు తెలివితోలగా లోనాచెంతలో నిలచి । కలవలెపూర్వ కథలెల్ల మరచి.

తా. శిష్యా భ్రమచే తెలియక జరిగినకాలమునునీవుతలచ నేవద్దు యిప్పుడు మోక్షేచ్ఛగలిగి గురుచెంత నిలచి పూర్వకథలెల్లను కలలో

ముచ్చట్లవలె నెంచుము. ఇదే ఫలకాలమని నెంచుము తెలివిగలిగిన మీకట తెలివిలో తెలివిని తెలిసికొమ్ము. యింతే చాలునని భావము.

కం. ననుగని కానకనిర్దయ । తనుగను మర్కటకిశోరధర్మము లోకం । బునగలదనుకొని గురిచే । నినునేనును విడువజాల నిజ మునీవేళ । నీమానసమం దనుమానమేలా । తను వెరుక లస్థిర మని ఘనులుదెల్ప నా । మనసు నిల్వదు నరక్షణము నికజరుపాకు నిజము నీవేళా । నీమానసమం దనుమాన మేలా. ౩

తా. గురునాథా మర్కట కిశోరధర్మము లోకములో నున్న దనుకొని నిప్పుడు నేను మిమ్ములవిడువను శరీర మెరుకలస్థిరములని పెద్దలు చెప్పగా వినియుండి నామనసు నిల్వలేదు. నిమిషమైనను నోర్వజాల. కాలము జరుపకుడని భావము.

కం. ననుజూచిన పిమ్మట నీ । కనుమానము లేదు లేదు యతులత భక్తిక । ఘనతీవ్ర మోక్ష భిక్షాశన కాంక్షచె నిలుచు విజయశా లికి నెపుడూ । తనుసంసిద్ధి తానె యొనగూడూ । ఘనసద్గురుని గన్నతనువొక్క క్షణమున్న । వినశక్తి లేకున్నత నెముక్తి నొందిం చుశాలికి నెపుడూ । తను సంసిద్ధి తానె యొనగూడూ. ౪

తా. శిష్యా నాదర్శనము చేసినమీదట నీ కనుమాన మెన్నటి కినిలేదు. ఘనమైన భక్తిచే తీవ్ర మోక్షాశనాభిక్షాపేక్షచేత వచ్చిన జయశాలికి తనువు సంసిద్ధి తనంతట తానే యగును. ఘనుడగు సద్గురునిదర్శనమైన పిమ్మట శరీర మొక్క క్షణమున్నను వినుటకు శక్తి లేక పోయినను సద్గురుడే ముక్తిని జెందించునని భావము.

కం. ఓపరమేశ్వర కారణ । భూపాలక సర్వలోక పుణ్యాత్మక మ । త్పాప విమోచనమునకై । నీపదములె నమ్మికొంటి నిజగురు చంద్రా । నిర్మలమోక్ష నిత్యయోగీంద్రా । దీపకసర్వదిగ్వ్యాపక పరమ చి । ద్రూపకలాపసన్నిపట్ల బ్రోవావె నిజగురు చంద్రా । నిర్మలమోక్ష నిత్యయోగీంద్రా.

తా. కారణపరమేశ్వరా, సర్వలోక వ్యాపకా, పుణ్యాత్మా, నిర్మల మోక్షము నిచ్చువాడా, సర్వదిశలందు ప్రకాశించువాడా, పరిపూర్ణరూపా, నా యొక్క పాపవిమోచనకొరకు తమ పాదారవిందమునే నమ్ముకొని యున్నవాడను గాన నన్నిపుడె కాచి రక్షింపవలెనని భావము.

కం. పరముక్తి కగ్రిసాధన । నరయగ సద్భక్తియదియె యాత్మవిచార । స్ఫురణకనురక్తి గావున । పరహితవర దేశికేంద్రభక్తియులేక । భవఘోరవిముక్తికాదీక। శక్తిచే వేదాంతయుక్తులు పలికిన వ్యక్తికలుగు నెబ్రహ్మసక్తిచేకూరునె భక్తియులేకా ।
. భవఘోరవిముక్తి కాదీకా.

తా. శిష్యా విచారించగా, పరముక్తికి మొదటి సాధన సద్భక్తిగానున్నది. ఇది యాత్మవిచారణచేయుట కనుకూలమైనది. గనుక పరిపూర్ణాచల గురువునందు భక్తిలేక ఘోరమగు పాతకము వీడిపోదు. వూరక తమతమ చాకచక్యముచే వేదాంతయుక్తులు పలికిన నమాత్రముననే పరబ్రహ్మశక్తి గలుగునా? గలుగదని భావము.

కం. జాతకఫలమేమొ కదా। పాతకములొనర్చి సర్వప్రాణి విఘాతి । ఖ్యాతిగ దుష్టుడనైతిని । యే తప జప మంత్రసిద్ధు లేరుగను స్వామీ । నాజన్మ సంప్రాప్తమిదె మీ । భూతలమున తిరిగి నీతులెరుగక నత్యా । తురమున జేర నన్నేతీరుబ్రోచెనో । యెరుగను స్వామీ । నాజన్మ సంప్రాప్తమిదేమీ.

తా. గురుదేవా నాజాతకఫలమేమో తెలియదు. నే ననేక పాతకములు జేసి దుష్టుడనని ప్రఖ్యాతి జెందితిని, నే నే తపములు, జపములు, మంత్రసిద్ధుల నెరుగను, నీతినిషిద్ధములు లేకుండా, భూమిమీద నంతట తిరిగి, నాపూర్వజన్మపుణ్య పరిపాకమువలన నత్యాతురముచే, తమ పాద సన్నిధి చేరితిని, నన్నెట్లు కడతేర్చెదరో నని భావము.

కం. ఎచ్చట నెచ్చట నేనా । సచ్చరితులజేరి పరమసాధన బలసం ।
పచ్చరితయోగ విద్యల । హెచ్చుగ నీవభ్యసించితే స్థలమందూ ।
వేదశాస్త్రభాష్యములు ముందూ యేయుపాయములలో నేనే
ధర్మము లెట్లు । సేయుచుంటివి మాతో దాయకదెల్ప రాయే
స్థలమందూ । వేదశాస్త్రభాష్యముల ముందూ. 8

తా. శిష్యానీవెచ్చట నేమహాత్ములనుజేరి పరసాధన కనుకూలించు యేయే యోగము లభ్యసించితివి ? వేదశాస్త్రవ్యాఖ్యా లేమైన నుచదివినావా ? యేయే ధర్మము లెట్లుజేయుచుంటివి ? యనియన్నియు విపులముగా మాసన్నిధిని దాచకుండ దెల్పుమని భావము.

కం. సకలంకమప్రజ్ఞాన్విత । ప్రకటమహావేద శాస్త్రపౌరాణతతుల్ ।
యొకటయిన విడువజాలక । సకలము గ్రహియించి యోగసాధ
కుడనయితీ । సర్వమంత్ర తంత్రకుడనయితి । సకలవేద శాస్త్ర
సకలయోగములలో సుఖమొకటిలేక సద్గతికయి ప్రార్థనసేతూ
సాధకుడనయితి । సర్వమంత్ర తంత్రకుడనయితి. 9

తా. గురువరా! ప్రజ్ఞతో గూడుకొని మహాప్రఖ్యాతిగల వేద శాస్త్ర పురాణాదులనెల్ల నొక్కటైనను విడువకుండా గ్రహించి యోగముల సాధించితిని. సర్వమంత్రములను తంత్రములను నేర్చుకొంటిని సకలవేద శాస్త్రములలో సకల యోగములలో నేమియు సుఖముగానక సద్గతికొరకు తమను ప్రార్థనచేయుచున్నానని భావము

కం. ఔరా నీమదినేర్చిన । కారణకార్యముల ముక్తి గానకనే నో। నో
రెరుగనిబాలునికిరియ । వేరొకవిధమునను బలుకవింటివిగదరా ।
కానరానిమరుగు నెరిగితిరా । క్షీరవైరాగ్యవిహార తీవ్రమోక్షు ।
కారణసత్యసంకల్పమెటుగల్గె వింటివిగదరా। కానరానిమరుగు నెరి
గితిరా. 10

తా. ఔరా శిష్యా, నీవునేర్చిని విద్యలవలని ముక్తిగానక యే

మోమాటలు గాని బాలునివలె నేమీ తెలియదని మర్మముగా జెప్పితివి. ఇంత తీవ్ర మోక్షాపేక్షసంకల్పము నీకెటులగల్గెనని భావము.

కం. కలిగిననా సంకల్పము । ఫలితంబగు నేని నిపుడె భవదీయ్యోదయా ।
కలితశుభ వీక్షణయు । క్సలలిత తనుదర్శనంబె చాలుగురునాధా ॥
బోధించుముజ్వలతత్వబోధా । వెలలేని మోహవాంఛలచేత మెల
గెటి । కలుషచిత్తుడనని తెలిసిబోధించావే చాలుగురునాధా॥ బో
ధించుముజ్వలతత్వబోధా. 11

తా. గురుచంద్రా తమ దయతోగూడుకొనిన శుభదృష్టిగల దివ్యతనుదర్శనమువలన నాకుగలిగిన మోక్షసంకల్పము సఫలమైతే నిప్పుడే కృతార్థుడనయ్యెదను. మోహవాంఛలలో తగులుపడియున్న పాపచిత్తుడనని తమరు తెలిసికొని పరతత్వబోధ నొసగుడని భావము.

కం. గురుపుత్రగణముజేరక । గురుభక్తియులేక నాత్మగృహకృత్యము
కై । గురుగృహవాసముచాయక । గురువాక్యమువినకముండ కుదు
రునెముక్తి । ద్వాదశవర్షగురుదీక్షాభక్తి । గురుకులవాససద్గోష్ఠిలే
కనాత్మ । గురుమహిమదెలియక గురుతత్వమెట్లెరుగు కుదురునేము
క్తి । ద్వాదశవర్షగురుదీక్షాభక్తి. 12

తా. శిష్యా, నీవు గురుపుత్రులలోజేరక, గురుభక్తిలేక నాత్మవిచారణకై గురునియింటనుండక, గురు వాక్యమువినక, పండ్రెండు సంవత్సరములు గురునిసేవించి గురుమహిమ తెలియకముందే నీకు ముక్తెటుల లభించును ? లభించదని భావము.

కం. పదిరెండగువర్షమ్ములు । మదిచెదరక మీదుదివ్యమందిరముననే।
వదలకహోరాత్రులు నీ । పదుగురు సుతులందుగలసి పడియుండ
గలనా । పరిచర్యలేర్పడసేయగలనా । పదపడినేనింక పదిరెండేం
డ్లకుగాను । పదిరెండుదండముల్ భక్తితోబెట్టెదపడియుండగలనా।
పరిచర్యలేర్పడసేయగలనా, 13

తా. గురునాథా పన్రెండేండ్లు మనస్సు చెదరకుండా నహోరాత్రులు తమదివ్యగృహమున గురుపుత్రులలోజేరి పరిచర్యలు జేయుచూ నేనుండగలనా ? నేనుండజాలనుగనుక పదిగొండేండ్లకుగాను భక్తిచే పన్రెండువంగసము లాచరించెదనని భావము.

కం. గురుసేవ కుదురు టొతో । పరిపూర్ణసుఖంబు తనకుపాల్పడుటంతే। గురుసేవపూర్తిసేయని । నరులపరోక్షమును జెంద నర్హులుగారూ । పామరులాత్మపరులుగాబోరు । గురుధర్మమున లేదు గురుమతమదిగాదు । గురుపుత్రులెరుగక గురుడొప్పదేశించు నర్హులుగారు । పామరులాత్మపరులుగాబోరు. 14

తా. శిష్యా ! గురుసేవ నెంతమటుకు జేసితే పరిపూర్ణసుఖము గల్గుటంతేగురుసేవ పూర్తిగా జేయునివాను పరిపూర్ణబోధకర్హులుగారు. పామరులెన్నటికి నాత్మవేత్తలుగా జాలరు. నీవు చెప్పినసంగతి గురుధర్మములో లేదు. గురుమతమదిగాదు. గురుపుత్రులకు దెలియకుండ గురుడొప్పదేశమిచ్చును. ఇవ్వడని భావము.

కం. గురుసేవగోరు సుజనుని । గురుమూర్తినను గ్రహింపకూడదనే సద్గురుపుత్రులందునాశ్రిత । గురుభక్తుడొనర్చు పూర్వగుణదోషములనూ । తద్ధర్మముల్ విన రేపెద్దలు నూ । పరమసాధులునన్ను పరిభవింపరు నీమ । కరుణేమో నాకర్మఘటనేమో నటుజరుగూగుణదోషములనూ । తద్ధర్మముల్ విన రేపెద్దలునూ. 15

తా. సద్గురురాయా గురుపాదసేవగోరి వచ్చిన బుధుని గురువరుడనుగ్రహించకూడదనియు, నిదివర కనేక పాపకృత్యములుచేసినాడనియు, చెప్పే గురుపుత్రులమాట లేపెద్దలునువినరు. ఆత్మవేత్తలునన్నుపరిభవపరచరు. తమకరుణయేమో నాకర్మఘటనయేమో నటుల జరుగునని భావము.

కం. గురుచెంతగోరుసుజనుని । గురుసుతులదలంచి పూర్వగుణదోష

ములన్ । పరికింపనతడో నర్చిన, నరకాబ్ధిమునుంగజొత్తురదినిజమహా రా ॥ గనుకను నీపై యలుక లెవరికిరా । పరహితులగువీరు పరిభ వింపరునిన్ను । పరనిష్ఠగలనీకు పరులతోపని యేమో యదినిజమహా రా । గనుకను నీపై యలుక లెవరికిరా. 16

తా. శిష్యా, గురుపాదసన్నిధిగోరి వచ్చినసుజనుని పూర్వగుణ దోషములను నెన్నుగురుపుత్రులు నరకమహాసముద్రమున బడుటనిశ్చ యమేయగును. గాన నీమీద నాకెన్నటికిని కోపములేదు. పరిపూర్ణా వలోకనజేయు వీరు నిన్ను పరిభవింపరు. బ్రహ్మనిష్ఠగల నీకితరులతో నేమిపనియున్నది ? లేదనిభావము.

కం. గురువర నేనిప్పుడె న । ద్గురుపుత్రులలోన జేరి గుణవంతుడనై । గు రుమహిమ లెరుగుచుందుదు । గురుతత్త్వప్రబోధయొసగు గురుకుల చంద్రా । సంపూర్ణకృపాలోకసాంద్రా । గురుదేవదేవ నీ చరణ స్మరణయొసగి । గురుపుత్రులలో జేర్చి పరమొసగవే దేవ గురుకుల చంద్రా । సంపూర్ణకృపాలోకసాంద్రా.

తా. సంపూర్ణకృపాదృష్టిగల గురుకులచంద్రా నేనిప్పుడే గురు పుత్రసమూహమందు జేరి సద్గుణముల నార్జించెదను. అఖండతత్త్వబోధ చేసి తమ చరణస్మరణనొసగుము. గురుసార్వభౌమా ! గురుపుత్రుల లోనన్ను జేర్చి పరిపూర్ణునిగా జేయుమనిభావము.

కం. గురుకులవాసులలోపల । గురిగాగూర్చుండి నంతగుణివై త్రివిగా । గురిమీర నింతలోనే । గురుకరుణెటులభ్యమౌరా గురుసుతులెన్నా । యేయోగమెక్కువవారికన్నా । పరిపరివిధముల పరిచర్య జేసిను । స్థిరముగ సాధులమరుగునదిరుగుము గురుసుతులెన్నా । యేయోగ మెక్కువవారికన్నా.

తా. శిష్యా గురుపుత్రులలోపల గురిగాగూర్చుండినంతమాత్ర మునసే మహాగుణశాలివై త్రివిగా, నింతలోనే గురుకరుణ యెట్లులభ్య

పడును. వారికంటె నేయోగమెక్కువనీకుగలదు. స్థిరబుద్ధిగలిగి యనేకవిధముల గురుశిశ్రూషజేయుచూ బ్రహ్మవేత్తలమరుగున సంచరింపుచుండుమనిభావము.

కం. కరుణించనె కరుణించవె । కరుణించుమటంటిగాని ఘనయోగుల
తో ! సరియగుదునె గురియగుదునె । గరిజేర్పుమునన్నుపరమ హై
వలలామా । అరమరసేయకఖండధామా । తరణోపాయముగురు
చరణస్మరణనుచు మీ । చరణాతలముబట్టి స్థిరప్రమాణముజేతూ
దై వలలామా । అరమరసేయకఖండధామా. 19

తా. గురుపరంధామా, కరుణించుమని తమరిని వేడుకుంటిని గాని, ఘనమైన యోగులతోటి నేనుసరియగుదునా: గురియగుదునా, నాయం దరమరయుంచక కడతేర్పుము. కడతేరునుపాయము గురుచరణస్మరణతప్ప వేరొండులేదని తమపాదారవిందములు బట్టుకొని ప్రమాణము జేయుచున్నాడనని భావము.

కం. మరిమరి సత్పరితాపము । యరయగ మత్కరుణవలన నణగును
నిదిగో । వరమిచ్చెదబ్రోచెదని । గురుపుత్ర జనాళిమధ్య కూర్చుం
డుపోరా॥ వెరువకవారి మరుగుగనుగొనరా॥ గురుపుత్ర కోటియోస
రణి దెలిసిరోపూర్వ । మెరిగి దగ్గర జేరి స్థిరమోక్షసుఖమందు
కూర్చుండుపోరా॥ వెరువకవారి మరుగు గనుగొనరా. 20

తా. శిష్యానీయందుమాకు గలిగినకరుణవలన నీయొక్క మోక్షవిషయ పరితాపమణగును. ఇదిగో నిన్ను రక్షించెదనని వరమిచ్చుచున్నాడను. నీవు భయపడకుము. నీవింక గురుపుత్ర సమూహమధ్య గూర్చుండివారి మరుగుదెలసికొని వారుపూర్వ మెటులబోధనొందిరో యామార్గమెరిగి నాసన్నిధిజేరిస్థిరమైన మోక్షసుఖమును బొందుమని భావము.

కం. పరమగురు చంద్రగ.ూకిహ । పరమగుసంసార విషయ భ్రమవి
డిచి మహా । పరవశమయ్యెను చిత్తము । పరమార్థము దెలుపు

బ్రహ్మాభావ ధివిజ్ఞా । పరమై క్యోపదేశ ప్రతిజ్ఞా॥ పరమసాధనచేత
పరయోగనిష్ఠత । త్వరునిచేసి సౌఖ్యకరమొసగవే బ్రహ్మాభావ
విధిజ్ఞా । పరమై క్యోపదేశ ప్రతిజ్ఞా. 21

తా. పరిపూర్ణైక్యోపదేశ ప్రతిజ్ఞజేసిన గురుచంద్రా? నాకీలోక సంసార విషయ భ్రమయు, పరలోక విషయసౌఖ్య భ్రమయువిడిచి పోయినామనస్సు పరవశమయ్యెను. నాయందు కణికరించి పరిపూర్ణసమాధియోగ నిష్ఠగలుగజేసి పరసుఖమును గలుగజేయుమని భావము.

కం. ప్రతిలేనిత్రివిధభక్తుల । చతురంబుగ నతుల భావచిరశిష్యామన్ ।
వితతచతుర్విధసాధన । గతులను పరమోపకారగతులలో మెదిగీ ।
కారణయోగగతికి తానొదిగీ । హితమతి నాత్మసద్గతిగోరు సుజ
నుడు । సతతభక్తిని సలిపి కృతకృత్యతను బొందు గతులలో మె
దిగీ । కారణయోగగతికి తానొదిగీ. 22

తా. శిష్యా త్రివిధభక్తులచే ననగా, బాహ్యభక్తి, అనన్యభక్తి, యేకాంత భక్తియని భక్తిత్రయములు, ఇందు బాహ్యభక్తి, శ్రవణము, కీర్తనము, స్మరణ, పాదసేవన, అర్చనము, వందనము, దాశ్యం, సఖ్యం, ఆత్మనివేదనమని తొమ్మిది విధములు. 1 శ్రవణమనగా ? గురుబోధ శ్రద్ధతో వినుట. 2 కీర్తనమనగా ? గురునామ సంకీర్తన జేయుచుండుట. 3 స్మరణయనగా? గురునామమును మరువక స్మరించుట. 4 పాదసేవనమనగా ? గురుమూర్తికి పాదము లొత్తుట. 5 అర్చనమనగా ? గురుపూజసేయుట. 6 వందనమనగా? గురుమూర్తికి సాష్టాంగవందనము లొనర్చుట. 7 దాశ్యమనగా ? గురునకుదాసత్వము జేయుట. 8 సఖ్యమనగా ? గురునియందు మైత్రి గలిగి యుండుట. 9 ఆత్మనివేదనమనగా ? గురుమూర్తికి మనస్సు సమర్పించుట. అనన్యభక్తి యనగా ? మనోవాక్కాయములచే నెప్పుడును నితరదైవముల దలచక గురుడే తన యిష్టదైవముగా దలచి

గుణరహితుండు వేరులేదని భజింపుచుండుట. యేకాంతభక్తి యనగా నేకాగ్రచిత్తము గలిగి తన గురువును పరంజ్యోతి స్వరూపునిగా నంతర్లక్ష్యమందు చూచుచూ పరమానందమును జెందియుండుట ఇట్టి త్రివిధభక్తులచే భావశుశ్రూష జేయుచు (1) నిత్యానిత్య వస్తు వివేకము (2) యిహాముత్రార్థ ఫలభోగ విరాగము. (3) శమాదిషట్క సంపత్తి (4) ముముక్షుత్వము అను సాధన చతుష్టయ సంపత్తి గలిగి, యాత్మ సద్గతి గోరి గురుకారణము కోరక్షు కనిపెట్టుకొనియుండు సత్పురుషుడు కడతేరునని భావము.

కం. జ్ఞానాజ్ఞాన విహీనత। నానాదుష్కృతు లొనర్చు నరపశువును నే। నేనియమాదుల నెరుగను మానితముగ బ్రోవు సాధుమానస లోలా। నామనవి గైకొను మాత్మలీలా నేనొకభక్తునిగా నగుపడ నాతో యానతిచ్చెద రేమో నేనెన్నడే మెఱుగ మానసలోలా। నామనవి గైకొను మాత్మలీలా. 23

తా. గురుదేవా నేనజ్ఞానమెట్టిదో నజ్ఞానమెట్టిదో నెరుగక ననేక దుష్కార్యములు జేసిన నరపశువును, ఇట్టినన్నొక శిష్యునిగా తమరెంచి నేమేమో యాజ్ఞ నిచ్చుచున్నారుగాని నేనెప్పుడును యేమ నియమములును నెరుగను దేవా నామనవి నంగీకరించి నన్ను రక్షింపుమని వేడుకొనుచున్నానని భావము.

కం. ఏమెరుగని యజ్ఞానికి నేమహితవిచారులైన యేపరమార్థం బేమని బోధించుట కొక। సామర్థ్యము లేదు సకలశాస్త్రములున్నా, తెలుపుట తెలియుటనికిసున్నా। యీమాట నిజమని యేమిపని లేదన్నా। నీమానసేంద్రియస్తోమకల కెటునిలుచు శాస్త్రములున్నా। తెలుపుట తెలియుట నికిసున్నా. 24

తా. శిష్యులోకమంద నేక శాస్త్రములున్నను నేమి నెరుగని మూఢునకు నెటువంటి బ్రహ్మవేత్తలైనను బోధించుటకు సామర్థ్యము

లేదు, గురువుసెల్పుట, శిష్యుడు తెలిసికొనుట యున్న ఈమాట ప్రకారం మేమియు ప్రయోజనము లేకని యూరకుండే నీ మనసున నుండు పరితాపమెట్లు మానును. బోధపడయకున్న మానదని భావము.

కం. దేవుడవని నిను నమ్మితి । నేవిధమున బ్రోవ నీవు నిశ్చయపడితో । యావిధిననిపుడు బ్రోవుము । భావప్రభావాత్మస్వప్రభావము లెరుగా । సమాధిషడ్విధవిధు లెరుగా । కేవలాత్మజ్ఞాన భావ సంసిద్ధికై । సేవ జేసెద బ్రహ్మప్రభావబోధ యొసగు భావము లెరుగా । సమాధిషడ్విధవిధు లెరుగా. 25

తా. గురునాథా తమరే దేవ దేవుడని నమ్మియున్నాను. ఏ మార్గముచే నన్ననుగ్రహించుటకు నిశ్చయించితిరో నా మార్గముచే నన్నిపుడే కడతేర్పుడు. భావాభావముల నెరుగను. ఆత్మప్రభావము నాకు తెలియదు. షడ్విధిసమాధి బోధ లెరుగను. పరిపూర్ణ భావసిద్ధికై తమ సేవజేయుచున్నాడను, బ్రహ్మబోధ నాకనుగ్రహింపుడని భావము. షడ్విధసమాధిబోధ లెవ్వియనిన, (1) బాహ్యదృశ్యానువిద్ధసవికల్పక సమాధి (2) బాహ్యశబ్దానువిద్ధ సవికల్పక సమాధి. (3) బాహ్యనిర్వికల్పక సమాధి. (4) అంతర్దృశ్యానువిద్ధ సవికల్పక సమాధి. (5) అంతర్శబ్దానువిద్ధ సవికల్పకసమాధి. (6) అంతర్నిర్వికల్పకసమాధియని యారువిధములు. తనకంటె వేరుగాతోచెడు పిపీలికాది బ్రహ్మపర్యంతము సమస్తచేతనములును, గడ్డిపోచ మొదలుకొని మేరుపర్యంతమైన అచేతనములును, తన తెలివియందే పుట్టి నసించినవిగనుక నవి తన తెలివి వలన కల్పితమైన వనియు, ఆ తెలివియైన ప్రజ్ఞానమే పరబ్రహ్మమనియు, ఆపరబ్రహ్మమే తానని చూచుట మొదటి సమాధి లక్షణము.

రామ, కృష్ణ, గోవిందాది సకలనామములలో తనకు వినబడిన నామములు తాను గానని విడచి సర్వనామములకు విలక్షణమైన పరబ్రహ్మమే నేనని యోచించుట రెండవ సమాధిలక్షణము అంత

ర్బాహ్యములయందు తనకు వేరుతోచక నొకవేళతోచినను సముద్ర మందు ముంచిన కడవలోపల వెలుపల నీరునిండి యున్నట్టు పరిపూర్ణమై యుండుటచూడవ సమాధిలక్షణము. తనయందు కామాది వృత్తులు గలిగి నప్పుడు వానినన్నిటిని క్రమముగా నేను గానని త్రోసివేసి వీనికన్నిటికి సాక్షియైన పరబ్రహ్మమునని భావించుట నాలవసమాధి లక్షణము. కామక్రోధాదులతో గూడుకొనిన సకలాంతర వస్తునామములు నేనుగానని విడచి సకలమునకు విలక్షణమైన పరమాత్మ నేనని యూహించుట యైదవ సమాధిలక్షణము. పైనజెప్పిన వృత్తులేవియులేక అఖండ పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపమైయుండుట నారవ సమాధిలక్షము.

కం. త్రివిధపరాత్పర సేవల । త్రివిధాత్మకుడైన పరమదేశికునాజ్ఞన్ ।
త్రివిధావస్థ విలక్షణ। త్రివిధమహాదీక్షనైన తెల్పేచేబూనూ । సవినయత్రివిధ భక్తులతోనూ । శివజీవైక్యముచే సచ్చిత్కళాదర్శన । ప్రవిమలానంద సద్భావజ్ఞుడవయ్యె తెలివిచేబూనూ ।
సవినయ త్రి విధభక్తులతోనూ. 26

తా. శిష్యా వినయము గలిగి త్రివిధభక్తులచే త్రివిధములైన శిశూషలు అనగా స్థానశిశూష, అంగశిశూష, భావశిశూష, యీ సేవలు చేయుచు తత్పదత్వంపదాశివ దాత్మకుడైన పరమగురునాజ్ఞచే జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలకు విలక్షణమైన, త్రైవిధ దీక్షలచే గలుగు జ్ఞానము నార్జింపుము. శివజీవైక్యసిద్ధి గలిగి సచ్చిత్కళాదర్శనముచే బ్రహ్మానందమును జెందెదవని భావము త్రివిధదీక్ష తెల్పెయనిన. 1. స్వస్తికారోహణదీక్ష. (2) స్పర్శదీక్ష. (3) వేదదీక్ష. శిష్యుని సిద్ధాసనునిగా గూర్చుండబెట్టుట. స్వస్తికారోహణము. శిష్యుని ముఖమందు బ్రహ్మవ్రాసినవ్రాత తుడిచి, తానొక వ్రాలు విభూతిచే వ్రాసి, సిరస్సున హస్త

ముంచి జన్మకు భయపడవద్దని అభయం బిచ్చుట స్పర్శదీక్ష యన బడును. వేదాంతశాస్త్రసమ్మతముగా నీవు చైతన్యమాత్రుడవు గాని మరి యేదియు గావని దృఢముగా బోధించుట వేధ దీక్ష యన బడును.

కం. నే నెరిగిన విద్యలలో । నే నెరిగినభాషలందు నిర్మలసుఖ వి ।
జ్ఞానము దెలుపుట కాత్మలో । బూనుము నామీద కరుణబుట్టి
నందులకూ। నీపదయుగమూ బుట్టినందులకు। మానాభిమానముల్
మానజాలని నాకు । స్వానుభవంబే విధానబోధించెనో బుట్టినం
దులకూ । నీపదయుగముబట్టినందులకూ.

తా. గురుప్రభో నేను తమ పాదారవిందములు బట్టినందుల కును, నామీద తమ కనుగ్రహ మొచ్చినందుకును, మానాభిమా నము లొదలజాలని నాకు విజ్ఞానము దెల్పి, స్వానుభవము గలిగించు టకు నే నెరిగిన భాషలో నాకు దెలిసిన విద్యలో బోధించి సుఖము గలుగజేయుడని భావము.

కం. నీ వెరిగిన విద్యలలో । నీవెరిగిన భాషలందు నీమత మొప్పడే ।
త్రోవలజను నావిధమున । భావము గనిపెట్టి యాత్మపదము
నెరిగింతూ । పరతత్వాను భవము గనుపింతూ । ఆవలీవల మది
బోవకను విను సత్పు ి । భావయోగ్యంబైన బ్రహ్మోపదేశపు
పదము నెరిగింతూ । పరతత్వాను భవము గనుపింతూ,

తా. శిష్యా నీ మనస్సు నావలీవలబోనియ్యక స్థిరబుద్ధితో వినుము. నీ వెరిగిన భాషలోనే నీకు దెలిసిన విద్యయుందే, నీమత మెప్పుడేదోవన బోవునో నావిధముగా నీమనసును కనిపెట్టి యాత్మ బోధజేసి పరతత్వానుభవము కనుపరచి బ్రహ్మోపదేశ మార్గము నెరిగించెదనని భావము.

కం. ముందేమియు బోధించెదా । సందేహము లెట్లు వెనకనమ

కూర్చెదో మీ । యందులనున్నది భారము । మందప్రజ్ఞుండ
నాకు మహిమదెల్పగనూ । దెలుపుచు సుఖమంద జేయగనూ ।
ముందువిషయకలుష బృందమణచెయోగా । నందోపదేశ మిం
పొందజేయవె దేవమహిమదెలుపగనూ । దెలుపుచు సుఖమంద
జేయగనూ. 29

తా. గురువరా నేను ప్రజ్ఞలేని మందుడను నాకు నాత్మబోధ జేసి సుఖముగలుగ జేయుటకు మొదట నేమిబోధజేయుదురో వెనుక సందేహములెల్లు దీర్చెదరో యా భారము తమయందే నున్నది. మొట్టమొదట విషయభ్రమల నణచునట్టి యోగము నుపదేశమివ్వ మని భావము.

శ్రీగురుతారకమంత్రసూచనము.

క. తారకబ్రహ్మవిచారా । ధారమునగు మూలమంత్ర ధనమును
నాత్మా । కారత కల్పితభవ ని । స్సారముగ నిగమార్థతత్వ
సారాముగానూ । తనుగతభావ సంహారముగనూ । తారకమం
త్రవిస్తారముదెల్పి ని । న్నారూఢయోగవిహారూని జేతును సారా
ముగాను॥ తనుగతభావ సంహారముగనూ.

తా. శిష్యా! అధ్యారోపముగాకల్పితమైన జన్మరహితమగు నట్లుగాను, వేదార్థతత్వ సారముగా, తారక బ్రహ్మ విచారమున కాధారమైన మూలమంత్రమును బోధించి నిన్నారూఢయోగమార్గ మందు జేర్చెద నని భావము.

కం. ఈ తారకగురుమంత్రము । పాతకహరణార్థ మనుచు । పఠియిం
చితి వి । ఖ్యాతిగ మంత్రార్థమునే । నేతీరున జెంది యాత్మనె
రిగి సుఖింతూ । నేసదుపాయమేది యోచింతూ। యే తపోవిద్యా
విభూతిచె మోక్షార్థ । హేతువయగు సర్వోపాధి విరహితయోగ
మెరిగి సుఖింతూ । నే సదుపాయమేది యోచింతూ. 31

తా. గురుసార్వభౌమా! తమరుపదేశ మిచ్చిన తారకమంత్రము పాపహరణమని పఠించితిని. మోక్షము నొందించుటకు నీ పరమమంత్రార్థము నేనే తపోవిద్యాబలముచేత నెరిగి యాత్మసుఖము నెంచుదు, నాకేసదుపాయము దోచ లేదని భావము.

కం. తానైన ప్రత్యగాత్మకు । మానుగ పరమాత్మునకును మహినైక్యపుసం । ధాన విధానపు యోగము । గాన సదా యోగమునకు ఘనమంత్రమునకూ । ఇతరేతరాధార మెందులకూ । దీనికిమూలమేగానక గురుకృప । దానివిడువకుము విజ్ఞానయోగమునకు ఘనమంత్రమునకూ॥ ఇతరేతరాధార మెందులకూ॥ 32

తా. శిష్యా! తానైన ప్రత్యగాత్మకును, (ప్రత్యగాత్మయనగా:- నాయహము, నాదేహము, నాతల యనియెరుగుచుండెడి చైతన్యమే ప్రత్యగాత్మ). పరమాత్మకును, (అనగా పిపీలికాది బ్రహ్మపరియంతరం సర్వశరీరములయందునను వ్యాప్తమై స్వచైతన్యముగలనో నా చైతన్యమే పరమాత్మ). నైక్యయోగమే మహాయోగముగనుక నాయోగమునకును, మంత్రమునకును, నొకదానికొకటి యాధారము లేదు, ఆధారము వేరేనున్నదనిదలచక, గురుకరుణచే ఐక్యానుసంధానయోగము విడువకుమని భావము.

కం. ఏయోగమంత్రవిధులును । జేయుగ నిపుడేమిశక్తి జిక్కదు దుష్టవ్యాయామకలుషములతో । నాయవివేకమును తొలగునట్టియోగముకా ! దెలుపుమదిమాయధీనమా గా । యేయోగమంత్రవిధాయకమున మోక్ష । దాయకమగు సులభోపాయము నెరుగుదునట్టి యోగముగా॥ దెలుపుమది మాయాధీనమా గా. 33

తా. గురునాథా ! నాదుష్టవ్యాయామదోషములలో యేయోగము చేయుటకు, నేమంత్రవిధులు జరుపుటకును, నాకుశక్తి లేదు. నాయవివేకము తొలిగిపోయ్యేయోగమును దెలుపుట మాయాధీనమే గదా.

యేమార్గముచే సులభముగా మోక్షమును పొందగలనో యామార్గ మును దెలిపి రక్షింపుమని భావము.

కం. యోగముభోగములనునివి । బాగొప్పగబ్రహ్మవిద్య భాగద్వయమా । యోగము సాక్షాత్కారము । భోగముబ్రహ్మానుభవము భువిని పెంపొందా। సాధనసాధ్యసంపదలందా । యోగవిద్యముందు భోగవిద్యకుపట్టు । భోగసంయోగములాత్మకుకడగట్టై భువిని పెంపొందా॥ సాధనసాధ్యసంపదలందా. 34

తా. శిష్యా! బ్రహ్మవిద్య యోగమనియు, భోగమనియు రెండుభాగములు. సాధనవలన లభ్యమగునది యోగము, యోగమువలన లభ్యమగునది భోగము, యోగముబ్రహ్మసాక్షాత్కారము, భోగము బ్రహ్మానుభవము, పరబ్రహ్మానుభవభోగవిద్యకు మొదట యోగవిద్య పట్టు, భోగసంయోగము లాత్మాతీతమని భావము,

కం. యోగమువరలక్ష్యార్థము।లాగమవిధులందువినగసత్యాద్భుతమా। నాగతప్రారబ్ధములో । సాగిఫలించేటి యోగసాధనగలదా । కడ తేర్చుబోధకుదరగలదా । రాగదుర్భోగదురాగతుడగునాకు। త్యాగవై రాగసంయోగమెటుల కుదురుసాధనకలదా॥ కడతేర్చుబోధ కుదరగలదా,

తా. గురువరా! యోగముయొక్క లక్ష్యములు శాస్త్రము నందు వినగా సత్యాద్భుతముగా నున్నవి. ఘటప్రారబ్ధవిషయ మమకారకలుషములలో సాగి నన్ను కృతార్థుని జేయుసాధన నాకుకనుపడదు, ఇటువంటి నాకుత్యాగవైరాగసంయోగము లెటులకుదురునని భావము,

కం. సత్యముబ్రహ్మము దృశ్యము । సత్యముతనువనుచు భ్రమవిసర్జించిమన । స్వాత్మాత్పరకృతుడై శివ । సత్యములో నిలుచుటదియె సత్యయోగముూరా । సత్యాఖండనిత్యభోగమురా । వ్యత్యాసములులేక సత్యంతగురుభక్తి । నిత్యామునిలుపగ గత్యంతరములేని సత్యయోగమురా॥ సత్యాఖండనిత్యాభోగమురా॥

తా. శిష్యా! బ్రహ్మసత్యము, జగత్తనువులు మిథ్యయని భ్రమనువిడచి బ్రహ్మావలోకనమందు నిలుచుటే సత్యయోగము. మనోసంశయములువిడిచి నిశ్చలమగు గురుభక్తిగలిగి యీప్రకారమెల్లప్పుడుండుట యఖండనిత్యభోగమని భావము.

కం. ఏసత్యయోగమైనను । నీసత్యకటాక్షమునకు మేలుగసరిగా ।
దాసక్తిని మదినిల్పుట । నాసర్వస్వతంత్రమగునె సద్గురునాథా ।
సర్వస్వమునీదేపరబోధా । వాసవశివ కమలాసనాదిసురలు । మీసత్కృపాలేశమాసింపనేనెంత సద్గురునాథా॥ సర్వస్వమునీదేపర
బోధా. ౩౭

తా. దేశికవరా! యేసత్యయోగమైనను బ్రహ్మానుసంధానమందు మనసునిల్పుటకు నాస్వతంత్రమా? నాకు స్వతంత్రములేదు. యావత్తుపరబోధయు తమయాధీనముగానున్నది. ఇంద్ర, శివ, బ్రహ్మాదిదేవతలు మీకృపకాశించియుండగా నేనెంతమాత్రమని భావము.

కం. ఏసాధులసద్గోష్ఠిలో । నీసాధననూక్ష్మబుద్ధి నెరిగితొ నదెనిరాసక్తితోడ నిలిపిన । భాసురతర చిద్విలాస పరమయోగమురా ।
గురుభక్తివిశ్వాస మొదలకురా । యీసర్వసమరసోల్లాసము గురుకులా । భ్యాసతనానునిర్వాపసమిది సత్యపరమయోగమురా॥ గురుభక్తివిశ్వాస మొదలకురా॥

తా. శిష్యా! ఏయేపెద్దల సాంగత్యముచే నీసూక్ష్మబుద్ధి గ్రహించితివో నదేపరమ యోగము గురునియందు భక్తివిశ్వాసము వదలకుము. ఈసమరస యోగము గురుకులవాసము వలన లభ్యమగునని భావము.

కం. ఏమేమోపరసాధన । నీమములేర్పరచి తెలిపి నిజహస్తలో
నామలకముగతి చూపిన । నామదికంగని విలాసనటనలనెటులా ।
భరుపుదువీటికేమందు మరలా । కామాదిషట్క దుర్వ్యాళిమోహ

విషయ వి । భ్రామికగల నేను నీమహితవిశేష నటనలనెటులా ।
జరుపుదువీటికే మందుమరలా.

తా. సద్గురునాథా, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాది యరిషడ్వర్గముల మోహవిషయ భ్రాంతులచే తగులు పడిననాకు పరసాధనానుకూలమగు యేమేమో విషయము లేర్పరచి యరచేతిలో నుసిరికాయ వతుకనుపరచినను నామనస్సుకు గోచరము గాని బ్రహ్మబోధవలన నేమిప్రయోజన మున్నది. ప్రయోజనము లేదని భావము.

కం. నేనిన్నునననుసీవును । మానుగగనుగొనుటకంటె మున్నేకతనగ
నిను విడువను నను వదలకు । మని మనకున్నట్టి సత్ప్రమాణమి
దేరా । భయమేల ననుగన్నకుమారా । నిను కడతేర్పగ నన్నాదై
వము జూపె । ననఘ యాదైవమె నిను బ్రోచు మనసత్ప్రమాణ
మిదేరా. భయమేల నన్నుగన్నకుమారా. 40

తా. శిష్యా ! నన్ను నీవును నిన్ను నేనును చూడకముందే దైవము నిన్ను కడతేర్చుటకు నన్ను జూపెనో, నాదైవమే నిన్ను రక్షించును, నిన్ను నేను విడువను. నన్నునీవు వదలకుము, ఇదే మన ప్రమాణము, నా కుమారా భయపడవద్దని భావము.





శ్రీ
గురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్య సంవాదము.

## పూర్వభాగము, శరణాగత ప్రకరణము.

### తృతీయ ప్రకరణారంభము.

కం. తారకమనగా నెయ్యది । తారకమునకురూపమెద్ది తారకము॥లా । ధారకమెట్లగుతత్పర । తారకమెరిగింపుపరమధీరసుశ్లోకా । భవార్ణవోత్తారణనౌకా । కారుణ్యమున మోక్షకారణ మొసగిన । న్నారూఢునిగను తత్వధీరునిజాయ వేధీరసుశ్లోకా । భవార్ణవోత్తారణనౌకా. 1

తా. పాపసముద్రమును దాటించు నోడవంటి గురునాధా! తారకమన నెయ్యది? తారకమునకు రూపమెట్టిది? సర్వమునకును తారకమెట్లాధారమగును? నాయందు కరుణించి మోక్షమునకు కారణభూతమగు పరమ తారకోపదేశమిచ్చి నన్ను తత్వారూఢుని జేయుమని భావము.

కం. తారకమపరోక్ష సుఖా। ధారక మాత్మస్వరూప తన్మయసాక్షా। త్కారమఖండాద్వయగురు । తారక మోంగోపదేశధర్మము వినరా । సాధనలక్ష్యసరణి గైకొనరా । తారకముకు పంచాకారముద్రలుండు। కారణాత్మకముల కనుపడుచుండు నీ ధర్మము వినరా॥ సాధనలక్ష్యసరణి గైకొనరా॥ 2

తా. శిష్యా! తారకమపరోక్ష పరిపూర్ణసుఖమున కాధారమైనది, ఆత్మస్వరూప సాక్షాత్కారమైనది, ఇట్టి మహాతారకోపదేశ

ధర్మమును జెప్పెద నాకర్ణించి సాధనలక్ష్యమార్గమును గ్రహింపుము. ఈ తారకమునకు గారణాత్మకములై కనుపడే పంచముద్రలున్నవి. వాని యొక్క మార్గము వినుమని భావము.

కం. పంచమహాముద్రలచే । సంచిత ప్రారబ్ధరహితసాధనములుబో ।
ధించిన నేనొకనైనం । గాంచి మహత్పదంబుగాంచగ గలనా ।
యోగము నిర్వహించగగలనా । సంచుదెలియని నాడనంచు నిర
సించక । వంచనలే కృపనుంచి బోధించవె గాంచగగలనా॥ యో
గము నిర్వహించగ గలనా. 3

తా. గురుదేవా! సంచితప్రారబ్ధనాశన హేతువులైన పంచముద్రలను తమరు నాకు బోధించిన, నే నొకనైనను గ్రహింపగలనా? ఆయోగమును సమర్థింపగలనా? నాచేతగాదు. యేమి సందర్భము తెలియని మొద్దు నని నన్ను నిరసనచేయక తమ కటాక్షము నాయందుంచి బోధింపుడని భావము.

కం. తారకగురుచిన్ముద్రలు । సారముగను రూపనామసాధనములు
వే । ర్వేరుగ బోధింతు తదా । కారమహత్వములు వినుము
కారణమహిమా । నిరుపమనిష్కారణగరిమా । తారకసిద్ధిచే
కూరుట కైబోధ । యూరికె నాత్మవిచారశ్రవణము జేయు కారణ
మహిమా॥ నిరుపమ నిష్కారణగరిమా. 4

తా. శిష్యా! తారకసిద్ధి నీకు గలుగుటకు తారక చిన్ముద్రల యొక్క రూప నామ క్రియలు వేరు వేరుగా విభజించి చెప్పెదను వాటియాకారమహత్తులు పూరక వినుచు, నాత్మవిచార శ్రవణము జేయుచుండుమని భావము.

తారకయోగావస్థాక సత్కృత్య విధి.

కం. వితతము విజనము విమలము । నతిసుఖ సమభూమిసత్కుశాజిన
చేల । స్థితపద్మాసనపద సం । గతుడై నమకాయశీర్షగళములన్

నిక్కించీ । చూపులు నాసికాగ్రమెక్కించీ, యతుడై సుధీసత్య
వ్రతుడై కామాదిక । హితుడై యోగాభ్యాసహితుడై సద్విధినిల
చిగళములన్ నిక్కించీ॥ చూపులు నాసికాగ్రమెక్కించీ. 5

తా. శిష్యా! విశాలముగానుండునదియును, సందడి లేనట్టియు పరిశుద్ధమైనట్టియు ఈగలు, దోమలు మొదలగు వాని బాధ లేక సౌఖ్యకరముగానుండునట్టియు, నేకాంతస్థలమున సమభూమియందు దర్భాసన, కృష్ణాజిన, వస్త్రములనొక దానిమీద నొకటి బరచి దానిమీద కూర్చుండి, యోగాభ్యాసము జేయునప్పుడు నడుము, మెడ, శిరస్సును వాటిని చక్కగా నిల్పి తనుదృష్టిని నాసాగ్రమందు జేర్చి, రెండవవైపునకు జలింపనీక నిలుపవలయునని భావము.

పరమాత్మాభినివేశరహస్యము.

కం. కనుయుగ్మము కరములచే । పనిమూసుక బొమలనడిమి బాట
లోద్విదళం । బునవిమలదృష్టి నిలుపుచు । కనిసింపగవలయులక్ష్య
ఘనసాధనములూ । యోగాంతర్విధానశోధనలూ । కనుచూపు
లోమెలగుమొనసుండిమోపులో । బెనగిసుషుమ్నలో తన రూపు
తానగుట ఘనసాధనములూ॥ యోగాంతర్విధాన శోధనలూ. 6

తా. శిష్యా చేతులచేత కనులురెండునుమూసికొని కనుబొమలమధ్య నుండు ద్విదళకమలమందు చూపునిలిపి కనుచూపులో నున్న సూది మొనమోపుననున్న సుషుమ్నలో తనరూపుతానగునట్టి లక్ష్యాంతరసాధనముల చూడవలయునని భావము.

కం. ఇదె భ్రూమధ్యముద్విదళము । నిదియాత్మారామనిలయమిదె దశ
రంధ్రం । బిదె బ్రహ్మరంధ్రసూక్ష్మము । యిదిగో నీవారశూక
మిదియే బ్రహ్మమురా । సుషుమ్నాంతస్పందనమిదేరా । యిదిగో
యాపోజ్యోతియిదియె పరమహంస।మిదియే శ్రీగురుతత్వమిదిసాధిం
చుటెము క్తియిదియె బ్రహ్మమురా॥సుషుమ్నాంతస్పందనమిదేరా. 7

తా. శిష్యా! దీనికే భ్రూమధ్యము, ద్విదళము, ఆత్మారామ నిలయము, దశరంధ్రము, బ్రహ్మరంధ్రము, సూక్ష్మము, నీవారశూక ము, బ్రహ్మము, సుషుమ్నాంతస్సదనము, ఆపోజ్యోతి, పరమహంస, శ్రీగురుతత్వమని పేర్లు దీని సాధించుటె ముక్తియని భావము. 7

కం. తొమ్మిదిబొక్కలుగల వృ । క్షమ్మునకుపై రెండు తూట్లుగలవాటికి
మధ్యంబున నొక రంధ్రముక్రిం । దిమ్మగ యహిబలముతోడ నీ
తూట్లూనాల్గూ । నడిమిఛిద్రమ్మున నాత్మవెలుగూ।నమ్మి గురుకృ
పాయు । ధమ్మునపక్షియు । గ్నమ్ముద్భంచినయచలమ్ము నీసొమ్మ
గునీతూట్లూనాల్గూ॥ నడిమిచ్ఛిద్రమ్మున నాత్మవెలుగూ. 8

తా. తొమ్మిదిరంధ్రములు గల శరీరమనునీ వృక్షమునకు పైన రెండు రంధ్రము లున్నవి. వానిపేరు. ఇడా, పింగళ, ప్రాణవాయు వీ రెంటిద్వారా ఉచ్ఛ్వాస, నిశ్వాసములను పక్షులుగా సంచరించు చుండును. ఈరెండు బిలములమధ్య సుషుమ్నయను బిలమొకటి యున్నది. ఈమూడు నాడులు భ్రూమధ్యమున నిలయును, కావుననే నీచోటునకు త్రికూటమని పేరు. ఈత్రికూటమునకు క్రిందుగా నూర్ధ్వ కుండలియని సర్పబిలమొకటియున్నది. నడిమిరంధ్రమునందాత్మప్రకా శించు చుండును గురుకరుణయను ఖడ్గంబున నీపక్షులరెంటిని ఖండించి నపరిపూర్ణము నీ సొమ్మగునని భావము.

కం. దేశికునికృపను మహదుప । దేశములోవిమలపూర్ణ దృష్టినిలుచు
టే । దేశముదృశ్యసమస్త వి। నాశస్థలముదెసుషుమ్న నాడికాంత
మునా । మెలగును వరనీవారశూకమునా । వాసిమీరగ సచరా
చరబ్రహ్మాండ । కోశముద్భుతసర్వదేశముల్నిమిడీననాడికాంతము
నా॥ మెలగును వరనీవారశూకమునా. 9

తా. శిష్యా! దేశమనగా, కంటికి కనబడు సమస్తమునువినాశ మగునట్టియు సచరాచర బ్రహ్మాండము లన్నియు, నిమిడియున్నట్టియు

సుషుమ్నాంతసీవార శూకమున సద్గురుమూర్తి కరుణచే నిర్మల పూర్ణదృష్టి నిలుచుట యేనని భావము. 9

నాదోపాసనము.

కం. ఓంకారముఘంటారవ । ఝంకారమామింటినంటి ఝాంకృతిమైన । ర్వాంకపదశవిధనాదము । లంకురితములగు చనుండు నాలించి వినుమూ । బిందుకళలాలోకించికనుమూ । కొంకకబిందు వేవంక చదరకసర్వ । సంకోచములుమాని సత్కళాప్రభనీవు నాలించి వినుమూ॥ బిందుకళలాలోకించి కనుమూ. 10

తా. శిష్యా! ఘంటానాదమువలె ఝుంకారము చేయుచు, ఓంకారముమింటినంటి మ్రోగుచున్నది. దానియందు పదివిధనాదములు పుట్టుచున్నవి. బుద్ధిని నటునిటుచెదరనీయక నీసంకోచము లొగదలి యాలకించి వినుము. బిందుకళలను విచారించి తెలిసికొనుమని భావము.

కం. ఆనాదముతుద మొదలుగ । దేనందుద యావసాన మేర్పడినిజనం । ధానవిధానసుచిత్కళ । స్వానుభవంబగుచు నెప్పుడు సత్యమై తోచూ । సాధనచే సాక్షాత్కారమగుచూ । భానభాంతరసర్వమూ నినట్లగుపడు । జ్ఞానము నే నేవిధానగు గ్రెరిగింతూ సత్యమైతోచూ । సాధనచే సాక్షాత్కారమగుచూ. 11

తా. అట్టి ఓంకారనాదము దేనియందుబుట్టి నెచ్చటలయమగునో, సాధనచే సాక్షాత్కరించునో స్వానుభవముచే సత్యముగా దోచుచూ భానభాంతరములు ఆనినట్లగుపడు జ్ఞానము నే నేవిధాన గుర్తెరిగించెదనని భావము.

కం. చిణియని మొరయుచునాపై । చిణిచిణియని ఘంటశంఖచిత్రతపీణా । ధ్వనితాళవేణుభేరీ । నినదమృదంగాభ్రఘోష నిర్భర మగుచూ । దశవిధభేదములనుఘూర్ణిలుచూ । తనుమోహ నానంద

జనితసునాదము । లనుపొందబ్రోయగ విని సంతతము యాత్మ నిర్భరమగుచూ॥ దశవిధభేదములను ఘూర్ణిలుచూ.

తా. ఓంకారము మొదట ఛిణియనియు తరువాత ఛిణి, ఛిణీ నాదము, ఘంటానాదము, శంఖనాదము, వీణానాదము, తాళధ్వని, వేణునాదము, భేరీధ్వని, మృదంగనాదము, అభ్రఘోషమునను పది విధముల భేదముచే మ్రోగుచుండును. బ్రహ్మానందముచే నీనాదము లాలించి వినుమని భావము.

కం. గురువక్షరప్రణవములో । మరుగులుగననకారు కారమవలమకా
రో । వరిబిందుమేళనంబై । పరమోంకారాక్షరంబు ప్రభవించెస
రిగా । ప్రఖ్యాతిచేపరహంస మనగ । ధరప్రణవనాదసుస్థిరఘంటా
రవమేక । నరణిహృదయాబ్జ మందిరవై । మ్రోయుచునుండు
ప్రభవించెసరిగా । ప్రఖ్యాతిచే పరమహంసమనగా.                    13

తా. శిష్యా । అకార, ఉకార, మకారోపరిబిందువులను మూడవ యవములుజేరి ఓంకారమను ప్రణవమాయెను. దీనికే పరహంస యని పేరు. స్థిరమైన ప్రణవఘంటానాద మెడతెగకుండ నొక రీతి గా హృదయకమలమందు మ్రోగుచుండునని భావము.

కం. నాదాభ్యాసముచేయని । వేదాంతులమనసు విషయవేదనచేనా।
త్మాదరణమొదలకను దు । ర్వాదములనుభేదములను వదురుటె
కాదా । ఆదిలోతప్పుదారిబడ లేదా । సూదిమోపను సందుబోదు
ముందెసాధ । నాదుల కుదరదుచేదుడుకు పనులగుచువదురుటె
కాదా । ఆదిలోతప్పుదారిబడలేదా.                    14

తా. నాదాభ్యాసముచేయని వేదాంతుల మనస్సులు శరీర భ్రాంతులొదలక మొదటనేతప్పుదారులుబడి, భేదబుద్ధిగలవారలై దుర్వాదములాడుటేగాని మరియేమియు ప్రయోజనము లేదు ముందె సాధనలకును దారిచిక్కక చెడుదురని భావము.

కం. నాదాంతమైన ఘంటా । నాదాభ్యాసకునకు నానావిధయో
గాదులు నాత్మవశీకర । ణాదాయతగలిగి బ్రహ్మానందాబ్ధిలోనూ ।
తన్మయమొందు తత్వసంపదనూ । యిందుధరాద్యమరబృందము
నాయోగ । పొందికగనియాత్మ డెందములను బ్రహ్మానందాబ్ధిలో
నూ । తన్మయమొందు తత్వసంపదనూ. 15

తా. నాదాంతమైన ఘంటానాదార్థము నభ్యసించువారికి నానావిధయోగాదులు వశమై బ్రహ్మానందసాగరమందు నోలలాడు చుండెదరు. శివాదిదేవతా సమూహములెల్లను నీయోగముచేతనే గదా బ్రహ్మానందపరవశులై యుండ గలిగిరియని భావము.

పంచముద్రావిధానము.

కం. ముందుగగురుచిన్ముద్రలు । పొందుగ విభజించి వాటిపొందమరు
టకై । అందున్నయోగసాధన । సందర్భము దెలుపుచుందు
శాస్త్రదృష్టముగా । అనుభవసౌఖ్యమందు స్పష్టముగా । ముందు
బోధించేటి సందర్భములలోని । సందేహములు నాదుముందుతీర్చు
కొంతంద్రీశాస్త్రదృష్టముగా । అనుభవసౌఖ్యమందు స్పష్టముగా.

తా. శిష్యా! తారకముద్రల సందర్భము నీకు తెలియుటకై ముందుగావాటిని విభజించివాటియోగసాధనలు నీకుచెప్పెదను. అనుమానములేకుండా అనుభవమునకు దెచ్చికొనుము నేను బోధించబోవు విషయములందు సందేహములున్నను నాసముఖములోనే నివర్తిచేసుకొనుమని భావము.

శిష్యా! తారకయోగమనగా నాదుబిందు కళలనుప్రత్యేకముగా ననుభవించిన తరువాత వానిని పరబ్రహ్మమందైక్యముజేయుటయే ఈనాదు బిందుకళలు సాధారణములైన యింద్రియములకు దోచబడవు గనుక వాని ననుభవించుటకై ననుకూలమగునట్లు ఇంద్రియ మనస్సుల నంతర్ముఖము జేయుటకు ముద్రయనిపేరు. ఈముద్రలైదు

విధములు 1 ఖేచరి, 2 భూచరీ, 3 మధ్యమ, 4 షణ్ముఖి 5 శాంభవియనునవి.

కం. హృదయమున గురుపదంబులు । వదలకనిర్మలవిదేహ వైభవసుఖసం । పదచే నిత్యనిరామయ । మృదుసాధనజేసి చూడుమదుగో ఖేచరిరా । ఆత్మనుజూడు మదినిశ్చయమురా । అదుగో ఖేచరిముద్రద్విదళాబ్జవీథిలో । పదిలముగాజూడ బట్టబయలైయున్నదదుగో ఖేచరిరా ॥ ఆత్మనుజూడుమది నిశ్చయమురా. 17

తా. గురుపాదారవిందములు హృదయమున నిల్పికను బొమల నడిమి భాగమున దృష్టినిలిపి పై భాగమునకు జూడుము ఖేచరిముద్రబట్టబయలుగా గనబడుచున్నది. ఆత్మారాముని జూడుమని భావము.

కం. చూపునుమనమును నేక । వ్యాపకముగ జేసిచూడ వరనిజరూపం । బే పారగగన్పట్టును । నాపట్టునువిడువబోకుమదిగో ఖేచరిరా । ఖేచరిమదిలోగోచరమగురా ! చూపురూపొకటైన ! పాపప్రత్యక్షమౌ । పాపనిల్చినఆపోజ్యోతినీవై వెలిగేవదుగో ఖేచరిరా॥ ఖేచరిమదిలోగోచరమగురా. 18

తా. ఈఖేచరీముద్రయందు చూపును, మనస్సును నేకముజేసి చూడగా నిజరూపము గనుపడును. చూపురూపు నొకటియైన పాపప్రత్యక్షమగును. ఆపాపనిలిచిన మీద నాపోజ్యోతి నీవైప్రకాశించెదవు. యీపట్టువదలకుము. ఈ ప్రకారము ఖేచరీముద్ర మనస్సుకు గోచరమగునని భావము.

కం. వరనాదుబిందుకళలను । నిరతము తానభ్యసించి నిజగురుసాక్షా । త్కరమగు హటయోగముచే । నరయగబ్రహ్మైక్యలక్ష్యమదుగో షణ్ముఖిరా । ఆత్మనుజూడుమదినిశ్చయమురా । అదుగో షణ్ముఖిముద్రహృదయాకాశమధ్య । పదముజూడగబ్రహ్మపదము నీకెదురయ్యే నదుగో షణ్ముఖిరా॥ ఆత్మనుజూడుమదినిశ్చయమురా. 19

తా. శిష్యా! నాదబిందుకళల నెప్పుడును నభ్యసించిగురువుచే బొందబడిన హఠయోగముచే బ్రహ్మైక్యలక్ష్యమైన షణ్ముఖముద్రను హృదయాకాశమధ్యను జూడుము ఆత్మపదము నీకెదురుగా గనుపడు నని భావము.

కం. కర్ణమునాసికచక్షుల । నిర్ణయమగు రంధ్రములనునిజహస్తములన్ ।
పూర్ణముగమూసియోగమ । హార్ణవమునమునిగిచూడు మదుగో
షణ్ముఖిరా । ఆత్మనుజూడుమదినిశ్చయమురా। వర్ణసువర్ణపరిపూ
ర్ణమహార్ణవ । తన్మయమగుబ్రహ్మతత్వమిదైవెలిగెడదుగో ష
ణ్ముఖిరా॥ ఆత్మనుజూడుమదినిశ్చయమురా. 20

తా. చెవులను కన్నులను ముక్కురంధ్రములను మూసి దృష్టి నీమనసుతోకూడ భ్రూమధ్యమందు స్థిరముగానిల్పి నాదబిందుకళల ననుభవించుటకు షణ్ముఖియని పేరు. దీని నీప్రకారముజూచితి వేని పరిపూర్ణమహాసముద్రమందు తన్మయుడవై యుండెదవని భావము.

కం. తనుమానసములు కేవల । తనుపరవశమగుచునాత్మతన్మయసుఖ
చే । తనమైఘనమైనభమై । యనిశముగను యోగలక్ష్యమదియె
భూచరిరా । ఆత్మనుజూడుమదినిశ్చయమురా । అదుగో భూచరిము
ద్ర । హృదయచిదాకాశ । సదనముగనసర్వసాధన నీవయ్యెదదు
గో భూచరిరా॥ ఆత్మనుజూడుమదినిశ్చయమురా. 21

తా. శిష్యా! హృదయ చిదాకాశమధ్యమున భూచరీముద్రను గను గొనుము. శరీరమానసములు పరవశమొందించి యాత్మసుఖ మును గలుగజేయు యోగలక్ష్యమిదే దీనిని జూచినసర్వ సాధకుడ వయ్యెదవని భావము.

కం. తుదనాసికాగ్రమందున । పదిలంబుగదృష్టినిల్పిపైనిటలాంత। స్ప
దనముప నెదురుగనుగొను । మిదెయాత్మప్రభానముద్ర మదుగో
భూచరిరా । భూచరియాత్మగోచరమగుగా । యిదియదియనిభేద

మొదలి బ్రహ్మానంద । పదవిలోనసీవుబట్టబయలై వెలిగెదనుగో
భూచరిరా॥ భూచరియాత్మగోచరముగురా. 22

తా. నేత్రములు కదలనియ్యక ముక్కుకొనపై దృష్టినిలిచి నటలమునం దెదురుచూచుట నోః భూచరీముద్ర దీని జూచిభేదరహితుడవై బ్రహ్మానంద పదవి గోపరిపూర్ణుడవై ప్రకాశించెదవని భావము.

కం. తుద మొద లేకంబై చి । త్పదశివజీవైక్యమధ్య ప్రణవశిఖాంత ।
ర్వదనమున తిలకముగను । మది యంతర్మధ్యగోప్యమదుగో మ
ధ్యమ రా । ఆత్మనుజూడుమదినిశ్చయము రా, మొదలచలము తెల్పి
తుది కెరుకవిడిపించె । పదమగుగోమధ్యనీకెదురెదురై తోచునదుగో
మధ్యమ రా॥ ఆత్మనుజూడుమదినిశ్చయము రా. 23

తా. శిష్యా! అంతర్మధ్యగోప్యమైనమధ్యమముద్రనుజూడుము. ఇది తుద మొద లేకంబై శివజీవైక్యసంధాన మధ్యప్రణవనాదాంతర్గతమగు పరంజ్యోతిని దర్శింపజేసి మొదట పరిపూర్ణమునుదెల్పి తుద కెరుకను విడిపించుమార్గ మిదేనని భావము.

కం. సామర్థ్యముగనునాసిక । సీమాంతర్మధ్యపవనచలనహతాంత ।
ర్వ్యోమశిఖధూమలక్ష్యం । భామహిమానంద మెరుగుమది యోమ
ధ్యమ రా । మధ్యమముద్ర సాధ్యమాగద రా । కామక్రోధారణ్యా
సీమదహనోజ్వల । ధామనై భవసౌఖ్య మేమనిబోధింతు నది యోమ
ధ్యమ రా॥ మధ్యమముద్రసాధ్యమాగద రా. 24

తా. కనులుసగముమూసిసగము తెరచి, ముక్కుయొక్కమధ్యభాగమునందు దృష్టినినిలిపి అచ్చటినుండి పై భాగముననున్న భ్రూమధ్యమును జూడవలయును ఇట్లుజూచుటకు మధ్యమముద్రయని పేరు. ఈ ముద్ర నభ్యసించుటచే గలుగు నానంద మెంతయని జెప్పుదును. కామ, క్రోధాదివర్గములను నరణ్యమునుదహించు కార్చిచ్చువంటిదని భావము,

కం. సదములపరిపూర్ణభ్రమ । మదిగలసినమాధిలోనమైమరచిశుభ । ప్రదముగనంతర్బాహ్యత । నదియుదినీవొదలిచూడు మదిగోశాంభవిరా । ఆత్మనుజూడుమదినిశ్చయమురా । అదిగోశాంభవి మనకెదురైదురై బ్రహ్మ । పదసమాధినిల్వ బట్టబయలై యున్న దదుగో శాంభవిరా॥ ఆత్మనుజూడు మదినిశ్చయమురా. 25

తా. శిష్యా! పరిపూర్ణ దృష్టిమనసుననుంచి శరీరమునుమరచి లోపల వెలుపల నిదియది యను భేదమునొదలి శాంభవీముద్రనుజూడుము. బ్రహ్మసమాధియందుండిన నీముద్ర బట్టబయలై కనుపడుచున్నదని భావము.

కం. అంతర్లక్ష్యమునిలుపుచు । నంతతహితబాహ్యదృష్టి సమకూర్చి సమా । ధ్యంతరనిమిషోన్మేషము । లంతర్లయమొందజేయుమదిగో శాంభవిరా । శాంభవిదృష్టి సంభవించునురా । అంతరాంతర రహితానందపరిపూర్ణసం । తతాచలగురుకాంతినీవై యున్న దదుగోశాంభవిరా॥ శాంభవిదృష్టిసంభవించునురా. 26

తా. ఒకవస్తువునందు దృష్టినిలుపుటయనునియమము లేకుండా కేవలము వెలుపలికిగాని లోపలికిగాని చూచుచు మనసును నిశ్చలముచేసి ప్రాణాయామాభ్యాసమువలన గాలినిబంధించి నాదబిందుకళల ననుభవింపవలయును. ఇట్లు జూచుటకు శాంభవీముద్రయని పేరు. ఈ ముద్రను నీవు సాధించిన అంతరాంతర భేదములేని పరిపూర్ణానందగురుప్రకాశము నీవై ప్రకాశించెదవని భావము.

కం. ఈపంచముద్రలకువెలి । లోపలమధ్యముల చూపులున్నవి త్రివిధవ్యాపకమగు హఠయోగవి । దీపితభావముల దివ్యతేజముగనరా । చూపురూపుప్రాపొక్కటేరా । కాపట్యమునువిడిచి యాపట్టుత్రిపుటిలో । నేపట్టుపట్టిన జూపట్టుకనుగుట్టు తేజముకనరా॥ చూపురూపుప్రాపొక్కటేరా. 27

తా. శిష్యా! పైనవివరింపబడిన పంచముద్రలకు (1)లోచూపు, (2) వెలిచూపు, (3) మధ్యమచూపని మూడుచూపులున్నవి. ఖేచరి, శాంభవీ,షణ్ముఖియనునవి లోచూపుగలవి. (అనగా కన్నులుమూసి కొనిచూచుట). దీనికే అమావాస్యదృష్టి యనిపేరు. భూచరియును, శాంభవియును, వెలిచూపుగలవి. (అనగా కన్నులు తెరచిచూచుట) దీనికి పౌర్ణమిదృష్టియనియు పేరు. మధ్యమ మధ్యచూపుగలది. (అనగాఅరగంటజూచుట), దీనికి పాడ్యమదృష్టియనిపేరు. ఈ అభ్యాసభావములచే చూపురూపునొకటిజేసి దివ్యతేజముగను గనునని భావము.

కం. సర్వాగమయోగములో। సర్వార్థప్రబోధజేయు సాధనముద్రల్।
సర్వముఖంబులు గలయవి। సర్వేశ్వరుకృపను నెరిగి సర్వజ్ఞుడవగుమూ। సర్వకళాముద్ర చేగనుమూ। సర్వకళాజాల సర్వస్వరూపమై। సర్వపరిపూర్ణము సద్గురుప్రభదోచు సర్వజ్ఞుడవగుమూ। సర్వకళాముద్ర చేగనుమూ. 28

తా. శిష్యా! శాస్త్రసంబంధమగు సాధనముద్ర లనేకవిధములుగా నున్నవి. అయితే వీనినెల్లగ్రహించి వీనికెల్లను కళయగు సర్వకళాముద్రయనుదాని జూడుము. దీనివలన సర్వకళలు, స్వరూపములు కనుపడి సద్గురుప్రభయగు పరిపూర్ణముదోచునని భావము.

కం. నేత్రయుగమ్ముకు ప్రక్కల। సూత్రముచేతర్జనులను చొరకొల్పి మనో। మైత్రిగభ్రూమధ్యంబున। చిత్రపువెన్నెలనుగనుము చిత్కళామయమూ। సచ్చిత్కళాముద్రగనుగొనుమూ। ధాత్రిహృద్గహార విచిత్రకళాజాల। సూత్రముద్రాభ్యసపాత్ర మిదేపుత్రచిత్కళామయమూ॥ సచ్చిత్కళాముద్ర గనుగొనుమూ. 29

తా. రెండుకన్నులకు ప్రక్కల సూత్రముగా తర్జనులను అనగా చూపుడువేళ్ళనుచొప్పించి, భ్రూమధ్యమున మనస్సు నిల్పి సచ్చిత్కళాముద్రనుజూడుము. చిత్రవర్ణములుగల చిత్కళలు దహరాకాశ

మందు గనుపడును. ముద్రాభ్యాసపరులకు పాత్రమైన ముద్రయి దేనని భావము.

కం. గురుకృపను పంచముద్రల। మరుగులుగురు తెరిగిబాహ్యమధ్యాంతరను । స్థిరయోగలక్ష్యసాధన । బరగెటిచిత్కళలగనుము పరవశపడుచూ । గురుకులధర్మమెరిగి వర్తిలుచూ । ధరమండలత్రయవరనాదు బిందున, త్పరశివకళలంటి నిరతముతానందు పరవశపడుచూ । గురుకులధర్మమెరిగి వర్తిలుచూ. 30

తా. శిష్యా । గురుకరుణచే నీపంచముద్రలమరుగు లెరిగి గురుకులధర్మమును గురు తెరిగి, యీయోగలక్ష్యసాధనలచే నాదబిందుకళలను గురిచేసి చూచినయెడల మనసుగాని, యింద్రియములుగాని వెలుపలలోపల సంచరింపక నాదబిందుకళలనే చూచుచునిలచియుండును అప్పుడు శరీరము కొంచెమైనను చలింపక పరవశమగును. గనుక నీ వీవిధముగా మనస్సు నిశ్చలముజేసి ముక్తినిజెందుమని భావము.

కం. యామద్వయమీయోగని । యామకమనవరత సాధనాభ్యాసమహా । ధీమహితువకీతారక । నీమముమణస్మానములకు నిశ్చయముగనూ । సంసిద్ధ్యగుభూమిలోపలనూ । సామాన్యాభ్యాసుల కేమోవత్సరమధమ । పామరులకు ద్వాదశాబ్దములకు సిద్ధినిశ్చయముగనూ ॥ సంసిద్ధ్యగుభూమిలోపలనూ॥ 31

తా. శిష్యా ! ఈయోగమునకు నియామక మేమనగా ప్రపంచమునందు తారకయోగమభ్యసించు తెలివిగల కుశాగ్రబుద్ధిగలవాని కారుమాసములకీయోగము సిద్ధియగును. సామాన్యముగానభ్యసించువారికి నొకసంవత్సరమునకును, పామరులగు మందబుద్ధిగలవారికి పండ్రెండుసంవత్సరములకును సిద్ధియగునని భావము.

కం. నిటలాగ్రదృష్టియామీ । దటకుండలి శీమణముననుధారకతేజ। స్ఫుటయమృతమయుడవైదు । ర్ఘటత్రిపురాంతకుడ వీవుగావే

కుమారా । పరమహంస నటనగనుగొనరా । కుటిలసంసారాంధ
పటలనిజితభూది । క్పటస్వప్రకాశయుద్భట చిద్భానుడవీవుగా
వేకుమారా ॥పరమహంస నటనగనుగొనరా. 32

తా. చిన్నికుమారా ! పరమహంసనటనను తెలిసికొనుము. నిటలాగ్రదృష్టికిపైని పంకువెన్నెలయందు అమృతపానము జేసినవాడవై త్రిపురాంతకుడవయ్యెదవు సంసారాంధకారమును పటాపంచలు జేయు స్వప్రకాశచిద్భాస్కరుడవయ్యెదవని భావము.

షట్కమలహంస తత్వయోగనిరూపణము.

కం. ఈపరమహంసమహరహ । మీపట్టుననిరువదొక్కవేలాన్నూ
ర్లా । తేపలుషట్కమలములను ! దీపితమైసంచరించుదిగ్భరితము
గనూ । ఖండాఖండ ప్రాపకముగనూ । ఆపోజ్యోతిగస్వస్వరూప
మనిలహృత్క । లాపనస్మేళన పక్రియలు వినుదిగ్భరితముగనూ॥
ఖండాఖండ ప్రాపకముగనూ. 33

తా. శిష్యా ! ఈపరమహంస వాయువతోగూడి యన్నికమలములందును విహరించుచుండును. సూర్యోదయము మొదలుకొని మరల సూర్యోదయమువరకును నిరువదియొక్కవేలు నారునూరుమార్లు సంచరించును. ఈప్రకారమాపోజ్యోతియైన హంస వాయువతో జేరి ఖండాఖండములుగాసర్వమునందునుసంచరించుచుండునని భావము.

కం. గుదమునమూలాధారము । వదలకమును వశషసాఖ్యవర్ణచేతు
న్సంపదతప్త హేమనిభభూ । సదవంబైఘ్రాణమునకు సాధనమ
గుచూ గణేశ్వరుడధిదైవమగుచూ । పదపడితత్కమల పదము
నందార్యాన్నరు । సదమలహంసలు జరుగునా గణపతికి సాధనమ
గుచూ ॥ గణేశ్వరుడధిదైవ మగుచూ॥ 34

తా. మూలాధారచక్రంబనగా గుదస్థానమందు వా, శ, ష, స, అను నాలుగక్షరములతోగూడిన నాలుగుదళములుగలదియు, ప్ర

టము వేసిన బంగారు కాంతిగలదియు, పృథ్వీభూతమున కాధారమైనదియు, ఘ్రాణకారణంబగునదియు నగు మూలాధారచక్రంబుగలదు. ఆ చక్రాధిదేవతయగు విఘ్నేశ్వరున కారునూర్లహంస లచ్చటజపముజరుగునని భావము.

కం. లింగముస్వాధిష్ఠానము । రంగుగనటబభమయరలరహితషడ్దళశో ।
భాంగారుణ కాంత్యోదక । సంగస్థలరసన హేతుసదనమై వెలుగూ । కమలజుడధిదైవముగాను జలగూ । హంగుచునారువేల్
సాంగముగా హంస । లంగీకరించి విధిశృంగారసర్వసదనమై వెలుగూ । కమలజుడధిదైవముగానుజలగూ. ౩౫

తా. లింగస్థానమున స్వాధిష్టానచక్రముగలదు. బ, భ, మ, య, ర, ల, అను అక్షరములతోగూడిన యారుదళములుగలిగి రక్తవర్ణముతో నాచక్రము ప్రకాశించుచుండును. అది జలభూతమునకాధారము. జిహ్వేంద్రియమునకుగారణము, దానికధిదేవతయగుబ్రహ్మకచ్చట నారువేల హంసలు జపముసమర్పింపబడునని భావము.

కం. ధరనాభినిమణిపూరక । మరయగదశదళవిలాసమై డఢణలతో ।
నరిగూర్చితథదధనపఫ । లిరువుగతత్వార్ధవర్ణమిది తేజలయమూ ।
మహావిష్ణుడధిదైవతమూ । వరపీతవర్ణయుక్సరసిజాంతరహారికి ।
వరహంసలార్వేలువడల కర్పణజరుగునిది తేజాలయమూ ॥ మహావిష్ణుడధిదైవతాము. ౩౬

తా. నాభియందు మణిపూరకమను చక్రమున్నది. అది పచ్చనిరంగుగలదియు, అగ్నిభూతమునకు వాసస్థానమైనదియు, నేత్రేంద్రియమునకు కారణమైనదియు నయి, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, అను బీజాక్షరములతోగూడి పదిదళములుగలిగి శోభించుచుండును. దానికధిదేవతయగు విష్ణువున కచ్చట నారువేలహంస లర్పణచేయబడునని భావము.

కం. హృదయస్థానమనాహత । సదనంబైక చద్వివర్గస్యాక్షరటఠ
లుగా వదలక ద్వాదశదళ సం । పద శ్వేతసు కాంతిమై తత్వాధా
కారణమూ । సదాశివుడధి దైవతమూ । ముదమలరతత్వములప
దవాసుడగుశివున । కొదగియార్వేల హంసలుజరుగుచుండు తత్వా
ధా కారణమూ । సదాశివుడధి దైవతమూ. 37

తా. హృదయస్థానమం దనాహతచక్రమున్నది, అది తెల్లటి వన్నెగలది, వాయుభూతమున కునికిపట్టు, త్వగింద్రియమునకు కారణమైనది, క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, అను వర్ణములతోటి పండ్రెండు దళములు గలిగి యున్నది. దాని కధి దేవతయగు రుద్రున కచ్చట నారు వేల జపములు జరుగునని భా.

కం. సమగళమున సువిశుద్ధము । నమరగనంధకారవర్గ మదియొక
ల్ప । క్రమమనీలముశ్రుతి కారణ । మమరమనుత్పదాంత రాలయ
మగుచూ శుద్ధజీవ దైవత్యమగుచూ ! శమదమోపరతుల నమరు
జీవునకొక్క । విమలసహస్ర హంసలు జరుగుటకు నంతరాలయ
మగుచూ । శుద్ధజీవదైవత్య మగుచూ. 38

తా. కంఠస్థానమందు విశుద్ధచక్రమున్నది, అది నీలవర్ణము గలది, ఆకాశభూతమున కునికిపట్టు. శ్రోత్రమునకు కారణము. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః, అను అచ్చులతోటి పదియారు దళములు గలిగి ప్రకాశించుచున్నది. దానికధిదేవతయగు శమదమోపరతులచే నొప్పియుండు జీవున కచ్చట నొక వెయ్యి హంస లర్పింపబడునని భావము.

కం. భ్రూమధ్యస్థానంబున । నామహదాజ్ఞేయ చక్రమమరుచుహంక్షం
బీమహివర్ణద్వయితో । కోమల మాణిక్యకాంతిగూడి విలసిల్లూ
అంతఃకరణాలయముప్పతిల్లూ । ప్రేమవరమాత్మశుద్ధామ సహస్ర
ము । నీమమైహంసలుజరుగుచునుండుసుకాంతిగూడివిలసిల్లూ । అం
తఃకరణాలయముప్పతిల్లూ. 39

తా. భ్రూమధ్యస్థానమునం దాజ్ఞచక్రంబుండును, అది మాణిక్యవర్ణము గలది, మనసునకు నివాసస్థానమై యున్నది, హాం, క్షం, అను వర్ణములతో గూడిన రెండు దళములతో నొప్పుచుండును, అచ్చటదాని కధిదేవతయగు పరబ్రహ్మమున కొక్క వెయ్యి హంస లర్పణయగునని భావము.

కం. గురుగృహముబ్రహ్మరంధ్రాం। తరమునసహస్రారమనగతగునోం
కార । స్వరహితసహస్రదళభా । స్వరశతకోట్యర్క తేజ సమాన
మాగా । సద్గురు దేవుడధిదైవమాగా । గురువునకు హంసలరయ
సహస్రము । జరుగుచుండును మోక్షసరణి జీవన్ముక్తిసగూనమా
గా । సద్గురు దేవుడధిదైవమాగా. 40

తా. బ్రహ్మరంధ్రాంతరమున కోటిసూర్యప్రకాశమై ఓంకారమను బీజముతో గూడుకున్న సహస్రదళములుగల సహస్రారమను పేరుగల కమలమున్నది. సుషుప్తి నుండు బుద్ధిమొదలగు నవిలయించు స్థానమదియే, దానికి గురుమూర్తి యధిదేవత, ఆయనకచ్చట నొక సహస్ర హంస లర్పణ జరుగునని భావము.

అష్టదళపద్మాంతర పరమహంస సంచారక్రమము.

కం. అష్టదళకమలమధ్యను । ద్రష్టసదానిలచిసర్వదిశలనుదిరుగున। స్ప
ష్టముప్రాగ్దళమున బహు । శ్రేష్టముగనుపుణ్యబుద్ధి జలగుకుమా
రా । నాజ్ఞేయతనిద్రాలస్యమురా । యిలయామ్యదిశ కౄరత్వత
లవునైరుతిపాప । ములవడపశ్చిమదళమున క్రీడలు జలగు కుమా
రా । నాజ్ఞచే యతనిద్రాలస్యము రా. 41

తా. శిష్యా! హృదయమందుండు అష్టదళపద్మము యొక్క మధ్యను హంసదీపాకృతిగా వెలుగుచు గాలిచే నన్నిదిశలను తిరుగుచు, యెనిమిది దళములమీదను చలించి వాలును. తూర్పుదళముమీద వ్రాలిన పుణ్యకార్యములు జేయు చింతయు, ఆగ్నేయమున నిద్ర

ఆలస్యము, దక్షిణదళమున క్రౌర్యము, నైరుతిమూల దళముమీఁద పాపకార్యచింతయు, పశ్చిమదళము మీఁద నాహంస వాలునప్పుడు క్రీడలయం దిచ్ఛయు గలుగు చుండునని భావము.

కం. గమనాగమనమువా యు । వ్యము నుత్తరమందురతియువసతీ
శాన । క్రమదిశదాహాదులు మ । ధ్యమమున వైరాగ్యబుద్ధిసన
రుకుమారా । కేసరముల జాగరణగురా । కమల కర్ణిక స్వప్న
మమలలింగముఁ సుప్తి । కమలత్యాగమె తుర్యమమరినాదముగ
లసినరు కుమారా । కేసరముల జాగరణగురా. 42

తా. శిష్యా! ఆహంస వాయువ్యదళమున నిలచియున్నప్పుడు నడువవలయునను తలంపును ఉత్తరదళమునందున్నప్పుడు రతియం దిచ్ఛయు, ఈశాన్యదళమున ధనధాన్యాదుల యందలి చింతయు గలుగును, కమలమధ్యముననున్నప్పుడు వైరాగ్యము పుట్టును, కేసరములయందున్నప్పుడు జాగ్రతయు, కర్ణికయందున్నప్పుడు స్వప్నమును, తొడిమెయందున్నప్పుడు సుషుప్తియు ననుభవింపబడును. ఆహంస పద్మము విడచినప్పుడు ప్రణవార్థమైన ఘంటానాదమునందు లయము నొందునని భావము.

కం. వేదమయంబానాదము । ఆధారబ్రహ్మరంధ్ర మాద్యంతము ని।
ర్వేదితశుద్ధస్పటిక ప్ర । భోదయమై సకలమందు పూర్ణమైయుం
డూ । యోగులకతిమోదమైయుండూ । యీదివ్యపరమార్థబోధ
తెలసితత్వ । వాదులీ పరహంససాధన సేయగపూర్ణమైయుండూ ।
యోగులకతిమోదమైయుండూ. 43

తా. శిష్యా! ఆనాదముమూలాధారము మొదలుకొని బ్రహ్మరంధ్రమువరకు శుద్ధస్ఫటిక ప్రభతోటి నొకటేవిధముగా సకలమందు వ్యాపించియున్నది. అదియే పరబ్రహ్మ తత్వరహస్యమని తెలిసికొని యోగులీ పరహంససాధన జేయుచుందురని భావము.

పరమహంసోపాసక జీవన్ముక్తిక్రమము.

కం. నిజపరిపూర్ణము గనుగొన।సుజనవరాత్మైక్య సుషిరసూక్ష్మహృ
దంత। ర్విజనపరస్థలముననొక। అజముఖగోళకములోన హంసేతి
రవమూ। ప్రబలెను ప్రత్యాహమూ ఘోషవినుమూ। సంసార
బంధ వి। ధ్వంసకమగు పరమ। హంస గాయత్రీ ప్రశంసింపుచు
నాత్మ హంసేతిరవమూ॥ప్రబలెను ప్రత్యాహమూఘోషవినుమూ. 44

తా. శిష్యా! హృదయాంతరమున గోస్తనముఖమువంటి నొక
గోళకమున్నది. అందు హంసగాయత్రీ మంత్రముగా సోహంఅనుధ్వని
సదాప్రబలి యున్నది. నీవు ముక్తుడవగుటకు నానాదము వినుమని
భావము.

కం. ధారణవిధిలేక యసా। ధారణమగు మహిమ లెరుగనరమాయిల
నం। హారణమొనర్పగ మరినిద్ధారణగా మనము నిలుచు ధార
ణవిధులా। హంసెతిసంచారాత్మలీలా। మారుత రేచకాపూరక
కుంభక। సారపూర్ణపరమ హంసను గలియుముధారణవిధులా॥
హంసేతిసంచారాత్మలీలా. 45

తా. శిష్యా! ధారణాధ్యానము లేకుండా యోగమహిమ లెరు
గుటకు తరముగాదు, దీనివలన మనసు చలించకుండా నిలచును గాన
హంససంచారమందు రేచక పూరక కుంభకములచే బరమహంసను
గలియుమని భావము.

కం. కుడినిడ యెడమది పింగళ। నడినాడిసుషుమ్న యిట్టినాడీత్రయ
ముగ। కడునెరిగి ప్రక్కలంటక। నడినాడిననిలిచి నన్ను నమ్ము
కుమారా। పెడదారులు జడదృశ్యమారా। నడిలో సందడి విడి
చినడిసుషుమ్నలోజ్ఞప్తి। నడిచియాత్మారామము నెడబడకను బొంది
నమ్ముకుమారా॥ పెడదారులు జడదృశ్యమారా. 46

తా. శిష్యా! కుడితట్టుయిడానాడి యెడమదిపింగళనాడి, నడిమింది
సుషుమ్నానాడి, ఈమూడు నాడులవివరమును చక్కగా దెలిసికొని

మనసు ప్రక్కల ప్రసరింపజేయక మధ్యనాడియందు దృష్టినిలిపినన్ను నమ్మి యాత్మారామునియందు జేరుమని భావము.

కం. హృదయంగత ప్రాణానిల । మదినాసిక వివరములను మసలుచు వెలికిన్ । పదిరెండంగుళములకును యుదిజరుగును రేచకంబై యంతలోపలనూ । అర్ధ సమయమిటు విలయమగునూ । ఇది బాహ్యకుంభకమిదె ధారణాభ్యాస । మిదె యోగశాస్త్రార్థ మిదియె ప్రాణాయామమంతలోపలనూ ॥ అర్థసమయమిటువిలయమగునూ. 47

తా. శిష్యా! హృదయమందున్న ప్రాణవాయువు నాసికనుండి పదిరెండంగుళములు వెలుపలకు వచ్చును. అదియే రేచకమనబడును. వచ్చినకాలములో సగము వెలుపల నిలచును దానికి బహిఃకుంభకమని పేరు. ఇట్లే లోపలికి జనుటకు పూరకమనియు నర్థకాలమణగియుండుటకు నంతరకుంభకమనియు పేరు. ఇదే ప్రాణాయామమని భావము.

కం. యీమహిత త్రివిధప్రాణా । యామములనుగాలిదిరిగి యలమానసమం । దీమహితహంసమెలగెటి । యామెలకువ కాలమున తానభ్యాసవిధినీ । సేయగవలయు గురుబోధరతినీ । సోమసూర్యాగ్నిన చిద్వ్యోమానందమునొంది । కామావికారాదు । లేమి దగలనిధారణాభ్యాసవిధినీ ॥ సేయగవలయుగురుబోధారతినీ 48

తా. శిష్యా! ఈ త్రివిధప్రాణాయామ లక్షణములచే గాలిదిరిగి మనస్సుతోటి యీ హంసకూడిన మార్గముయొక్క రహస్యమునభ్యాసముచే గ్రహించినవారు, కామాది వికారరహితులై మోక్షమునుబొందెదరని భావము.

కం. దనరుహాకారముపూరక । మునుపొందిక జేసిముఖ్యముగ కుంభకమం । దునబిందుగూర్చి రేచక । మునను సకారము నమర్చిముదముతోఁ వీటి । తెలియు తెలివేసనుబోధధాటి । ఘనహంస మఖిల

చేతనతనుగతముల । నొనరుదీనికీలుగనిసాధించిన ముక్తిమదము
తోపీటి ॥ తెలియుతెలివేననుబోధధాటి. 49

తా. శిష్యా! హంసమంత్రము జపించువిధము జెప్పెదను. పూరకమందు హకారమున్నదనియు, అంతరకుంభకమునందు బిందువున్నదనియు, రేచకమునందు సకారమున్నదనియు, భావనచేసి జపించుజపమును తెలిసికొను జ్ఞానమనుహంస మక్షలచే తనతనువుల యందును నిండియున్నది. దీనికీలుదెలిసికొని సాధించుట ముక్తియని భావము.

కం. మానసపవనమ్ములకును స । న్మానతసమకూర్చి హంసమంత్రా
క్షర సం । ధానముననజపజపితని । ధానతహ్మృగ్గగనమందుతగ
బిందువెవుడూ । నిలువుచునాదకళలందు నెవుడూ । జ్ఞానహాకార
పూర్ణానందజలధిలో । లీనమైదృశ్యస । కారమాత్మనుజెందు తగ
బింబువెవుడూ ॥ నిలువుచునాదకళలందు నెవుడూ. 50

తా. శిష్యా! మనస్సును, గాలిని, నొకటిజేసి హకార సకారములకు బిందువుజేర్చి హంసమంత్రమును జపించి నాదబిందుకళలను పొందుము. హకారమును ఆనందజలధిలో దృశ్యమగు సకారములీనమై పరమాత్మలో నైక్యమగునని భావము, " అనగా నాదుబిందు కళాతీతమై సచ్చిదానంద స్వరూపమై ప్రకాశించుపరమాత్ముడు హకారమనబడును, దేహేంద్రియాది దృశ్యరూపిణియగు ప్రకృతి సకారమనబడును. ఈ పురుషప్రకృతులుగలసుటయే హకార సకార మధ్యనున్న బిందువు గనుక హంసయన బడునని తెలిసికొన వలయు.

శిష్యవచనము.

కం. శ్రీమద్గురుతారకప్రభ । నీమములిట్లెరుగదెల్ప నిజశిష్యుడనెన్ ।
స్వామీనీమహానిష్యత । నామదిబోడగంటి సత్యమాశ్చర్యముగ
నూ । యోమందుబ్రహ్మానందమికనూ । దీమహితసూర్యాగ్ని ।

సోమకోట్యద్భుత । ధామవైభవమునేనేమానివినిపింతు నాశ్చర్య
ముగనూ॥ యేమందుబ్రహ్మానందమికనూ. 51

తా. ఈవిధముగా శ్రీగురుమూర్తి తారకమహిమలు శిష్యున కెరుగజెప్పిన శిష్యు డీవిధముగాననెను. స్వామీ సత్యముగాతమమహత్తునుగంటిని. నాకాశ్చర్యమగుచున్నది. కోటిసూర్యచంద్రులకాంతిచే నొప్పియుండు స్థలవైభవమింతంతని చెప్పుటకలవిగాదని భావము.

కం. కంటివిగవె తారకప్రభ । వింటివిగద యోగలక్ష్యవిభవము నెల్లన్।
కంటికిమింటికిరెంటికి నంటకనరకంటచూడు నామహిమ లెల్లా ।
వినుకనుతినుపనులన్నికల్లా । జంటవెఱుపులమిన్నంటి యారెంటిపై
రెంటినడుమనుభ్రుముక్కంటిలోపల వెలుగునామహిమ లెల్లా॥ వినుక
నుతినుపను లెల్లకల్లా. 52

తా. శిష్యా ! తారకప్రకాశముచూచితివిగదా, యోగలక్ష్యములు మార్గములు వింటివిగదా కంటికి మింటికి నంటక జంట వేఱుర వముమిన్నంటి, వాటిమధ్యనుండు మూడవ కంటియందు వెలిగే మహిమ లరగంటితోజూడుము. విను, కను, తిను పనులన్నియుకల్లయగునని భావము.

కం. ఈముద్రలయభ్యాసము । నేమాత్రముచొరవలేనినీచాత్ములకిం ।
కేమైనముద్రలున్నవో । యామహిమలుదెల్పి బ్రోవుమమలవిచా
రా । అద్వైతపరానందసారా । యీమహిమలోగురుస్వాములనే
కము । లేమోదెలుపుదురట యామూలా మెరిగింపుమమలవిచారా॥
అద్వైతపరానందసారా. 53

తా. గురువరా ! యీముద్రలయభ్యాసము చొరవలేనినీచుల కింకేమైనా ముద్రలున్నవా ? ప్రపంచమం దనేకగురువు లేమేమో తెల్పుదురట. ఆసందర్భము లేమో నాకుదెల్పి రక్షింపుడని భావము.

కం. ముద్రనుపంచకయోగస । ముద్రములోముద్రకొక్క ముద్రల
కోటుల్ । ముద్రితములయ్యెవెలిలో భద్రముగను యోగపట్టభద్ర

డవగుమూ ! తారకవీరాభద్రుూడవగుమూ । ముద్రలోపలముద్ర నిద్రలోపలనిద్ర । ముద్రభద్రాతీతమూర్తి వినవేర భద్రూడవగు ము ॥ తారకవీరభద్రుూడవగుమూ. 54

తా. శిష్యా! యీముద్రపంచకమును సముద్రమందునొక్కొక ముద్రకు కోటానకోటిముద్ర లేర్పడినవి. ఈముద్రలలోని భద్రమును గనుము. అనగా పరంజ్యోతిని దర్శించుము ముద్రలోపలిముద్రయు, నిద్రలోపలినిద్రయు, ముద్రభద్రములకతీతుడవు నవుదువని భావము.

కం. గురునాథప్రణవనాదము । స్ఫురణించుట దేనియందు శుద్ధజగ ద్బిం । దరయగ నేదహృద్గో । చరచిత్కళయనగ నేదో చర్చించి తెలుపూ । స్థిరమగుపీటిమరుగులు దెలుపూ । పరిపరివిధములపరి గత్తెవృత్తుల । తెరగు తెలియు టకేమి గురిగురుతుజిక్కదు చ ర్చించి తెలుపూ । స్థిరమగుపీటిమరుగులు దెలుపూ. 55

తా. సద్గురునాథా! పరిపరివిధములుగా పరుగు లెత్తు వృత్తుల యొక్క మార్గము దెలియుటకు గురిగుర్తుచిక్క లేదు. ప్రణవనాదము దేనియందుగలుగుచున్నది. బిందువనగా నేది ? హృదయమందుగోచర మయ్యె చిత్కళనగా నెద్ది ? వీటిని వివరించి మరుగును నాకు జెప్పుడని భావము.

కం. పవనప్రఘోష నాదము । జవసత్వ ప్రాణమాన సాగ్రస్థిత బు ద్ధివికల్పమెబిందువు త । త్వవిమలబింబావభాసమది చిత్కళరా । నాదుబిందుకళలీ వెగదరా । సవినయముగను నీ త్రివిధయోగా భ్యాస । శివజీవైక్యభావచిత్సమాధిలోజూడు ప్రకటచిత్కళరా । నాదుబిందుకళలీ వేగదరా, 56

తా. శిష్యా సకలకర్మలనుజేయుచు పవనముతో గూడియు న్న మనస్సుయొక్క అగ్రమందుండు కర్తృత్వాదిధర్మములుగల బుద్ధి యే బిందువనబడును. వాయువుయొక్క ధ్వని నాదమనబడును. ఈబిం

దునాదములకు సాక్షియైయున్న యాత్మప్రతిబింబమే కళయనబడును. ఈత్రివిధయోగాభ్యాసములచే శివజీవైక్యసమాధినిజెందుననిభావము.

కం. వరనాదబిందుకళలను । గురిచేసియు మనమునందుగూర్చి పదా
ర్థః । స్ఫురణానురక్తియుక్తిని । సరసముగను ముద్రనమితి సక
లాముజూడ । సాధనలక్ష్యమొకటాయెజూడ । ప్రకటితముగ బ్ర
హ్మపదమున విలసిల్లు । శుకరాజముఖముతో ప్రకటచిత్కళగంటి
సకలాముజూడా । సాధనలక్ష్యమొకటాయెజూడా. 57

తా. గురువరా! నాదబిందుకళలను మనస్సునగురిజేసి ముద్రలనుజూడగా సాధనలక్ష్యమొకటాయెను. బ్రహ్మపదమున బ్రకాశించు శుకరాజముఖముతో, ననగా సుషుమ్నాంతమందుండు చిత్కళలు జూచితినని భావము.

కం. కొండలనేడింటికిపై । నిండేరులమూటిగలసినిజకనకనగం । బం
డగొనిదశవిధాంత । ర్మండలములుదాటియండమధ్యను వెలుగు ।
నజపహంస కుండలిజెలగున్ । దండిసుషుమ్న హృత్పుండరీకాగ్రి
బ్రహ్మాండ భాండానత్యాఖండదర్శన మగుచు మధ్యను వెలు
గుః ॥ నజపహంసకుండలి జెలగూ. 58

తా. శిష్యా! ఏడుకొండలకుపైన మూడునదులనుగలసి, కనకాచలమును అండచేసికొని, దశవిధనాదములగు నంతర్మండలములు దాటి, అండమధ్యమున అజపకుండలియున్నది. కుండలియనగా పాము వలెనుండునాడి. అది సుషుమ్నానాడితో బెనగొని నిటలాంతముదాకా వెలుచుండును. అట్టి యజపకుండలిని సాధించిన సుషుమ్నాంతమందుండు బ్రహ్మాండభాండాఖండదర్శనమగుననిభావము.

కం. నాకొకమాహాత్మ్యముగను । నాకంటికి గానబడియె నదియేమ
గునో । నీకరుణామృతమేమో । యేకాలములేక తేజమేకాపైవె
లుగూ । గన్పడి సర్వలోకముల్ జలగూ । ఆకడనీకడనాకడగట్టే

ద్వి ॥ చేకొని దెల్పుచిదాకాశసర్వేశ యేకమైవెలగూ ॥ గన్పడిన
ర్వలోకముల్ జెలగూ. 59

తా. సద్గురుస్వామీ! తమయొక్క కరుణామృతమేమో నా
కంటికి లోకమహాత్మ్యముకనుపడెను. కాలాకాలములు లేకుండా మహా
తేజస్సు కనుపడి లోకాలోకములన్నియునిండి నిబిడీకృతమాయెను. దీని
కెంతవరకు మేరయున్నదో నాకుదెల్పుడని భావము.

కం. లేకున్నది లేకున్నది। నీకున్నా కున్నదన్న నిజమందరిలో చేకు
న్నదిపోకున్నది। రాకలుపోకలును లేని రాజ్యములోనీ। రాజితదహ
రాకాశగవనీ। వాకిలిదీసినిరాకారముననిల్పి। కాకీముఖమునందే
కాగ్రముగజూడురాజ్యములోనీ॥ రాజితదహరాకాశగవనీ. 60

తా. శిష్యా! రాకడపోకడలు లేని స్థలమందు దహరాకాశగ
వనివాకిలిదీసి నిరాకారమున నిల్పి సుషుమ్నాంతమున నేకాగ్రదృష్టి
తోజూడుము. లేనిది లేకనే పోయినది. నీకునాకు నున్నదనుకున్న నిజ
మందరిలో పోకుండానున్నదని భావము.

దహరాకాశగవనివాకిలి దీయుటనుగురించి కొంతవివరించెదను
బ్రహ్మనాడియగు సుషుమ్నవాయు జయంబునగాని సిద్ధింపదు. ఎట్లన
గా పాపస్వరూపిణియగుమూలప్రకృతి, మహదాదితత్వములతో గూడు
కొని ముఖమువిచ్చి సుషుమ్నామూల రంధ్రమునుగప్పి మూలాధార
ము మొదలుకొని వీణాదండా కారముగానున్న వెన్నెముకసంబంధ
రీత్యామీదికి బాహ్యమధ్య నాడితోగూడా బ్రహ్మరంధ్రమును తోక
చివరతో గప్పియుండును గాన వాయువునడిమి నాళమైన సుషుమ్న
యందు జొరలేక ఇడా, పింగళాద్వారములను యెక్కుచు దిగుచు
నుండును. గనుక నీరెండు వాకిళ్లనుమూసి గురుకరుణ వలన సాధన
జేసినడిమి వాకిలయిన దహరాకాశగవని వాకిలిదెరవనేర్చి నప్పుడు
వాయువు వశమైయుండును.

కం. చూడగచూడగ ముద్రలు । వేడుక వేడుకలు నగుచు విడిబడి తామేపోడిమగుపడకపరవశ । జాడగనై మరపుతోఁచెసత్యముస్వామీ। తన్మయ మొక్కటాయనింకేమీ । నాడునాడె నాకీజాడ దెల్పిననెంత । వాడనాదునని వేడుకగలిగెను సత్యము స్వామీ ॥ తన్మయమొక్కటాయనింకేమీ. 61

తా. గురుచంద్రా! ఈముద్రలు చూడగా చూడగా నెన్నో చిత్రములుగనుపించి మనసునకు వేడుకలుగలుగజేసి యంతలోనేజాడ లేకుండా పోవుచున్నవి. ఎప్పటికిని నీలాగే యున్నది. మొట్టమొదట నేనివి నిలిచేవి కావనేజాడనాకు దెలిపియున్నట్టయిన నేనిప్పటికి నెంత వాసినాదునోనని తలచెదనని భావము.

కం. ఆటలపాటలమాటల । పాటిగసత్క్రియల యోగభాటల తెల్పఁ తేటగజూడని దేమో । నేటికి నామదికి తోఁచే నీ జన్మ ఫలమూ । సంసిద్ధిముమ్మాటికి నిజమూ । ధాటినీయెరుకను గోటమీటితినీ । నోటిమాటలు యీనాటికి వింటినే నీజన్మఫలము ॥ సంసిద్ధిముమ్మాటికి నిజమూ. 62

తా. శిష్యా! ఆటలచేతను, పాటలచేతను, మాటలచేతను, సత్క్రియలచేతను, యోగమార్గముల నీకుజెప్పుచుండగా వానిభావము నీవు తేటగాజూడనిదెందుకో, యెరుకను గోటమీటివేసేచూట నీనోట నీనాటికి వింటిని, సంతసించితిని, నీయొక్క జన్మఫలము నేటికి సంసిద్ధియాయెనని భావము.

కం. వాచామగోచరంబగు । నీచిన్మయమునకు చిన్నె లీవన్నెలుముఁ చూచినగతిదాచనిమతి । నేచందముగాను యోగ మేర్పరచితయ్యా । యేర్పరచి ప్రబోధించి తయ్యా । యీ చిత్రకల్పకమేచిత్రమునగలిగె । యోచించిదెల్పినను గాచిరక్షించవే యేర్పరచితయ్యా॥ యేర్పరచి ప్రబోధించితయ్యా. 63

తా. దేశికవరా ! ఇట్టిదనివర్ణించుట కలవిగాని నీచిన్మయమున నీచిన్నెలు, వన్నెలు చూచినట్లు యోగముకల్పించి నాకు బోధించితిరి. యీచిత్రమైన కల్పనయేచిత్రములోకలిగినది. ఈ సందర్భము యోచించి నాకుదెల్పి నన్ను రక్షింపుడనిభావము.

కం. అడిగెటిశిష్యునిమానస । నడవడికనిసించి యతనినమ్మికయర్థం ।
బొడగూర్చి నిహపరంబుల । కడితేర్చేఘనుడు గురుడుగాదటవో
యీ । పరహితమాత్మహితముగనవోయీ । అడిగినదొకటి తా
నుడివేదిమరియొకటి । చెడుబోధ గురుశిష్యులోడబడరెన్నటికిగా
దటవోయి । పరహితమాత్మహితము గనవోయీ. 64

తా. శిష్యా ! అడిగేశిష్యునియొక్క మనసు నడవడికనిపెట్టి వాడడిగినదాని వాని మనస్సుకు సరిపోవునట్లు బోధించి యిహమునందును, పరమునందును, కడతేర్చేగురుడే గురుడుగాదా ! అడిగేదొక విషయము, చెప్పేది మరియొకవిషయముగానుండు చెడుబోధ యెన్నటికి ప్రయోజనములేదనిభావము.

కం. అడిగిననాప్రశ్నకు మీ । రొడబడిమును తగినబోధ నుడివితిరిం
తక । అడిగెటివేళల నడుగని । జడముగులోపములు శిష్యజనుల
వెకావా । తడబడుకర్మతంత్రములుగావా । గడచిన వేళలో జ
డుపుతను వెరుకల । విడిచియడిగిననిజమువిడువకమీరనరే జనుల
వెకావా । తడబడుకర్మతంత్రములు కావా. 65

తా. గురునాథా! నేనడిగినప్రశ్నలకు తగినబోధజేసితిరి. అడిగే సమయమందడుగదగిన సంగతులడుగనిలోపము శిష్యులదేగదా. కర్మతంత్ర మిట్లుజరిగినది. నీలోపమేమియునులేదు. తనువెరుకలస్థిరములని వానిని విడచి తమరినియడిగియుంటే నిజమును బోధించకపోయినారా, బోధించేయుందురని భావము.

కం. సాకల్యముగను తత్వము । నేకముగా దెలుపువేళ నీతారకసాం ।

ఖ్యక్రమవిధు లెఱిగింపరె । నీకేసంశయము వలదునిక నమ్ముపుత్రా
సాధులపూర్వగతులెఱుగుమిత్రా । ఆకాలమునకది యీకాలము
నకిది । పాకభేదముకాని పరిపూర్ణమేకము యికనమ్ముపుత్రా ।
సాధులపూర్వగతు లెఱుగుమిపుత్రా. 66

తా. శిష్యా! గురువులనేకమార్గములచే శిష్యులకు తత్వబోధ
చేయు వేళల తారకసాంఖ్యములయొక్క క్రమవిధులు బోధించెదరు.
నీకు సంశయము వలదు. సాధుల పూర్వస్థితులను తెలిసికొమ్ము, ఆకా
లమునకది, యీకాలమునకిది, పాకభేదమేగాని పరిపూర్ణమొక్కటే
నని నమ్ముమని భావము.

కం. సకల వ్రత జపతపములు । సకలాగమశాస్త్రయోగ సాధకముల
నే । నొకటెఱుగనీవె దైవము । యికనైనను కరుణజూడుమిందరి
లోనూ । జేర్చుముగురుపుత్రులలోనూ । యికనావశమేమున్నదిక
మీచిత్తముగాభాగ్యము కేమిఘనమునే, నొకపుత్రుడను కొంటి
యిందరిలోనూ । చేర్చుముగురుపుత్రులలోనూ. 67

తా. సద్గురుదేవా! నేను వ్రతములుగాని జపములుగాని, తప
ములుగాని, ఆగమములుగాని, శాస్త్రములుగాని, యోగసాధనములు
గాని, ఒకటియు నెఱగను నీవేదైవమని మాత్రమెఱుగుదును. యింక
నైనను కరుణించి గురుపుత్రులలో జేర్చుము యికనావశమేమియు
లేదు. మీచిత్తము నాభాగ్యము, యింతమంది తమపుత్రులలో నేను
నొక పుత్రుడ నేనని తలచితినని భావము.

కం. యేవేళకేమి యాచన । నేవాంఛతో నిన్ను కన్నదే మొదలెందున్
నీవేమడిగిన యాచక । నావిధము దెల్పలేదా నాతండ్రీ వినరా ।
మద్వరపుత్రగణములోనిలరా । నీవే నేనని యాత్మభావ మెఱిగించి
గురు । దేవపుత్రులలోన । నిన్నొకనిగానెంతు నాతండ్రీ వినరా ।
మద్వరపుత్రగణములోనిలరా. 68

తా. నాకుమారా! నిన్నుచూచినది మొదలుకొని నే నేవాంఛతోనో నీవు నన్నే మడిగినను, దాచకుండా బోధించలేదా నా ప్రియశిష్యులలో నిన్నొకనిగా నెంచితిని శిష్యసమూహమందు జేరుమని భావము.

కం. దేవాంఛలేను లేదిక । దేవామీపాదపద్మదివ్యామృతసం । సేవావాంఛితమొకటై । యేవిధికడతేర్చదలచితేమో మహాత్మా దేమహిమ లేమని నేంతునాత్మా । దేవ దేవయాదినారాయణగురు । దేవనాకికబ్రహ్మభావముదెల్పవెయెమోమహాత్మా ॥ యేమహిమ లేమని నెంతునాత్మా. 69

తా. ఆదినారాయణ దేవా! తమ దివ్యపాదపద్మారాధన వాంఛతప్ప నాకింకే వాంఛయులేదు, మహాత్మా నన్నేవిధిగా కడతేర్చదలచినారో తమ మహిమ నేనెంతని తలచెదను నాకు నింక బ్రహ్మభావము బోధించుమని భావము.

కం. గురుసత్యహృదయుడై పర ! గురుమహిమ లెరింగి నాత్మగురుధర్మములన్ । గురిమీర నల్పుచుండెడి । గురుపుత్రున కిహపరమ్ములకొదువ లేదోయీ । వానిసాటిగుణు లెవ్వరోయీ । గురుడు బ్రహ్మవిష్ణువు గురడెపురహరుడని । గురుభక్తిసేవింప గురుడై రక్షించును కొదవ లేదోయి ॥ వానిసాటిగుణు లెవ్వరోయీ. 70

తా. శిష్యా! సత్యహృదయముతోటి పరమగురుని మహిమ లెరిగి తన గురుధర్మములను గురిచే నెరవేర్చుచున్నట్టి గురుపుత్రున కిహపరములం దేకొరతయులేదు. వానితోసాటి నెవరును కారు, గురుడేబ్రహ్మ గురుడే విష్ణువు, గురుడే పురహరుడని గురుభక్తి గలిగి సేవించితే గురుడే రక్షించునని భావము.



శ్రీ

గురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైతప్రబోధ గురుశిష్య సంవాదము.

## పూర్వభాగము, సాంఖ్య ప్రకరణము.

### చతుర్థప్రకరణారంభము.

కం. మనుతారకయోగప్రభ । గనుగొంటి తదీయబ్రహ్మకళమామక హృ । ద్వనజమునబట్టబయలగు । ఘనతరవిజ్ఞానసాంఖ్యకథ దెలుపుస్వామీ । తెలిసినతెలివి నిలువదదేమీ । అనిశమాత్మానాత్మలను తేటపరచునా । ధనబోధజేసి చిద్ఘనునిగాననుజేయుకథదెలుపుస్వామీ । తెలిసినతెలివినిలువదదేమీ. 1

తా. గురుస్వామీ తారక ప్రకాశమును గనుగొంటిని అట్టి బ్రహ్మకళమనస్సుకు గోచరమాయెను. అదెమో తెలిసిన తెల్వినిలుచుటలేదు. ఆత్మానాత్మలను తేటపరచునట్టి బోధనొసగి నన్ను ఘనునిగా జేయుమని భావము.

కం. ఘనజ్ఞానసాంఖ్యయోగము । వనజాసనవిష్ణురుద్రవాసవసురస । న్మునిగణములహరహంబుల । మనమునచెంచించుచుండె మార్గముగదురా । బోధింతునూరికెనువినరా । వినుఘనబ్రహ్మవిజ్ఞానసాంఖ్యాదిక । ధనముపనిషదర్థమనుసరించిన తత్వమార్గ మిదేరా ॥ బోధింతూనూరికెనువినరా. 2

తా. శిష్యా! సాంఖ్యయోగము వుపనిషత్తులయొక్క అర్థము ననుసరించిన తత్వమార్గము. యిది బ్రహ్మ, విష్ణు, శివ, ఇంద్ర, దేవ

తాదులెల్లప్పుడు మనసులందు విచారణజేయు మార్గము దాని నీకు బోధించెదను వినుమని భావము.

కం. అమలవిచారముసాంఖ్యము । సుమనస్కమహాసమాధి సురచిర
భాస్వ । త్సముచితబ్రహ్మానందం । బమనస్కంబగుటవలన నా
రెంటిలోనూ । సాంఖ్యమువక్కాణింతునీతోనూ । రమణీయ్య
మగుసాంఖ్యక్రమముపనిషదర్థ । సుమహితాత్మానాత్మ విమలబో
ధద్విావిధమారెంటిలోనూ ॥ సాంఖ్యమువక్కాణింతునీతోనూ. 3

తా. సాంఖ్యమమలవిచారము అమనస్కము బ్రహ్మసమాధిని గలుగజేయునది. ఈరెంటిలో నుపనిషదర్థప్రతి పాదకంబైయాత్మానాత్మ బోధమైయుండు సాంఖ్యమును నీకు దెలియజేయుదునని భావము.

కం. యేకంబై నిరుపమని । ర్లోకంబైయాత్మమూలలోకాదులకా ।
లోకంబైసురుచిరమహా । దేకంబై బ్రహ్మసత్యమేకమైవెలుగూ ।
సచరాచర । నీకమైజలగూ । లోకాలోకేశులు లోకస్థులకుతుదా
లోకమైనిత్యనిరామయకులమై బ్రహ్మమేకమైవెలుగూ ॥ సచరాచరా
నీకమైజలగూ. 4

తా. శిష్యా! సృష్టికిపూర్వము అనగా లోకములు లోకస్థులు లోకేశులు, మొదలగు తోపకములకు ముందు, లోకరహితమై తన కంటె రెండవది లేనిదై సచరాచరములందంతటను శాశ్వితసర్వాకార మైపరిపూర్ణ నిస్గుణస్వరూపుడై పరబ్రహ్మయొక్కడే ప్రకాశించుచుండు నని భావము

కం. జ్ఞానంబై సకలాధి । ష్ఠానంబై ప్రకృతిరహితస్వాత్మాంతర్వి । జ్ఞా
నంబై మోక్షార్థని । ధానంబైనిగమసత్ప్రిధానమైవెలుగూ । పర
మాత్మాభిధానముజలగూ । దానాదానాహీనమానసాధకసుప్ర ।
జ్ఞానఘనానందస్వానుభవైక్య ప్రధానమైవెలుగూ । పరమాత్మా
భిధానముజలగూ,

తా. ఆబ్రహ్మము జ్ఞానరూపమైనది ఈ ప్రపంచమున కంతయు నాధారమైనది. మాయారహితమైనది. అంతటను వ్యాపించియున్నది. మోక్షమును గోరువారికి నిదానమైయున్నది. వేదములకునికిపట్టై అనగా వేదములు పరబ్రహ్మ నాశ్రయించుకొనియున్నవి. ఆయననిత్యవిజ్ఞానస్వరూపుడు ఆనందరూపుడని భావము.

కం. సారంబై తత్వార్థవి । చారంబై యఖిలకలుషనాశకరవి। స్తారంబై నిత్యనిరా । కారంబై నట్టి బ్రహ్మకారమిదేరా। పరసభక్తిఘనసుకుమారా, ధీరనిర్గుణమోక్షధారామై వేదార్థ । సారమైలోకవిహారమైన బ్రహ్మకారమిదేరా ॥ పరసభక్తిఘన సుకుమారా॥ 6

తా. భక్తిచే నొప్పియుండు సుకుమారా! సారమైన పరమార్థవిచారమై సకల కలుషములను పోగొట్టు నిత్యనిరాకారమైన బ్రహ్మాకారమిదియే యీ పరబ్రహ్మము మోక్షమున కాధారమై వుపనిషదర్థసారమై లోకాలోకము లందంతటను వ్యాపించి యున్నదని భావము.

కం. పరమైనిరుపద్రవసుఖ । కరమైపరమాణుసూక్ష్మతరమైమహితో। త్కరమైనిత్యనిరామయ॥ కరమైపరిపూర్ణమోక్షకరమైనదాత్మా। కాలాకాలసరణిపరమాత్మా । వరమైసుజనాళికాదరమై త్రిభువనసుం । దరమై చిన్మయచిదంబరమై చిరతరభాగ్యకరమైనదాత్మా। కాలకాలసరణీపరమాత్మా. 7

తా. ఈయాత్మ మాయను తగులక మాయకంటే పరమై ప్రకాశింపుచు, బ్రహ్మానందసుఖమును గలుగజేయునదియై సన్నమునకు నతిసన్నమై అత్యున్నతమునకు ఘనమై నిరామయమై సుజనుల కాశ్రయభూతమై వెలుగులను వెలుగజేయువాడు గావున, త్రిభువనసుందరమైప్రకాశింపుచున్నదని భావము.

కం. దానాదానవిహీనత । హీనాహీనాదిరూపవిరహితవిషయ । జ్ఞానాజ్ఞానవిలక్షణ । స్వానుభవాఖండమైన సత్యమిదేరా । పరమార్థనిధానమిదేరా । నానావిధజీవసంతానసమానస । న్మానరక్షణ సర్వానుగతాద్వైతసత్యమిదేరా । పరమార్థనిధానమిదేరా. 8

తా. ఈ పరబ్రహ్మ యిచ్చుట పుచ్చుకొనుట లేనిదియు ఉచ్చనీచములులేనిదియు జ్ఞానాజ్ఞానములు లేనిదియు, స్వానుభవముచే నఖండమై తృణము మొదలు మేరువువరకు నాకసాంతరములందు వ్యాపించియుండు పరమార్థ నిధానమైయున్నది. ఆత్మకు వేరైన వస్తువింకొకటిలేదని భావము.

కం. ఇదియది యనియింతింతని। మదినెంచు సకలవిగానిమహిమానంబే। యదియేపరసుఖవస్తువు । ఇడియదియింతింతటంచు నెరుగు తెలివేరా । దీనికిమించినది లేదల్లదెరా । యిదిసత్యపరిపూర్ణ మిదినిత్యపరమాత్మ । మిదియని సర్వముకదలికదలని మొదలునెరుగు తెలివేరా ॥ దీనికిమించినది లేదల్లదెరా. 9

తా. ఇది ప్రపంచమనిగాని, ప్రపంచమున కతీతమనిగాని, గుణరహితమైనదని గాని, గుణముతో కూడినదనిగాని, యింత పరిమితి యనిగాని, పరిమితి లేదనిగాని, దేనినిగూర్చి చెప్పుటకుశక్యముగాదో నా పరబ్రహ్మమై, యీ ప్రపంచము కానవచ్చు చున్నది. ఆ బ్రహ్మము కానరాలేదు, ఆబ్రహ్మము నిర్వికారమైనది, యీ ప్రపంచము వికారముతో గూడినది, ఈ ప్రపంచమునకు పరిమితిచెప్పగలము, ఆ బ్రహ్మమునకు పరిమితి చెప్పనేరమని విచారించే జ్ఞానమైయున్నది, ఆ జ్ఞానమే పరబ్రహ్మమని భావము.

కం. యీపరిపూర్ణమునిశ్చయ। మాపూర్వబ్రహ్మసృష్టికటు పూర్వము మున్నేపరమాత్మనిరంజన । వ్యాపక మద్వైతమచల వసధిరూపముగా । జెలగుచిదాత్మలోపలవెలిగా । కూపారమున బు

ద్బుదాకారమితములై । దీపించినసలిలమైజూపట్టి నట్లచలవనధిరూపముగా । జెలగుచిదాత్మలోపలవెలిగా, 10

తా. ఇట్లు నిర్వికారమైన పరిపూర్ణ బ్రహ్మంబున బ్రపంచము బుట్టిన విధమెరిగించెద వినుము. ఈ ప్రపంచమనాదిగావున మొట్ట మొదటి సృష్టియని యొక్కటిలేదు, ప్రతికల్పమునకు తుదయందీ జగము నసించుటయు మరల బుట్టుటయు గలదు. గనుక నిట్టి నిరంజనవ్యాపకమైన పరిపూర్ణమునం దీజగము, సముద్రమున జలము బుద్బుదములై కనుపడి మరల నీరైన విధముగా బుట్టుచున్నదని భావము.

## ఆత్మశక్తి వివరణము.

కం. అట్టి చిదాత్మునకును లో । పట్టుననొకయాత్మశక్తి ప్రబలియు నాదిఁ బుట్టి మహావ్యక్తంబై । అట్టిట్టిదటంచు నెంచనలవిగాకుండు। ఆద్యంతమభేద్యమైయుండూ । వట్టిమృత్తులలోన కట్టకడకునిల్వ । నట్టెఘటభ్రమపుట్టిగిట్టని యటులనలవిగాకుండు । ఆద్యంతమభేద్యమైయుండూ, 11

తా. కుండగా నేర్పడునట్టి సామర్థ్యము మట్టి యందే యుండి మట్టికంటే వేరుగాకుండిన విధముగా, సృష్టికి పూర్వము నిర్వికారుడై యుండు పరబ్రహ్మమందొక యాత్మశక్తి ప్రబలి, అట్టిదిట్టిదని నిరూపించుట కలవిగాకుండును, యీ సృష్టికి మాయయే కారణ మని, భావము,

కం. బీజమునవృక్షశక్తియు । తేజమునం దుష్ణశక్తి ధీరసమీర వ్యాజమున చలనశక్తిప్ర । యోజనమగునటుల నాత్మకొదవె శక్తియును । శక్త్యాత్మలొక్కటిగా నేర్పడెనూ । రాజిల్లు నీజగద్బీజమేనాత్మవి । రాజముగానయవిభాజ్య చిద్వస్తువకొదవె శక్తియునూ ॥ శక్త్యాత్మలొక్కటిగా నేర్పడెనూ, 12

తా. విత్తనమందు చెట్టును కలుగజేయు సామర్థ్యమున్ను, వాయువునందు చలించుశక్తియును కలదు, ఈ శక్తులీస్థలమునందుండుట యనుభవసిద్ధమే కదా, ఇవి తమ కాశ్రయభూతములైన విత్తనము మొదలగువాని కంటె వేరుగా కనుపడుటలేదు, వేరుగా కనబడకపోయినను, వృక్షాదులను బుట్టించుట మొదలగు కార్యములు జేయుచునే యున్నవి కదా, విత్తనము కంటె చెట్టున్నూ, గాలికంటె చలనమున్ను, వేరుగాగనబడనందున, భేదములేదన వలెను, కార్యములవలన భేదమున్నదన వలెను. ఇటులనే శక్త్యాత్మ లొకటిగా నేర్పడి బ్రహ్మకంటె శక్తి వేరనిగాని వేరు కాదనిగాని చెప్పుటకు వీలు లేకుండా ప్రపంచమును పుట్టించు చున్నదని భావము.

కం. చైతన్యశక్తియాత్మ న । జాతకమైయఖిలజీవ జననలయాంత । ర్హేతుకమైతత్సన్నిధి । నాతత త్రిగుణాత్మకముగ నాలంబమగుచూ । తదధిష్ఠానమునకు వేరగుచూ । స్వాతంత్ర్య మాయా విద్యాతంత్రములచాత । భూతవిభాగసంఘాతమేర్పడి జగదాలంబమగుచూ । తదధిష్ఠానమునకు వేరగుచూ. 13

తా. ఆత్మయందు చైతన్యశక్తిపుట్టి అనగా చేష్టలు చేయునట్టి సామర్థ్యము కలిగి జననవిలయాదులకు హేతువై త్రిగుణములతో గూడుకొని అధిష్ఠానమునకు వేరుగా గనబడుచూ భూతవిభాగము మొదలగునవి యేర్పడెనని భావము.

కం. ఇది సత్తని యోచించిన । తుదకు మహాజ్ఞాన మొదవతోచునభావం । బిదియునసత్తని దెలసిన । కదలుచు సకల ప్రపంచగతమై యగుపడునూ । రూపనామక్రియల తోడుతనూ । సగస త్తనుచు బలుక మొదలులేకనుమధ్య । నొదవియంత్యమునకుదురైని ల్వాదుసర్వగతమైయగుపడునూ।రూపనామక్రియలతో డుతనూ. 14

తా. ఇది యెల్లపుడు స్థిరముగా నుండునది యని యోచించితే బ్రహ్మాను భవముగలుగగనే లేనిదై పోవు చున్నది. ఇదే లేనిదని

యోచింపగా రూపనామ క్రియలతోఁ గదలుచూ సర్వప్రపంచమును గోచరమగుచున్నది ఇది సదసత్తుయని యోచింపగా మొదట లేక మధ్యగనుపడి కడకునిల్వదు. యిది యుండియు లేనివస్తువుగా నున్నది. ఇ విరుద్ధముగానున్నదని భావము.

కం. అవయవముగాదుచూడని । రవయవమునుగాదనశ్వరముగాదు సదా । యవివేక వివేకాలయ । జవసత్వవినాశశూన్య జాలమై యుండూ । దృశ్యాదృశ్యత్రోవలగుచుండూ । లవలేశమును దీనిభువినివర్ణింపగ । స్వవశముగాదు మోహవిడంబమే కాని జాలమైయుండూ । దృశ్యాశ్యత్రోవలగుచుండూ. 15

తా. కనబడే సకల పదార్థములు సుషుప్త్యవస్థయందు నసింపగా తానునశింప కుండుటచేత అవయవములతోఁ గూడినదని చెప్పుటకును వీలులేదు. సమస్త ప్రపంచముయొక్క ఆకారముతోఁ గనుపడుచుండుటచే నవయవములు లేనిదని చెప్పుటకువీలులేదు. పట్టి మోహవిడంబమే గానిదనివర్ణించుటకు శక్యముగాదని భావము.

కం. వినుదీనిననిర్వాచ్యం । బనినెన్నరునాత్మవిదులు నాదిలో సర్వం బునుదెలసి యాత్మకదియును । ఘనభిన్నా భిన్నమనుచు గనుగొన బోరూ । మాయాప్రకృతులనుదలచ రారూ । కనుదృష్టి చెదరిర జ్జునసర్ప మొకటితా । జనియించి వెనక నేమనక బోవురీతిగనుగొన బోరూ । మాయాప్రకృతులను దలచ రారూ. 16

తా. కనుదృష్టిచెదరినందుచే త్రాడుపాముగా గనుపించి వెనుక నేమియులేకపోవునట్లుగా పరబ్రహ్మాద్వితీయుడయ్యును ప్రపంచముగా దోచుట అనుభవసిద్ధమై యున్నది. ప్రపంచమనగా నామరూపములు మాత్రమే గాని మరేమియులేదు. ఇట్లొకడైన పరబ్రహ్మ భిన్నముగా దోచుట భ్రమ. మాయయనున దొకటిలేదు. బ్రహ్మవేత్తలిది యనిర్వాచ్యమని నెంచి మాయా ప్రకృతులని తలచనే తలచరని భావము.

కం. అనుభవవిజ్ఞానమహా । వననిధి వెలుగొందు యాత్మవరేచ్ఛాశ । క్త్యు
నుగతసూక్ష్మవిలోకన । లౌకికవరదృష్టిబొడమగలిగెనుమాయా,
విభ్రమమూలమునజగములాయా । తనుభూతసృష్టిని విని యాత్మ
గనుమీద । గననేదిలేదొ తానదియెమాయాతమము గలిగెను
మాయా ॥ విభ్రమమూలమున జగములాయా. 17

తా. స్వానుభవవిజ్ఞానమునందు ప్రకాసించు పరమాత్మ యిచ్ఛాశక్తిచేకూడుకున్న సూక్ష్మావలోకనచే లోకదృష్టికిపొడమగనే మాయగలిగెను. అట్టి భ్రమమూలమున జగము లేర్పడెను ఏకమైన పరబ్రహ్మము విరుద్ధమగు మరియొకరూపముగా దోచుటకు గారణ మెద్దియో ఏది భేదరహితమైన జ్ఞానము కలుగగనే బొత్తిగ లేనిదై కానరాదో అదియే మాయయని భావము

కం. ఇదెమాయావిద్యాద్వయ । మిదెజీవేశ్వరవిభేదమిదెబ్రహ్మండం।
బిదెవాచ్యార్థ్యుభయపద । మిదియేసుమ్మాత్మశక్తిఇదిగనుము యు
క్తి । భ్రమవిడువనదేసద్యోముక్తీ । తుదమొదటికి దీనికుదురొ
క్కటేగనుక । మదిచెరినగజభ్రమసి రెండగు దీనిగనుగొనుము
యుక్తీ ॥ భ్రమవిడువనదేసద్యోముక్తీ. 18

తా. మాయావిద్యాద్వయము జీవేశ్వరభేదము, బ్రహ్మండము ఉభయవాచ్యార్థములు ఆత్మశక్తి మొదలగునవి. ఈమాయయే యీభ్రమలిడచుటే ముక్తి మనసుచెదిరితే గదాభ్రమవలన రెండగు చున్నవి. యుక్తిచేదీని గ్రహింపుమని భావము.

కం. యీయాత్మశక్తి యందొక । మాయావిద్యాద్వయంబు మహిజ
లగునునా । మాయాజగదుద్భవాది వి । ధాయకమననిఖిల భూ
తాధారకమనగా । సమష్ట్యంతరాత్మసుష్ట్యనగా । పాయకగుణస
ర్వాదాయలోకాలోక । ధీయుతజీవసమపాయమహావ్యక్త్యాధారక
మనగా ॥ సమష్ట్యంతరాత్మసుష్ట్యనగా. 19

తా. ఈయాత్మశక్తియందు, మాయయనియు, అవిద్యయనియు రెండుగలిగెను. అసత్యజడ దుఃఖరూపిణియగు మాయయే జగదుద్భవాది జీవనదుపాయమగు సర్వమునకును నాధారమైయున్నది. అవిద్యయనినను, అవ్యక్తమనినను సుషుప్తియనినను నజ్ఞానమనినను నొక్కటేయని భావము.

పంచభూతోద్భవ విధానము.

కం. పరమోంకారమునందున । కరమరుదుగశబ్దగుణకకలితంబైత ।
త్పరశబ్దబ్రహ్మంబున । స్థిరముగనాకాశమొకటి సృష్టి గలిగెనుగా । ఆగగనమందనిలమేర్పడెగా । మరివాయువందగ్ని మరినగ్నియందుదక । మరయుజలములయందీధరణిబుట్టిజగముసృష్టి గలిగెనుగా । ఆగగనమందనిలమేర్పడెగా. 20

తా. పరమోంకార బ్రహ్మంబున శబ్దగుణముతో గూడికొనిన ఆకాశము గలిగెను. ఆయాకాశమున వాయువును, వాయువునందగ్నియును, అగ్నియందుదకమును, ఉదకమునందు భూమియు నుబుట్టి జగదుద్భవ మాయెనని భావము.

కం. యీపంచభూతములుమరి । లోపలరెండగుచు సగము లొక్కొక్కటిన్నా । ల్గేపారిపంచవింశతి । ప్రాపంచస్థూల సూక్ష్మ పంచీకృతములై । ప్రబలెనుపంచీకరణ భాగములై । దీపిత స్థూలసూక్ష్మోపాధి కారణ । వ్యాపకతనుగుణరూపత్రయాత్మక పంచీకృతములై । ప్రబలెను పంచీకరణభాగములై. 21

తా. ఈయైదు భూతములును నొక్కొక్కటి రెండేసి భాగములై ఒక్కొక్క సగము నాల్గేసి భాగములై, స్థూలసూక్ష్మకారణ దేహంబులంబొంది తనుగుణరూపత్రయాత్మకమగు అయిదయిదు లిరువదియైను పంచీకరణ భాగములై ప్రపంచమాయెనని భావము.

## సృష్టిపంచీకరణ వివరణము.

కం. ఆసర్వస్సృష్టి దెలిపెద । భాసురతరగగనమర్ధ భాగముజ్ఞాతై । యా సగమును నాల్గంశలు । నై సుమనోబుద్ధి చిత్తాహంకారములుగా ప్రబలెను గగనపంచకమనగా । నీసూక్ష్మకాశాంశలాసమీరాగ్ని వి । కాసనలిలధాత్రిలేశాంశముల గల శహంకారములుగా । ప్రబలెను గగనపంచకమనగా. 22

తా సృష్టినిగురించి వివరించెదను వినుము. ఆకసము రెండు భాగములై అందులో నొకసగము జ్ఞాతమయ్యెను. కడమసగము నాల్గుభాగములై యితరనాలుగు భూతంబులైన వాయువు, అగ్ని, నీరు, భూమినిం గూడుచున్నవి. అందులో గాలినింగూడుటచేత మనస్సుపుట్టెను. అగ్నితోకూడుట వలన బుద్ధియుదయించెను. నీటితో జేరుటవలన చిత్తము గలిగెను. భూమితోగూడుట వలన నహంకారము బుట్టెను. ఇట్లు పుట్టిన నాలుగును సమష్టిభూతంబులని పిల్వబడును. యీజ్ఞాన మనోబుద్ధి చిత్తఅహంకారంబులైదునునంత రింద్రియములనియును ఆకాశపంచకమనియు చెప్పబడునని భావము.

కం. మారుతమర్ధాంశమును । వేరై వ్యానంబునయ్యెవిడిబడుశేషం । బారీతినచతురంశల । పారముగసమానుదాన ప్రాణామపానా । మునువాయుపంచకమయ్యెగానా । కోరినీమారుత సారాంశలాకాశ । భూరిదహనవారి ధారుణిగతములై ప్రాణామపానా॥ మును వాయుపంచకమయ్యెగానా. 23

తా. వాయువు రెండుభాగములై అందులో నొకసగము వ్యానవాయువనే వ్యష్టిభూతంబయ్యె తక్కిన సగము నాలుగుభాగములై యితర నాలుగు భూతంబులైన, యాకాశ, అగ్ని, జల, భూములంగూడు చున్నవి నందు నాకాశముతో గూడుటచే సమానవాయువు గలిగెను. అగ్నిసంబంధముచే నుదానముపుట్టెను. నీళ్ళతో

జేరుటచే బాహ్యవాయువు జన్మించెను. భూమితో జేరుటచే సమానవా యువుదయించెను. యీనాలుగును సమష్టిభూతంబులు, వాయుపంచ కంబగు నీయైదును పంచప్రాణంబులని చెప్పబడుచున్నవని భావము.

కం, దహనార్ధాంశము చెక్షు । ర్విహితంబై భాగశేషవిధియొక నాలై
మహిలోపలశ్రోత్రత్వక్ । స్పృహజహ్వాఘ్రాణవిషయ సూక్ష్మా
ములగుచూ । యిదియొకదహనపంచకమగుచూ । నహజగగనవా
యుజలభూచతురాంశల । మహదైక్యముగ నెలసి । మహితనందీ
పాగ్ని సూక్ష్మములగుచూ। యిదియొకదహనపంచకమగుచూ. 24

తా. అగ్ని రెండుభాగములై యందులో నొకభాగము నేత్ర మనెడు వ్యష్టిభూతమాయెను. తక్కిన భాగములునాలుగు శకలములై యితరనాలుగుభూతములైన ఆకాశము, వాయువు, నీళ్ళు భూమినిం గలసుకొనుచున్నవి. అందాకసముతో జేరుటచే, చెవులుపుట్టెను. వా యువుతో గలయుటచే జర్మముగలిగెను. జలముతో జేరుటచే నాలుక పుట్టెను. భూమితో గలియుటవలన ముక్కుగలిగెను. యీనాలుగును సమిష్టిభూతములయ్యె. అగ్నిపంచకంబగు నీయైదును జ్ఞానేంద్రియము లని చెప్పబడుచున్నవని భావము.

కం. జలమర్ధాంశమురసమై । యలశేషమునాల్గుభాగములై శబ్దస్పర్శ
లురూపగంధములుగా । జలగెనుతన్మాత్రలగుచుసాధనగాగా । యి
దియొకయాపోపంచకమనగా । సలలితతత్సూక్ష్మజలాంశములతో
డ । కలితములై వ్యోమ । మరుదగ్నిభూములుసాధనగాగా యిది
యొకయాపోపంచకమనగా. 25

తా. జలము రెండుభాగములై యందు నొకభాగము రసమ నెడి వ్యష్టిభూతమాయెను. తక్కిన సగభాగము నాలుగుభాగములై యితరభూతములైన ఆకాశ, వాయు, వహ్ని, పృథ్వులం గూడుచు న్నవి. అందు నాకసముతో జేరుటచే శబ్దముపుట్టెను. గాలితో జేరుట

వలన స్పర్శము కలిగెను. నిప్పుతో గలియుటచే రూపముపుట్టెను. భూమితో జేరుటచేత గంధముగలిగెను. ఈనాలుగును సమష్టిభూతములాయెను. వుదకపంచకంబగు నీయైదును జ్ఞానేంద్రియములకు విషయములు. ఇవే పంచతన్మాత్రలని ప్రసిద్ధములనిభావము.

కం. ఇలనర్ధాంశము పాయువు । కలశేషము నాల్గుభాగకములై మరితామిలకర్మేంద్రియ సమితిగ । జెలగుచు వచనాదిక్రియలూ జేయుచూనుండూ । ఇదిభూతపంచకమైతానుండూ। యిల తన చతురంశములువ్యోమమరుదగ్ని । జలములగలసినులలితములై క్రియజేయుచునుండూ । కర్మేంద్రియపంచకమగుచుండూ, 26

తా. భూమి రెండుభాగములై యందులో నొకపాలు పాయువనెడి వ్యష్టిభూతంబయ్యె. మిగతసగము నాలుగుతునకలై యితరనాలుగుభూతంబులైన ఆకాశము, వాయువు, నిప్పు, నీళ్ళనుగూడుచున్నవి. అందాకాశముతో గూడుటచేత నోరు కలిగెను. గాలితోగలియుటచేత చేతులు గలిగెను. అగ్నితోగూడుటవలన గాళ్లుపుట్టెను. జలముతో గలియుటచేత శిసినముగలిగెను. ఈ నాలుగును సమష్టిభూతములని పిలువబడును, భూమిపంచకంబగు నీయైదును గర్మేంద్రియములని చెప్పబడుచున్నవనిభావము.

కం. భూతార్థభాగములుమును । జాతములై జ్ఞానవ్యానచక్షురసాంతర్జ్యోతకపాయువులగుచును । ఖ్యాతిగ గగనానిలాగ్ని ఘనజలధరణి । ప్రబలెనుపాంచాభౌతికసరణి । నీతారెనీపంచ । భూతార్థములునితర । భూతజననమరణ హేతుకములునొంది ఘనజలధరణి ప్రబలెను పంచభౌతికాసరణి. 27

తా. జ్ఞానము, వ్యానవాయువు, నేత్రములు, రసనేంద్రియము, గుదము, ఈఅయిదును నిజాంశములవల్లనే (అనగా) ఆకాశమాకాశముతోను, వాయువు వాయువుతోను, అగ్ని అగ్నితోను. నుదకము

నుదకముతోను భూమి భూమితోను, గలియుటచేత గలుగుటబట్టి యివి వ్యష్టిభూతంబులాయెను. తక్కినయిరువది భూతంబులును మిశ్రమభూతంబులతో గలియుటచే సమష్టిభూతంబు లాయెను. ఈసమష్టి భూతంబులే మొదటలయించి తరువాత వ్యష్టిభూతంబు లయించుసని భావము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆకాశపంచకం | జ్ఞానము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | అంతరింద్రియములు |
| వాయుపంచకం | సమానవాయువు | వ్యానవాయువు | ఉదానవాయువు | ప్రాణవాయువు | అపానవాయువు | ప్రాణేంద్రియములు |
| అగ్నిపంచకం | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము | జ్ఞానేంద్రియములు |
| ఉదకపంచకం | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము | పంచతన్మాత్రలు |
| పృథ్వీపంచకం | వాక్కు | పాణి | పాదము | గుంహ్యము | గుదము | కర్మేంద్రియములు |
| | ఆకాశతత్వములు. | వాయుతత్వములు. | అగ్నితత్వములు. | ఉదకతత్వములు. | పృథ్వీతత్వములు. | |

స్థితిపంచీకరణ కదంబవివరణము.

కం. జ్ఞానసమానము శ్రోత్రము । ప్రీతిగ శబ్దమునువాక్కు పెంపుగ నభసం । జాతకపంచకమిదియును । యీతరివ్యానత్వక్కు నిరువుగస్పర్శా । పాణితోవాయుపంచక విమర్శా । మరిమనీషాదానవరద్బుగ్బాపపదము । లిరువుగ వైశ్వానరపంచకమనదగు నిరువుగ స్పర్శా । పాణితో వాయు పంచకవిమర్శా. 28

తా. జ్ఞానము, సమానము, శ్రోత్రము, శబ్దము, వాక్కు, ఈ అయిదు నాకాశపంచకము. మనస్సు, వ్యానము, త్వక్కు, స్పర్శము,

పాణి, ఈ అయిదును వాయుపంచకము. బుద్ధి, ఉదానము, చక్షువు, రూపము, పాదము, యీయయిదు నగ్నిపంచకమని భావము.

కం. చిత్తముప్రాణము జిహ్వయు । సత్తాధికరసము పస్థనమితీంద్రయ
మిా । హత్తునజలపంచకమిది । యుత్తమహంకృత మపానమొగి
నాసములునూ । గంధము పాయువులు గలసియునూ । పు త్తిల్లి
భూపంచకోత్తమమిదియోగి । సత్తాదెలసిన బ్రహ్మవేత్తలకెల్ల
పుడునొగినాసములునూ । గంధముపాయువలుగలసియునూ. 29

తా. చిత్తము, ప్రాణము, జింహ, రసము, గుహ్యము, యీయయిదు నుదకపంచకము. అహంకారము, అపానము, ఘ్రాణము, గంధము, గుదము, యీ యయిదు పృథ్వీపంచకమని చెప్పబడును. వీనియొక్క సత్తాదెలసిన బ్రహ్మవేత్తలు కృతార్థులగుదురనిభావము.

కం. అంతర్జ్ఞాతసహస్రా । రాంతరమువనిలచి జ్ఞప్తిరాగొల్పుమరిక
స్వాంతముగళనిలయంబై । సంతతయూహలును గలుగు వైఖారి
జేయూ । సంకల్పవికల్పముజేయూ । అంతను బుద్ధిముఖాంతమం
మునిలచి వింతవస్తువితతినంతానకోరి యావైఖరిజేయూ । సంక
ల్పావికల్పముజేయూ. 30

తా. జ్ఞాతసహస్రారమునందు నిలచి జ్ఞప్తిని గలుగజేయుచుండును. కంఠస్థానమందుండి యూహలుబుట్టించుచు సంకల్ప వికల్పములను గలిగించుచుండును. ముఖమందునిలచి వింతవస్తువులమీాద కోర్కెనుగలిగించుచుండునని భావము.

కం. చిత్తమునాభీతలమున । హత్తుగదానిలచి చింతలన్నిటిజేయుః ।
మత్తిల్లి యహంకారము । సత్తుగరుధిరమునుండి సర్వమొనర్చూ
నభపంచకమింతయొనర్చూ । అంతరింద్రియమోహ భ్రాంతుల
చేయూకా । శాంతఃకరణజీవ చింతాపరంపరల సర్వమొనర్చూ ।
నభపంచకమింత యొనర్చూ. 31

తా. చిత్తము నాభియందునిలచి యావత్తు చింతలను గలిగించుచుండును. అహంకారము రక్తమందుండి యంతరంగమోహభ్రాంతులచే సర్వకార్యములు జేయుచుండును. ఆకాశపంచక మింతజేయుచున్నదని భావము.

కం. ముందుసమానమునాభీ । కందకమున భుక్తయశనఘునరసపచనం । బందొప్పజేసినాడీ । బృందముకుఁ భాగవిధిగాభోగ్యత నొసగు । సర్వేంద్రియ సమరసమొసగూ । పొందువ్యానము సర్వసంధూలశీతోష్ణ । ద్వంద్వసంస్పర్శ లానందముగజేయు భోగ్యత నొసగూ । సర్వేంద్రియ సమరసమొసగూ. 32

తా. సమానవాయువు నాభిబిలమందునిలచి భుక్తాన్నమును పచనముచేసి యారసమును యావత్తునాడులకును భాగవిధిగా బంచిపెట్టుచుండును. వ్యానవాయువు సర్వసంధులందును శీతోష్ణస్పర్శలను జేయుచుండునని భావము.

కం. క్రమమలరకంఠబిలమున । నిమిడినుదానానిలంబునేర్పుగ సంకల్పములొందజేశి మరియు । న్నమరగశబ్దములు బలుకునటులౌను జేయూ । తనుసుప్తిజాగ్రతలలొ వెలయూ । సుమహితేంద్రియ సర్వసమితిను ప్తినిమూశి । విమలజాగ్రతహృషీకముల మరలనునిలుపునటులౌనుజేయూ । తనుసుప్తిజాగ్రతలలొ వెలయూ. 33

తా. ఉదానవాయువు కంఠబిలమున నిమిడి సంకల్పములుగలిగించుచు శబ్దములను బలికించుచుండును. ఇంకను నది నిద్ర జాగ్రతలను గలిగించుచుండును. సర్వేంద్రియములను నిద్రయందు లీనముజేయుచు జాగ్రతయందు వానివాని స్థానములందు నిలుపుచుండునని భావము.

కం. ప్రాణముహృదయగతంబై । నానెముగను బ్రహ్మదండి నంతటిదూర్ధ్వ । ఘ్రాణముఖరంధ్రములప్రా। మాణ్యతను శ్వాసములను।

మానాకానిండీ । ఇడపింగళాఖ్యల నాదవుచుండీ । ఘోణిశ్వాసాని లశ్రేణిచెలుపలకుబికి । రాణింపహృదయాంగుళము జనినటనిలుచు మానకనిండీ । యిడపింగళాఖ్యల నాదవుచుండీ. 34

తా. ప్రాణవాయువు హృదయమందు జేరి బ్రహ్మాదండి నంటి ఘాణరంధ్రములద్వారా శ్వాసములనిండి ఇడా, పింగళ యనుపేర్లచే వెలుపలకువచ్చి తిరుగా హృదయమునకుజని ఇట్లుశ్వాసవాయువు జరుగుచుండునని భావము.

కం. యిలనాధారాబ్జంబున । నిలచియపానానిలంబు నేర్పుగకుక్షీ మలమూత్రవిసర్జనములు । నలుపును విషయోపరతికి సాధనగానూ । శుక్లానంద మలరి వేడుకనూ । కలకనధోశ్వాసకలితమై గర్భనం । చలనమిదియే నిర్మలవాయు పంచకముసాధనగానూ । శుక్లానందమలరి వేడుకనూ. 35

తా. అపానవాయువు, ఆధారము, కమలమందునిలచి, కుక్షియందలి మలమూత్రములను వెలికిద్రోయుచు విషయరతికి సాధనమై శుక్లానందమును గలిగించుచుండును. ఇదియే వాయుపంచక మని భావము.

కం. శ్రోత్రముకర్ణయుగంబుల । సూత్రివ్యాపకముగాను సూక్ష్మనుశబ్ద । వాత్రితముదిక్కులతనువిను । ధాత్రిత్వగింద్రియము సప్తధాతువిధులాకూ । పైముసుకిదియే పసగన్పించుటకూ । నేత్రము నీ బాహ్యనేత్రగోళకమూల । పాత్రతనిలచి సర్వత్రరూపము లెరుగుధాతువిధులకూ । పైముసుకిదియెపసగన్పించుటకూ. 36

తా. శ్రోత్రేంద్రియము కర్ణములందుండి శబ్దములను గ్రహించుచుండును. త్వగింద్రియము సప్తధాతువిధులకు ముసుకుగా నేర్పడి యాకారమేర్పడుచున్నది. నేత్రేంద్రియము బాహ్యమందుండు నేత్రగోళకములద్వారా రూపముల నెరుగుచుండునని భావము.

కం. జిహ్వేంద్రియమును బాహ్యత । జిహ్వేంద్రియమందు నిలచి చిత్రతషడ్రు । చ్యాహ్వాయముల భోగించును । సహ్యతఘ్రాణేంద్రి యంబు సకమలనాసా । పుటములనిలచి పొసగువికాస । గహ్వర ములత్రివిధగంధములను జెందు । విహ్వాలమగుదహన విషయపంచ కమిదియో సదమలనాసా । పుటములనిలచి పొసగువికాస. 37

తా. జింహ్వేంద్రియము జింహ్వయందుండి షడ్రుచుల నెరుగు చుండును. ఘ్రాణేంద్రియము నాసాపుటములనిలచి సువాసన, దుర్వా సన, మిశ్రమవాసనలను గ్రహించుచుండును. దహన, విషయపంచక మిదియేనని భావము.

కం. నిరతము శబ్దముద్వివినా । వరణములను ధ్వనులుజేయువరనిజదే హాం । తరమంతటసంస్పర్శము । గురుతెరుగును కఠినమృదుల గుణజాలములా । శీతోష్ణస్వందాదిమూలములా । స్థిరరూపు నేత్ర గోచరవస్తునికరము । పరికించిచేజిక్కి పరిపాలింపగజేయు గుణ జాలములా । శీతోష్ణద్వంద్వాదిమూలములా. 38

తా. శబ్దమెల్లప్పుడును చెవులయందు ధ్వనులుజేయుచుండును. స్పర్శము దేహమంతటను మృదుకఠినములను శీతోష్ణాదులను గురుతె రుగుచుండును. రూపము కంటికి కనుపడు వస్తుజాలములనెల్ల జూచు చుండునని భావము.

కం. రసమునహస్రచ్ఛద । బిసరుహమందుండిపదునుబేర్కొను సర్వ ప్రసరితమగుగంధేంద్రియ । మెసగనువాసనలగ్రోలి మెలగుతా నెపుడూ । ఇదెజలపంచకము నాత్మవినుడూ । వసుమతిగగన దిగ్దశబ్రహ్మాండాఖండ। రసముమెలయుసిరసతన్మాత్రలతోటి మెల గుతానెపుడూ । ఇదెజలపంచకమునాత్మవినుడూ. 39

తా. రసము సహస్రారకమలమందుండి పదునుగలుగజేయుచు రసతన్మాత్రలతోటి భూమ్యాకాశాది దిగ్దశల బ్రహ్మాండాఖండరసము

ను స్రవింపచేయుచుండును. గంధేంద్రియ కెంపుడును వాసనల గోరిలు చుండును. యిదే జలపంచకమని చెప్పబడ నని భావము.

క. వాగింద్రియ మనవగతము । వాగ్విలసితమైన సుకృతవాక్కుల పుణ్యం । బాగమనించును దూషణ । వాగ్వైఖరివలన దోషవశముచు జేందూ । ఘనమృదు నీచకఠినాదులందూ । బాగుగ ప్రాణేంద్రియము చేతులనిలచి । త్యాగ పుణ్య పాపభోగక్రియలూ జేయూవశమును జెందూ । ఘనమృదునీచకఠినాదులందూ. 40

తా. వాగింద్రియ మెల్లప్పుడును, మృదువైన సుకృతవాక్కులు పలుకుటచే పుణ్యమును, కఠిన, నీచ, దూషణ, భూషణాలాడుటవలన దోషమును జెందుచుండును, ప్రాణేంద్రియము చేతులయందు నిలచి త్యాగకార్యములను, పుణ్యకార్యములను, పాపకృత్యములను భోగక్రియలను జేయుచుండునని భావము.

కం. పాదేంద్రియభూతము నిరు । పాదములను నిలచిపుణ్యపాపములనురెం । జేదారిన రాదగునో । యాదారిననడచినడచి యాయాసమొందూ , తనుసంచారాపాయ మింపొందూ । పాయువుయోని ప్రజాపతులందుండి । యాయడశుక్లమూత్రములు విసర్జించి యాయాసమొందూ । తనుసంచారోపాయమింపొందూ. 41

తా. పాదేంద్రియము రెండు పాదములయందుండి, పుణ్యపాపము లేదారిన రాదగునో, యాదారిన నడచుచు, శరీరమును మోసికొని నడచుచుండును. పాయువు, యోని, ప్రజాపతులయందుండి శుక్లమూత్రములను వెలికి ద్రోయుచుండునని భావము.

కం. మొదటనుపస్థేంద్రియమిా । గుదమందున నిలచిగర్భగోళకమందుణ్ వదలక వెలికివిసర్జన । మదిజేయునమేధ్య మూత్రమాలిన్యమంతా మానవసూక్ష్మ గోచరమంతా । విదితముగ నాత్మపద మెరుగువారికి । పదముభూపంచక మదుగోగనుగొను పూర్వమాలిన్యమంతా । మానవసూక్ష్మ గోచరమంతా. 42

తా. ఉపస్థేంద్రియము గుదస్థానమందు నిలచి గర్భగోళమందుండు మలమూత్రమాలిన్యము నంతయు వెలికి విసర్జన జేయుచుండును. యిది పృథ్వీపంచకమని చెప్పబడును, ఆత్మపరమెరుగువారీ విచారణ జేయవలయునని భావము.

లఘుపంచీకరణము.

కం. ఆకాశాంశపుబయలులో । పాకటముగ పృథివికఠిన భాగముగ లియర్ । లోకస్ఫుటసంభాషణ । లీకరణిని తొలగివాక్కులీనమైయుండూ । భూతార్ధాంశగల పృథివీయందూ । చేకొని వాయు సంచలనాంశమునభూమి । దాకొన్నపాణినిష్కర్మని స్తేడమై లీనమైయుండూ । భూతార్ధాంశగల పృథవియందూ 43

తా. పృథ్వియొక్క కఠినాంశము, ఆకాశముయొక్క బయలాంశముతో గూడిన మాటలు తొలగి వాక్కు లయించును. పృథ్వియొక్క కఠినాంశము వాయువుయొక్క చలనాంశముతో గూడిన కర్మరహితమై పాణి లయించునని భావము.

కం. స్థిరవైశ్వానర తేజాం । తరమున ధరకఠినభాగతత్వము గలియర్ తిరుగాడుటొదలిపాదము । నరయగనిష్కర్మమగుచు నవుడేలయమందూ । భూతార్ధాంశగల పృథివినొందు । నిరువుగజలద్రవము గలసిభూకఠినాంశ । చొరగనుగుహ్యము విసర్జనమును వొదలి యపుడె లయమందూ । భూతార్ధాంశగల పృథివినొందూ. 44

తా. పృథ్వియొక్క కఠినాంశము, అగ్నియొక్క తేజాంశముతో గూడినట్లయిన, తిరుగుట నొదలి కర్మరహితమై, పాదములయించును, పృథ్వియొక్క కఠినాంశము, అప్పుయొక్క ద్రవాంశముతోగూడిన విసర్జనమునొదలి గుహ్యము లయమునొందుననిభావము.

కం. అలగగనాంశపుబయలులో । జలభూతముయొక్క ద్రవముజెందిన వేళ । కలకలము లేక ధ్వనులతో । వెలిబోశబ్దములు నిలచి

విలయమునొందూ । భూతార్థాంశగల జలమూనందూ । కలిత గంధవహాచల నాంశమునపూర్ణ । సలిలద్రవాంశనది కలియస్ప ర్శేంద్రియమువిలయము నొందూ । భూతార్థాంశగల జలము నందూ. 45

తా. జలభూతముయొక్క ద్రవాంశము, ఆకాశముయొక్క బయలాంశముతో జేరిన ధ్వనిరహితమై శబ్దము లయమగును. అప్పుయొక్క ద్రవాంశము వాయువుయొక్క చలనాంశముతో జేరిన పక్షమున స్పర్శేంద్రియము లయించునని భావము.

కం. వరదహనాంశములోపల । నిరువుగజలభూతద్రవమునిగిరినవేళ । పరదృగ్గోచరజాగ్రత । మరుపై తద్రూపమెల్ల మరివిలయ మొందూ । భూతార్థాంశగలజలమునందూ । ధరణి కఠినాంశము సారదిజలద్రవమంట । చిరతర వాసన లరయక తద్గంధములయము నొందూ । భూతార్థాంశగలజలమునందూ. 46

తా. అప్పుయొక్క ద్రవాంశము, అగ్నియొక్క తేజాంశముతోగూడిన నితర పదార్థముల చూచు జాగ్రత తప్పి, రూపములయించును, అప్పుయొక్క ద్రవాంశము, పృథ్వియొక్క కఠినాంశముతో గూడిన వాసనల గ్రహించు తెలివిపోయి గంధేంద్రియము లయించునని భావము.

కం. వియదంశపుగగనంబు లో । నాయనలాధిక్యతేజ మటు గలశిన ని ర్వాయామతశ్రవణాది వి । ధాయక శ్రోత్రేంద్రి యంబు తగవిలయ మొందూ । భూతార్థాంశగ లవహ్నియందూ । వాయుసంచలనాంశమా యగ్నితేజము । బాయకగలయుండ బాయుత్వగింద్రియము తగవిలయమొందూ । భూతార్థాంశగలవహ్నియందూ. 47

తా. అగ్నియొక్క తేజాంశము ఆకాశముయొక్క బయలాంశ

ముతోఁ గలియు నప్పుడు వినుట మాని శ్రోత్రేంద్రియము లయిం
చును. అగ్నియొక్క తేజాంశము వాయువుయొక్క చలనాంశమునందుఁ
గలసిన త్వక్కు లయించునని భావము.

కం. ఉదకాంశము లవ ద్రవము లీ సరసములగ రాంశ తేజస
త్వముగలియుఁ । పదునుగుణంబునురుచియును । నొదలుచు జి
హ్వేంద్రియంబును లవణఁగుముందూ । భూతార్ధాంశగల వహ్ని
యందూ । యిదెప్పృథివీకఠినాంశ కెదురుదహనప్రభ । గదియు ఘ్రా
ఘ్రాణము చదిరినిజగుణముతోనురువణగుముందూ । భూతార్ధాంశ
గలవహ్ని యందూ. 48

తా. అగ్నియొక్క తేజాంశము అప్పుయొక్క ముద్రాంశము
తోఁ జేరినట్టు లనపను. గుణమును, రుచిగునట్టు జిహ్వేంద్రియ
ములయించును అగ్నియొక్క తేజాంశము పృథ్వియొక్క కఠినాంశ
ముతోఁ జేరినయెడల ఘ్రాణేంద్రియము లయించునని భావము.

కం. ఆగగనపుబయలాంశను । తాగురుతుగ వాయు చలనతత్వముగలి
యఁ । భోగాశనపచనాదులు । సాగకవిలయమును గొంకు శ్వాస
లుముందూ । తదర్ధాంశగల వాయువందూ । యోగాగ్ని తేజాంశ
భాగములో మాను । తాగమ చలనాంశ మొగినుదానముని శ్వాస
లుముందూ । తదర్ధాంశగల వాయువందూ. 49

తా. వాయువుయొక్క చలనాంశము ఆకాశముయొక్క బయ
లాంశముతోఁ గూడిన సమానవాయువులయించును. వాయువుయొక్క
చలనాంశము అగ్నియొక్క తేజాంశముతో గూడిన ఉదానవాయువు
లయించునని భావము.

కం. సలిలద్రవ లేశములో । విలసితముగ వాయుచలనవీక్షణ గలియఁ
మలమూత్రవిసర్జనచెడి । తలపనపానానిలంబు తత్వము జెందూ ।
తదర్ధాంశగల వాయువందూ । ఇలభూతకఠినాంశ ములవాయు

చలనాంశ । గలసిప్రాణానిలము నిజగుణములతోడ తత్వము జెం
దూ । తదర్ధాంశగలవాయువందూ. 50

తా. వాయువుయొక్క చలనాంశము అప్పుయొక్క ద్రవాంశముతోఁగూడినట్టయిన ప్రాణవాయువులయించును, వాయువుయొక్క చలనాంశము పృథ్వియొక్క కఠినాంశముతోడం గలసినట్టయిననపానవాయువు లయించునని భావము.

కం. నీరాంశపు ద్రవభగల్గొ। ధారుణికఠినాంశసూక్ష్మతత్వముగలియన్ ।
కారణకార్యమువిడచియు । ధీరయహంకారమణగి ధీవిలయమునం
దూతదర్ధాంశగలనభమునందు । భూరివహ్ని తేజమారూఢిజలద్ర
వము। జేరచిత్తమువిషయ క్రూర విభ్రమలతో ధీవిలయమందూ।
తదర్ధాంశగలనభమునందూ. 51

తా. ఆకాశముయొక్క బయలాంశముతో పృథ్వియొక్క కఠినాంశము జేరిన కారణకార్యములొదవి యహంకారము లయించును. వహ్నియొక్క తేజాంశము జలముయొక్క ద్రవాంశమందుఁ జేరిన భ్రమలను విడచి, చిత్తములయించునని భావము.

కం. మారుతచలనాంశంబులో । దారుణగాఢాగ్ని తేజతత్వముగలి
యన్ । పేరడగియూహాపోహల । నోరెత్తగలేక బుద్ధినుగవణగు
ముందూ । తదర్ధాంశగలనభమునందూ । చారుచిద్గగనవిస్తార
బయలులోవాయు।ధీరచలనముగలియ తారుమారై మనసు నురు
వణగుముందూ । తదర్ధాంశగలనభమునందూ. 52

తా. మారుతముయొక్క చలనాంశముతో నగ్నియొక్క తేజాంశము గలసినయెడల బుద్ధిలయించును. ఆకాశముయొక్క బయలాంశముతో వాయువుయొక్క చలనాంశము జేరినట్లయిన మనస్సు లయించునని భావము.

కం. తొలిచాతుర్భాగాంశలు। గలుయింద్రియ గణములిటులకడుగుణ
ములతో । విలయించి వాటియర్థాం । శలుగల భూతప్రపంచ

జాలములందూ । జేరుసుప్రథమగోళములందూ । ఇలజలాగ్ని
వాయుసలలితాంబరముల । విలసిల్లి నిర్విషయకలితములై యాత్మ
జాలాములందూ । జేరును ప్రథమగోళములందూ. 53

తా. ఈప్రకారము మొదటిచతుర్భాగాంశలుగల యింద్రియ
సమూహములు వాని గుణములతోడ వాటి వాటి వ్యష్ట్యంశలు గల
భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము వీటియందు లయించు
నని భావము.

పంచభూతాత్మాంశలయము.

కం. వసుమతియర్థాంశముదు । ర్వ్యసనావృతమైన వాయువదిని జసా
రాం । శసమానాంశచతుష్కము । పసగలశితదంశనొదలి వా
యువేంద్రియమూ । లయమై పృథివీగతమేకమయమూ । విసుకు
చేతద్విషయప్రసరణమూనిని, ర్వ్యసనని స్తేజమై కొనకేమినగు పడ
కవాయువేంద్రియమూ । లయమై పృథివీగతమేకమయమూ. 54

తా. పృథ్వి అర్ధాంశయొక్క చతుర్భాగములు పృథ్వియొక్క
మిగతసగమై నవాయువునందు గలసి, విషయప్రసరణమూని తేజోర
హితమై కనుపడకుండ పృథివిలోలయమై పోవునని భావము.

కం. జలమర్థాంశమురసస । కలితంబై తజ్జలాంశకళలవినాశ్లగ । నెల
వులువిడితనుజేరిన । విలయించును తద్రసంబు వింతాగానంతా
జలభూతమేకార్ణవమంతా । తెలివిలేకవిషయకలకలములు లేక ।
వెలిలోని స్తేజమై తొలగియేమియుగాక వింతాగానంతా। జలభూత
మేకార్ణవమంతా. 55

తా. రసముతోఁ గూడుకొని యుండు జలార్ధభాగముతోడ
తక్కిన జలార్ధభాగముయొక్క నాల్గు భాగములు చేరినప్పుడు రస
హీనమై యావత్తు జలభూతము వికారరహితమై యేమియు లేకుండ
జలభూతమందులయించునని భావము.

కం. పావకమధ్యమచక్షువు । లావగునిజభాగ చతుర్లవలుమతనంగో।
నే వేళగలయునిజకళ । లా వేళ నేవిడచి చక్షువగ్నిలోకలయూ ।
తద్వహ్ని భూతాకారమరయు । భావసంజ్ఞవిషయభావ రూపము
లొందవి । సావధానములేక సమసిని స్తేజమై యగ్నిలోకలియు ।
తద్వహ్నిభూతాకారమరయూ. 56

తా. చక్షువుతోఁ గూడిన వహ్నియొక్క అర్ధాంశముతోడ తక్కిన యగ్ని యొక్క యర్ధాంశ చతుర్భాగములు జేరి నప్పుడు చక్షువు తన కళవిడచి, తన భావసంజ్ఞలన్నియు విడచి, తేజోరహిత మైయగ్నిభూతమునందు లయించునని భావము.

కం. పవనార్ధాంశము వ్యానము । నవిరళముగ శేషభాగ లచ్చటవిడిత।
న్నవలంబించివ వ్యానం । బవయవసంచార మొనవి యనిలము
నొందూ । తద్వాయుభూతాంతరమందూ । ప్రవిమలా తర్విషయ
వివిధకృత్యములొందవి । అవివేకనిలయమై జవసత్వహీనమై యని
లమునొందూ । తద్వాయుభూతాంతర మందూ. 57

తా. పవనార్ధభాగమగు వ్యానము తక్కిన పవనార్ధ భాగపు నాలుగు భాగములలో జేరఁగా, నవయవసంచార మొనవి జవసత్వ హీనమై వ్యానము పవనమునందు లయించునని భావము.

కం. ఆకాశార్ధమ జ్ఞాతయు । ప్రాకటముగ మిగులు నాల్గుభాగలు
తనలో। డాకొనగఁ జ్ఞాత జ్ఞానము । నేకానకువిడిచి నభమైనిండి
వెల్గొందూ । తద్గగనభూతము నాత్మజెందూ । నేకడనంటక
రాకపోకలు లేక। సాకారమెఱుఁగకలోకని స్తేజమై నిండివెల్గొందూ
తద్గగనభూతము నాత్మజెందూ. 58

తా. ఆకాశార్ధభాగమగు జ్ఞాతయందు తక్కిన యాకాశార్ధ భాగచతుష్కకలములు చేరఁగా జ్ఞాతజ్ఞానము నొందవి ఆకాశమునందు లీనమై పోవును. ఆ యాకాశభూతము ఆత్మను జెంది దేని నంటక

రాకపోకలు లేక సాకారమెఱుఁగక లోకరహితమై ప్రకాశించుచుండు నని భావము.

బ్రహ్మాండవిలయ పంచీకరణము.

కం. ప్రళయంబున ననిలముచే । జలనిధిలోఁ బడినమృత్స్నశకలముమాడ్కిన్ । గలసివసుధాఖ్య లేకను । జలమై ప్రవహించి ధరకు శత భాగాధికము । పెంపగుసర్వవిలయ గోచరమా । జలమొక్క బిందువై యలఘుతరాగ్నిపై । జిలుకసలిలాఖ్యత నిలువకవహ్ని యాశతభాగాధికమా । పెంపగుసర్వవిలయ గోచరమా. 59

తా. ప్రళయకాలంబున సముద్రమందు మట్టిపెళ్ళ కలసి తన రూపము చెడినట్లు నూరంతలు హెచ్చుగానుండు జలమందొక భాగమైన భూమిచేరి భూమి యను పేరు లేకుండా పోయి జలభూతము నిలచును. కాలిన యినుముమీఁద నీటిబిందువుపడి సమసిపోయిన విధముగా నూరుపాళ్లు జాస్తిగా నుండు యగ్నియందొక భాగమైన జలముచేరి నశించి, అగ్నిభూతము నిలుచునని భావము

కం ఈరీతియగ్నిసమసెడు । కారణసమయమున దీపకళికకృశమై । భూరితరశతగుణాధిక । మారుతగతి వేగమగ్ని మరివిలయమొం దూ । సర్వార్థైక్యసాధన యందూ । నానాకసివాయు ప్రేరణ గలవహ్ని । పేరులేకనణంగి యూరులేకనిలచి మరివిలయమందూ॥ సర్వార్థైక్యసాధనయందూ॥ 60

తా. మహావాయువుచే దీపము చల్లారినట్లు నూరంతలు హెచ్చుఁగాగల వాయువునందొక పాలైన యగ్నిచేరి వాయుప్రేరణగల యగ్ని యను పేరు లేకుండా సమసిపోయి వాయుభూతము నిలచునని భావము.

కం. మారుతఘనవేగ వి । హారమునాకాశమందు నల్పానిలమై । దారకనాసాపుట సంచారపురవగాలిమాట్కి సంభవమందూ । దాని

లోనదియె సమయూ తానెందూ । సారములేని సమీరమెచ్చట
తోంటి । పేరులేకను సర్వాధారాంతరితమై సంభవమందూ ।
దానిలోనదియె సమయుతానెందూ. 61

తా. ముక్కురంధ్రముల ద్వారావచ్చు రవగాలి వెలుపలికి వచ్చి తెలియనివిధముగా నూరంతలు జాస్తియై ఆకాశమందొక భాగమైన మారుతముజేరి మారుతమనే పేరుచెడి సర్వాధారమగు ఆకాశభూతము నిలచునని భావము.

కం. ఆసర్వగతాకాశం । భాసూత్మానందభూతమది కేవలచి । ద్భా
సురబ్రహ్మాకారవి । కాసములోఁగలసి సర్వలయమునూజెందూ।
తానుగాని తత్వార్థమందూ । యేసాధుజనులు నిశ్వాసచేసను
గని । శ్వాసనక్రమమును । ల్లాసముగను దెల్పలయమును జెందూ।
తానుగాని తత్వార్థమందూ. 62

తా. అట్టి సర్వగతమైన ఆకాశము స్వజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యుండును సర్వకార్య కారణవిలక్షణుండును, నిర్గుణుండును నగు పరబ్రహ్మమందుఁ గలసి పరబ్రహ్మము నిలచును. సాధుజనులెవరయినను నిశ్వడిగినట్లయిన వాసనరహితమైన యీ మార్గమును సంతోషముగాఁ దెలుపుమని భావము.

కం. ప్రళయమున భూతకోటులు । విలయించుట వలన జననవిధులకు
హేతు । ర్విలయములగు కర్మత్రయ । మలప్రారబ్ధత్రయంబునంది
భూతములూ । జన్మలు మరలగలిగి తొలఁగుటలూ । వెలయు
బ్రహ్మవిచారకులకు సమాధిని । శ్వలమున తత్కర్మవిలయించుట
దెముక్తినందీభూతములు । జన్మలుమరల గలిగితొలగుటలూ. 63

తా. ప్రళయకాలములయందు భూతకోటులు నశించుటవలన జన్మములకు కారణమైన ఆగామి సంచిత ప్రారబ్ధకర్మములను, పంచ మలములను భూతములుజెంది జన్మములుగలిగి తొలఁగుచుండును బ్రహ్మ

విచారమువలన పంచభూతములును జన్మకారణములైన త్రివిధ కర్మములను లయించుటే ముక్తియని భావము.

సర్వలయపంచీకరణము.

కం. ఇఁకసర్వలయముదెలిపెద । ప్రకటితబ్రహ్మాండపృథివిపంచకమెల్లన్ । ఒకజలపంచకమునజను । అకుటిల జలమగ్నియందు యణగిలయమందూ । ఆయగ్ని పంచక మనిలమందూ । సకలసమీరణాధికపంచకమెల్ల।నాకయంతరిక్ష పంచకమందైక్యత నలరియణగిలయమందూ ॥ ఆయగ్నిపంచక మనిలమందూ. 64

తా. సర్వలయమును దెలిపెదను వినుము. పృథివీపంచకము జలపంచకమందు లయించును. జలపంచకం బగ్నిపంచకమందు సమయును. అగ్నిపంచకము వాయుపంచకమందు లయించును. వాయుపంచక మాకాశపంచకమందులయించునని భావము.

కం. కాటుకజీకటిలోను । ఘాటంబుగ మేఘపంక్తి గప్పినగతినా । నాటికినిలనభములుకన్ । దీటుకునగుపడక నేమి తెలియకున్నటులా । బయలుబ్రమింగి బాటలేనటులా । పాటిగదోచువిక్షేపావరణశక్తి । ఘాటబ్రహ్మాండ కటాహమెల్ల బ్రమింగి తెలియకున్నటులా । బయలుబ్రమింగిబాటలేనటులా. 65

తా. అంధకారబంధురంబైన చీకటికాలమందు గాఢమైన మేఘముకమ్మికొనఁగానిదిభూమి, ఇదియాకసమని తెలియకుండులాగున పరిపూర్ణబ్రహ్మ నావరించియుండు విక్షేపావరణశక్తి బ్రహ్మాండకటాహము నెల్ల మింగుననిభావము.

కం. ఆయంతరిక్షమంత । వ్యాయామసులీనసూక్ష్మవై భవనిత్యా । దాయోదయలయయుతసం । ధాయక విక్షేపశక్తి తత్వమునొందూ । నదిడిందుయావరణశక్త్యందూ । యీయుభయశక్త్యోదయలయముల్ వటబీజ । ఛాయామూల ప్రకృతిలోనణుమాత్రమై తత్వమునొందూ॥ నదిడిందుయావరణశక్త్యందూ. 66

తా. ఆయంతరిక్షము ఉదయలయములతోఁగూడినవిక్షేపశక్తి యందుఁ గలియును. ఆవిక్షేపశక్తి యావరణశక్తియందు లయించును. ఈరెండుశక్తులయొక్క జననలయములు మూలప్రకృతియందులయిం చునని భావము.

కం. వటభూరుహ మెల్లనునా। వటబీజమునందుఁ బుట్టివడినణగుగతిఁ। దిటవుగ మూలప్రకృతిలో। పటువగునాత్మస్వశక్తియునగ ప్రబలునూ క్ష్మముగా। జగములు గలిగి నమయునుబాగా। చటులజగద్బీజ మటులబ్రహ్మమెగాన। నటునుదయమిటు విలయనటన బ్రహ్మము జెందు ప్రబలుసూక్ష్మముగా।జగములుఁగలిగి నమయునుబాగా. 67

తా. మఱ్ఱిచెట్టు సూక్ష్మమగు మఱ్ఱివిత్తనమునుండి ప్రబలి ల యించినట్లు మూలప్రకృతియం దాత్మ స్వశక్తి సూక్ష్మముగా గలిగి జగదుత్పత్తి లయములు గలుగుచున్నవి. జగద్బీజమైన యాత్మశక్తి బ్రహ్మమేగనుక నుదయ లయ నటన బ్రహ్మమునే జెందునని భావము.

క. మునుపృథివియొకటిపమసిన। కనుపడువిశ్వముకుప్రాపకము లేక చె డెఁ। అనిశమునుజలరసహీనత।' పనులన్నియునూని నిష్ప్రపం చమైపోనూ। విభ్రమకలితగుణములతోనూ। అనలప్రభలు నమ యదనరూపమును లేదు। అనిలమారినశ్వాసగనరాకతానిష్ప్ర పంచమైపోనూ। విభ్రమకలితగుణములతోనూ. 68

తా. మొదటనొక్క పృథివిలయముగాఁగానే విశ్వమునకుప్రా పకము లేకపోయినది. జలరసము లయింపఁగనేపనులన్నియు నిలచిపో యి ప్రపంచరహితమగును. అగ్నిప్రభ, నమయఁగనే రూపము లేకపో వును. మారుతము లయింపఁగనే శ్వాస కానరాకపోవునని భావము.

కం. ఆకాశములయమైనను। నేకాఖండమ్ములోన నెట్లవకాశం। బీ కరణిజెలగసర్వాని। రాకారములోనరాకాపోక లేమానూ। మా యావిద్యాలేకమైపోనూ। ఆకాలకర్మలోనే కోలదిజీవేశ। సా

కారవిభ్రమసోకసిదదె బయలుకాక లేమానూ। మాయావిద్య లేకమైపోనూ. 69

తా. ఆకాశము లయించినతోడనే నవకాశ రహితమైన యేకాఖండ సర్వనిరాకారమందు మాయావిద్య లేకమై జననమరణములు లేకపోవుచున్నవి. ఇట్టి సందర్భములో జీవేశ సాకారభ్రమ లెంతమాత్రమున్నా సోకనిదే పరిపూర్ణమని భావము.

కం. ఆరాకపోకసోకని। మారాకిగురించనట్టి మహీనచలాఖ్యా। కారపరబ్రహ్మములో। నేరీతిన సృజనవిజన మెవరిచేవిన్నా। యేపంచీకరణములందుగన్నా। వారొకటి వీరొకటి తారుమారుగదెల్పి। పోరుమాన్పి రేకాని దారినెరుగనికథ యెవరిచేవిన్నా। యేపంచీకరణములందుగన్నా. 70

తా. రాకడపోకడనంటని యేకాఖండమగు పరిపూర్ణబ్రహ్మమందు జగదుత్పత్తి, లయ విధాన మెవరిచేవిన్నను నేయేపంచీకరణములందు గన్నను వారొకటి వీరొకటి దారినెరుగని కథ తారుమారుగా దెల్పి పోరుమాన్పి రేకాని వేరేకాదని భావము.

కం. కొందరుత్రిగుణవికారము। లందీతనువులునునింద్రియాదులు సృష్టే। యంగంటె సమసెనందురు। కొందరుయజవిష్ణు రుద్రకోటిచేసృష్టి। గలిగితొలగునందురీవ్యష్టి। యుందరెన్నిగతుల సందేహ భ్రమలచే। పొందిక పడ దెల్పుచుందురిట్లు భూతకోటిచేసృష్టి। గలిగితొలగునందురీవ్యష్టి. 71

తా. రజస్సత్వ తమోగుణములవికారములవలన నీతనువులును నింద్రియాదులు జనించి, వానియందే లయించునని కొందరు చెప్పుదురు. బ్రహ్మ, విష్ణు, రుద్రులచే నీ సృష్టిగలిగి నమయునని మరి కొందరందురు. ఈ వ్యష్టి ప్రపంచంబునందీ ప్రకారము సందేహ భ్రమలచే పొంది కలవరపడు నట్లనేకమార్గములచే దెల్పుచుందురని భావము.

క. ఈలయవిధములు జూడగ । చాలగ నేరీతి మొదట సర్వేంద్రియ
స । ర్వాలంబసృష్టి జెలగెను । నాలీలంభూతలయమునందెను సరి
గా । యేఃభూతమాభూతములోగా । పాలుపుచ్చెటివిధము చాల
మరలదెలుప । నేలనుదయమెంతో నీలయవిధమం తెనందెను సరి
గా । యేఃభూతమాభూతములోగా. 72

తా. ఈ లయ విధానములు చూడగా నేరీతిన సర్వేంద్రి
యాలంబమైన సృష్టికలిగెనో నారీతిగానే యేభూతమాభూత మందు
లయించును. భాగహార విధము మరల దెల్పుటెందుకు. జనన విధ
మెంతో లయవిధానమం తేనని భావము.

పంచకోశ వివరము.

కం. యీపంచవింశతీంద్రియ । ప్రాపకస్థూలాంగమిదియె భక్ష్యాన్న
రస । వ్యాపకసంజనితాత్మక । మేపట్టుగదోచుదీని మేదినిలోగా ।
బల్కెదరన్నమయకోశమనగా । దీపింపప్రాణ కర్మేంద్రియదశక
ము ప్రాణమయకోశ మేపారగ విలసిల్లు మేదిని లోగా । బల్కె
ద రన్నమయకోశమనగా. 73

తా. అన్నరసముచే నేర్పడిన తల్లిదండ్రుల శుక్లశోణితంబు
లేకమై పుష్పించి యిరువైయైదు తత్వములతోగూడి స్తంభమువలె
గనుపించు నీస్థూల శరీరమన్నమయకోశమనబడును. కర్మేంద్రియ
పంచకంబును ప్రాణాదివాయు పంచకంబును గూడినది. ప్రాణమయ
కోశమని చెప్పబడునని భావము.

కం. జ్ఞానేంద్రియపంచకమును । మానసమును గలియగోహ మను
మైయదియ । జ్ఞానమనోమయకోశము । జ్ఞానేంద్రియ పంచకమ్ము
బుద్ధియుగలియా । అదెకే జ్ఞానమయకోశమరయా । తానంతః కర
ణముపూని యజ్ఞానప్ర । ధానమేళనమై నానందమయ కోశము
దాబుద్ధిగలియా । అదెవిజ్ఞానమయకోశమరయా. 74

తా. జ్ఞానేంద్రియ పంచకంబును మనస్సునుగూడి యజ్ఞాన మనోమయ కోశంబనబడును. శబ్దాదివిషయ పంచకంబును, బుద్ధియు గూడి విజ్ఞానమయకోశ మనబడును. ప్రియప్రమోద వృత్తిమత్తై అజ్ఞానప్రదమైన అంతఃకరణ మానందమయ కోశమనబడుననిభా॥

కం. అన్నమయకోశమేమును । పన్నుగస్థూలం బటండ్రు ప్రాణమనో
సం-జ్ఞెన్నగవిజ్ఞానమయో-త్పన్నత కోశత్రయంబు నొకటిగ జేరి-
సూక్ష్మశరీరలింగాముయలరి । ముందె యానంద మయోన్నతకోశ
ము । యెన్న కారణతనువన్న దెవినుమిటుల నొకటిగజేరి । సూక్ష్మ
శరీర లింగాముయలరీ, 75

తా. అన్నమయకోశమే స్థూలమని చెప్పబడుచున్నది. ప్రాణ మయ, మనోమయ, విజ్ఞానమయ, కోశములు మూడును జేరి సూక్ష్మ శరీర మనబడును. ఆనందమయ కోశమే కారణ శరీరమని చెప్పబడునని భావము.

అ వ స్థా త్ర య వి వ ర ణ ము.

కం. నయమలరజ్ఞానకర్మేం । ద్రియమంతః కరణ గలసి దిటముగ
పదునా । ల్గయనించివిశ్వదేవ । క్రియలంజరించు విషయక్రీడన
మవస్థా । వ్యాపకమిదియె జాగ్రదవస్థా । స్వయమంతఃకరణేంద్రి
యచతుష్టయభాగా । లయముస్వప్న వికాసమయము తైజసదే
వక్రీడనమస్థా । వ్యాపకమిదియె జాగ్రదవస్థా. 76

తా. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, అంతఃకరణ చతుష్టయము, ఈపదునాల్గును కలసి శబ్దాది విషయములందు ననుభవముగలిగి, విశ్వ దేవక్రియయందు జరియించుచుండుట జాగ్రదవస్థ యని చెప్పబడును. జాగ్రత క్రమక్రమముగా క్షీణించి గాఢనిద్రను బొందక జాగ్రదవస్థ యందలి విషయముల యనుభవముగలిగి తైజసదేవ క్రియలయందు జరియించుచుండుట స్వప్నావస్థ యనిచెప్పబడునని భావము.

కం. వినుమీజాగ్రత్స్వప్నము । లనగల నీస్థూలసూక్ష్మ మఖిలేంద్రియ
చే । తనగతులు పరతి జెంగక । ఘనతమసనుఖోపశాంతి గడగు
సుషుప్తి । ప్రాజ్ఞాధిదైవముదనజ్ఞప్తి । మునుజాగ్రతయు స్వప్న
మునదోచ దాస్వప్న । మునుజాగ్రతకు రాదీసనులు రెండెరుగక
గడగు సుషుప్తి । ప్రాజ్ఞాధిదైవముదనజ్ఞప్తి. 77

తా. జాగ్రస్స్వప్నములయందు జరియించు మానసాది సర్వేం ద్రియశూన్యమై, యేమియు గోచక సుఖోపశాంతముగానున్న యవ స్థయే సుషుప్త్యవస్థయని చెప్పబడును. దీనికి ప్రాజ్ఞు డధిదేవత యని భావము.

కం. వినుమొకసూక్ష్మము దెలిపెద । కనబడుతనవస్తువితతికనిగుర్తిం
చే । మనసేజాగ్రదవస్థయు । కనికనిసించకను యన్యకార్యాము
లందూ । చేసెటి యోచనదెస్వప్న మందూ । కనురూపు మరచి
యోచన సేయుటకు వెరచి । కనరాని వినరాని ఘనతమసమే సుప్తి
కార్యములందూ । చేసెటి యోచనదె స్వప్నమందూ. 78

తా. నే నొక సూక్ష్మమును దెల్పెదను వినుము. కంటికి గోచ రమయ్యే వస్తుసముదాయమును గుర్తించెటి మనసే జాగ్రదవస్థ యు నబడును. కనిసించకుండా నన్యకార్యములందు జేయుయోచనే స్వప్నా వస్థ యనబడును. కనుచూపుమరచి యోచనలేకుండా కన వినరాని గాఢతమసమే సుషుప్త్యవస్థయనబడునని భావము.

## యేకైకయవస్థాంతరవిధానము.

కం. జాగ్రతలోనను స్వప్నము । జాగరమునగాఢసుప్తిజాగర దశలో
జాగరము మహాజాగ్రత । నీగురుతుగ త్రివిధదశలనెనగి పరాత్మా ।
చరియించు ప్రత్యహమంతరాత్మా । రాగలుగు పోగలుగులోగుర్తు
మధ్యబయు। లాగ్నియున్నది చూడుయోగానుభవమున నెనగిపరా
త్మా । చరియించు ప్రత్యహమంతరాత్మా. 79

తా. జాగ్రతలో స్వప్నము, జాగ్రతలో సుషుప్తి, జాగ్రతలో జాగ్రత, యీ త్రివిధదశలలో పరమాత్మ యెల్లప్పుడును సంచరించు చుండును. రాకపోకలుగల లోగుర్తుమధ్యను బయలాగియున్నది. యోగానుభవమువలన జూడుమని భావము.

జాగ్రతలో స్వప్నమెట్టిదనగా గురువు బోధచేయుచుండగా వినుటకు పరాకుపడుటచే ఆవిషయములు జ్ఞాపకముండియునుండకయుండుట.

జాగ్రతలో సుషుప్తి యెట్టిదనగా గురుబోధ వినవలయు నని వినునప్పుడు హెచ్చరికలేమిచే నవియేమియును బొత్తిగా జ్ఞాపకము లేకపోవుట.

జాగ్రతలో జాగ్రతయెట్టిదనగా గురుసన్నిధినిబోధవినునపుడు గడగినవిషయములు నడిగి తెలిసికొని మనసున మరుపు లేకయుండుట.

కం. స్వప్నములోపల జాగ్రత । స్వప్నములోపల సుషుప్తిస్వప్నములో
నే । స్వప్నమగు త్రివిధ వృత్తుల । స్వప్నవిహారోపజీవ సౌఖ్య
మీయాత్మా । చరియించుప్రత్యహమంతరాత్మా । స్వప్నావస్థా
దిలో స్వప్నమధ్యమునందు । స్వప్నాంతమున బయలునసంప్రాప్తిం
చేటియోగసౌఖ్యమీయాత్మా। చరియించుప్రత్యహమంతరాత్మా.

తా. స్వప్నములో జాగ్రత జాగ్రతలో సుషుప్తి స్వప్నములో స్వప్నము. యీ త్రివిధ దశలయందును నంతరాత్మ సదాచరించు చుండును. స్వప్నాదియందును స్వప్నమధ్యను, స్వప్నాంతమునను పర బయలాగి యున్నది. యోగానుభవముచే దెలిసికొనుమని భావము. స్వప్నములో జాగ్రతయనగా, కలగని లేచి తాను కలలో గన్నదాని నంతయు తప్పకుండ చెప్పుట. స్వప్నములో సుషుప్తియనగా కలగని మేలుకొని దాను చూచిన దంతయును మరచుట, స్వప్నములోస్వప్న మనగా కలగనిలేచి అందలివిషయములను మరచి మరవకుండుట.

కం. సుషుప్త్యవస్థనుజాగ్రత । సుప్తినిస్వప్నంబు పూర్ణసుప్తిని సుప్తే

సుప్త్యావసానవిస్మృతి । జ్ఞప్త్యంతరల యనయూధిజ్ఞాన మీాయా
త్మా । చరియించు ప్రత్యహమంతరాత్మా । జ్ఞానమీాత్రివిధవిధా
నావస్థలలోన । దేనినైనమూడోయీాహంసతిరుగును జ్ఞానమీాయా
త్మా । చరియించు ప్రత్యహమంతరాత్మా. 81

తా. సుషుప్తిలో జాగ్రత, సుషుప్తిలోస్వప్నము. సుషుప్తిలో సుషుప్తి, యీామూడు దశలయందును పరహంస సదా సంచరించుచుండును. సుషుప్త్యంతరమునను, సుప్త్యావసాన మందును కేవలాత్మ ప్రకాసింపుచున్నది. యోగానుభవముచే గనుమని భావము. సుషుప్తిలో జాగ్రత యెట్టిదన, సుఖముగా నిద్రించిలేచి ఆనిద్రసుఖ మిట్టిదని తెలసి చెప్పుట. సుషుప్తిలో స్వప్నమెట్టిదన, సుఖముగా నిద్రించియు, దానివలని సుఖమెట్టిదో తోచి తోచకుండుట. సుషుప్తిలో సుషుప్తి యెట్టిదన నిదురించి లేచిన పిమ్మట దాని సుఖ మిట్టిదని తోచకుండుట.

### అ తీ తా వ స్థా త్ర య వి వ ర ణ ము.

కం. పరమాంతఃకరణాలయ । నరసిజత్యాగంబె తుర్యసదనములోక
స్ఫురణాఖిలవిభ్రమజిత । పరతుర్యాతీతావస్థబ్రహ్మనిలయమురా ।
నిజపరభేదవిరహితాంతమురా । నిరతిశయాఖండపరిపూర్ణ గోచ
ర । పరమశివస్థాన మరయషడావస్థ బ్రహ్మనిలయమురా , నిజపర
భేదవిరహితాంతమురా. 82

తా. అంతః కరణాలయమగు కమలత్యాగము. తుర్యము. సకల లోకస్ఫురణ రహితము. తుర్యాతీతావస్థ, నిరతిశయాఖండ పరిపూర్ణ బ్రహ్మానుభవ, మారవయవస్థయగు అతీతావస్థయని చెప్పబడునని భావము.

### ష డా వ స్థ ల తా ర త మ్య వి వ ర ము.

కం. తొలిత్రివిధావస్థలసా । ధులచేసాధనలచాతదుర్ఘటయోగా । దు
లచేవినదగుకనదగు । నిలనాపై మూడవస్థ లెరుగుటుళ్ళక్కి । నె

రగని చోటకలయుటుళ్ళక్కీ । తొలిమూడవస్థలే కలియ లేనియా
త్మ । తెలివి లేక యావలి:పగాటి నెల్లెరుగుటుళ్ళక్కీ । నెరు
గనిచోట కలయుటుళ్ళక్కీ. 83

తా. మొదటిమూడవస్థలను సాధుజనులచేతను సాధనలచేతను యోగాదులచేతను వినుటకుగాని కనుటకుగాని తగినవిమైయున్నవిగాని తక్కినమూడవస్థలును తెలిసికొనుట అబద్ధము మెరుగనిచోట కలయుటయు నబద్ధమే మొదటిమూడవస్థల నేకలియలేని యాత్మ తెలివి. లేకుండా నవతలిమూటి నెల్లెరుగును? యెరుగ లేరని భావము.

కం. ఇలజాగ్రత్స్వప్నసుషు । ప్తులవృత్త్యంతరము లెపుడుపొందక వె
లిలో । పలనిండి వెలుగునచలము । గలిసేసాధనము తెలియగలి
గితేచాలూ యిదిజన్మసంసిద్ధిపదివేలూ । తెలివి తెలియ లేనినిల
కడగలచోట । చలగినావలి మూడుకలవో లేవో తెలియగలిగి తె
చాలూ । యిది జన్మసంసిద్ధి పదివేలూ. 84

తా. ప్రపంచమందు జాగ్రత్స్వప్న సుషుప్తులవృత్తుల జెందక వెలుపలలోపలనిండి ప్రకాశించు పరిపూర్ణమును బొందుసాధనము తెలియగలిగి తేజాలును ఇదేజన్మసంసిద్ధి యెరుకరహితమైనచోటనుండి యావలిమూడు నున్నవో లేవోనని తెలియగలిగితే చాలునని భావము.

## శుద్ధాత్మ విచార నిరూపణము.

కం. నేనుశరీరేంద్రియములు । గానుమహీజలాగ్ని ఖానిలయములు నే
గానుమనోబుధ్యాదులు । గాను నదాస్థూలసూత్మ్మకారణములు
నూ । పంచకోశావస్థాత్రయములునూ । నేనుగానను వాడగాను
వానినిగాను । వానిగాంచెటి చిద్ఘనానందసాక్షినీ కారణములు
నూ । పంచకోశావస్థాత్రయములునూ. 85

తా. శరీరేంద్రియములు నేగాని పృథివి, అప్పు, అగ్ని, వాయువు, ఆకాశములు నేనుగాను, మనోబుద్ధి, చిత్తఅహంకారాదులు నే

గాను స్థూలసూక్ష్మకారణాదులు నేనుగాను, పంచకోశములు నేగాను అవస్థాత్రయములు నేగాను. నేనుకాదనే వానిని నేగాను, వీనినన్నిటిని గాంచు చిత్సాక్షినని భావము.

కం. నేనఖిలదృశ్యపటలము। గానుసదాదర్శనంబుగానికదృక్కున్। గాననిపలికెడివస్తువు। గానుమహాఖండ పూర్ణఘనుడను నేనూ। నేననుదురభిమానముగానూ। కానని కనుగిటులోనబూని నిటు రానిపోనిచోటతానుతానని పూర్ణఘనుడానునేనూ। నేననుదు రభిమానముగానూ. 86

తా. కనుపడునట్టి ప్రపంచము నేనుగాను, చూచువాడనుగాను చూడబడునదిగాను, చూపునుగాను, నేనుగానని పల్కెడి వస్తువును నేనుగాను, నేనుపుట్టు గిట్టుటలు లేనిచోటనేనై ప్రకాసించు పరి పూర్ణాఖండఘనుడనని భావము.

కం. ఇదిఘటపటమఠదృశ్యం। బిదిసకలేంద్రియప్రపంచమిదె తనుత్రి విధం। బిదిపంచకోశదశలును। యిదియిదియని నేర్పరించి నెరి గేటివాడా। యరిగెటియరుకమరుపైనజాడా। యిదియాత్మ నా త్మలునిదిజీవేశ్వరద్వివిధ। మిదియదివిడచినే మొదటిపరిపూర్ణము నెరిగేటివాడా। యరిగెటి యెరుకమరుపైనజాడా. 87

తా. ఇదిఘటము, యిదిపటము, యిదిమఠము, ఇదిదృశ్యము, ఇది ప్రపంచమనియు, ఇదిస్థూలము, ఇది సూక్ష్మము, ఇదికారణ మనియు, ఇదియాత్మ, యిదియనాత్మయనియు, ఇదిజీవేశ్వర ద్వివిధ మనియు, నేర్పరించి, ఇది యదివిడచి మొదటి పరిపూర్ణము నెరిగెటి వాడను నేనని భావము.

కం. అచలచలసహితదీపము। ప్రచురతఘటపటపదార్థపటలియు వెలు గగ। సుచరితముగ జేసిమహా।రచనచేతను వెలుగుకరణి రాజితము గనూ।చక్షుర్గోచరమఖిలజగములునూ। ఉచితవిషయములలో ప్ర

గాను స్థూలసూక్ష్మకారణాదులు నేనుగాను, పంచకోశములు నేగాను అవస్థాత్రయములు నేగాను. నేనుకాదనే వానిని నేగాను, వీనినన్నిటిని గాంచు చిత్సాక్షినని భావము.

కం. నేనఖిలదృశ్యపటలము । గానుసదాదర్శనంబుగానికదృక్కున్ ।
గాననిపలికెడివస్తువు । గానుమహాఖండ పూర్ణఘనుడను నేనూ ।
నేననుదురభిమానముగానూ । కానని కనుగిటులోనబూని నిటు
రానిపోనిచోట తాను తానని పూర్ణఘనుడాను నేనూ । నేననుదు
రభిమానముగానూ. 86

తా. కనుపడునట్టి ప్రపంచము నేనుగాను, చూచువాడనుగాను చూడబడునదిగాను, చూపునుగాను, నేనుగానని పల్కెడి వస్తువును నేనుగాను, నేనుపుట్టు గిట్టుటలు లేనిచోట నేనై ప్రకాసించు పరిపూర్ణాఖండఘనుడనని భావము.

కం. ఇదిఘటపటమఠదృశ్యం । బిదిసకలేంద్రియప్రపంచమిదె తనుత్రి
విధం । బిదిపంచకోశదశలును । యిదియిదియని నేర్పరించి నెరి
గేటివాడా । యరిగెటియురుకమరుపైనజాడా । యిదియాత్మ నా
త్మలునిదిజీవేశ్వరద్వివిధ । మిదియదివిడచి నే మొదటిపరిపూర్ణము
నెరిగేటివాడా । యరిగెటి యెరుకమరుపై నజాడా. 87

తా. ఇదిఘటము, యిదిపటము, యిదిమఠము, ఇదిదృశ్యము, ఇది ప్రపంచమనియు, ఇదిస్థూలము, ఇది సూక్ష్మము, ఇదికారణమనియు, ఇదియాత్మ, యిదియనాత్మయనియు, ఇదిజీవేశ్వర ద్వివిధమనియు, నేర్పరించి, ఇది యదివిడచి మొదటి పరిపూర్ణము నెరిగెటి వాడను నేనని భావము.

కం. అచలచలసహితదీపము । ప్రచురతఘటపటపదార్థపటలియు వెలు
గగ । సుచరితముగ జేసిమహా।రచనచేతను వెలుగుకరణిరాజితము
గనూ।చక్షుర్గోచరమఖిలజగములునూ । ఉచితవిషయములలో ప్ర

కం. నేననటిదానికాత్మ । జ్ఞానసుఖానంద స్వప్రకాశాద్భుతన । ర్వానుగతమనుచునిజసం । ధానార్థ సమాధినొందుతన్మయపరు డూ । నిరుపమనిర్వాణగోచరుడూ । తాను నేనను భ్రమలేక లే। కను బ్రహ్మ। భానమనిశము నేను నేననితలచు నుతన్మయుపరుడూ నిరుపమ నిర్వాణగోచరుడూ. 91

తా. తన్మయత్వముచేనుండు బ్రహ్మవేత్త నేననుమాటకు సర్వమునందును వ్యాపించియుండు జ్ఞానసుఖానంద స్వప్రకాశమైన యాత్మయని యర్థముచేసికొని తాను నే నను భ్రమరహితుడై పరబ్రహ్మ నేనే నని సదా తలచుచుండుననిభావము.

కం. ఇటునేనను శబ్దముకం । తటికేకార్థంబు నేయతగదిక ఘటనం । ఘటకాల కర్మవశమున । నటునిటు బాహ్యాంతరముల నర్థద్వయ ముగా । నమరెనుబంధ మోక్ష హేతువుగా । స్ఫటికమునకు చి త్రపట శ్వేత కాంతి లు । నెటులనారోపితమటునా త్మవిలసిల్లునర్థ ద్వయముగా ॥ నమరెనుబంధమోక్ష హేతువుగా. 92

తా. నిర్మల ధావళ్యముగానుండు స్ఫటికమునకు రంగువేసిన పటముయొక్క కాంతు లారోపితమగునట్లు ఘటనంఘటన కాలకర్మ వశమున బంధమోక్ష కారణములుగా, మలినరహితుడగు నేనను నాత్మనకు జీవుడనియు, నీశ్వరుడనియు నర్థద్వయ మారోపితమయ్యెను గనుక నేననుశబ్దమున కంతటికి నేకార్థముచేయదగదని భావము.

జీ వే శ్వ ర వి చా ర ము.

కం. ధరమాయాప్రతిబింబము । తరుచుగతన్మాయతోడ తదధిష్టాన । స్ఫురణపరతత్వలక్షణ । పరమాద్భుతమోహమాయపరవశుడజు। డూ । సర్వేశ్వరుడు సర్వసాధకుడూ । హరిహరబ్రహ్మపురండ। రాదివేషధరుడై జగదుదయలయాదులతా జేయుపరవశుడజుడూ॥ సర్వేశ్వరుడు సర్వసాధకుడూ. 93

తా. మాయయు మాయయందలి ప్రతిబింబమును, దాని కాధారమగు శుద్ధ చైతన్యంబును కలసి ఈశ్వరుడనే పేరుచే నొప్పి, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను రూపములచే జగదుత్పత్తిస్థితి లయాదులను జేయుచుండును. ఈయనే సర్వేశ్వరుడై సర్వసాధకుడుగా నున్నాడని భావము.

కం. పరగనవిద్యాదికన । త్పరిశుద్ధోదయవిలాస ప్రతిబింబకళా । ప
రిపూర్ణమెజీవుడును । స్థిరతనుకారణ సూక్ష్మస్థూలమునొందీ ।
ఆశాపాశాంతర భ్రమలజెందీ । సారదిజలవకాధ్యదుష్పరవశకలక
చే । పరులుతానని జననపరిపాల విలయములస్థూలములొందీ ॥
ఆశాపాశాంతర భ్రమలజెందీ. 94

తా. అ విద్యయు, అ విద్యాప్రతిబింబంబును, దాని కాధారమగు శుద్ధచైతన్యమును గలసి జీవుడనే పేరుచే నొప్పియుండును. ఇతడు స్థూల సూక్ష్మకారణ శరీరములను పొంది ఆశాపాశముల భ్రమలలో జిక్కి మలినసత్వముచే తానని, ఇతరులని వ్యష్టిభావముచే జనన విలయాదులను జేయుచుండునని భావము.

కం. యితడు మహామహిముం । డితడునదానందమయుడు నితడేప్రా
జ్ఞుం । డితడే పరమార్థజ్ఞుం । డితడేవ్యష్ట్యంతరాత్ముడితడేశకుడు
డూ । త్రివిధావస్థలను జెందుపరుడూ । యితడేగుణవిహారుడిత
డేక్షేత్రజ్ఞుడు । డితడే దేహజీవుడితడే కార్యకోటికితడొక్కడునుడూ॥
త్రివిధావస్థలను జెందుపరుడూ. 95

తా. ఈ జీవుడు మహామహిమగలవాడు సదానందముతో గూడుకొన్నవాడు, ప్రజ్ఞానుడు, పరమార్థజ్ఞుడు, పిపీలికాది బ్రహ్మ పర్యంతరం సమస్తమునందు నుండునంతరాత్ముడు, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల జెందుచు రజస్సత్వతమోగుణములచే విహరించువాడు, క్షేత్రజ్ఞుడు, దేహి, జీవుడు, యితడే సర్వకార్యకోటులను జేయు ఘనుడని భావము.

కం. మాయావిద్యాదికదు । ర్వ్యాయామత్రిగుణకలితవననిధిలోము ।
నీయింద్రియదేహాదులు । నాయెడలంబుట్టిగిట్టెయద్భుతమంతా ।
దెలిపితి సాంఖ్యసారాంశమంత । నీయఖిలోపాధు లాత్మనంటవు
నిక । నాయాత్మగను సదుపాయమునికవినగ నద్భుతమంతా । దె
లిపితిసాంఖ్యసారాంశమంతా. 96

తా. దుర్వ్యాయామ త్రిగుణములతో గూడుకొనిన మాయా అవిద్యా యను సముద్రమునం దీయింద్రియదేహాదులెల్లను నాయెడల నే పుట్టి గిట్టినవి. సాంఖ్యముయొక్క సారాంశమును బోధించితిని. పైనిచెప్పిన వుపాధులేవియు పరమాత్మనంటవు ఆపరమాత్మ నెరుగు సదుపాయమును గ్రహింపుమని భావము.

కం.--సాంగముగను తారకసాం। ఖ్యాంగద్వయబోధజేసిఘనతరయమ
న । స్కాంగోపన్యాసమహా । శృంగారపుబోధజేయసిద్ధమైనేనూ
దలచితియంతరంగములోనూ । రంగులలరగ యోగిపుంగవ నీకా
త్మ । సంగతిబోధింపమంగళప్రదముగ శిద్ధమైనేనూ । దలచితి
యంతరంగములోనూ. 97

తా. యోగిపుంగవుడగు శిష్యా! తారక సాంఖ్య సాంగముల నుసాంగముగాబోధించితిని. ఇంకమీదటశృంగారమైన అమనస్కబోధను మంగళకరముగా నీకు దెల్పుటకు నామనమున నుత్సహించి సిద్ధపడియున్నవాడను. సాంగముగా దెలుసుకొనుమని భావము.

కం. ఈజీవబ్రహ్మైక్యము । రాజీవభవాచ్యు తేశ్వరాదులకున్ని ।
ర్వ్యాజముగనలవిగాదట । నీజగతులనెవరు తెలియనెట్లగుతండ్రీ ।
దెలిపిన తెలియగలరే మాతండ్రీ । యేజన్మసంథితో జెందనీయాత్మ।
తేజరిల్లగసాంఖ్యరాజయోగము వింటివనట్లగుతండ్రీ । దెలిపిన తెలి
యగలరేమాతండ్రీ. 98

తా. ప్రియశిష్యా! ఈ జీవేశ్వరైక్యానుసంధానము బ్రహ్మ,

విష్ణు, రుద్రాదులకైనను, నూరక నలవికాదట. యీ ప్రపంచములం దుండువారెల్లగ్రహింపగలరు. బోధించినను తెలియగలరా? తెలియలేరు. నీవు యేజన్మసంసిద్ధితోనో, నీయాత్మప్రకాశమువలన సాంఖ్యయోగమును వింటివనిభావము.

తత్వవాక్యశ్రవణానంతర తీవ్రమోక్షాసక్తలక్షణము.

కం. గురుతత్వశ్రణానం । తరమునశిష్యుండుగురుసుధాకరునెదుటం ।
గురిమీదనిలచిసన్నిధి । పరిచర్యలొనర్చి బోధపరవశమందు ।
తత్క్రమమెల్ల నెరిగింతుమందూ । నరుఁడుశీతబాధకోరకగ్నిదరి
విడువ । కరయనంటకకార్యసరణిజరిపినయట్లు పరవశమందూ।
తత్క్రమమెల్లనెరిగింతుమందూ. 99

తా. దాసవరా! నరుడు చలిబాధకోర కగ్నిసాన్నిధ్యమందు జేరి అంటకుండా తన శీతలబాధను నివర్తిజేసికొనువిధముగా, శిష్యుడు గురుసాన్నిధ్యమందు గురిచేనిలచి పరిచర్యలొనర్చి బోధయొక్క పరవశత్వాన్ని జెందును. దాని క్రమమును దెల్పెదనని భావము.

కం. ఆదృష్టాంతరమేమన । నాదరమునదేశికేంద్ర సాన్నిధ్యమునో ।
భేదవిహీనతమెలగుచు । మోదముగను కేవలాత్మమూలమునోడ
యూ । వినకనుతగుబోధతా బడయూ । వాదముచే మననాడు
గురుడనినమ్మ । రాదనేభీతితో రాజభృత్యునిపగిది మూలమునోడ
యూ । వినకనుతగుబోధతాబడయూ. 100

తా. ఆ దృష్టాంతర మేమనగా: గురుమూర్తి మనవాడని, నమ్మరాదనే భయముచే రాజభృత్యునివలె దేశికుని సన్నిధానమందు భేదరహితముగా మెలగుచు మహాసంతోషముచే పరిపూర్ణమూలమునుబొంది సుఖించునని భావము.

కం. ఏదడుగకదూరముగా । పేదరికముతోడ నిలచిబెదరుచుమదిలో।
తామర్త్యసనముఁలొందుచు । శ్రీదేశికునెదుట కెపుడుఁచేరని వా

డూ । యేదారి కెక్కుడు మూఢతముడూ । యేదో తనుకడ తేరు
నాత్రోవనడిగిడు । శ్వాదభేదములుడి గిబోధనొందక గురునిచేర
నివాడూ ॥ యేదారి కెక్కుడు మూఢతముడూ. 101

తా. శిష్యాగ్రణీ! గురుసన్నిధిలోజేరి భేదవాదములుమాని యే
దో తాను కడతేరునట్టి మార్గ మడుగకుండా భయపడుచు దేబెవలె
నూరకముగానుండి, మనస్సున దుర్వ్యసనము నొందుచుండు మూఢు
డెప్పటికిని యేదారికి నెక్కక చెడిపోవునని భావము.

కం. ధరణీశుగొలుచు భృత్యుని । కరణిన్వియమును పాము గన్నపు
డొదవే । వెరపును సుతవాత్సల్యత । స్థిరమగు విశ్వాసమెపుడీ
స్థితితోను గలిగీ । సద్గురుభక్తిగలిగి రతిజెలగీ । పరమవ్మోతుసం
పత్కరయోగసాధన । వరచతుష్టయసహితపరవశాత్మక బుద్ధిస్థితి
తోను గలిగి । సద్గురభక్తి గలిగి రతిజలగీ. 102

తా. రాజునుసేవించు భృత్యునివలె వినయమును, సర్పదర్శ
నమైనప్పుడు దోచు భయమును, సుతునియందలి వాత్సల్యతయు, ధీర
మైన విశ్వాసమును యీస్థితులతోటి సద్గురునియందు భక్తిగలిగి సా
ధనచతుష్టయ సంపత్తిసహితముగా దేశికునివలన బోధింపబడవలెనని
భావము.

పంచమలబంధ వివరణము.

కం. అణురూపుదాల్చి మనమున । క్షణమునకొకసారి బ్రహ్మజ్ఞానము
బొడమగ । గుణమయకల్పితమునత । క్షణమునసదిమరువజే
యుశక్త్యణవమలమూ । ఇది వసుధాంశ జనియించు నిజమూ ।
గణుతింపసంకల్ప గణజలధిలోజ్ఞాన । జనితవిస్మరణనిర్గుణ మందక
నుజేయుశక్త్యణవమలమూ।ఇదివసుధాంశజనియించూనిజము. 103

తా. శిష్యా! అణురూపుదాల్చి బ్రహ్మజ్ఞాన మప్పుడప్పుడు క
లుగగా, సంకల్పమను సముద్రమునందు దానిని మరుగుపరచునది,

అణవమలమనబడును. ఇది పృథివీ భూతమువలనబుట్టి జ్ఞానస్ఫురణను మరువజేయుచుండునని భావము.

కం. మును వేదాంతార్థములను। ఘనులుప్రబోధింప దాని గదియక వేరే। పనిపనిలోజొరబడుటకు। కనిపించెటిబుద్ధిజలము కార్మికమలమూ। యిదిసలిలాంశజలగు నిశ్చయమూ। తన చిత్తచలనము తనకు బాగైబుధ। జనులు దెలిపెటిబోధ వినసహ్యపడపట్టిదికార్మికమలమూ॥ యిది సలిలాంశజలగు నిశ్చయమూ. 104

తా. శిష్యా! వేదాంతశాస్త్రములను సద్గురువులు బోధింపుచుండగా వానియందు బుద్ధిని చొరనియ్యకుండ వేరేపనిలో ప్రవేసించే బుద్ధి కార్మికమలమనబడును. ఇది సలిలాంశవలన జనించి, తన చిత్తచలనమే తనకు బాగైతోచి పెద్దల మాటలు వినకుండా జేయుచుండునని భావము.

కం. వకకాలములోనైనను। సకలేంద్రియచలనమణగి సత్యజ్ఞానాత్మకవాసనలవగలుగక। యఖిలతమంబలరుబలము మాయాకమలమూ। ఇదిదహనాంశజలగు చంచలమూ। సుకృత కార్యమ్ములకుముఖమెత్తనియ్యక। వికట కర్మలకెపుడు ప్రకటాసక్తి గలుగు మాయాకమలమూ॥ యిదిదహనాంశజలగు చంచలమూ. 105

తా. శిష్యా! ఒకానొక కాలమందైనను నింద్రియచలనమణగి పరబ్రహ్మజ్ఞానవాసననుకలుగకుండా జేయునది మాయాకమలమనబడును. ఇది దహనాంశవలన గలిగె, సుకృత కార్యములకు మనస్సును పోనియ్యక వికటకార్యములయందాసక్తి గలుగజేయుచుండునని భావము.

కం. నోయడలజూడతరణో। పాయమువదిజిక్కనీక పాపమనస్సం। జాయతకృతదుస్సహజా। దాయములను మరిగి వ్యధల తగులు దుర్బలమూ। యిదిదుర్విషయ మాయెయాకమలమూ। వాయు

భూతాంశమై పాయకదుష్క్రియల । లోయుక్తి హెచ్చి మదిరో
యని పరబోధ తగులుదుర్బలమూ । ఇది దుర్విషయమూ యీ
కమలమూ. 106

తా. శిష్యా! యెటుల జూచినను కడతేరునట్టి మార్గము చిక్కనియ్యక పాపకృత్యములయందు మనస్సునుచొరబెట్టునదిమాయే యమలమనబడును. ఇది వాయుభూతాంత వలన జనియించి, దుష్క్రియలయందు యుక్తి హెచ్చింప జేయుచుండునని భావము.

కం. సత్యమగుబ్రహ్మమున పర । సత్యాత్మకబుద్ధివిడచి సత్యేతరదు ।
ర్వ్యాత్యంతర దైవమ్ముల । నత్యంతాసక్తిగొలుచు నదితిరోధా
నా । మలమనవెలుగూ గగనాంశవలన । ప్రత్యేకమగుజన్మ కృ
త్యాద్యవస్థలను । చిత్యతనొంది తన నిత్యమెరుగక గొలుచు నది।
తిరోధానా । మలమనవెలుగూ గగనాంశవలనా. 107

తా. నిత్యసత్య పరబ్రహ్మ పరిపూర్ణమునందు, అనిత్యబుద్ధి పుట్టించి, పరబ్రహ్మకంటె వేరగు నితరదేవతలును, మంత్రములును, క్రియలును, మతములును, కలవనియు, అవి నిత్యములనియు బుద్ధిని స్థిరపరచునది తిరోధానమలమనబడును. ఇది గగనాంశవలన గలిగి జననమరణాది, దుఃఖముల ననుభవింపజేయుచుండునని భావము.

కం. యీపంచమలములనిశము । ప్రాపంచక దృశ్యవిషయ ప్రతిబం
ధములై । రాపాడమోపగలవర । కేపగిదిన బ్రహ్మబోధ కెటు
పట్టుచిక్కూ । చిక్కనిటక్క రేటులకడ కెక్కూ । నీ పంచమల
బంధ వ్యాపక మొదలక । దీపింపమహావాక్య ప్రాపకార్థముకు
దురు కెటుపట్టుజిక్కూ । చిక్కనిటక్కరెటుల కడకెక్కూ. 108

తా. ఈ పంచమలము లెల్లపుడు ప్రపంచమునకు ప్రతిబంధములై రాపాడుచుండువరకును బ్రహ్మబోధకు బట్టు చిక్కదు. వీటి యొక్క వ్యాపకమొదలక మహావాక్యార్థము కుదుర నేరదు, మహావాక్యబోధ నొందక, కడ తేర లేరని భావము.

శుద్ధామనస్కరాజయోగ ప్రభావము.

కం. అలయక సప్తార్ణవములు । గలయఁగనీదంగవచ్చు కరకమలములన్ । కులగిరుల నెత్తవచ్చును । నిలనభములుపగలదీయ్య నేర్చగవచ్చూ । కాని కార్యములు జేయవచ్చూ । యలమినీయమనస్కఫలమంద నెవరికి । నలవిగాదుజ్ఞాన పరిపక్వమందక నేర్చగవచ్చూ ॥ కాని కార్యములు జేయవచ్చూ. 109

తా. శిష్యతిలకా ! కొంచెమైనను నాయాసము నొందకుండా సప్తసముద్రముల, నీవలిదరినుండి, నావలి దరివరకు, నీదిన నీదవచ్చును, కులపర్వతముల నెత్తిన నెత్తనచ్చును, భూమ్యాకాశములను పగలదీసినను తియ్యవచ్చును, నెరవేరని కార్యములనైనను జేయవచ్చునుగాని ఆత్మానాత్మవిచారణజేయని వారి కీయమనస్కయోగమును గ్రహించుట కలవిగాదని భావము.

కం. జ్ఞానపరిపక్వమొందిన । మానవుడమనస్కయోగమహిమానమున । న్మానముగ నెరిగిబ్రహ్మ । జ్ఞానము సమకూడియాత్మ గనివిలసిల్లూ । వానికిశుభముసులభమైచెల్లూ । సన్నిహితకుసుమాళిపూనిగోయుటకంటె । తానుకన్నవమూసి కను తెరుచునంతలోగని విలసిల్లూ ॥ వానికిసుఖము సులభమైజెల్లూ. 110

తా. శిష్యరత్నమా ! ఆత్మానాత్మల, విభాగింపగల మహాత్ముడు చెంతనున్న కుసుమముల గోయునంతలోను కనులుమూసి తెరచునంత కాలములోను నమనస్కభావమును సులభముగా గ్రహించి బ్రహ్మానందసుఖము నొందునని భావము.

కం. జ్ఞానము నొకపరికశినము । జ్ఞానమునొక వేళ సులభగతమహా నాయా , మానవుల పూర్వగత ప్రార । బ్ధానుభవాధికవిముక్త ప్రాప్తముకొలదీ । సంభవమగుజ్ఞానమీకొలదీ । గాన నేజన్మజన్మానికైన వి । జ్ఞానామనస్కముపూనితామందుట ప్రాప్తముకొలదీ । సంభవమగుజ్ఞానమీకొలదీ. 111

తా. కుమారా ! అమనస్కజ్ఞాన మొకసమయమందు కఠినముగాను మరియొకసమయమందు సులభముగా నుండును. మానవులు వారివారి పూర్వజన్మ ప్రారబ్ధనాశముకొలది జ్ఞానామనస్కభావమును జెందెదరు. యేజన్మానికైనను ప్రాప్తముకొద్ది నమనస్కభావము లభ్యమగునని భావము.

కం. పనిలేదుపూర్వతారక । ఘనసాంఖ్యక్రమము దేహకష్టముమరి నే ।
పనిలేదు మనోజయమును । పనిలేదమనస్కయోగ భావ మందుటకూ । పనులికగలవని భ్రమపడకూ । కనుగొనుమిదుగో చక్కనిఫలముమనకు । గనుపించుగతిదోచే కనుగదలకచూడు భావమందుటకూ । పనులికగలవని భ్రమపడకూ. 112

తా. మానసపుత్రా ! అమనస్కభావము జెందుటకు దేహకష్టమును కలుగజేయునట్టి తారక సాంఖ్యయోగములవలన ప్రయోజనములేదు. నీనివలన ప్రయోజన మున్నదని భ్రమపడకుము చక్కని ఫలముకనుపడేమార్గ మిపుడు దోచినది గను కదలకుండా జూడుమని భావము.

## గురుశిష్యసంవాదపద్యము.

కం. అని యిటులజ్ఞాన సాంఖ్యము । వినుపించెటిగురునితోటి వినిశిష్యా ।
గ్రణి మనమునననానందా । బ్ధినిమునుగుచు ననియెబ్రహ్మ మునికులవర్యా । శరణుఘనయోగ ధుర్యా । అనఘమహా వాక్య జనితాఖండబోధ । వినమోక్షపదమందు ననువొందునది తెలుపుముసికులవర్యా । శరణుశరణుఘన యోగధుర్యా. 113

తా. ఈ ప్రకారము గురుస్వామి జ్ఞానసాంఖ్యము నుపదేసింపగా శిష్యుడు మహదానందాబ్ధిని మునిగి మునికులసార్వభౌమా ! మహావాక్యాఖండబోధ నాకనుగ్రహింపుడు నేను మోక్షమును జెందెదను శరణుజేయుచున్నాడనని భావము.

కం. నామానినికులసుదీపక । నామరుభూరుహపుప్రమొలక నామరుచిలు
కా । నాముద్దువరకుమారక । నామానసకమలమిత్ర సనుగన్న
పుత్రా । నీమదిశంక లేలశుభగాత్రా । ఆమహావాక్య శ్రవణామో
దాసక్తిని । కె మహాదేశికస్వామి కృపనుగలిగె సనుగన్నాపుత్రా।
నీమదిశంక లేలశుభగాత్రా. 114

తా. నాముద్దుల వరమానసపుత్రా ! నీకు మనోసందేహము
వలదు. నీకా మహావాక్య శ్రవణమునందాసక్తి యేమహాదేశికస్వామి
కృపాకటాక్షమువలన గలిగెను. నీకట్టి యఖండబోధనిచ్చి రక్షించెద
నని భావము.

కం. స్వామీయీమహావాక్యము । కేమంత్రము యేమిజపము యే
నియమములకు । నేమహిమలతో వెలుగుని । రామయ సహజా
మనస్క రాజయోగముగా । శాశ్వితభోగ సమరసమనగా ।
యీమంత్రమాశ్రయించే మహాత్ముల కాత్మ । నీమక్రమాదు
లింకేమున్నావో దెలుపు రాజయోగముగా । శాశ్వితభోగసమర
సమనగా. 115

తా. గురుచంద్రా ! ఈమహా వాక్యమున కేమి మంత్రము జప
మెట్టిది. దానికేమి నియమములు శాశ్వితాఖండ భోగమునిచ్చు నిరా
మయ సహజామనస్క రాజయోగముగా నెట్టిమహత్తులతో ప్రకా
సింపుచున్నది. ఈమంత్రము నాశ్రయించునట్టి మహాత్ముల కింకా
నేమేమినీమక్రమధర్మములున్నవి, వీనినెల్ల సమగ్రముగా నానతియ్య
వలయునని భావము.



గురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్య సంవాదము.

## పూర్వభాగము, మహావాక్య ప్రకరణము:

### పంచమ ప్రకరణము.

కం. నానంశయముల నెల్లను । మానసముఖములోనె తీర్చి మాకృపనా
త్మో । ల్లాససుఖ మొందజేయుచు । దేశికగురు సుప్రతిష్ఠి జెందు
ముతంబ్రీ । శరణాగత బిరుదునిల్పండీ । భాసురతరచిద్విలాసవే
దాంతార్థ । మానదీరగ దెలుపు ద్రోసిలొగ్గితికీర్తి జెందుముతం
డ్రీ । శరణాగత బిరుదునిల్పండీ. 1

తా. గురురాయా! నా సంశయము లెల్లను తమరు తీర్చి చిద్విలాసమైన వేదాంతార్థ బోధను నాకు ఆశతీరునటుల బోధించి నాయాత్మకు నుల్లాసము కలిగించి గురుప్రతిష్టను బొందుము. తండ్రీ దోసిలొగ్గినాను శరణాగత బిరుదు నిలుపుడు.

కం. వేదాధ్యయనము సేయక । వేదమహాయోగభాష్య వివిధోపనిష ।
ద్భేదక శాస్త్రము లెరుగక । వేదాంతార్థప్రబోధవిధు లెటులం
దూ । దుర్వాద దుర్భేదమనమందూ । సాధనచతుష్టయాది సం
పత్తిలో । మేధకుడే బ్రహ్మబోధాధికారియగు విధు లెటులందూ ।
దుర్వాద దుర్భేద మనమందూ. 2

తా. వేదాధ్యయనము సేయక, వేదయోగభాష్యోపనిష ద్బోధకములైన శాస్త్రములు తెలియక వాదభేదములతో గూడు కున్న నీకు వేదాంతార్థబోధ నెటులజేయుదును. సాధన చతుష్టయ సంపత్తిలో మేధగలవాడే బ్రహ్మబోధకు అర్హుడగును.

కం. వేదచతుష్టయమెల్లను । నాదిమునీంద్రాదులైన నాద్యంతముగా!
సాధించజాలరట త । త్పాదసహస్రాంశమైన పాఠకమగునా । త
ద్వాక్యశ్రవణముసేయగలనా। యేదోనాలుగుమంచి సాధకవాక్య
ముల్ బోధజేసినన్ను నీదరిజేర్పవే పాఠకమగునా । తద్వాక్యశ్రవ
ణముసేయగలనా. 3

తా. ఆదిమునులైనను నాలుగు వేదములు మొదటినుండి కడవరకు సాధింపలేరట. అందులో వెయ్యోభాగమైనను నేను పఠించగలనా. వినగలనా నావలనగాదు. యేదో సాధకములైన మంచి వాక్యములునాలుగుబోధించి నన్ను తమపాదసన్నిధిజేర్చవలయును.

కం. ఐతేనికనూరికెవిను । మైతేమద్బోధ సత్యమైనీలో బై । లైతే
బ్రహ్మమునీవగు । దైతే నయ వినయ సాంప్రదాయకబుద్ధీ । వి
నుభయభక్తిగలిగిప్రసిద్ధీ । నయశాలి శ్రవణాశ్రయములోనే నిజ
గురు । దయనొందునపుడే జయమగు పరసాంప్రదాయకబుద్ధీ ।
వినుభయభక్తిగలిగిప్రసిద్ధీ. 4

తా. నాయొక్కబోధసత్యమై నీలోచొచ్చితే బ్రహ్మస్వరూపమే నీవైతే నయవినయబుద్ధితోటి భయభక్తులు గలిగి యూరకవినుము. సూక్ష్మబుద్ధిగలవాఁడు శ్రవణకాలములోనే దేశికుని దయకు పాత్రుడగునపుడే జయము కలుగును.

కం. చిత్తముగురుపరమేశ్వర । చిత్తముబ్రహ్మోపదేశసిద్ధాంతములో!
కోత్తరముగదెలుపు కృపా । యత్తము భవదీయ్య సత్ప్రియత్న
మేగాకా । మా స్వప్రయత్నము లేదుగనుకా । చిత్తముమామక
చిత్తభ్రమలనణచి । సత్తాదెల్పి బ్రహ్మవేత్తనుజాయ మీయత్న
మేగాకా । మాస్వప్రయత్నములేదుగనుకా. 5

తా. గురుపరమేశ్వరా ! చిత్తము. బ్రహ్మోపదేశ సిద్ధాంతము నాకు చక్కగా బోధింపుడు తమయొక్క దయకు పాత్రుడను. నా

యొక్క యత్నమేదియునులేదు. నాకుండిన చిత్తభ్రమల నణచి సత్తా తెల్పి బ్రహ్మవేత్తను జేయుడు.

శ్రీ మ హా వా క్య గు రు బో ధ .

కం. నాలుగు వేదమ్ములలో పరి । శీలించగనచటనచట శివజీవాంత । ర్మాలములై పరమార్థ వి । శాలములై జలగు వేద శాస్త్రర త్నములూ । సాధకబోధ సత్ప్రియత్నములూ । నాలుగువాక్యము లాలోకింపుము సర్వ । మూలము దెలుసు భ్రమజాలమునిలుచు ను శాస్త్రరత్నములూ । సాధకబోధసత్ప్రయత్నములూ. 6

తా. రుగ్వేదము. యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేధములనునాలుగు వేదములలో వెతకగా నచ్చట నచ్చటశివజీవుల కంతర్మాలములై పరమార్థము తేటగా తెలుపునవిమై బోధవలన సాధింపతగిన ప్రయత్నములై యుండు వేదశాస్త్రరత్నములు నాలుగు దొరికినవి. ఆ నాలుగువాక్యములు విచారణజేయుము. శివజీవుల భేద కారణము తెలియును. భ్రమవీడును.

కం. ప్రజ్ఞానంబ్రహ్మమనే । సంజ్ఞచెవెల్గొకటిదాని సాధించిన సర్వజ్ఞ తహంబ్రహ్మను । నాజ్ఞేరెండవదిగా నీకానతిచ్చితిరా । సర్వంకష ప్రజ్ఞచేగనరా । విజ్ఞతత్వమసి సంజ్ఞచేమూడోది । ప్రాజ్ఞతఅయ మాత్మా బ్రహ్మనాల్గవదిగా నానతిచ్చితిరా । సర్వంకష ప్రజ్ఞచే గనరా. 7

తా. ప్రజ్ఞానం బ్రహ్మమను పేరుచే నుండువెలుగు మొదటిది. దానిని సాధించిన అహంబ్రహ్మాస్మియనునది రెండవది. తత్వమసియను సంజ్ఞ మూడవది. అయమాత్మాబ్రహ్మయనునది నాల్గవదిగా నీకుప దేశ మిచ్చినాను. వీనిని నీ ప్రజ్ఞచేత తెలిసికొనుము.

కం. ఈనలువాక్యమ్ములకును । స్వానుభవార్థములునాత్మసద్గురుకృప చే । తానెరుగ బ్రహ్మబోధర । సానందమహాబ్ధిజెందు చాలుచా

లునురా । సమరసయోగభోగమూలమురా । లీలలక్ష్యక్రమ జాల
లక్షణసర్వ । మాలోకింపగశ్రుతి మూలములైయుండు చాలుచా
లునురా । సమరసయోగభోగమూలమురా. 8

తా. జీవేశ్వరైక్యమునకు కారణమే శాస్త్రమూలములైన నీనాలుగు వాక్యములకు సద్గురుమూర్తి కృపవలన, స్వానుభవార్థములు తాను తెలిసికొనిన బ్రహ్మబోధ రసానందసాగరమందు నోలలాడును. వీనికి లక్ష్యలక్షణము లాలోచించిన చాలు చాలును.

కం. ఏపరమజ్ఞప్తి వెలుపల । లోపల కనువినుచుతినుచు లోమూర్కొ
నుచుఁ । యోపిక స్పర్శనెరుంగుచు । జూపట్టునఖండప్రజ్ఞ సూ
క్ష్మధర్మమురా । ప్రజ్ఞానచైతన్యమర్మమురా । ఆపరవస్తు వేప్రాప
కదీపక । వ్యాపకబ్రహ్మస్వరూపమిదియె మొదటి సూక్ష్మధర్మము
రా । ప్రజ్ఞానచైతన్యమర్మమురా. 9

తా. ఏయొక్క పరమ తెలివి వెలుపల, లోపల చూచుచున్నదో, వినుచున్నదో, తినుచున్నదో, వాసనచూచుచున్నదో, స్పర్శను నెరుగుచున్నదో ఆజ్ఞప్తియే ప్రాపై ప్రకాశించునదియై, అంతటా వ్యాపించినదైయున్న బ్రహ్మస్వరూప మిదియే ప్రజ్ఞానం యొక్క మొదటి సూక్ష్మధర్మము.

కం. అట్టిపరబ్రహ్మమునిక । ఘట్టిగ నేననేటిస్ఫురణ గాఢసమాధిఁ ది
ట్టముగనిల్పుయలకడ । గట్టునపరిపూర్ణ స్వప్రకాశమయమందూ ।
తనువెరుక పుట్టనిదేశమందూ । గట్టిగనచలమైనట్టిట్టు తిరుగని । ప
ట్టురెండవదాని గుట్టునర్థము స్వప్రకాశమయమందూ । తనువెరు
కపుట్టనిదేశమందూ. 10

తా. అట్టిపరబ్రహ్మము ఘట్టిగా నేననెటి స్ఫురణనుతను వెరుకలులేని, అటుయిటు మెసగని అచలమై ప్రకాశమందు నిలుపుటే రెండవవాక్యము యొక్క గుట్టర్థము.

కం. జీవేశ్వరప్రతిబింబిత । భావవికారాత్మదృశ్య భ్రమనిస్సందే। హా
విర్భవతత్వాంత। ర్భావితసద్వాచ్యలక్ష పరిశీలత్వమునా। త్రివిధో
పదేశి కత్వమునా । నీయుభయవాచ్యార్థమ్రోవ విడిచిలక్ష్య ।
భావద్వివిధమైక్య భావమేమూడోది పరిశీలత్వమునా । త్రివిధోప
దేశికత్వమునా. 11

తా. కనుపడెటి జీవేశ్వర ప్రతిబింబభ్రమసందేహ నివారణ కొరకు, వాక్యములయొక్క మూడు బోధలచేత, వాచ్యార్థలక్ష్యార్థములు పరిశీలించి జీవేశ్వరభ్రమ గలిగించు వాచ్యార్థము యొక్క మార్గము విడచి లక్ష్యార్థ మంగీకరింపగా జీవేశ్వరైక్య భావమే మూడవదాని ముఖ్యార్థము.

క.. ఈయఖిలస్వప్రకాశక । మీయపరోక్షానుభూతమీ పరమాత్మే ।
యేయెడలజూడతన్నెడ । బాయక బ్రహ్మంబుపట్టబయలాయనను
చూ । సర్వముఖల్విదంబ్రహ్మమనుచూ । స్వయత్నపరయత్నమే
యత్నమనకన ।ర్వాయత్తమెయందు బాయదునాల్గవది బయ లా
యననుచూ । స్వర్వముఖల్విధం బ్రహ్మమనుచూ. 12

తా. తనకు వేరులేక అఖిలములందు వెలిగే పరమాత్మే అంతటా నిండి సర్వంఖల్విదం బ్రహ్మమనుచు, స్వతసిద్ధమై యుండుటే నాల్గవదాని భావము.

కం. నేటగునీవాక్కులకుఁ। ధాటిగనర్థములుసేయదగు వేదములుఁ।
కోటానకోటిసంఖ్యలు । పాటింపుగ లేవుబ్రహ్మ భావమునందూ॥
బోధాఖండపాటవమునందూ । మేటిగానినునీవే నూటిగాగనుమ
న్న । మాటాకే కోటానకోటిశృతులుదెల్పు భావమునందూ । బో
ధాఖండపాటవమునందూ. 13

తా. బ్రహ్మబోధయందు తమరు చెప్పు గూఢ వాక్కులకు అనేక వేల వేదములు తెలియజాలవు. నిన్ను నీవు కనుక్కొను మను మాటకే కోటానకోటి శృతులు తెలుపుచున్నవి. నావల్ల నేమవును.

కం. తెలిసితె నిదిచాల్చాలును । తెలియకపోయిననునాత్మ దేశికునె దుటన్ । నిలచియరవిడిచిఘట్టిగ తెలియనిపరమార్ధమెల్ల తెలుసుకోచాలా । దెల్పెద వేయి వేల వేదములా । తెలిసి తెలియక నవల తెలివిమాలి తెగుదు । తెలిపెనేమోవొకటి తెలియధనకుముందు తెలుసుకోచాలా । దెల్పెద వేయి వేల వేదములా. 14

తా. తెలుసుకుంటే యిదే జాలును. తెలియకపోతే సద్గురు సముఖములో అరవిడచి తెలియని పరమార్ధము చక్కగా తెలిసికొనుము. అనేక విధములుగా బోధించెదను, యిప్పుడు తెలిసి, తెలియక తరువాత గురుదేవో, ఒకమాట చెప్పెను. అదినాకు తెలియక పోయెనని అనుకోవద్దు.

కం. సలలితనిజదేశికముఖ ! విలసితవేదార్ధబోధ విని శిష్యుడనెన్ తెలియదునీవేదార్ధము । తెలియకముందెట్లునేను తెలుసుననేదీ । వ్యర్ధమెగాదా తెలివిగలగనిదీ । తెలివిమాలిన నాడు తెలివికి వేదార్ధ । ములలోమహావాక్యమూలమెట్లుదెలును తెలుసుననేదీ । వ్యర్ధమెగాదా తెలివిగలగనిదీ. 15

తా. దేశికులవలన వేదార్ధబోధను విని స్వామీ వేదార్ధము నాకు తెలియదు. తెలియనిసంగతి తెలుసునంటె వ్యర్ధమేకాదా ! తెలివిమాలిన నాకు వేదార్ధములలో మహావాక్యమూలము నాకెట్లు తెలియునని శిష్యుడనెను.

కం. వేదమహాభాష్యాదులు । వేదాంతార్ధములుచాల వెదకివెదకినే । వేదచతుష్టయ శిఖలచే . మోదముతో బ్రహ్మతత్వ మూలమెరుగింపా । తెలియదంటె లేదుతరింపా । ఆదిలో బ్రహ్మరుద్రాదులీ బోధచే । గాదె జీవన్ముక్తి సాధకులైరిక మూలమెరుగింపా॥ తెలియదంటె లేదుతరింపా. 16

తా. శిష్యా ! వేదములు, భాష్యములు, వేదాంతార్ధములు

నీకొరకు వెదకి వెదకి నాలుగు వేదములలో నాలుగు వాక్యములేరి బ్రహ్మ తత్వమూలము బోధించితిని. తెలియదంటే నీవు కడతేరు నుపాయములేదు. ఆదిలో బ్రహ్మాదులీబోధచేత నేకదా జీవన్ముక్తులైరి.

కం. ఉపదేశకాలమున మ। ద్విపరీతపు చిత్త చపలవిభ్రమలేమో।
యుపరమతజెందిబోధచే। విపులత తక్షణమె బ్రహ్మవేత్తనైన
టులా। దోచెనుగాని ఇపుడుండదటులా। అపుడారీతేమోమన। సి
పుడీరీతేమొ మీా। కృపఖేత పరతత్వసఫలుని జేయవే వేత్తనైనటు
లా। దోచెనుగానియిపుడుండదటులా. 17

తా. గురువరా! తాము బోధించు సమయమందు నా చిత్త చలనమువలన గలిగిన భ్రమలణగి అప్పుడే బ్రహ్మవేత్తనై నటుల దోచెనుగాని తదనంతర మిపు డటులుండలేదు. అప్పుడారీతేమో యిప్పుడీరీతేమో తెలిపి పరతత్వమును నా కొసగుడని భావము.

కం. మును శ్రవణకాలముననే। గనుగొంటినినీదుచిత్త కలకలమెల్లన్।
వినుచోటమనసులేకను। మనసందినచోటవాక్య మహిమగనుపడ
కా। కనికానక తనువుమరుచుటెకా। ఘనతరమహావాక్యప్రణవ
ధ్వనులకుమనసు। కనుమూసెనేమోనది కలకాలముందునే మహి
మగనుపడకా॥ కనికానక తనువుమరుచుటెకా. 18

తా. ఇదివరకు నీవు నాబోధను విను కాలములోనే నీయొక్క చిత్తచలనము నేను తెలిసికొంటిని వినుచోట మనసులేకను మనసున్న చోట వాక్యముయొక్క భావము తెలియకను మహావాక్యప్రణవధ్వను లను కని కానక శరీరము మరచుటేగాని యది యెల్లపుడుండునా? యుండదని భావము.

## సమాధిత్రయబోధశ్రవణవిధి.

కం. శ్రవణంబనగా నెయ్యది। శ్రవణేంద్రియములకు సర్వశబ్దగ్రా
హ్యం। బవిసద్ధమగుచునుండగ। ప్రవిమలగురుబోధ జొరని

ప్రారబ్ధమేమీ। తత్ప్రతిబంధ మేది గురుస్వామీ। శ్రవణకాల మున నాయవివేకమున కెదుట।వివిధదుష్కృతము లవశిష్టములై జేలగు ప్రారబ్ధమేమీ। తత్ప్రతిబంధ మేది గురుస్వామీ. 19

తా. శ్రవణమనగానేది. గురుస్వామీ చెవులకు సర్వశబ్దములు వినుట సహజమై యుండగా గురుబోధ చెవులలో జొరనినాప్రారబ్ధమేమి? శ్రవణకాలములో నా యవివేకము కెదురుగా అనేకదుష్కార్యములుతోచే ప్రతిబంధమేది! నాకు తెల్పుడనిభావము.

కం. అవివేకవాసనత్రియ। వివిధేంద్రియదృశ్యసర్వ విషయమనః ప్రా। భవకలుషదుర్గుణాదులు। సవిశేషముగాను విడిచే సర్వ సాధనకూ। గావలయునీ శ్రవణమందరకూ। భువిలో మహావాక్య శ్రవణముచేబ్రహ్మను। భవమందుటకు నిదియె ప్రధమ సమాధగు సర్వసాధనకూ। గావలయునీ శ్రవణమందరకూ. 20

తా. అవివేకసంబంధమైన లోకవాసన శాస్త్రవాసలును సర్వేంద్రియములకు దోచు విషయములు మనోజన్యమైన పాపములు దుర్గుణాదులు శేషములేకుండా విడచిపోవుటకెల్ల వారికి నీశ్రవణము కావలయును. మహావాక్యశ్రవణము చేత బ్రహ్మనుభవము జెందుటకీశ్రవణమే. మొదటి సమాధియని భావము.

కం. ఆవేదాంతశ్రవణము। లోవెలశిన యర్థమాత్ర లోమగ్నతన। ర్వావస్థల నిజనిష్ఠగ। బావించుటకేదిపట్టు బయలు గన్పట్టూ। మత్ప్రారబ్ధ మెట్లుతుదముట్టూ। కేవలాద్వైత ప్రభావమునకు దుర్వి। భావదుశ్చింతన లేవడ్డగించక బయలు గన్పట్టూ। మ త్ప్రారబ్ధ మెట్లు తుదముట్టూ. 21

తా. గురుసార్వభౌమ తాము జేయుబోధలోని భావమునుయెల్లపుడు నిజనిష్ఠగా బావించుట కేదిపట్టు. కేవలాద్వైత ప్రభావమునకు

దుష్టభావము దురుచింత మొదలగునవేవియు నడ్డగించకుండా నెట్లుపరి పూర్ణము తెలియును. నాప్రారబ్ధము తుదముట్టెదెట్లు అని భావము.

కం. గురువాక్యశ్రవణానం । తరమున తద్వాక్యముఖ్య తాత్పర్యము
న । త్వరమోపరతిని యంతః । కరణములో బయలునిండి గను
పించుకొరకూ । మననముసేయ వలయునందరకూ । పరి పరివి
ధముల పరిగెత్తు పూర్వ సం । స్ఫురణలన్నియుమాని నిరతముసు
ఖమాత్మగనుపించుకొరకూ। మననముసేయ వలయునందరకూ. 22

తా. ఎల్లరకు గురువాక్యమును వినినతరువాత నావాక్యతాత్పర్యము నంతఃకరణలో పరిపూర్ణగా నిండి కనిపించుకొరకు మననము చేయువలయును. అనేక విధములుగా పరుగెత్తు పూర్వపు సంకల్పములుమాని యెల్లప్పుడు ఆత్మసుఖము గలుగుటకీ మననము రెండవ సమాధి యని భావము.

నిదిధ్యానము.

కం. దినదినమును నామానన । వనజములోపలతదీయ వాక్యార్థఘ
ముచిం । తనశాయగానె కేవల । ఘనతర చిత్సుఖ సమాధి క
ల్పితమగునా । నీమననము న్మనిజెందనగునా । పనిలేని పనిగ వా
జ్మనములచే ధ్యాన । మొనరజేసిన సర్వమును నమసి నిర్విష
య కల్పితమగునా । నీమననమున్మనిజెందనగునా. 23

తా. ప్రతిదినమును నామనస్సునందు వాక్యముయొక్క బావమును చింతనచేసిన నిర్వికల్ప సమాధి నాకు గలుగునా ? లేనిపోని పనిగా వాక్కుచేతను, మనస్సుచేతను ధ్యానముచేసిన విషయభ్రాంతులెల్లను నమసిపోవునా యని భావము.

కం. మననసమాధిలో జెనగొట్టి । ఘనబ్రహ్మవిచారమాత్మ గనిసించె
టిపా । ధనగాగనిదిధ్యాసకు । ననుకూలంబగుచు కలయునచల

మునందూ । మూడవసమాధి దెజగము సందూ। తనివి దీరక నా
త్మకనకాచలంబెక్కి । జననమరణ సంజ్ఞతను వెరుక లెరుగనిసచ
లమునందూ । మూడవసమాధి దెజగమునందూ. 24

తా. మననసమాధి యందుండు బ్రహ్మవిచారణము, ఆత్మను తెలియుసాధనగా నిధిధ్యాసయందు కలసిఅచలమును పొందుచున్నది. తనివితీరేటట్టు ఆత్మయను బంగారు కొండనెక్కి చావుపుట్టుకలు, దేహి, దేహములను నెరుగని పరిపూర్ణమునందు జేరుటకే నిధిధ్యాస, మూడవసమాధియగునని భావము.

త్రి వి ధ స మా ధి సా ధ కు ల తా ర త మ్య ము.

కం. తనమానచర్యలుయు । న్మనిలో నిలుపుటకు శ్రవణ మనననిది
ధ్యా । సనలగునీత్రిసమాధుల । కును సాధనకృత్యమొకటి కొక
టెక్కువౌనా । యెక్కువ తక్కువలు లేకపోనా । వినుపింపుము
ధ్యానవిధిలోన మునుయోగి । జనవాడికెమోనంతన లేమో వొక
టికొకటెక్కువౌనా ॥ యెక్కువతక్కువలు లేకపోనా. 25

తా. స్వామీ! తన మనస్సుయొక్క వృత్తులను నిర్వికల్ప సమాధియందు నిల్పుటకు శ్రవణ, మనన, నిధిధ్యాసలను నీ మూడు సమాధులను సాధించుపని ఒకదానికంటె యొకటి ఎక్కువ తక్కువ యుండునా ? లేక ఎక్కువ తక్కువలులేక సమానముగానుండునా? పూర్వపుయోగుల అభ్యాసములేమో జనులవాడుకేమో దానిసంత నయేమో నాకు వినుపింపుడని భావము.

కం. అనిశమునీత్రిసమాధుల । మునుకొని సాధించునట్టి మోతెర్ధి
యుసా । ధనచాతనొకటొకటెహె । చ్చని శ్రీగురుకరుణవలన సా
ధించిమించూ । సర్వోపాధులెల్ల నిరసించూ । వినుశ్రవణముకు
హెచ్చుమననమిబ్బడి యౌను । మననమునకు ద్వివిధమునవౌను
నిదిధ్యాససాధించిమించూ ॥ సర్వోపాధులెల్ల నిరసించూ. 26

తా. శిష్యతిలకా! మోక్షేచ్ఛగలవాడు యీమూడు సమాధులను సాధించుటలో ఒక దానికంటె నొకటి హెచ్చని తన గురుకరుణచేత తెలిసికొని సాధించి సర్వవృత్తులను నిరసించి కృతార్థుడగును. శ్రవణమునకంటె మననము యిబ్బడిహెచ్చు, మననమునకంటె నిధిధ్యాస రెండంత లెక్కువగునని భావము.

మోక్షార్థికిసాధనత్రయసిద్ధి లేక జ్ఞానసిద్ధి గలుగదనేవిషయము.

కం. మునుత్రివిధసమాధివి । ధానములభ్యాసపడకతత్త్వము మిథ్యా । జ్ఞానజడబుద్ధిచేయను । మానించుచువిన్న యోగమహిమ లగుపడునా ॥ నిష్ఫలమానుగాని స్థిరపడునా । మానాభిమానము మాననిమదికింక । లేనిసంశయములు పూనుగానియోగమహిమలగుపడునా । నిష్ఫలమానుగానిస్థిరపడునా. 27

తా. మొదట నీమూడు సమాధులభ్యాసముచేయక జ్ఞానములేని మందబుద్ధిచేత, అనుమానించుచు బోధవిన్నట్టయిన నిష్ఫలమగునుగాని, స్థిరపడదు. మానాభిమానములువదలని మనస్సునకు లేని సంశయములు తోచునుగాని యోగమహిమ కనుపడదని భావము.

కం. అందముగనుమద్బోధయు । పొందుగశ్రవణంబొనర్చి బుద్ధ్యావరణం । బిందుతదర్థమునిడిని । స్సందేహముగానుమననసౌఖ్యతనొందూ । తన్మనమాత్మను నిలుపుమెందూ । ముందు నీమహావాక్య సందర్భములోనేమి । సందేహమున్న నాముందుదీర్చుకొనుచు సౌఖ్యతనొందూ । తన్మనమాత్మను నిలుపుమెందూ. 28

తా. కుమారా! నేను చేయుబోధను శ్రద్ధతో విని, దాని భావమును నీ బుద్ధియందుంచుకొని సందేహము లేకుండా మనస్సును ఆత్మయందు కలిపి మననసుఖమును బొందుము. నేను జేయు మహావాక్యబోధయందు నీకు యేమి సందియములున్నను నావలన తెలిసికొని సవరణ చేసుకొని సౌఖ్యమును బొందుమని భావము.

కం. ఇకనీపరమార్థములో । నొకలేశాంశార్థమైన నూహింపగనిం ।
దొకటొకటికి మిక్కుటముగ । తికమకమై మనసుకేదీ తెలియదు
స్వామీ । నీమహావాక్యములమర్మమేమీ । వొకటి రెండు నాల్గు
సుకృతబోధలకెల్ల । సకలాధారముమూడో దొకటున్నాదట నేదో
తెలియదుస్వామీ । నీమహావాక్యముల మర్మమేమీ. 29

తా. గురుచంద్రా ! మీరు చేయుపరమార్థబోధ ఆలోచింపగా ఒకదాని కొకటి మిక్కుటమై నామనసు కలకజెంది యేమి తెలియకున్నది. యీమహావాక్యములలో ఒకటి రెండు నాలుగు వాక్యముల బోధలకు సర్వాధారమైనది. మూడోవాక్య మొకటి యున్నదట. దాని భావము నాకు తెలియదు. యీమహావాక్యముల మర్మమేమో నాకు తెల్పుడని భావము.

కం. మనకామహావాక్యార్థము । మనపాలిటిగురు డఖండ మహిమోజ్వలుడై । మనవెనక మనకుముందర । మనకిరుపార్శ్వములనిలచి
మహిమదెల్పగనూ । తెలుసునె కాని తేటపడదికనూ । వినుమా
మూడోవాక్యమున జీవబ్రహ్మైక్య । ఘనతత్వసంసిద్ధికలుగు । జీవన్ముక్తిమహిమనుదెలపగనూ । తెలుసునెగాని తేటపడదికనూ. 30

తా. శిష్యరత్నమా ! మనకామూడోమహావాక్యార్థము మనపాలిటి సద్గురుమూర్తి మనకు వెనుక ముందు రెండు పార్శ్వములను నిలచి మహిమ తెలిపితే తెలుసును, కాని లేనియెడల తేటపడదు. ఆమూడో వాక్యమువలన జీవబ్రహ్మైక్యసిద్ధిగలిగి జీవన్ముక్తుడగు నని భావము.

పంచమ ప్రకరణము సంపూర్ణము.



శ్రీగురుభ్యోనమః.

# శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్యసంవాదము.

# పూర్వభాగము జీవబ్రహ్మైక్య విచారప్రకరణము.

కం. నాలుగు వాక్యార్థముల । న్నేలీలం దోచుబోధ లెరుగుటకొరకై ।
మూలమునే వాక్యార్థము । నాలోచనసేయ తెలుసునయ్యాగు
రునాధా । దీనికి మొదటకీద్దెల్పు మేధా । చాలదుర్విషయ దుశ్చల
మాయామోహాది । జాలము విడచియవలీల బ్రహ్మము నగుదున
య్యాగురునాధా । దీనికి మొదటికీద్దెలుపు మేధా. 1

తా. నాలుగు వాక్యార్థముల బోధలు తెలిసికొనుటకే వాక్యార్థము విచారణ చేయవలయును. దీనికి మొదటకీలు దెల్పుము. దుర్విషయములు మోహము మొదలగు మాయసంబంధ దుర్గుణములు విడచి నేవిధమున సులభముగా బ్రహ్మమగుదునని భావము.

కం. తెలిపినవాక్యమ్ములలో । తెలిపితినన తెలుసునన్న తెలియదుమూ
ఢా । దలతత్వమసీత్యర్థము । పలికెద నేమరలశుకుడు పరశివునివ
లనా । తొమ్మిది మార్గ్లు తెలుసుకొనెగానా । యల రహస్యోప
నిషత్తులఘనాలమదిగాదె । తెలివిమాలిన తెల్వి తెలియక తెలు
సుకో పరశివుని వలన । తొమ్మిది మార్గ్లు తెలుసుకొనెగానా. 2

తా. నేను నీకుదెల్పిన వాక్యములలో నేను తెల్పినానని చెప్పినా తెలుసుననినా తత్వమసియను వాక్యార్థము తెలియదు. దీని భావమును పరశివుడు శుకులవారికి తొమ్మిదిమార్గ్లు బోధించిరి. యెరుక మార్గమును వదలి దీనిని గ్రహించుమని భావము.

కం. ఇదిమూడుపదములై త । త్పదమనిత్వంపదమునసియు పదముల
తోనిం । పాదవెనుతత్పదమీశ్వర । పదమైత్వంపదముజీవపదము
గనలరే । అసియనుపదముకైక్యార్థమలరే । మొదట మా
యోపాధిప్రతిబింబమీశ్వరుడు । తుదకవిద్యోపాధి గతబింబమే జీ
వపదముగ నలరే । అసియనుపదముకైక్యార్థమలరే. 3

తా. ఈతత్వమసివాక్యము, తత్పదము, త్వంపదము అసిపదమని మూడు పదములైనది. తత్పదము యీశ్వరపదము. త్వంపదము జీవపదము. అసియనునది యైక్యపదము. మాయాప్రతిబింబము యీశ్వరుడు. అవిద్యాప్రతిబింబము జీవుడు. యీశ్వరజీవులను యేకముజేయునిది అసిపదమని భావము.

కం. ఈయుభయులకును వేరుగ । వాచ్యార్థలక్ష్య భావార్థము
లై । యేయేయర్థములలరో । జేయుగజీవేశద్వివిధ సృష్టిగలిగెను
గా । వ్యష్టిసమష్టిచేష్ట లమరెనుగా । నీ యునికి లక్ష్యార్థఛాయా
లోకచేపట్టు । నీయనృతవాచ్యముల్ ద్రోయకడగట్టగు సృష్టిగలిగె
నుగా । వ్యష్టిసమష్టిచేష్టలమరెనుగా. 4

తా. ఈశ్వరజీవులకు వేరుగా వాచ్యార్థమని లక్ష్యార్థమనియు భావార్థమనియు యేమేమో అర్థములుచేయగా రెండు విధముల సృష్టిగలిగెను. అనగా యీశ్వరసృష్టి, జీవసృష్టి, గలిగి సమిష్టియని వ్యష్టియనిచేష్టలు గలిగెను. యీఅబద్ధపువాక్యార్థములువదలి లక్ష్యార్థముచేచూడగా జీవేశ్వరు లొక్కటేనని భావము.

కం. జీవునివాచ్యార్థమువిను । ధీవిలసితస్థూలసూక్ష్మదేహేంద్రియముల
ధ్యావరణశోకమోహాజ । రావస్థలు జననమరణ రాకపోకలునూ
రాగద్వేషభావనాదులునూ । లావల్పములు విషయశావరములు
జీవ । భావకర్తృత్వాదిపరిగణములు మళ్ళి రాకపోకలునూ । రా
గద్వేషభావనాదులునూ. 5

తా. జీవునియొక్క వాచ్యార్థము చెప్పెదనువిను స్థూలసూక్ష్మ కారణదేహములు యింద్రియములు, బుద్ధి, శోక, మోహాములు, బాల్య, యవ్వన, కౌమార, జరావస్థలు, జననమరణములు, రాకపోకలు, రాగద్వేషాదులు, లావు, అల్పములు, విషయేంద్రియ కావరములు, జీవభావము కర్తృత్వము మొదలగు పరివారములతోగూడి యుండుటయని భావము.

కం. ఈతనిలక్ష్యార్థమువిను। జాతతనుత్రయవిహీనజాగ్రత్స్వప్న। తీతాపరోక్షసాక్షి। ద్భూతమునై ప్రత్యగాత్మభువినీ పెంపొందూ। సర్వవిలక్షణాద్వైతమందూ। చేతనాచేతనవ్రాతములలోబ్రహ్మ। జాతాంశకాఖ్య విఖ్యాతిమీరగ సర్వభువిని పెంపొందూ। సర్వవిలక్షణాద్వైతమందూ. 6

తా. జీవునిలక్ష్యార్థమేమనగా, స్థూలసూక్ష్మకారణ దేహము లేనివాడును, జాగ్రత స్వప్న సుషుప్తుల కతీతుడును. తనంతటతాను స్వతసిద్ధమైన వాడునునై సర్వమునకు సాక్షిభూతుడై చేతన అచేతనములలో పరబ్రహ్మమను పేరుతోటినుండుట యని భావము.

కం. వినుతత్పదవాచ్యార్థము। ఘనసర్వజ్ఞత్వసుగుణక(?)స్తు క్తసమిష్ట్యనుకూలత్రివిధదశలను। బెనగుచుకోశత్రయంబుపెంపొందుభువినీ। సర్వసృష్టిసంహారస్థితినీ। వనజభవాండములనుబెంచు ద్రుంచుసా। ధన బ్రహ్మవిష్ణీశజననమరణసంజ్ఞ పెంపొందిభువిని। సర్వసృష్టిసంహారస్థితినీ. 7

తా. తత్పదవాచ్యార్థమేమనగా, సుగుణములతో గుమిగూడుకొని, సమిష్టిభావమును జెంది, మూడు దశలతోటి పెనగుచు, స్థూలసూక్ష్మ కారణదేహములు గలిగి, సృష్టిస్థితిలయములకు కారణుడై పుట్టించుటయందు బ్రహ్మయనియు, పెంచుటయందు విష్ణువనియు,

లయింపజేయుటయందు రుద్రుడనియు పేర్లు బెట్టికొని యుండుటయని భావము.

కం. క్షితితత్పదలక్ష్యార్థ । స్థితి సత్యజ్ఞానపరమచిద్గగనాంత । ర్గతబ్ర హ్మానందసమా। గత యాత్మాకారమగుచు గన్పించుచుండూ । ఆ ద్యంతమాఖండమైయుండూ । గతాగతములేక ప్రతిజాతిస్వజాతి హితస్వగతభేదరహితమగు బ్రహ్మమైగన్పించుచుండూ । ఆద్యంత మఖండమైయుండూ. 8

తా. తత్పదలక్ష్యార్థమేమనగా, సత్యజ్ఞానానందమైన ఆత్మస్వ రూపమై, మొదలు తుదలేక అఖండాకారమై, చావుపుట్టుకలు లేక, ప్రతిజాతియనియు, స్వజాతియనియు, భేదములేక పరబ్రహ్మమై తోచుట యని భావము.

కం. అసియనుపదమునకర్థము। పొసగన్నైక్యంబుగానభువితత్వాంతః ప్రసరణలక్ష్యార్థద్వయ । మనదృశజీవేశకళల కైక్యమొక్కటిగా। జేసినపట్టుసమాధిగాగా । కొనకుతత్త్వంపదమునుకులగువాచ్యా ర్థ । బినలురెండు పెరికివిసరివేసినకళలకైక్యమొక్కటిగా । జేసి నపట్టుసమాధిగాగా. 9

తా. అసియనుపదమునకు, ఐక్యమని యర్థముగనుక, తెలిసి కొని, తత్పదత్వంపదముల వాచ్యార్థములనే, ముసుకులు తీసివేసిన యెడల, జీవేశ్వరుల రెంటియొక్క కళ లొకటేనని నిశ్చయించుకొను పట్టే అసియను వాక్యమున కర్థమని భావము.

కం. యీమహిమపట్టు తెలియక । శ్రీమహిళాధీశ బ్రహ్మశివదివిజేశ । స్తోమముజీవేశ్వరభ్రమ । నేమరివాచ్యార్థములతో నిటులనొప్పిరి గా । రూపనామక్రియలమెలగిరిగా । సామర్థ్యముగనాత్మనీమ ల క్ష్యార్థము । లామూలమెరుగరదేమో మాయావిద్యనిటులనొప్పి రిగా । రూపనామక్రియలమెలగిరిగా. 10

తా. విష్ణు, బ్రహ్మ, రుద్ర దేవతలు మొదలగువారు యీ ఐక్యానుసంధానముయొక్క మహిమ తెలియక వాచ్యార్థముచేత జీవుడనియు, ఈశ్వరుడనియు, భ్రమచెంది రూపనామక్రియలచేత నొప్పియుండిరి. అదేమో మాయావిద్యలలో తగులుకొని లక్ష్యముచేత దీని మూలము తెలియలేరైరని భావము.

కం. స్థిరమైనరూపనామ । స్ఫురణలవాచ్యార్థలక్ష్యసులలితజీవే । శ్వరులకు నైక్యమనికనే । వెరవునఘటియించు సర్వవిధులు వికటముగా । నగుచోట వాక్యములోదవెసరిగా । ధరలక్ష్యార్థములంగీకరణసేయవలయు । సరణిలక్ష్య త్రివిధ పరబోధలెరుగనివిధులు వికటముగా । నగుచోట వాక్యములోదవెసరిగా. 11

తా. గురువరా! వాచ్యార్థముచేత, స్థిరమైన రూపనామ క్రియలచేత, నెదుట గనబడుచున్నదానికి, లక్ష్యార్థముచేత నైక్యమే రీతి గలుగును. సర్వవిధులు వికటమైనచోట వాచ్యములేర్పడినవి. గనుక లక్ష్యార్థ మంగీకారము చేయవలెనంటే, లక్ష్యముయొక్క మూడువిధములైనబోధలు, యెరుగనందువలన వికటముగా దోచుచున్నది గాన లక్షణత్రయబోధను దెలుపుమని భావము.

ల క్ష ణ త్ర య బో ధ.

కం. విడుచుటయుజహల్లక్షణ। విడువనిదజహత్స్వలక్ష్యవిధులివిరెండుగ। విడిచియువిడువనినడువడి । విడువకజహదజహల్లక్ష్య విహితములివిరా । వేర్వేరుగవిభజించికనరా । జహల్లక్షణవిడచి యజహల్లక్షణగడచి । జహదజహల్లక్షణమహరహముసాధించు విహితములివిరా । వేర్వేరుగవిభజించికనరా. 12

తా. జహల్లక్షణము, అజహల్లక్షణము, జహదజహల్లక్షణమని మూడు లక్షణములుగలవు. జహల్లక్షణమనగా విడచిన లక్షణము,

అజహార్లక్షణ మనగా విడువని లక్షణము, జహాదజహార్లక్షణ మనగా విడచి విడువని లక్షణము వీనిని వేరు వేరుగా విభజించి తెలిసికొనుము. జహార్లక్షణను వదలిపెట్టి అజహార్లక్షణను విడచి జహాదజహార్లక్షణను నెల్లప్పుడు సాధించుము. యిదే హితమైనదని భావము

కం. మొదటిజహాలక్షణవిను । ముదమున కాశీగతుండు మునువిప్రుల తో । నదెగంగాయాంఘోషను । పదమొకటవ్యక్తముగను పలికియురికెనుగా । దానికినర్ధవిధిలేకసరిగా। పదపడిగంగకుప్రవాహార్ధమెకాదా । రొాదజేసునేగంగకుదరనిపద మొకటిపలికియురికెనుగా । దానికినర్ధవిధిలేకసరిగా. 13

తా. మొదటిజహార్లక్షణము వినుము కొంతమంది పెద్దలొక చోటసభ జేసియుండగా కాశీకి వెళ్ళిన నొకవిప్రుడువచ్చి గంగాయాంఘోషయని నొకయర్ధములేని మాటపలికి పరుగెత్తిపోయెనని భావము.

కం. గంగకునదియనుయర్ధ మొ । సంగుచు తత్తీరపురిని జనఘోషిత మా । సంగతినిజమీాయర్ధము । నంగీకారంబు సేయుమనిన ట్లున్నదిగా । వున్నది విడువవలెనన్నర్ధముగా ॥ వినుతద్వాక్యము దీనికనుకూలమనుకున్న । కనబడుతనువెరుకలన్నిపుడే విడచిపొమ్మనినట్లు వున్నదిగా । వున్నదివిడువవలెనన్నర్ధముగా. 14

తా. సభయందలి పెద్దలాలోచించి గంగకునదియనియు ఆనది యొద్దున గొల్లపల్లెయున్నదనియు నిజమైనయర్ధమని బ్రాహ్మణుడుచెప్పిపోయినట్లున్నది. అనగా వున్నదానిని విడువుమని యర్ధమగుచున్నది. ఈవాక్యము జీవేశ్వరైక్యమున కనుకూలమనుకుంటే కనుపడే శరీరములుయున్నప్పుడే విడిచిపెట్టుమని చెప్పినట్లున్నదని భావము.

కం. ఏతత్సామ్యమువిడుమను । కూతలుగదత్వంపదార్ధ కూటస్థము హా । చైతన్యాంతమువిడవలె । నీతరివిడచినముముక్షు లెవరగుప

డకా । ప్రత్యక్షవిరోధమాగాకా । వే తీరుజూడవిఘాతజహల్ల
క్ష్య । ప్రీతిజేసినవిపరీతమై మోక్షార్థులెవరగుపడకా ప్రత్యక్ష
విరోధమాగాక. 15

తా. ఈవాక్యము యొక్క భావము త్వంపదార్థుడైన జీవుడు మొదలుకొని యీశరీరపర్యంతము విడువుమని యర్థమగుచున్నది. గనుక నీవిడచిన లక్ష్యమును అంగీకరించి నట్టియున మోక్షమును కోరువారెవరును లేక విపరీతమై ప్రత్యక్షవిరోధమగు చున్నది గాన నీజహల్లక్షణపనికి రాదనిభావము.

కం. ఇంచుకయజహల్లక్షణ । మెంచెదనొక మాధ్యవిప్రుడీమహిమ
న్నే । తెంచితను కేక వేయుచు । మంచాఃక్రోశంతి యనెటిమా
టంచుజనెగా । దానికినర్థవిధిలేకసరిగా । మించినబుధులాలో
చించిమంచెల్లరుచు । మంచెపై ననరులా క్రోశించిరనిరి యీమా
టంచుజనెగా । దానికినర్థ విధిలేకసరిగా. 16

తా. అజహల్లక్షణయనగా విడువనిలక్షణము చెప్పెదను వినుము. పైనచెప్పినసభవద్దకొక మాధబ్రాహ్మణుడొచ్చి మంచాఃక్రోశంతియని అర్థములేనివాక్య మొకటియరచి వెళ్ళిపోయెను. బుధవరులాలోచించి మంచాః క్రోశంతియనగా మంచలు అరచుచున్నవని యర్థము మంచలు జడములైనందున యెట్లు అరచును మంచలను విడువకుండా, మంచలమీదివారు అరచుచున్నారని అర్థముచేశికోవలెనని నిర్ణయించిరని భావము

కం. ఈసంధికిమించెనుకడ । దీసినవర్థంబులేకదీనందారులు, ల్గానముగ
నరిచిరనునవు। డీసాధనజూడ వొస్తువుపీడదనుటా అర్థముయొనగూ
డెమనకిచటా కడువడి మొదలేమొ విడువరాదను పెద్ద బడుగు
దృష్టాంతము యొడబడదిచ్చట విడువరాదనుటా । అర్థము యొన
గూడె మనకిచటా, 17

తా, ఈ సందర్భమందాలోచింపగా కనుపడే భ్రమ రూపము విడువడని అర్థమగుచున్నది యెరుకను విడువకూడదను దృష్టాంతము జీవేశ్వరైక్యభావమందు పనికిరాదని భావము.

కం, ఇదియేమివికటమగునన । సదమలలక్ష్యార్థ మెరుగ జడదృశ్యజగ । త్పదనతనుపంచకోశా । స్పదవాచ్యార్థములు విడువ బడ వలసె ముందూ । విడచి తెగాదా కడ తేరు టెందూ । విడువరాదను మోహాజడపుదృష్టాంతమూ । గడమేగాకతత్వమెుడగూడునె విడువబడవలసె ముందూ । విడచి తెగాదాకడ తేరు టెందూ, 18

తా, ఇది విరుద్ధముగానున్నదని ఆలోచింపగా లక్ష్యార్థ భావము తెలిసికొనగనే కనుపడేపంచకోశ వికారాస్పదమైన జగత్సంబంధము గు వాచ్యార్థములు తమంతటతామే వదలిపోవుచున్నవి. అట్లువదలిపోతే నేకడ తేరుట విడువరాదను జడమైన దృష్టాంతరము యిచ్చుటకూడదని భావము.

కం, వినుజహదజహల్లక్షణ । యును విడిచియు విడువనట్టి యాత్మైక్య లన । క్షణజీవేశ్వరలక్ష్యము । గనుగొని పరిపూర్ణనిష్ఠకడ తేరవోయీ ఇది దెలసితె పైనలేదోయీ । మునుసోయందేవదత్తనుశ్రుతి మూలము । తనివిదీరగవిని నిను నీవేగనుగొని కడ తేరవోయీ । ఇది దెలసితే పైన లేదోయీ, 19

తా, మానసపుత్రా! జహదజహల్లక్షణయనగా, విడచీవిడువని లక్షణమునుగూర్చి చెప్పెదను. ఇది జీవేశ్వరైక్యమును జేయు లక్ష్యము. సోయందేవదత్తయను శ్రుతియొక్క మూలమును తనివితీరేటట్లు గురువువలనవిని, నిన్ను, నీవు తెలిసికొని పరిపూర్ణమును జెంది కడతేరుము. ఇది తెలిసితే దీనికి పైనలేదని భావము.

కం, ఇలగంగాతీరంబున । విలసితముగ దేవదత్త విప్రోత్తమునికా । తొలిముప్పది సంవత్సర । ములక్రిందట గన్న నరుడు మునికొని

మరలా । గనుగొంటి కావేరీ తీరములా, అలనాటికిలనాటి కల
విగాక దేహ । బలసంపదలు దేశ కాలభేదములగుచు మునికోని
మరలా । గనుగొంటి కావేరితీరములా. 20

తా. ఇదివరకు ముప్పది సంవత్సరములక్రిందట దేవదత్తుడను బ్రాహ్మణుని గంగాతీరమున జూచితిని, తిరుగా వానినే, కావేరీతీర మున యిప్పుడు జూచితిని, ఆదేశ మీదేశముగాదు, ఆకాల మీకాలముగాదు, అప్పుడుండు బలమిప్పుడులేదు, యీకారణములవలన గురుతుపట్టుటకు వీలులేకపోయెనని భావము.

కం. జ్ఞానాభావముచేనను । మానించుటెగాని యుభయ మార్గప్ర
భావ । స్థానభేదములువిడిచిని । ధానతగనదేవదత్తతను విదేయ
గునూ । భేదములేవాచ్యార్థములగునూ । మానరానిపోడు నా
నార్థములకీడు । లేనివాడుగాడు గానవాడెవీడు తనవిధేయగు
నూ । భేదములేవాచ్యార్థములగునూ. 21

తా. జ్ఞానములేనందున అనుమానించుటేగాని, ఆదేశమును యీదేశమును, ఆకాలమును యీకాలమును, అప్పటిబలమును ఇప్పటి బలమును, విడచినదానముగా గుర్తుపట్టితే దేవదత్తునితనువిదేయగును. వాడే వీడు, నానార్థములచేత కీడుకలిగించునవి యీవాచ్యార్థములే యగునని భావము.

కం. గురిచిక్కని కాలములో । పరిపరివిధములవికార భ్రమతేర్పడు
నా । కరణిగజీవేశాఖ్యల । బెనగిన వాచ్యార్థద్వివిధ భేదోపా
యములా । గోచరములై మెరసె రూపములా, మరి దేవదత్తుని
మరుగునెరుగనికాల । సరణిలో భ్రమలెల్లు జరుగు జీవేశ్వరుల భే
దోపాయములా, గోచరములై మెరసె రూపములా. 22

తా. దేవదత్తుని సుకృతు చిక్కనికాలములో భ్రమ లెట్లేర్పడెనో ఆలాగే వాచ్యార్థములచేత జీవుడని యీశ్వరుడని రెండు భేదములుగలిగి, రూపము వేరువేరుగా గనపడెనని భావము.

క. గురిగురుతుల మరవాచక। మరుగులుజీవేశ్వరాఖ్య మరినాత్మలకున్ । స్థిరనిజ లక్ష్యార్థోభయ । పరిశుద్ధప్రత్యగాత్మ పరమాత్మలకునూ । ఐక్యతకొక్క తెరగుగనుమికనూ । మరిజీవేశ్వరమలిన మరుగులు విడిచిన । పరలక్ష్యార్థములోన బ్రహ్మకళలేకము పరమాత్మలకునూ । ఐక్యతనొక్క తెరగుగనుమికనూ. 23

తా. గురిగుర్తులు యేర్పడుటవలన యేకమైన ఆత్మకు, జీవుడని, యీశ్వరుడని, అబద్ధపుమరుగులు కలిగెను. పరిశుద్ధమైన ప్రత్యగాత్మ పరమాత్మలకు లక్ష్యార్థముచేత, ఐక్యమగుటకొక మార్గమున్నది. అదియేదనగా, జీవేశ్వరులయొక్క మలినమైన మరుగులను తీసివేసినయెడల లక్ష్యార్థములో బ్రహ్మకళలొక్కటేనని భావము.

కం. యీలక్షణత్రితయాంత । ర్మ్యాలము తత్త్వమసివాక్య ముఖ్యార్థప్రబో । ధాలయము గానసర్వము నీలోనివెరుగ తెలుసు నిజముసుమారా । ననుగన్న బంగారు సుకుమారా । యేలాగైన తత్త్వ మూలమెరిగి యోగ । శీలులాలోనన్ను మేలుమేలని పించు నిజముసుమారా । ననుగన్న బంగారుసుకుమారా. 24

తా. ఈమూడులక్షణముల లోపలిమర్మము తత్త్వమసి యనువాక్యముయొక్క బోధకునునికి పట్టుగాన నిన్ను నీవు తెలుసుకుంటే నిజము తేటపడును నన్నుగన్నబంగారు సుకుమారా యేలాగుననైనా యీవైక్యానుసంధాన మెరిగి పెద్దలవద్ద ప్రతిష్ఠనిలుపుమని భావము.

శిష్యవచనము

కం. శివజీవైక్యవిచారము । శివరూపకగురునివలన శిష్యుడువినితా ।

సువివేక త్రివిధభక్తుల । సవినయముగ దేశికేంద్రు చరణాబ్జము
లకూ । సాగిలిమ్రొక్కి సమరస మొలుకూ । ప్రవిమలాత్మధ్యా
న వివరణమ్మృదుమధుర । రవముగులుకబలికె త్రిభువన దేశికు
చరణాబ్జములకూ । సాగిలిమ్రొక్కి సమరస మొలుకూ. 25

తా. శివస్వరూపుడయిన గురునివలన జీవేశ్వరైక్యబోధ శిష్యు
డువిని వినయవిధేయముగా దేశికేంద్రుని పాదారవింపములకు త్రివిధ
భక్తులచేత సాష్టాంగదండప్రణామము లాచరించి మృదుమధురవా
క్కులతోటి యిట్లనియెనని భావము.

కం. స్వామీయీవాక్యార్థము । లేమోనవేదపఠన వలెవినబడె
నిం । కేమోభాషాభేదము లేమోమీదివ్య మహిమ లేమో
కనిపెట్టి । తెల్పవెనాదు భాషానుపట్టి । ప్రేమ మీరెరుగించే
నామహాబోధకం । కేమైనరుచిపుట్టు నీమలక్ష్యక్రమము లేమో
కనిపెట్టి । తెల్పవెనాదు భాషానుపట్టి. 26

తా. సద్గురువరా! తాము బోధించే యీ వాక్యార్థములు
వేదసారమువలెనున్నవి. నాకేమియు తెలియలేదు. భాషాభేదమేమో
తమదివ్యమహిమ యేమో నాభాషను కనిపెట్టి నాకు బోధింపుము
దయచేత తమరునాకు బోధించేబోధకు యింకాయేమయిన రుచిపుట్టే
నీమములు లక్ష్యములున్నవేమో తెలుపుమని భావము.

కం. పేరైనబ్రహ్మవిద్యా । ధారులుజపియించువేద తార్కికభాషా ।
ధారమగునట్టివాక్యము । లారీతిగనీకుమనసు కందునట్లుగనూ ।
తెల్పితి వేదసారతరముగనూ । ఆరూఢిబ్రహ్మవిచారములో మది
దూరక వేరొకమారు బానలనీకందునట్లుగనూ। దెల్పితివేదసారత
రముగనూ. 27

తా. ప్రఖ్యాతిజెందిన బ్రహ్మను భవులుజపించే వేదతర్కభా

మకు ఆధారమైన వాక్యములు వేదసారముగా నీమనసుకందునట్లు వేరు భాషలో తెలిపితినని భావము.

కం. కుండయనకుంభమనగను । కొండయనన్ గిరియనంగ కులభాషలువే । రుండిన యర్థంబొకటిగ । దండిగగన్పించుగాన తనమనసుకందూ । నిజభాషచే నిండుసుఖమందూ । పండితులగు వారఖండబోధ శిష్యు । మండలిగు తెల్లారుగుచుండు మాటలు దెల్పు తనమనసుకందూ । నిజభాష చేనిండుసుఖమందూ. 28

తా. కుండయనగను కుంభమనగను వకేవస్తువున కర్థమగును, కొండయనగనుగిరియనగను వకేవస్తువున కర్థమగుచున్నను. కుండయని యు కొండయనియు తెలుగువారు మాట్లాడుదురు, కుంభమనియు గిరియనియు సంస్కృతభాష మాట్లాడువారు మాట్లాడుదురుగాన. వారి వారి భాషలచే బోధించినవారి మనసుకు సుఖముగలుగును పండితులగు వారుశిష్యులకోటి భాషనుబట్టి బోధింపవలయునని భావము.

కం. వేదాంతబోధకెల్లను । పాదైయున్నట్టిబ్రహ్మ భావముదెల్పన్ । గాదో నాకిది తెలియగ । లేదంటివియితరభాష లేలనినీకూ । నీకులభాషలోన దెలుపుటకూ । ఆదరింపవదేమో నీధరణితొల్పై । లో ద్రవ్యమెవరంటరాదందురే జనులేలనినీకూ । నీకులభాష లోనెదెలుపుటకూ, 29

తా. భూమియందు తోలుపెట్టెలో పెట్టిన ద్రవ్యము తాకకూడదని యవరైనా అనెదరాయని వేదాంతబోధకు తా ఆధారమగు బ్రహ్మభావమును నీ కులభాషలో నీకు తెలియునట్లు బోధించినను ఆదరింపవెందుకని భావము.

కం. తనకనుభవమునకందని । ఘనతర సద్వేదవిద్య ఘనులకెఘనమై । గనిపించుగాని తద్రుచి । గననప్పుడెనిష్ఫలంబు గాదెగురు

స్వామీ । మనసానంద మందదింకేమీ । ఘనసంపదలుగల జన
నాథునన్నము । తినన్నొల్లనట్లనె విననన్యబోధలు గాదెగురు
స్వామీ । మనసానంద మందదింకేమీ. 30

తా. గురుస్వామీ ! ఘనమైన వేదవిద్య ఘనులకేఘనముగాని శాబోటి తెలియనివారికి మనసుకు తెలియనప్పుడు నిష్ఫలమేకదా ? నామనస్సుకానందముకలుగలేదు. యెక్కువగా సంపదగలరాజు అన్న మంతిన నిచ్ఛలేనట్లు యితరబోధలు నేను విననని భావము.

కం. ఒకమాటకు వొకపూటకు । ఒకభాటకు వొక్కచోట వడినిల్వ
నినీ । వికటాలాపములణుగుట । కికనేమని బోధజేతు నెన్నిది
నములకూ । నీమదిభ్రాంతు లన్నివిడుచుటకూ । విన్నట్లెవిందు
వు కన్నట్లెకందువు । అన్నిదెల్పినవెనుక సున్నబెట్టెదవిక నెన్ని
దినములకూ । నీమదిభ్రాంతు లన్నివిడుచుటకూ. 31

తా. శిష్యా ! నీకొకమాటలేదు, ఒకపూటలేదు, ఒకబాటలేదు, ఒక్కచోటనునిల్వని నీ వికటపుమాటలణగుటకును, నీ మనస్సునందలి భ్రాంతులు పోవుటకును, యెన్నిదినములేమనిబోధచేయుదును, విన్నట్టేవినెదవు, తెలిసినట్టే నటించెదవు. అన్ని తెల్పినతర్వాత నాకు తెలియదని సున్నబెట్టెదవని భావము.

కం. ఎటుజూచిన నేబ్రతుకే । భటువొందకగాదె వేద భాష్యవచస్సం
ఘటితమహావాక్యంబుల । కటునిటు మాట్లాడకున్నా నయ్యాగురు
నాథా । మత్ప్రారబ్ధా ఘటనేమోకాదా । ఎటువంటి రోగుల
కటువంటౌషధమొసగి । తటుకున బ్రతికించు ధన్వంత్రివనుకున్న
నయ్యాగురునాథా । మత్ప్రారబ్ధ ఘటనేమోకాదా. 32

తా. గురునాథా ! నా ప్రారబ్ధానుభవమెటులనున్నదో, యెటులాలోచించినను, వేదభాష్యమూలములైన వాక్యములు తెలియక,

నేను కడతేరేమార్గముచిక్కక అటునిటు మాట్లాడకయున్నాను. యె టువంటిరోగుల కటువంటి ఔషధమిచ్చి తక్షణమే బ్రతికించేటటువంటి వైద్యులు మీరేనని నమ్మికొన్నాననిభావము.

కం. వేదచతుర్విధబోధలో । పాదగుతత్వంపదద్విపదలక్ష్యార్థ్యా । భేదపరిపూర్ణసత్కళ । మోదముగను నచలమంత్ర మూలమే ర్పరచీ । అభేద్య మఖండ మగుపరచీ । ఆదితత్వంపద భేదావా చ్యార్థములు । సాధించినీరెంటి వాదముల్ కడద్రోసు మూల మేర్పరచీ । అభేద్య మఖండమేర్పరచీ.　　33

తా. ప్రియశిష్యా! నాలుగు మహావాక్యముల కాధారమైన తత్పద, త్వంపదములకు లక్ష్యార్థముచేత భేదరహితమైన పరిపూర్ణకళ కు అచలమంత్రమూల మేర్పరచి భేదింపరాని అఖండమునుజూపిమొ దట తత్పద, త్వంపదములయొక్క భేదమైన వాచ్యార్థములను నీకు చక్కగా అనుభవమగునట్లుచేసి యీరెంటియొక్క భేదములను బోగొ ట్టెదనని భావము.

కం. అటుజేసిననేబ్రతుకుదు । తటుకునకడతేర్చు పెద్ద ధారల్లదెగా । మటుమాయావిద్యల దు । ర్ఘటమగు వాచ్యార్థద్వివిధ ఘట్ట మెప్పటికీ । అదెప్రారబ్ధపుట్టిల్లంతటికీ । యెట్లయిన నీదుష్టచేష్టలీ రెండెరుక । పట్టుజెరచికడగట్టు జేర్చుటకిదియే ఘట్ట మెప్పటికీ । అ దెప్రారబ్ధపుట్టిల్లంతటికి.　　34

తా. స్వామీ! ఆప్రకారము కరుణించితే నేను కడతేరెదను. నన్ను త్వరలో కడతేర్చు పెద్దబాట అదే. ఈరెండు విధములైన మా యావిద్యాసంబంధమైన వాచ్యార్థములు రెండిటియొక్క ఘట్టమే ప్రార బ్ధముయొక్క పుట్టిల్లు. యెటులైనను శివజీవులనే భ్రమరూపకమైన యెరుకను పోగొట్టి నన్ను పరిపూర్ణుని జేయవలెనని భావము.

కం. ఏలాగునైననినుగుణ । శీలునిగా జేసికనుల జూచెదనని నే। నా
లోచింపుచునిక వెయి । వేలకునీకొక్కఘడియవిమలబుద్ధిగనూ ।
నేర్పడచాలదేముక్తిగననూ । యేలీలనైన నేనాలోననాగురు ।
కీలకమెరిగించి యేలుకొందును పుత్రవిమలబుద్ధిగను । నేర్పడచా
ల దేముక్తిగననూ. 35

తా. పుత్రా ! యేవిధముచేతనైనను నిన్ను బ్రహ్మవేత్తనుజేసి కండ్లచూతామని నే నాలోచింపుచుందును. నీబుద్ధి నిర్మలమైన నొక ఘడియలోనే ముక్తికలుగును. భయపడకుము. యెట్లయినను నాగురు కీలకమెరిగించి నిన్ను జీవన్ముక్తుని జేసెదనని భావము.

షష్టమప్రకరణము సంపూర్ణము.



శ్రీశివాయగురవేనమః

# శ్రీ శుద్ధాద్వైత ప్రభోధ గురుశిష్యసంవాదము.
## ఉత్తరభాగవిషయ ప్రభోధిక.

శ్రీమత్పరాత్పరాఖండ మహాపరిపూర్ణాచల బ్రహ్మోపదేశమున కనుగుణ్యమగు పరబ్రహ్మవిద్య యనాదికాలంబున వుపదేశరహస్యత్రయాత్మకంబై అక్షి విద్య దహరవిద్య శ్యామవిద్యాదిరూపంబుల విలసిల్లె. నందక్షి విద్య పాదత్రయంబై ప్రథమపాదం బంతస్తారక సూక్ష్మాణుతేజోమయంబై పంచమహాముద్రాది సందీప్య బాహ్యాంతర్మధ్య లక్ష్యత్రయ విరాజితంబై యలరె. ద్వితీయ్యపాదంబభేద్య బాహ్యతారక జగద్బిందు చరాచరాంతర్గోచర భిన్నాభిన్నవస్తుత్వాది తేజోమయంబై యలరె. తృతీయ్యపాదంబుమహాతారకస్వరూపంబై అంతర్బాహ్యగోచరాద్భుతైకాఖండ తేజోమయంబై యలరె. ద్వితీయ్యరూపంబగుదహర విద్య పాదత్రయంబై ప్రథమ పాదంబున సర్వేంద్రియవశీకరణయోగ సాధనానుకూలంబై మహాదుర్ఘట కఠిన హఠయోగసంఘటితబంధత్రయమూలక చతురుత్తర షష్ఠ్యాసనవిధానోక్త యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణ సమాధ్యష్టాంగయోగ సంసిద్ధుల చేదనరి బాహ్యవ్యాపక రేచక కుంభక పూరకాదిష్టవాయుధారణాత్మకంబై యల్లరె. ద్వితీయ్యపాగం బంతర్దహారకుండలీత్రయ మహాతేజోదర్శన సాధనానుకూలంబై యణిమాద్యష్టసిద్ధులందనరి సర్వజ్ఞత్వాదిసుగుణంబులనొప్పివియద్గమన పరకాయప్రవేశ భూమ్యాదిపంచమహాభూత స్తంభనాది సత్క్రియాతాంత్రికంబులమెలంగి యంతర్వ్యాపక వాయుధారణాత్మకంబైయలరె. తృతీయ్యపాదంబుమహాసూక్ష్మదహారకుండ

లీ కుమార లసద్బ్రహ్మతేజోఖండ సందర్శనసాధనాంతర్లంబికాయోగవి
లీన పరవశగత బహుకాలజీవిత్వసశీలనొప్పి తనుమనఃప్రాణేంద్రియ ని
గ్రహత్వంబున ఏకాఖండ బాహ్యాంతర్వాయుధారణాత్మకంబై యలరె
నీషడ్విధరహస్య సాధనంబు లొకటికొకటి కన్యోన్యసాధన వశీకరణంబు
లై వేదవిధ్యుక్తాఖండ మహాతారకయోగోపదేశ ఆత్మానాత్మ విమర్శ
జ్ఞాన సాంఖ్యబ్రహ్మవిచారాంతర్వ్యాపారములై ద్వివిధబోధోపకరణంబు
లై ప్రవర్తిల్లు తృతీయరూపంబగు భ్రామవిద్య పాదత్రయంబై ప్రథ
మపాదంబున సాధనచతుష్టయ సంపద్విశిష్టాధికార నియామకంబున చ
తుర్విధ వేద మహావాక్యోపదేశ జీవబ్రహ్మైక్య లక్షణాన్వితంబై యల
రె. ద్వితీయపాదంబున తత్పూర్వోక్తబ్రహ్మైక్య సమాధి సమరసభోగ
వంతంబగుటకు అఖండపరిపూర్ణాచల మహావాక్యార్థప్రతిపాదకంబై త
దీయవిభవమహాచల దర్శనీయంబై యలరె. తృతీయపాదంబున అఖం
డభ్రమవిసర్జన సాధనానుకూలంబై సదాచార్యముఖోక్తబ్రహ్మబుద్ధ్యుప
దేశమహానందభోగపరవశాత్మకంబై యలరె. నీత్రివిధవిద్యలం దనవరత
బ్రహ్మానుభవసాక్షాత్కారభూతములై యేతద్వివిధనవగోప్యంబులుద్భవిం
చె నివియే బ్రహ్మవిద్యాత్రయాంతర్గతనవవిధయోగోపదేశ రహస్యంబుల
ని ప్రఖ్యాతిగాంచె నివియు యథాసాకల్యముగ నెరింగించుటకు గ్రంథవి
స్తరభీతిచే వెరచియే నిప్పుడుపూర్వోత్తరభాగములలో సంక్షేపరూప
ముగా నీపరమరహస్యసారాంశములు పూర్వానుభవముల ననుసరించి
యుపన్యసించితి నందునీగ్రంథపూర్వభాగంబున అక్షివిద్యవహారవిద్యా
ది ద్వివిధ రహస్యంబులమెలగు యోగశాస్త్రసాధనాన్వితమగు మహా
తారకయోగ సాక్షాత్కారము సాంఖ్యయోగానుభవంబగు ఆత్మానా
త్మవిచారము తృతీయపాదంబగు భ్రామవిద్యలో ప్రథమపాదమగు వే
దచతుర్విధమహావాక్యోపదేశ తత్త్వార్థసమాహిత జీవబ్రహ్మైక్యబోధ
యు నాచేవివరింపంబడియె ఇకమీద నుత్తరభాగంబున పూర్వోక్తభ్రా
మవిద్యారహస్యార్థ శేషాంశద్వయమును ప్రబోధింప నుపక్రమించితి

ద్రహస్యద్వయ మవాఙ్మానసగోచరాప్రతర్క్యసర్వప్రపంచాతీతనిర్గుణా చల పరమరహస్యములై యున్నవి తద్రహస్యాంశము లాత్మవేద్యంబై పూర్వచతుర్విధ మహావాక్యార్థ సమరసైక్యానుభవంబగుటకుతదీయ పూర్వోత్తరభాగ వేదవిద్యా పరికల్పిత సహస్రాష్టోత్తర శతోపనిషత్ప మాగత శ్రీమదనంతాచలోప నిషత్ప్రమాణప్రతిపాదకమగు శ్రీమదచ లద్వాదశాక్షరీ షోడశాక్షరీద్వయప్రబోధము లాధారములై యున్నవి తద్రహస్య మహావాక్యార్థప్రబోధలు అనాది మహాఋషిగణముఖోద్గత ఋభుగీత బ్రహ్మగీత నారదగీతావధూతగీత అష్టావక్రగీత పూర్వోత్త రభగవద్గీత బృహద్వాసిష్ఠ వసిష్ఠజనకసంవాదాది పూర్వవేదాంతప్రక రణములచే ప్రసిద్ధములగుచుతదుపదేశకర్తలగు బ్రహ్మవేత్తలచేతదా సక్తులగు మోక్షార్థులందరుప్రబోధలొందసి కృతార్థులగుచుండిరి. ఇట్లుం డగా నానాటికి నీకలికాలసంప్రాప్త దుష్టప్రారబ్ధదశలకొలది వేదశా స్త్రవిద్యలందనవరతాసక్తి గలుగక తదీయ శాస్త్రశబ్దావలోకనలేని మోక్షార్థులు తచ్ఛబ్దజాల ప్రఘోషాన్వితతద్బోధము మనోవృత్తికగో చరంబై తద్వాక్యశ్రవణానందమే లేక తదుపరి తన్నిష్ఠాగతులు మనన నిధిధ్యాససమాధివిధులందక మహావ్యసనపరంపరలచే జ్ఞానాసక్తులతిప్ర యాసలొందుచుకొంత కాలంబుజరిగెను తదనంతరంబున పరమాంతరం గ ప్రబోధకులలో శ్రీ శివరామ దీక్షితస్వామియగుమదీయ బహుకా లపూర్వాచార్యులవారవతరించి సర్వసాధులకుజ్ఞానోపదేశంబుసేయునె డల నొకానొకసమయంబున యేతద్విషయమంతయునిజాంతరంగసమా ధియందవలోకించిసర్వభూతదయాళుతాచిత్తులైయాలోకించిరదెట్లనగా భూతభవిష్యద్వర్తమానములగు నేకాలములయందైనను వేదశాస్త్రప ఠనద్వారా సంస్కృతభాషాభ్యాసులగు జ్ఞానులుతద్భాషప్రబోధకలగు టచే పఠన సంస్మరణ శ్రవణ మనన నిదిధ్యాసాధికారములు గలిగి కృతార్థులు కావచ్చును, తద్భాషావిహీనులగు మోక్షార్థులు యేత ద్బ్రహ్మవిద్య నార్జించుటకు నిస్సాధనీభూతులైరని కొండొకదడవు

వితర్కించి బహువిధయోగ శాస్త్రాదుల పరీక్షించి అజ్ఞయొసంగి రదెట్లనగా—దీని కన్యసాధనోపాయము లేదను దురభిప్రాయముమాత్రము మిక్కిలి దుస్తరమై యున్నది యెట్లయినను సర్వజీవోపాసనార్హమగు పరబ్రహ్మవిద్య యొక్క సర్వభూతావశ్యమునకు ముందు హాని యగుచున్నది విశేషజ్ఞానమోక్షాసక్తత అనేక జన్మ సుకృత తపఃస్సంసిద్ధులచేత కలిగిన్ని వృధాగా వక స్వల్పకార్యమగు సంస్కృతభాషాజ్ఞానలోపముచేత అట్టి సాధులందరు నీజన్మలలో నేమిజేయునది లేకను భవిష్యత్కాలమందు వ్యర్థమగు కొన్ని జన్మలు యెత్తవలసి వచ్చునను విపరీతధర్మమేర్పడి యున్నది యిందుకు ఏ సదుపాయము యాలోచించుటకు యే పెద్దలైనను యేకృతమైన సామర్థ్యములు లేవని చెప్పవలశినట్లున్నది యిందువలన సర్వవిధములరహి మార్గమందత్యంత విపరీతవిరుద్ధార్థములు లిట్లావహించి యున్నవిగాన నీదురభిప్రాయము లన్నియు సర్వదా అసంభావితమని స్పష్టముగా నెంచదగియున్నవి. యేతద్విషయసిద్ధాంతములో పూర్వశాస్త్రానుభవములు విచారించగా విశేషించి యే భూతములకైనను తీవ్రవైరాగ్యభక్తిజ్ఞానములు బహుజన్మసంసిద్ధులవలనంగాని గలుగవు అట్టి సాధనములవల్ల గాని పరిపూర్ణజ్ఞాన సిద్ధికాదు యిందుకు ప్రమాణము.

శ్లో॥ మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవగరీయసీ ।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయ్యతే ।
బోధోస్యసాధనేభ్యోహి సాక్షాన్మోక్షైకసాధనం ।
పాకస్యవహ్నివజ్ఞానం వినామోక్షోనసిధ్యతి ॥

ఇట్టిసాధనత్రయములు పరిపూర్ణజ్ఞానసిద్ధికాధారములై యున్నవి యీత్రివిధసాధనములు లేని పశుప్రాయులు యెన్నెన్ని జన్మలందు యాగయోగతపోధ్యయన వ్రతదానధర్మతీర్థస్నానాది యేకృత్యములొనర్చినను ఫలము యెంతమాత్రము లేదనుటకు ప్రమాణము.

శ్లో॥ కురుతేగంగాసాగరగమనం- వ్రతపరిపాలనమథవాదానం- జ్ఞానవిహీనస్సర్వమతేన - ముక్తింనభజతిజన్మశతేన॥ అని యున్నది.

శ్లో॥ అలంయాగైరలంయోగై - రలంత్యాగైరలంధనైః- జ్ఞాతంబ్రహ్మనవిజ్ఞేయ - మితివేదాంతడిండమః.

అనియున్నది ఇదియునుంగాక బహుజన్మతపస్సంసిద్ధిచే గలిగిన మోక్షాసక్తి కాలమునకు యేకాలము సరికాదనియు అట్టికాలమునకెన్నిఅభ్యంతరములుగలిగినను జ్ఞానోపదేశమునకదెసకాలమనియుతత్కాలమందుపదేశించుటచేతశీఘ్రముగబ్రహ్మసిద్ధియగుననుటకుప్రమాణము.

శ్లో॥ తీర్థేదేవాలయేగ్రామే - మందిరేగహనేగుహే - శ్మశానేయేహ్యసంకీర్ణే- చండాలశ్వపచాలయే- అవేదశాస్త్రసాహిత్యే- అశుద్ధేఅప్రసక్తకే-అసంబంధేఅసత్కృత్యే-అవశిష్టేఅపాత్రకే- అనధ్యాయనదుష్కాలే - అశుభేజాడ్యపీడనే - అస్వాధీనేఅనాచారే - అపవిత్రేఅయోమయే-జ్ఞానసంపత్సమాయుక్తం- సమకాలంవిదుస్తథా-తత్కాలేతత్వబోధేన । క్షణేమోక్షశ్చసిధ్యతి॥

అనుమాట సిద్ధాంతమైయున్నది. ఇకను వేదశాస్త్రభాషలవల్ల జ్ఞానసిద్ధి యెంతమాత్రము పొందలేరనుటకు ప్రమాణము.

శ్లో॥ ఆలోక్యచతురావేదాన్ - ధర్మశాస్త్రాణిమానవాః- బ్రహ్మతత్వంనజానాతి - దర్వీపాకరసంయథా॥

అనియున్నది.

శ్లో॥ అలంవేదైరలంశాస్త్రై । రలంశ్రుతిపురాణకైః । జ్ఞాతంబ్రహ్మనవిజ్ఞేయ మితివేదాంతడిండిమః॥

అదియునుంగాక బ్రహ్మజ్ఞానము బహుజన్మ తపోఫలిత జ్ఞానమునగాక తద్వ్యతిరేకమగు వేదశాస్త్రప్రసిద్ధభాషాగణ్య మెన్నటికి కాదని యిందువల్ల సిద్ధాంతమైయున్నది గావున యేభాష కాభాషే అధికమై ఆయాభాష ఆర్యాజీవులకు మనోరంజనమై యున్నది అప్పటికి

జ్ఞానసాధన సర్వజీవులకు యేకరూపకముగా అత్యావశ్యకమైయున్నది యిందుకు పూర్వోక్త జ్ఞానోదయము లేక జన్మసిధ్యను గతమైయున్నది. అట్టిజన్మ సంసిధ్యను గత జ్ఞానముచాత జీవన్ముక్తి గలుగవలసినదై యున్నది. యిందువలన యేగాజీవులు నాయాస్వభావ ప్రబోధలచే తదుపదేశకర్తలవలన జ్ఞానప్రబోధనొంది ముక్తులగుటకు యేసందేహము లేదు. ఇదియే సర్వజీవన్ముక్త ప్రకరణసిద్ధాంతము ఏతద్విషయము లోనింకను మదీయ్య గురుసాంప్రదాయ కానుభవములు వివరింపు చున్నాను.

౧. మహాయోగసిద్ధుండను మదీయ్య నిజాచార్యుండగు శ్రీ శ్రీధరస్వాములవారు పరమసాధు హితోపదేశం బొనర్చునెడల సామాన్యస్వభావాజ్ఞానవిహీనమానవులగు నానావిధమహావ్యక్తజడమూకబధిరాంధ అంగవైకల్యాది సమూహములకు హస్తనయన భావసంజ్ఞలచే జ్ఞానసూచనము లొనర్చి విదేహకైవల్య జీవన్ముక్తి యొసంగి యున్నారు.

౨. వారియాచార్యుండగు మదీయ్యపరమగురుండు ఆత్మదర్శనావధూతగారు సాధుహితోపదేశం బొనర్చు సమయంబున అజ్ఞానావృతనానావిధ చతుష్పాత్పశుపక్షుర్యురగకీటక పిపీలికాది నిఖిలచేతనాళులకు తత్తజ్జీవ కళాధ్యాన్యంతర భావ సంజ్ఞలచే జీవన్ముక్తిప్రబోధ లొసంగియున్నారు.

3. వారియాచార్యుండును మదీయ్యపరమేష్టి గురుండగు సంసిద్ధయోగావధూతగారు సాధుహితోపదేశం బొనర్చుతరి పరలోకావహితభూతభేతాళ యక్షబ్రహ్మరాక్షస పైశాచిక గణాదులకు ఆత్మసంజ్ఞాధికారమువలన తత్తత్ప్రతి బంధరహితులంగావించి ముక్తులొనంగుచు మరియు వృక్షపాషాణ కంటకగిరికంధర కానన మహీనద్యాదులకు నిజపరిపూర్ణ బ్రహ్మావలోకనముల నిజశరీరస్పర్శజ్ఞాన సంజ్ఞాధికారముల సర్వజీవన్ముక్త ప్రబోధలొసంగి యున్నారు.

యింక ననేకులకు పరమహంస లాత్మజ్ఞానవశాన నిరీక్షణలచే నాయాకాలముల సర్వసాధు కృతార్థతా ప్రబోధలాచరించి రక్షించినటుల పూర్వయోగశాస్త్రంబులు ఘోషింపుచున్నవి గావున సర్వ జీవన్ముక్త సంసిద్ధియే నిజపూర్ణసిద్ధియనునది ముఖ్యముగా పూర్వదేశికాభిప్రాయమైయున్నది. కావున దీనినవలంబించి సాధుసంరక్షణయొనర్చుట మాకును అత్యావశ్యకమై యున్నది. అని యాగురుకులోత్తముడగు శివరామ దీక్షితస్వాములవారు యేతత్సర్వభూత పశ్చాత్తాపచింత్తంబున సమస్తదేశభాషాదులలో బ్రహ్మవిద్యాకల్పక వేదమహావాక్యార్థంబులు సమన్వయంబుగ సంస్కృతభాష దేశభాషామేళనంబులనేకప్రబోధప్రకరణంబులు గల్పించి తత్తద్దేశకాలోచితవిధుల సాధులకు బ్రబోధించి రందు నీయాంధ్రదేశామేళన ప్రబోధలవలన నంతకుమున్ను కొందరు మహాత్ములు సంస్కృత భాషావిహీనులగు జ్ఞానాసక్తులకు తత్త్వోపదేశంబులు చేయుచుండిరి.

ఇట్లుండగా తదీయ్యాచల పరిపూర్ణసాంప్రదాయక యోగనిష్ఠాగరిష్ఠుండగు మదియ్యగురుండఖండ కరుణాకటాక్ష వీక్షణంబున స్వాత్మప్రియుండగు వివేకనిధింగని తత్పూర్ణభావం బుపదేశించె తద్బోధం బొక్కించుక నీగ్రంథ పూర్వభాగవిషయ ప్రబోధికలలో వివరింపంబడియెనవియెయ్యవియనిన బ్రహ్మవిద్యాంతర్గతగోచర శాంభవవేదవిద్యాప్రతిపాదక అచల బ్రహ్మమూల మంత్రోపదేశవిధాన సర్వాశంకారహిత పరిపూర్ణాశంకాన్విత పరతత్వసూచన విధాన అఖండభ్రమవిసర్జన విధాన బ్రహ్మ బుద్ధి లక్షణవిధాన మహదానంద పరవశవైభవ విధానాదులతో షట్ప్రకరణంబులు నీయుత్తరభాగంబున సమగ్రముగ వివరింపంబడియె. దీని యత్యంతమోక్షాసక్తులగు మహాత్ములాకర్ణింపవలయు. సర్వాపరాధాః క్షమధ్వం.

ఇట్లు సాధువిధేయుఁడు,

అన్నంరాజు రామయోగియతీంద్రులు,



శ్రీశివాయగురవేనమః

# శ్రీ శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్యసంవాదము.

## ఉత్తర భాగము

శ్రీమదఖండాచలోపదేశ ప్రకరణము.

కం. దేవేవమీకృపాప్ర । భావముచేఁబోవసకలభారముమీదే । గా
వునవిస్సంశయముగ । జీవన్ముక్తునిగనన్ను జేయుముతండ్రీ । భవ
దాజ్ఞకుబద్ధుఁడనండీ । యేవేళకేవిధినేమిబోధించిన । నీవేతల్లివి
దండ్రివీవేసద్గురుడవుజేయుముతండ్రీ । భవదాజ్ఞకుబద్ధుఁడనండీ. 1

తా. దేవా తమయాజ్ఞకు బద్ధుడనై యున్నాను. యెప్పుడెప్పు డేమి బోధించినను తమ కృపవలన నన్ను సంశయరహితుని జేసి జీవన్ముక్తునిగా జేయు భారము మీదే, మీరేతల్లిదండ్రి సద్గురులని భావము.

కం. కావలసినపరమార్థము । నీవడిగినక్షణమునందు నీకిచ్చెద ను । ర్భావవిపరీతసంశయ। త్రోవలనికవిడచిమాత్మదృష్టిచేనిలచీ। శ్రీగు రునత్ప్రభావముదలచీ । కావలసినార్థముకావలయుననితత్ప్ర । భా వమెరిగియడుగుబ్రహ్మపదంబిత్తుదుర్భ్రమలననణచీ । శ్రీగురుత్ప్రభా వము దలచీ. 2

తా. మానసపుత్రా ! నీవిపరీతభావములను, సంశయమార్గములను విడచి, శ్రీగురుమూర్తి యొక్క ప్రభావము నెరిగి, యేక మనస్సుతోటి నీకు కావలసిన పరమార్థము నడుగుము, తత్క్షణమే నీకు పరిపూర్ణపదము నిచ్చెదనని భావము,

కం. ఎందాకమీఁదుమర్మము । గందునునెందాకతత్వకథలాశ్చర్యం ।
బెందాకవిందునను భవ । మెందాకనెరుంగసాధ్యమికయుక్తి లేదూ।
సాధనసాధ్యయుక్తిగనరాదూ । ముందుదెల్పెటి బ్రహ్మానందబోధ
నెరిగే । టందు కేసాధనబృందమున్నదో తెల్పుమికశక్తి లేదు ।
సాధనసాధ్యయుక్తిగనరాదూ. 3

తా. దేవా ! తమరుచేయు తత్వబోధయందాక విందును, తమ మర్మమెందాకకందును, సాధనచేత సాధించేయుక్తి కనుపడ లేదు, ముందు నాకు చెప్పబోయే బ్రహ్మానందబోధ నెరుగుట కేయే సాధనలున్నవో. నాకు దెల్పుమని భావము.

కం. ఏసాధనలాసించిన । మోసము లేకాని లేదు మోక్షంబని మో !
హాశక్తి విడచిగురువి । శ్వాసములోనిలిచియోగశక్తి చేబూనీ । స
ర్వాబద్ధయుక్తులుమానీ । యేసాధనలమీఁది నాసవదలితివని । భా
సజేసిననీకుపరిపూర్ణ మెరిగింతు శక్తిచేబూనీ । సర్వాబద్ధయుక్త
లుమానీ. 4

తా. దానవర్యా ! నీవేసాధనలు కోరినా, వాటివలన మోసము లేకాని మోక్షము లభింపదు, గురునియందు విశ్వాసము గలిగి, సర్వాబద్ధమైన యుక్తులను వదలివేయుము, సాధనలమీఁది ఆశవదలితివని నీవు ప్రమాణముజేసిన యెడల నీకు పరిపూర్ణబోధ నొసగెద నని భావము,

కం. సత్యముబ్రహ్మముజగమున । సత్యముతనువెరుకలనుచు సమరస
ముగనే। వ్యత్యాసపడకగురుపద। సత్యమునత్యంబటంచుసత్యహృద
యమునా॥ పలికెదసర్వసత్యయోగమునా । సత్యత్రివిధమహాసత్య
మెనర్చెద । సత్యమువిడువనసత్యమాసించను సత్యహృదయము
నా । పలికెదసర్వసత్యయోగమునా. 5

తా. గురుసార్వభౌమా। నేను మాటికి ముమ్మాటికి ప్రమాణము చేయుచున్నాను, బ్రహ్మసత్యము, జగత్తుశరీరాత్మలు అసత్య

ము, నేను సత్యమును వికువను, అసత్యము నాసించను, నామనఃపూ ర్తిగా బాసజేయుచున్నానని భావము.

క॥ నను గనియుమీకు కృపతో । ఘనతర పరమార్థమచలకథ దెల్పద నక్ । గనియడుగుట విని తెలుసుట । మనకొకకలవలెను వెనక మాటవట్టిదిగా । బోధయు మేల్కనిననంటకుగా । వినసొంపుగనుక కలగనినీవు ముందేమే । ల్కొనినన్ను మేల్కొల్పుడని తెల్పుబోధిం తుమాటవట్టిరిగా । బోధయు మేల్కనిననంటదుగా. 6

తా. దాసతిలకమా! నీవు నాసముఖమందు జేరి, పరమార్థమైన పరిపూర్ణకథ తెల్పుమని నన్ను నీవడుగుట, నేను నీకు చెప్పిన దాని విని నీవు తెలుసుకొనుట నొక స్వప్నమువలె నబద్ధము, జాగ్రతయందు స్వప్నానుభవము నబ్బరకాదా; వినుటకు సొంపుగనుక స్వప్నమందు గనపడు పదార్థములు మేల్కనిన వేమీలేవనే మెళు కువను నీవు ముందు పొంది నన్ను మేల్కొల్పుమని భావము.

కం. మీరేమిబోధ జేసిన । నూరికెవిన నేమిఫలమునొనరుతలర్థం । జే రీతిబోధపడునో । దారెరుగనివానిగాన దగ్గరదీసీ । నాజన్మకడ తే రగజేసీ । నూరిజనులలోమీపేరుప్రఖ్యాతివిని । చేరితి మీయంత వార్నిగానను జేయు దగ్గరదీసీ । నాజన్మకడ తేరగజేసీ॥ 7

తా. దేశికవరా! మీరేమి బోధజేసినను, నేను వూరకవి నినందున నేమిఫలము గలుగును? బోధయొక్క భావము నాకేతీ రున బోధయగునో, నేనేమియు మార్గము తెలియని మూఢుని గనుక తమదగ్గర జేర్చి నాజన్మసఫలము జేయండి, పెద్దలలో మీపేరు ప్రఖ్యాతి విని తమ సన్నిధిలో జేరినాను, దయచేసి మీయంతటివా రినిగా నన్ను జేయుడని భావము.

కం. మాటకిమాటికి మాటలు । బూటముగపల్కనగునె బోధయుమ దిలో । నాకెనుచాల్చాలనినీ। నోటనునీవన్నదనుక నుడువుచుండె

దరా। పాటువలచే లెస్సదెల్పెదరా। కోటికొక్కటిజెల్లే మాటలు దెల్పుము। మ్మాటికినసునీవై పాటించీనదనుక నుడువుచుండెదరా। పాటువలచే లెస్సదెల్పెదరా॥ 8

తా. శిష్యా! పదేపదే బూటకములెందుకు, అనేక మాటల కొకమాట చెల్లేటట్లు అనేకదృష్టాంతరములు చెప్పి బోధించెదను. బోధ నాకు తెలిసినది చాలు చాలునని నీవుఅనేవరకు యింతయెందు కు ముమ్మాటికి నేను నీవై నీవుచాటించేవరకు బోధించెదనని భావము.

కం. ముద్దుగముద్దుగమునుబహు। పెద్దలచేమీప్రసిద్ధి ప్రియముగ వినిమీ। వద్దికిచనుదెంచితి నా। పద్దికగెల్పించి బ్రహ్మభావము దెల్పూ। పరిశుద్ధబోధాసక్తి నిలుపూ। ముద్దమోటులనైన బుద్ధులుదెల్పి పరి। శుద్ధులజేయు ప్రసిద్ధిమీదేగనుక భావము దెలుపు। పరిశుద్ధ బోధాసక్తి నిలుపూ॥ 9

తా. స్వామీ! నేను మొదట అనేక పెద్దలవలన తమయొక్క ప్రసిద్ధి విని తమ సన్నిధికి వచ్చితిని, తెలివిలేని మొద్దులనైనను తమ బోధ వలన పరిశుద్ధులను జేయు కీర్తి తమదే గనుక, నాప్రతిజ్ఞను గెలిపించి బ్రహ్మభావమునాకు తెల్పుమని భావము.

కం. అచలమహాతత్వముశ్రుతి। నిచయములోభామయోగనిత్యోత్తమ హా। సుచరిత్రబ్రహ్మవిద్యా। భ్యుచితశిరోరత్నమగుచుభువిని పెం పొందూ। అనంతోపనిషదర్థ మందూ। ప్రచురమగుపరమార్థ రచనచేపరిపూర్ణ। మచలోపదేశము వచియింతునీమహిమభువి ని పెంపొందూ। అనంతోపనిషదర్థమందూ. 10

తా. పుత్రరత్నమా! బ్రహ్మవిద్యకెల్ల శిరోభూషణమై అనం తోపనిషత్తుయొక్క అర్థమైన అచల మహాతత్వము వేదములలో భామయోగవిద్యయందంతర్భూతమై ప్రకాశింపు చున్నది. దానివలన పరమార్థము నేర్పరచి అచలోపదేశమును జేసెదనని భావము.

కం. పరిపూర్ణమనగ నెరుకన । నరయగ రెండిట్లు చెలగునాదిలో నెరు
కే । తెరవునగ్గలను నేనిక । యెరుకనువిడుచుటకువిధము నేదిగు
రుస్వామీ । తెలుపుమునాకు సర్వాంతర్యామీ । పరిపూర్ణ
మే మొదటపరిపూర్ణముగ దెలిపి । పరికించి లేనెరుకపరిహరించు
ము వెనుక నేదిగురుస్వామీ । తెలుపుమునాకుసర్వాంతర్యామీ. 11

తా. గురువరా! విచారింపగా పరిపూర్ణమనియు యెరుకయనియు, రెండున్నట్లు వున్నది. మొదట ఎరుక యే ప్రకారము గలిగెను ? ఇకను నేను ఎరుకను విడచుటకు మార్గమేది? నాకు తెల్పుము. మొదట పరిపూర్ణమును విశదముగా దెల్పి, తరువాత లేనియెరుకను పోగొట్టుమని భావము.

కం. మొదలచలము నెరుగుటకై తుదకువిమర్శించియెరుకతొలిగించు
టకై ! ముదమలర బ్రహ్మవిద్యా । భ్యుదయ మహావాక్య మంత్ర
మూలమునందూ । వేదోపనిషదర్థములందూ । పదిలముగను
మూడు బ్రహ్మమంత్రములున్న । విదిగో దెల్పెద నేనుమదిగురువు
లనుదలచీమూలమునందూ । వేదోపనిషదర్థములందూ. 12

తా. శిష్యాగ్రణీ! వినుము మొదట నచలము నెరుగుటకును, విచారణచేసి తుద కెరుకను విడచుటకును, మహావాక్యమంత్రమూలములో, బ్రహ్మమంత్రములు మూడున్నవి. నాగురువును నామనసున ధ్యానించి, ఆమంత్రములను నీకు దెల్పెదను, గ్రహింపుమని భావము.

కం. ఏమోమీమహిమలునిం । కేమోసకలాగమముల కేమూలము
ము ! దేమో వెను కేమోగురు । స్వామీబోధింపు మంచీసమయ
మిదేగా । ననుబ్రోవభారముమీదేగా । నామదిలోనీవే దేవుడవని
తోచే । యేమోచిత్రముయింకేమిదోచదు దేవసమయమిదేగా ।
ననుబ్రోవుభారముమీదేగా. 13

తా. పరమపావనా! నన్ను రక్షించే భారము మీదే, ఇది యేమిచిత్రమో నామనసునందు మీరే దేవాదిదేవుడవని తోచును న్నదిగాని మరియేమియు తోచుటలేదు. మీమహిమలింకా యెమో సకలమైన ఆగమములకు మూలమేమో; ముందేమో వెనుకేమో యిదే మంచి సమయము గనుక నాకు బోధించుమని భావము,

కం. మంత్రత్రయములుసర్వస్వ । తంత్రములై వెలగు వాటితాత్పర్య మున । మంత్రముగాదెల్పెదనీ । మంత్రత్రయమెరిగి యచల మహిమగ్గ కొనరా । బయలెరుకాలతంత్రముల్ గనరా । మంత్ర తంత్రములలోమర్మ మెరిగియచల । మంత్రమీవై యెరుకతంత్ర ముల్ విడనాడుమహిమగ్గ కొనరా । బయలెరుకల తంత్రముల్ గనరా, 14

తా. పుత్రా! యీ మూడు మంత్రములును సర్వ స్వతంత్ర ములై ప్రకాశింపుచున్నవి. వీటియొక్క అర్థమును సమంత్రముగా దెలిపెదను, ఈ మూడు మంత్రముల నెరిగి, మంత్రతంత్రముల మర్మ ము తెలిసికొని, అచలమంత్రమేనీవై, అబద్ధపు యెరుకతంత్రములను విడనాడుమని భావము,

కం. ఆమంత్రత్రయములకును । నీమక్రమధర్మ కర్మనిర్ణయములు ము । న్నేమర్మములోనున్నవో । యామూలము బోధజేయుమ మలవిచారా । నిరుపమనిత్యనిర్వాణధీరా । మీమహాతత్వార్థ మేమో మొదట నెదెల్పి । యామీదనీయెరుకనామమణగజేయుమ మలవిచారా । నిరుపమనిత్యనిర్వాణధీరా. 15

తా. తండ్రీ! యీ మూడు మంత్రములకును, నీమక్రమకర్మ ధర్మము లిదివరకేమర్మములున్నవో సక్రమంబుగాబోధించి పరిపూర్ణ తత్వమును మొదట తెల్పి, తరువాత నెరుకయొక్క పేరు లేకుండా జేయుమని భావము.

కం. పరిపూర్ణము నెరిగించెద । పరబయలిదిగో యఖండభావముచేత ।
త్పరమార్థసిద్ధిగనదగు । పరిపూర్ణబ్రహ్మ మంత్రపటలమునందూ॥
వాక్యార్థమొక్కటిజలగెముందూ । మరి యీావృత్తబట్టబయలేమి
యులేదను । సరణియీాద్వాదశాక్షరి మొట్టమొదటిది పటలమునం
దూ । వాక్యార్థమొక్కటిజెలగెముందూ. 16

తా. దాసరత్నమా! పరిపూర్ణము నెరిగించెదను, అఖండ భావముచే పరిపూర్ణానుభవము పొందవలెను. అదిగో పరబయలు బ్రహ్మమంత్రములలో యీా యుత్త బట్టబయలేమియు లేదు అనునది మొట్టమొదటిది. ఇదే ద్వాదశాక్షరియని భావము.

కం. ఇదితప్ప యేమిలేదా । తుద మొదలేకత్వమనుచు తోచెనిదేమో।
కదలక మెదలకనుండే । పదమచలంబిదియటంచు భావింపగలనా ।
ముదమలర బోధను జెందగలనా । యిదితప్పవేరుంటె అదిముందు
జూపించు । ఇది యదిజూపించితుద కేమి జేసెదవో భావింపగలనా । ము
దమలర బోధను జెందగలనా. 17

తా. గురువరా యిది తప్ప యికనేమియు లేదా? ఇదితుదా మొదలు నొక్కటేనని తోచుచున్నది. కదలక మెదలకయుండే అచలపదమిదియని నేను భావించగలనా? అది నాకు బోధపడునా? యిదిగాక యింకొకటి వేరుంటే దానిని నాకు ముందు జూపింపుడు, యిది అది చూపించి కడపట నన్నేమి జేయుదురో యని భావము.

కం. ముదమాయెను నీమాటకు । మదిలోపలవిన్న నితరమహానీయ్యుల
తో । నెదిరించియిటులబల్కిన । చెదరుగదా వారిదివ్యచిత్తము
తండ్రీ । కుదిరినబుద్ధివదలాకుతండ్రీ । ఇదితప్ప వేరులేదని తెల్పెనా
మాట । మొదటిమంత్రములోనే మునిగియున్నదిచూడుచిత్తాము
తండ్రీ । కుదిరినబుద్ధివదలకుతండ్రీ. 18

తా. ముద్దులకుమారా! నీమాటకు నేను చాలాసంతోషించితిని, కుదిరినబుద్ధి కదలకుము, నాతో మాట్లాడినట్లితర పెద్దలతో

మాట్లాడినవారి దివ్యచిత్తము చెదిరిపోవును గనుక, నిటులవారితో పలుకకుము. ఇది తప్ప వేరులేదనేమాట మొదటి మంత్రములోనే యున్నది. ఆలోచించి చూడుమని భావము.

కం. రెండో మంత్రము దెలుపుము । ఖండాఖండార్థములుగగన్పడి వెలి
 లో । నిండిమరుపెరుకలనునివి । రెండును నన్నుండవిడువ లేదునీ దే
 మో । అపుడేపుట్టిగిట్టుట దేమో । వుండివుండని యెరుక మొండి మే
 శముదీని । ఖండించే సాధనని౦డార దెలుపు పోలేమనీ దేమో । అపు
 డేపుట్టిగిట్టుట దేమో.					19

తా. గురుసార్వభౌమా! రెండో మంత్రము తెల్పుడు. యెరుకమరుపులు యెప్పుడును నన్ను విడువకున్నవి. అవి అప్పుడే పుట్టుటేమో, అంతలో నశించుటేమో, వుండి యుండని యెరుక మొండి మేశముగా నున్నది. ఈబాధను నేను పడజాలను. దీనిని పోగొట్టే సాధన నాకు చక్కగా బోధింపుమని భావము.

కం. బోధమహావజ్రాయుధ । సాధనచేపంచబద్ధసంశయశైల । చ్ఛేద
 మగుచుసుఖో । పాధికమగు యచలమంత్రపటలములోన । శృత్య
 ర్థ మొక్కటిజెలగుగానా । ఏదీమొదట లేదో అదియిక యేమిలే ।
 దిద్ధమంత్రమేపంచదశిరెండవదివినుముపటలములోనా । శృత్యర్థ
 మొక్కటిజెలగుగానా.					20

తా. శిష్యశ్రేష్ఠా! అచలమంత్రములలో ఏది మొదటలేదో, అది యిక నేమిలేదు. అనునది రెండవమంత్రము. ఇదే పంచదశి మంత్రము. ఇది పృథివ్యాపస్తేజోవాయురాకాశములను పంచభూతములకూడికచే నేర్పడిన నంశయమనే పర్వతము దీనిని గురుబోధ యను వజ్రాయుధముచే ఛేదించి పరసుఖము జెందవచ్చును.

కం. మూడవమంత్రము దెలుపుము । నాడుచుపాడుచునుమోహనటనా
 దులచే । కూడుచువీడుచుతనువులు । మూడున్నేకీభవించి మరియు

మూలమొక్కటిగా । దృష్టికిదోచిపీడలంటెనుగా । ఆడాడకన్పడు జాడలన్నినిలచే । కూడలింకేడనాకీజాజూపించా వేమూలమొక్కటిగా । దృష్టికిదోచి పీడలంటెనుగా. 12

తా. గురునాథా! మూడవమంత్రమును దెల్పుడు, స్థూలసూక్ష్మకారణదేహము లొకటియై గూడుకొనుచు, విడచి పోవుచు, ఆడుచూ, పాడుచూ, అనేక మోహనటనలు గనబరచుచు, మురియుచూ, కంటికిగోచరములై పీడగలిగినదిగదా ? యీ వ్యత్యాసపు రూపములచేత నగపడే జాడలన్నియు నిలిచిపొయ్యే సంధి యింకా యెచ్చటనున్నదో నిప్పుడే తెల్పుమని భావము.

కం. ఆమూడోమంత్రమునిదె । నీమముగను కనులుమూసి నెమ్మదివినినీ । సామర్థ్య బలముకొలదిని । యేమారక మరవబోకు మీమంత్రసరణీ । వాక్యార్థమొక్కటిగలదు ధరణీ । ఈమూలములేకగు ర్తెరిగెశరీర, మేమిలేదనుమంత్రమి దేషోడశాక్షరి యీమంత్రసరణీ । వాక్యార్థమొక్కటి గలదు ధరణీ. 22

తా. శిష్యశ్రేష్ఠా! మూలములేకగుర్తెరిగెశరీరమేమీ లేదూ, అనునది మూడోమంత్రము ఇదే షోడశాక్షరీమంత్రము నీమముచేత కనులుమూసికొని నీసామర్థ్యము కొలది విని దీనిని మరువవద్దుసుమూ యని భావము.

కం. ఈమంత్రత్రయమహిమలు । వేమరువినవినగ మనసువిభ్రమగతమై । యేమిాదోచనినిత్యని । రామయమైచెప్ప చూపరాకాయున్నదిగా । పరవశమేమిబలుక నియ్యదుగా । ఈమంత్రార్థములు మూడేమూలనున్నావో । ఆమూలచెయిబెట్టి స్వామీచూపుము గనరాకయున్నదిగా । పరవశమేమి బలుకనియ్యదుగా. 23

తా. దేశికవరా! ఈమూడు మంత్రముల ప్రభావములు పదేపదేవినగా యేమిాతోచని నిరామయమై యిట్టిదని చెప్పుటకు నలవి

గ నుండా నున్నది. మనస్సు పరవశముజెంది పలుకలేక యున్నాను ఈమంత్రముల అర్థములు మూడున్నూ మూఁడున్నవో నన్నుచేయి పట్టుకొని ఆమూలచూపింపుము అనగా యేయేమంత్రార్థ మెచ్చట నున్నదో తెలుపుమని భావము.

కం. తొలియచలమంత్రమంతట। గలదావలిమంత్రయుగము గనుగొ నుమిదె చెం। తలవింతలనంతనచే। తలపులలోతలపెకలిగి తానే చూచేదీ। తలచేదిపిలచేదినిలచేదీ। చెలగివినుకనుతినుమెలుకువ లవిగాదె। తొలిదానినమ్మినావల రెంటివిడనాడుతానేచూచేదీ తలచేదిపిలచేదినిలచేది.		24

తా. మానస కుమారా, మొదటి అచలమంత్రము అంతటా నిండినిబిడీకృతమై యున్నది. కడమ మంత్రములన్ననో దగ్గర నే మనో రూపమై మహావింతగా తలపులలో తలపుగలిగి చూచేది వినేది పిలి చేది నిలచేది కనేది మొదలగు మెళకువలు గలిగియున్నవి. మొదటి దానిని నమ్ముకొని కడమరెంటిని విడచిపెట్టుమని భావము.

కం. ఎరిగితినసర్వార్థము నే। నెరిగెటిదీయెరుకయనుచు నెరిగితిమిము నే। మరిగితితద్బోధస్థితి। మరుపెన్నడురాదు దివ్యమహిమేమోకానీ। అయిననునాపై యరమరమానీ। యెరిగినపరమార్థ మెరిగినట్లేనిల చే। స్థిరసమాధిబోధ తెర వెరగింపు మీమహిమేమోకానీ। అయి నను నాపై యరమరమానీ.		25

తా. పరంధామా, నేను సర్వార్థమును గ్రహించితిని యెరి గేది యెరుకయని నెరిగితిని. నామనస్సును తమయందు చేర్చితిని తమ యొక్క మహిమయేమో తమరుచేసిన బోధ నాకెప్పుడు మరపురాదు అయినను నేనెరిగిన పరమార్థము యెరిగినట్లే నిలచియుండునట్టి స్థిర మైన సమాధిని కలుగజేయు బోధమార్గమును తెలియజేయుమని భావము.

కం. ఈమూడుమంత్రములలో । నామధ్యది నెరిగియీవలావలిరెంటిన్ ।
నీమక్రమబోధలచే । సామర్థ్యమువలనగనుము సత్యమిీమాటా ।
తెలియుముయోగక్షేమమిచ్చోటా । నేముందు బ్రహ్మసుఖానంద
మును దెల్ప । నీమందమతిమాని యామునుముకధవిను సత్యమిీమా
టా । తెలియుముయోగక్షేమమిచ్చోటా. 26

తా. శిష్యా. ఈమూడు మంత్రములలో నడిమిదియనగా పంచ దశీమంత్రమును నెరిగి యివతలి అవతలి మంత్రములనగా ద్వాదశాక్షర షోడశాక్షర మంత్రములను క్రమముగా నియతమైన బోధవలన తెలిసికొనుము. పరమార్థమును తెలియుక్షేమమిదే యికముందు నీకు బ్రహ్మసుఖానందమును బోధించెదను నీమందమతిని విడచి ముందు చెప్పబోవు బోధనువినుమని భావము.

కం. నడిమంత్రార్థము దేనికి । కడుమైత్రిగదోచి లోకకధలెరిగించున్ ।
కడకెందులోన లయమగు । నడిమంత్రము కేదిపట్టు నాకునీగుట్టూ ।
దెలుపుచుపరముజేర్చ్యాకడగట్టూ । జడుపును లెన్నగవిడిచి బోధి
టువిందు । విడువకుండినకడు చెడు నాత్మహిత మెట్లునాకునీగుట్టూ ।
దెలుపుచుపరముజేర్చ్యాకడగట్టూ. 27

తా. గురువరా, పంచదశీమంత్రార్థమేమంత్రముకు సంబంధము కలిగి లోకనటనలను తెల్పుచున్నది. కడపటికెందులోన లయమగుచున్నది. ఈనడిమంత్రముకు పట్టుదలయేది యీరహస్యమును దెల్పి కడ గట్టైన పరిపూర్ణమునందుజేర్పుము నేనిట్లు అడుగుచున్నానని మీరను కొనెదరేమో భయము విడచి యడుగకున్న ఆత్మహితముచెడి నిష్ఫల మగుచున్నది గనుక స్వామీనాకు దయచేసి చెప్పుమని భావము.

కం. ఎరుకశరీరమునకు ప్రియ । కరమైతనలోనె తాను గల్పించుచు
శ్రీ । గురుబోధాచలవనధిలో । సరసముగను బుద్బుదములు సలిల
మైనటులా । విలయమునొందుతను వెరుకలటులా । మెరుకచేత

నెయచలమెరిగి పరిపూర్ణమై । యరిగేటిమెరుకను గురుతుండ
నియ్యకుసలిలమైనటులా। విలయమునొందుతను వెరుకలటులా. 28

తా. శిష్యరత్నమా ! వినుము సముద్రోదకమునందు బుద్బుద
ములు పుట్టితిరుగా ఆనటియుండే లయమగు రీతిగా యెరుక (అనగా
తెలివి; దేహమునకు నింద్రియకరమై తనలోతానే గనబడుచు తను
వెరుకలురెండును గురుబోధయను అచలమహాసముద్రమునందు లయిం
చుచున్నది. ఈయెరుకచేతనే అచలమిట్టిదని తెలిసికొని పరిపూర్ణమై
యెరిగెటి యెరుకను వదలిపెట్టుమని భావము.

కం. గురువరమంత్రమ్ములలో । పరిపూర్ణము మొదటిమంత్రభావము
దెలుపున్ । యెరుకశరీరేంద్రియముల । నరయువిమర్శింప చాలున
ట్టివిరెండూ । మంత్రములొక్కసరణిచేనుండూ । యెరుకెప్పుడల
నడిమిమరుగు మంత్రములోన । తిరుగుగజటక్కరి తెరగుబోధకుజి
క్కాకనట్టివిరెండూ । మంత్రములొక్కసరణిచేనుండూ.		29

తా. గురువరా ! మొదటిమంత్రము విచారించగా పరిపూర్ణ
భావమును దెల్పుచున్నది. కడమరెండు మంత్రములు దేహి దేహ
ములను విమర్శింపగలవిగా నున్నవి. మంత్రములొకటే తీరుగానున్నవి.
యెరుకయనునట్టి దేహి యెప్పుడున్ను నడిమంత్రములో మహామాయ
లమారిగా తిరుగుచున్నది. గాని గురుబోధకు చిక్కేటట్లుగానె యున్న
దని భావము.

కం. కడుమొదటిమంత్రమీవై । నడిమంత్రపుపట్టువిడుపు నమ్మకముల
తో । గడుపుచుకడమంత్రార్థము । విడిబడిగు ర్తెరిగి రెంటివిడరా
మాయప్పా । వినుమీమూడుగడుసులేనప్పా । ముడతలేనిబోధ
మూటినొకటిగ తెలియ । నడిమీదికేల్పైడలి తోడిమె మొదటిదెని
ల్చి విడరామాయప్పా । వినుమీమూడుగడుసులేనప్పా.		30

తా. అజ్ఞాయీ! మొదటిమంత్రిమనగా, అచలద్వాదశాక్షరినిపై, నడిమంత్రమైన పంచదశియొక్క పట్టు వదలుము. నమ్మకముచే నీప్రకారముచేయుచు, కడపటి మంత్రమైన షోడశాక్షరిని విమర్శించి తుదకు రెంటిని విడువుము. వడివచ్చుములేని యీబోధచే మూటిని నకటిగా తెలిసికొనినయెడల నడిమంత్రపు, మెరుకకీలు విరిగిపోవును. మొదటిదైన పరిపూర్ణమే నిలుచునని భావము.

కం. కావలయు మొదటిమంత్రమ । దేవక్కటి దెలుపజాలదా మేపనికై
యావలిమంత్రద్వయముల । తోవివరింపగను బలమైతో చేమూడే
లా । తెలుపుము యోగభావసంశీలా । దేవశ్రీగురుమహాదేవ మీపా
దపద్మ । సేవజేసెదబ్రహ్మ । భావసంసిద్ధికై తో చేమూడేలా ।
తెలుపుము యోగభావసంశీలా. 31

తా. శ్రీగురుమహాదేవా! తమ పాదపద్మముల సేవించెదను, మొదటి మంత్రార్థము వల్లనే తమరుచేయుబోధ తేటపడుచున్నది. కడమమంత్రములు రెంటితో కూడా బోధించుచున్నారే యెందుకు. బోధబాహుళ్యమేకాని ప్రయోజనము కనుపడలేదు. ఇట్లు బోధించుటకు కారణమేమని భావము.

కం. ఇలమంత్రముతంత్రముతో । కలసిన కార్యములుజరుగుగద నిందొ
కటికి । తొలగినసంతనపడదిక । చెలువుగ నీమంత్రతంత్రచర్యల
తోనూ । సర్వక్రియలుజలగునీధరనూ । యీలయమంత్రతంత్రవి
ధులలోమర్మము । తెలసినసద్గురుకలసి తెలియుము కార్యచర్యలతో
నూ । సర్వక్రియలుజలగునీధరనూ. 32

తా. భూమియందు మంత్రతంత్రములు రెండున్నూ కలసి సర్వకార్యములు జరుగుచున్నవి. యిందులో నొకటితొలగినను కార్యములు జరుగవు. లయించిపోయ్యే యీమంత్ర తంత్రములలోని మర్మమెరిగిన సద్గురుమూర్తిని జేరి తెలిసికొనుమని భావము.

కం. బోధాచార్యులునాదిలో । సాధుజనాళులకుముఖ్యసాధనచేమం ।
  త్రాధారముతేర్పరచిరో । బోధప్రకరణముతెన్నొ । పొలుపొందఁ
  దెలుపూ । సంశయరహితమేధలోగలుపు । శోధించిప్రార్థగాగా
  ధలుపరికించి । యోధచేపరతత్వసాధకమగువాటిపొలుపొందఁ దెలు
  పూ । సంశయరహితమేధలోగలుపూ.                33

తా. గురుదేవా ! ఆదియందు బోధాచార్యులు, ముముక్షుల కొరకు, గోప్యమంత్రాధారము లేర్పరచిరి. అనుభవము యొక్క గాధలు విచారించి, పరతత్వమునకు సాధనభూతములగు ప్రకరణము లెన్ని నాకు తేటగా దెల్పి నాసంశయమును బోగొట్టుమని భావము.

సర్వమంత్రార్థసమాప్త నిజగురుబోధ.

కం. పూర్వాచలోపదేశిను । లుర్వీస్థలిద్వాదశాక్షరొక్కటిచాతన్ ।
  సర్వాచలపరిపూర్ణపు । సర్వార్థమునుదెలియప్రథమసాధనమిదిగా।
  జేయుచుబోధ నిర్వహించిరిగా । అర్వాణముగషోడశాక్షరితోడనా
  తర్వాతనువెరుకమరుపులుతొలిగింపసాధనమిదిగా ! జేసియుబో
  ధనిర్వహించిరిగా.                34

తా. ఆదికాలమందే యీ ప్రపంచంబున ముముక్షువులకు బోధజేయు, అచలగురువులు, పరిపూర్ణము యొక్క పూర్ణానుభవము కలిగించుటకు, ద్వాదశాక్షరిని ప్రథమసాధనగా నేర్పాటుచేసి తర్వాత షోడశాక్షరిచే, తనువెరుకలయొక్క భ్రమను పోగొట్టుచు, వచ్చిరని భావము.

కం. యీమంత్రార్థములోపల । శ్రీమద్గుణయచలభోగశిష్టాత్ములుశ్రీ ।
  త్యామూలముగవిధించిన । నీమంబగుభామవిద్యనీకుతెల్పితిగా ।
  నీలోనాలోనిజమునుజూపితిగా । సామర్థ్యముగగురుదేవునికృపగలిగి ।

యీమూలమొదలక స్వామివై యికబ్రతుకునీవు తెలిపితిగా । నీలో
నాలో నిజము జూపితిగా. ౩౫

తా. దాసతిలకమా! పరిపూర్ణానుభవముగల మహాపెద్దలు, ఉపనిషత్సారభూతముగా నేర్పాటు చేసిన, భావవిద్యలోని యీ మంత్రార్థమును నీకుదెల్పితిని. నీలో నాలో నుండు నిజమైన మర్మము కనుపరచితిని, నీయొక్క శక్తి కొలది గురుదేవునిదయను, పొంది యీ మూలము నొదలక స్వామివై బ్రదుకుమని భావము.

---



శ్రీగురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైతప్రబోధ గురుశిష్య సంవాదము:

## ద్వితీయ ప్రకరణము.

అఖండసమాధి సార్ధాంతిక అచలశంకానిరూపణ ప్రకరణము.

కం. పరిపూర్ణబోధనాకే । తెరగునమదికందునట్టిదివ్యసమాధ్యం । త
రయోగనియమయుక్తుల । నెరిగింపుమనంగశిష్యు నెలమినిజూచీ ।
దయచేసిదగ్గరచారబిలచీ । గురుడుపలికెనుయచలగురుతులగుపదు
యోగ । మరుగులెరిగింతునేమరకుండవినుమనుచు నెలమినిజూచీ।
దయచేసి దగ్గరచారబిలచీ. 1

తా. దేవా! పరిపూర్ణబోధనామనస్సు కారూఢమయ్యె సమాధియొక్క మరుగైన యోగమేమో, నీమహిమేమో తెలుపుమని శిష్యుడడుగగా, గురువరుడు దయారసముచే, శిష్యునిజూచి, దగ్గర కూర్చుండబెట్టుకొని, నాయనా పరిపూర్ణగురుతులగుపదు యోగము యొక్కమరుగులు నీకు చెప్పెదను. శ్రద్ధతో, జాగ్రతగా వినుమని చెప్పెనని భావము.

కం. శ్రీమహితయచలబోధను। ధార్ణవమహిమంబుసద్బుధాళులకొరకీ।
భూమినిమున్నెగజల్లిన । యామూలమురుభవసిష్ఠయజ్ఞానులచే ।
శుకజనకసనకాదిమహానులచే । నీమోక్షకథబుట్టిప్రేమమీరగశివ ।
రామదీక్షితులచే నీమహిమవిలసిల్లెయజ్ఞానులచే। శుకజనకసనకా
దిమహానులచే. 2

తా. అచలబోధయను అమృతసాగరము యొక్క మహిమను సత్పురుషులకొరకు ప్రపంచమునం దాదియందెగజల్లిన ఋభు, వశిష్ఠ,

బ్రహ్మ, శుక, జనక, సనకాది పురుషులచే నీమోక్షకథ పుట్టెను. తరువాత శివరామదీక్షితులవారిచే దీనియొక్క మహిమ ప్రకాశించె నని భావము.

కం. శివరామదీక్షితులనే । పరివిమలముగఁదలఁచిసత్ప్రభావగురుకుం గో ।
ద్భవశిష్యపరంపరలను । సవినయముగఁదలఁచియాత్మసద్గురు నెంచీ ।
మద్గురుపుత్రసమూహము నెంచీ । జీవైక్యసువిలాసచిన్మయాచలబోధ ।
భువిలోనఁదెల్పినీభవబంధమణఁచెనసద్గురు నెంచీ । మద్గురుపుత్రనివ
హము నెంచీ 3.

తా. శిష్యాగ్రణీ! నేను వినయవిధేయములతోటి, శ్రీ శివరామదీక్షితులవారిని, వారిశిష్యపరంపరలను, నాసద్గురుమూర్తిని, నాగురుపుత్రసమూహమును వినుతించి, జీవభ్రాంతిని పోగొట్టి అచలమం దైక్యమయ్యె పరిపూర్ణబోధజేసి, నీయొక్క పాపబంధములను పోగొట్టెదనని భావము.

కం. శ్రీగురుపదసంస్మరణచే । నాగమపరిపూర్ణనిర్గుణానందమహా ।
యోగార్థభావవిధులను బాగొప్పగబ్రహ్మవిద్యపరులవినుతించీ ।
పలికెదపూర్వపలుకు లేగాంచీ । నాగుతుణిబయలులోదాగి సూచ
నసేతు । బాగువోగులుయచలభోగులుక్షమియింప పరులవినుతిం
చీ । పలికెదపూర్వపలుకు లేగాంచీ, 4.

తా. శ్రీగురుమూర్తి పాదపద్మముల నారాధించి, గుణరహితమైన కేవలానందముచే నొప్పు మహానుభావులను, బ్రహ్మవిద్యయందాసక్తిగల బుధవరులను కొనియాడి గురుపరంపరగావచ్చె నాగురుబోధవలన నేను గ్రహించిన అనుభవము యొక్క పలుకులే పలికెదను. నాయొక్క గుర్తు నేను పరిపూర్ణములో దాగి సూచన జేసెదను. మంచిచెడ్డలు అచలగురువులు క్షమించవలెనని భావము,

## నిజగురుస్తుతి.

కం. నాగురుతత్త్వమునేనే । నాగురుతత్త్వోపదేశనటనయునేనే । నాగురుమహిమనునేనే । నాగురునకుయధికమొక్కనాటికేనెరు । గానెరుగనేయెరుక కేగుర్తెరుగా । నాగురునకు మ్రొక్కి నేసుతు సూచింతు నాగురుతుకనువిను లోగురుతేకదయింకేనాటికేనెరుగగా । యెరుగనేయెరుక కేగుర్తెరుగా. 5

తా. నాగురుతత్త్వమైన పరిపూర్ణము నేనే, నాగురువు చేసిన తత్త్వోపదేశమైన అచలముయొక్క నటన నేనే, నాగురుమహిమయును కేవలాత్మ నేనే, నాగురురూపమైన పరిపూర్ణము కంటె నెక్కువైన దానిని నే నెన్నడెరుగను, యెరుగననే గుర్తేదో నేనెరుగను. అట్టి నాగురునకు వందనముచేసి నాగుర్తు సూచన జేయుదును, నాగురుతనగా చూచేది, వినేది, యను లోగుర్తేకదా, లోగుర్తు అనగా తెలివిలో తెలివియని భావము

## ప్రథమ శంకా సూచనము.

కం. ఇదియేమిమహిమ శ్రీగురు । నకయునకే తెలియవలెను సత్యముగాన । న్ననదియనరాదనిగానీ విదితంబుగ వారికైనా వివరింపరాదూ । శక్యముగాదు విధితోచబోదూ । యిదియని తెల్పుటకిది యని తెలుసుటకు । నదివికారమెసూచనచేత దోచవలెవివరింపరాదూ । శక్యముగాదు విధితోచబోదూ. 6

తా: ఇదియేమో చిత్రముగా నున్నది గురుస్వామిని అనరాదనిగాని వారికైనను యిట్టిదని చెప్పుటకలవిగానట్లే యున్నది గనుక ఇదియని చెప్పుట యిదియని తెలిసికొనుట వికారమేగనుక సూచన చేయగానే గ్రహించవలయునని భావము.

## పూర్వవాక్యము.

ఇదియేమొ గురుస్వామికే తెలియవలెను. అనరాదుగాని

వారికి శక్యముగానట్టి యున్నది. ఉన్నది చెప్పశక్యముగాదు, గనుక చెప్పేదివికారముగను సూచనచేత గనుగొనవలయునని తాత్పర్యము.

ద్వితీయశంకాసూచనము.

కం. వినుమదినూచనమైతే । గనుగొనసీకొక్క భ్రాంతిగలిగుండమనీ। కనుసూచన నిజమైతే । యనిశము నేనుండబోనుయదియునేగానూ॥ నానమానమందరిలోనూ । గనుకభ్రాంతికి మూలమసితోచే దెరుకేచీ । కనరాదువినరాదు యచరానిదొకయెరుకే యదియునేగానూ । నానమానమందరిలోనూ. 7

తా. నేనుపరిపూర్ణ సూచనచేసి నీవదిగ్రహించిన వెంటనే నీకొక్క భ్రాంతియునుండదు వాస్తవముగా నాసూచనను గ్రహించిన యెడల నేననుభ్రాంతి యెన్నటికి యుండదు నాతోగూడా ప్రపంచ మందంతట అందరియందును సమానముగా ఛీ, ఛీ, భ్రాంతికి మూల మంతా నొకఎరుకే నని భావము.

కం. పాయక నేనదిసూచన । జేయగ నేస్వప్నమందుసింహముగనుదం । తేయడనిల్వక ప్రాణము । పోయినగతియెరుక లేకపో నేపోయనురా । పరబయలుకపాయమెచ్చటరా । యీాయుక్తిలోతోచే స్వాయత్న బద్ధకల । తోయట్టిసామ్యముగాయుండరన్నపుడే పోనేపోయనురా। పరబయలుకపాయమెచ్చటరా. 8

తా. గనుక నేనది సూచనజేయగానే కలలోసింహమును జూచి నయేనుగకు ప్రాణమేమిలేక పోయినట్లు యెరుకయెన్నడోలేక పోవు చున్నది. సూచనచేయగానే గ్రహించుయత్నము చేయక యెరుకచేత బద్ధులైన ప్రపంచభ్రాంతిగల బద్ధకులతోటి పరిపూర్ణానుభవము జెందిన పెద్దలు సమానరహితులని భావము.

పూర్వవాక్యము.

అది సూచనైతే నీకొకభ్రాంతియుండదు ఛీ అదిసూచనైతేనే మవుండను నాయందు అందరియందు సమానముగా ఛీ ఛీ భ్రాంతికి

మూలమంతా వకమెరుకేగనుక సూచనశాయగా నేకలలో సింహము
ను చూచిన యేనుగ ప్రాణము యేమిలేకపోయినటుల యెరుక లేకపో
తున్నది గనుక యీతోపకముతోచే బద్ధులతో సమానముగావుండరని
తాత్పర్యము.

తృతీయ్యాశంకాసూచనము.

కం. పరిపూర్ణమైనతనకొక । పరభ్రమలున్నవనుభ్రాంతి పలుకెన్నటి
కీపరిపూర్ణమునకు లేదిక । పరిపూర్ణమె పూర్ణమఖిలపరిపూ
ర్ణమంతా । బాహ్యాంతరమేకబయలంతా । పరిపూర్ణమున
కుదాంపత్యహిత కార్యము । పరనిర్ణయము లేని భావమువలెదా
నేపరిపూర్ణమంతా । బాహ్యాంతర మేక బయలంతా, 9

తా. పరిపూర్ణానుభవము జెంది అచలుడైన తనకు యితర భ్రమలున్నవను భ్రాంతిమాట యెన్నటికిని లేదు వెలుపల లోపల అంతాపరిపూర్ణమే యెరుకయుండుటకు చోటెచ్చటనున్నది. భ్రాంతి జన్యమైన లేని యెరుక లేనే లేదు. భార్యాభర్తల అనుభవమిద్దరికిని తెలిసియుండియు నితరులతో చెప్పుటకు నిర్ణయరహితమైనట్లు నిర్ణయరహితమైన పరిపూర్ణమునకు తానను అర్ధము చేయవలెనని భావము.

పూర్వవాక్యము.

పరిపూర్ణమైన తనకు భ్రాంతివున్నదన్న భ్రాంతియెన్నడో లేదు. దీనియర్ధము భార్యాభర్తల వుపమానమువలె నిర్ణయరహితమైన దానికి తాను అనే అర్ధము చాయగలరని తాత్పర్యము.

చతుర్ధశంకాసూచనము.

కం. పరిపూర్ణమునకుతనకొక । కొరవేరులు లేనియుక్తిపాడమితె
చాలుక । పరిపూర్ణమనినతానన । మరియొక్కటియనిననచల
మహిమాగాగనరా । గనుగొనిబోధమరిగితిరుగకురా । అహర
హమిది సర్వసహజసమాధిగ । అహమువిడచి గురుగుహాలోనహం
సోహమహిమాగాగనరా । గనుగొనిబోధమరిగితిరుగకురా. 10

తా. పరిపూర్ణమునకు తనకు వేరులేదనే దృఢయుక్తి తెలిస్తే చాలును పరిపూర్ణమనినను తాననినను వకటియనినను అచల మొక్కదానికే యర్థము యీబోధను మరిగి తిరుగకుము ఎల్లప్పుడును యిదేసహజసమాధిగా నుండుమని భావము.

పూర్వవాక్యము.

పరిపూర్ణమునకు తనకు వేరులేకుండాయుండే యుక్తి తెలిస్తే చాలును. పరిపూర్ణమన్నా తానన్నా వకటేనని తాత్పర్యము.

పంచమ శంకానూచనము.

కం. మూలములేకనుగురుతెరు । గాలయమగుతను వభేదమదినాకం టెల్ । వాలాయము వేరందురో ! చాలగనందరునభేద సామ్యమే గదరా । అట్టియభేదమంతావక్కటెరా । లీలతనురాకకు మూల మేమిలేదు । ప్రేలికడకుబోవ్వేదేలాగో తెలియదు సామ్యమేగద రా । అట్టియభేదమంతావక్కటెరా. 11

తా. మూలములేక గుర్తెరిగే శరీరమభేదము నాకంటేవేరే యెందరున్నారో అందరు అభేదమే అటువంటి భేదరహితమంతానమా నమే ఈశరీరము వచ్చేటందుకు మూలము యేమియులేదు శరీరనటన జరిపి కొసకుప్రవేసించుటకును యేమీలేదని భావము.

కం. ఇలసీతోపకములలో । పల తోచబడున్వికారగతులగుచు నుతా। కలలెట్లోయాలాగున । నలపరమపవాన మెవ్వుడుకూడితోచునురా । నేనుగానినిలకసత్యమురా । వెలయునభేదముతిలకింపగను నాతో । కలసినర్వముతాను తొలగిపోవునుగనుకకూడితోచునురా । నేను గానినిలకసత్యమురా. 12

తా. ప్రపంచమునందీ భ్రమరూపకమైన తోపకములలో తోచబడు అనుభవ వికారములు కలలో అనుభవమేలాగో నాలాగు

ననున్నది. అధ్యారోపాపవాదమనగా లేని యపవాదము కలుగుచున్నది. భేదరహితమని ఆరూఢియైనప్పుడు నాతోకూడా సర్వము మిథ్యయై పోవుచున్నది. నేనుఅనే ఎరుక లేనిది పరిపూర్ణమే నని భావము.

కం. ఇటువంటిసత్యమింతిం। తటువంటిటువంటిపంచుననశక్యముగా।
డటుగాననిదియుభేద్యము। తటుకునగుత్రింప బ్రహ్మతరమా నేచా
లా। గుతెరుగనెవ్వరునొక్కమూలా। గుహుతెరుగుప్రభావము
రయగుహుతెరుగుటే। గురుద్రోహమని యచలగురునిచేవినబడుతర
మా నేచాలా। గుతెరుగరెవ్వరునొక్కమూలా. 13

తా. ఇట్టి సత్యమైన పరబయలింత యంతయని చెప్పుట కలవిగాదు గనుక అదే భేదింప శక్యముగానిది ఈగుట్టుతటుకున తెలియుటకు బ్రహ్మకునహా నలవిగాదు గుత్తెరుగుట కెవ్వరున్నారు గుత్తెరిగేదాని ప్రభావము గుత్తెరుగుటే గురుద్రోహమని యచలగురువులని భావము.

కం. ఇదిసర్వానర్థములకుఁ। కుదురైగన్పట్టుగనుకక్రూరులెరుకచే।
మదిచెడియద్వైతంబని। పదిలతసిర్గుణమటంచుపలుకుభేదముగా।
వాదములోనేభేదమున్నదిగా। పదసంధిలోనొక్కటాదవి లేదని
యొక్క। టదినిజమనినోటవదిరినట్లగుపదుపలుకుభేదముగా। వా
దములోనే భేదమున్నదిగా. 14

తా. ఇదిసర్వానర్థములకు మూలము గనుక పామరులెరుకచేమతి భ్రష్టులై అద్వైతమనియు నిర్గుణమనియు భేదముగా బలుకుచున్నారు వాదములోనే భేదమున్నది. ఈపదములసంధి యోచించగా ఒకదాని లేనని విడచిపెట్టి ఒక్కటేనిజమని అనగా పరిపూర్ణమేనిజమని అర్థమగుచున్నదని భావము.

## పూర్వవాక్యము.

మూలములేక గురైరిగేశరీర మభేదము నాకంటె వేరే యెందరున్నారో అందరు అభేదము యీశరీరము వచ్చేటందుకు మూలము యేమీలేదు కొనకు ప్రవేసించుటకును యేమీలేదు యీతోపకముల తోచేయెడల కలలేలాగో అలాగునను వాదము ముఖ్యముగా తోచుచున్నది అభేదమన్నపుడు నాతో సర్వము పోతూవున్నది గనుక నేను గానిది సత్యముగనుక ఇటువంటి సత్యము ఇంత యంతయని చెప్పడముకు శక్యముగాదు గనుక అదే అభేద్యము గుతెఱిగేదాని ప్రభావము గుతెఱుగుటే గురుద్రోహము ఇది సర్వానర్థమూలము గనుక అద్వైతము నిర్గుణము అనునది వాదమేగనుక వీటిలో వకటిలేదు వకటినిజమని తాత్పర్యము.

## షష్ఠమశంకాసూచనము

కం. ఎరుకనుగడుపుటకనము । గురుకరుణకు పాత్రుడైన గుణశాలై నగా । మరుపునసీమత్తైనా । యెరుకనుసత్యముగనమ్మి యెట్లున్నసరేరా । సర్వము నెరుకై సరిపడుపోరా । గురిదీనిప్రభావకరమహాత్ములలోన । నొకటెరిగిసత్యమన్న గురుద్రోహమదె నిజముయెట్లున్నసరేరా ! సర్వమునెరుకై సరిపడుపోరా. 15

తా. ఎరుకనువిడిచి పెట్టుట మహాకఠినమైనపని గురుకటాక్షమునకు పాత్రుడైన వాడైనను కొంచెమైనను పొరబాటున యెరుక సత్యమని నమ్మినానరే సర్వములోపల దీని ప్రభావముతో గూడుకొన్న మహాత్ములలో నొకదానినైనను సత్యమని నమ్మినానరే సర్వములోపల అదేగురుద్రోహమని భావము.

కం. చాలగసర్వము కెరుకే । మూలంబని గురుకటాక్షమూలము చేతగా । మేలైనషోడశాక్షర । మాలికపఠియించ నెరుక మాయ

మైపోరా । ఇదియేమిలేదదియే నిజమరా । యదినిజమగుటకు కు
దురైన ద్వాదశ । పద మొదలబోకు నీకేదు రేమిరాకదియే మాయ
మైపోరా । ఇదియేమిలేదదియే నిజమరా. 16

తా. సర్వమునకు నెరుకేమూలమని గురుకటాక్షముచేత షోడశాక్షరీమంత్రమును పఠియించిన యెడల యెరుకమాయమై పోవును ఎరుకయేమీలేకపోవును పరిపూర్ణమేనిజము పరిపూర్ణము నిజమగుటకు ద్వాదశాక్షరీ మంత్రమును వదలకుము నీకేదియు నష్టమురాదని భావము.

పూర్వవాక్యము.

యెరుకనుగడిచేది కఠినము గురుకటాక్ష పాత్రుడైనవాడు యీ పత్తెనాయరుక సత్యమని నమ్మినాసరే సర్వములోపల దీనిప్రభావము తోగూడుకొన్న మహాత్ములతో ఒకటి సత్యమని నమ్మినాసరే సర్వము లోపలఅదే గురుద్రోహము సర్వమునకు యరుక మూలముగనుక గురు కటాక్షముచేత నెరిగితే ఇదియేమిలేదు అదియే నిజమని తాత్పర్యము.

సప్తమశంకాసూచనము.

కం. వున్నదితనువందునలే । కున్నది యేచిన్నె లెన్నకున్నది బయలే ।
అన్నదికనపడనన్నది । కన్నదిదేగనుక నేదికావడములేదా । లే
నేలేదూతన్నెరుగరాదు । అన్నిటిగురుతెరిగే యహముతనువులు
రెండు । కన్నారగన్నాన విసున్నై పోవునేగాని కావడములేదా ।
లేనేలేదు తన్నెరుగరాదు. 17

తా. ఉన్నదనగా ఏచిన్నెలెరుగని పరబయలీశరీరమందు లేకనేయున్నది. అన్నదిలేకపోయినది గనుక కావడములేనే లేదు. ఈ గురుతెరిగే యెరుకనే అహంకారము శరీరములేకనే యున్నది. సత్యమైన పరిపూర్ణమీ శరీరమందు కాకనేయున్నది. అన్నిటిని గుర్తెరిగే అహముతనువులు రెంటిని కన్నారా చూచినా అవినిల్వకుండా పోవుచున్నవి గనుక యేమిన్నికొనసాగలేదని భావము.

కం. తనువెరుకేంద్రియములలో । కనిపింపగబయలు లేదు కలవలెతా
నే । పనిలేకపుట్టిగిట్టు । తనువహము లేగనుక బయలుతనువందు లే
దూ । లేనిదిజూడకనుపడబోదూ । అనిశముగురుపాద వనజభక్తి
నియచల । ఘనవైభవమును సూచననెరుగుదగుగాని తనువందు
లేదూ । లేనిదిజూడకను పడబోదూ. 18

తా. శరీరము, ఎరుక, యింద్రియములు, వీనియందు వెదకి చూచినా పరిపూర్ణము లేదు. స్వప్నమువలె పనిలేనిపనిగా పుట్టి గిట్టేవి తనువహము లే గనుక, పరబయలు తనువందు లేదు. శరీరమందు కన బడనిదానిని శరీరమందు వెదకితే తెలియునా ? తెలియదు. ఎల్లప్పుడు గురుపాదారవిందములమీది భక్తిచేత, అచలవిభవమును, సూచనచే తెలియవలెనుగాని, యోగములు, ముద్రలు, లక్ష్యభావములు మొదలగు కాయక్లేశములచే తెలియబడదని భావము.

## పూర్వవాక్యము.

వున్నది శరీరమందున లేకనేయున్నది అన్నది లేకపోయినదికనుక కావడము లేనేలేదు యీగురుతెరగే అహంకారము శరీరము లేకనే యున్నది సత్యము యీశరీరమందు కాకనేయున్నది లేనిది యీగురు తెరగే అహంకారము అనేశరీరము యెరుకే గనుక వున్నదానియందు లేనేలేదని తాత్పర్యము.

## అష్టమశంకాసూచనము.

కం. చూచినదోచేభావము । చూచుశరీరములు లేక శూన్యంబై । తే
చూచినదోచనిమన్నది । యీచర్చకు దర్పణంబు నికసామ్యమహా
రా । మాయాసమస్తవాచకమహారా । యోచించువారికియోచ
నెరుగనివారి । కీచిత్రమొకటిగ తోచేనిదేనిజమునిక సామ్యమహా
రా । మాయాసమస్తవాచకమహారా. 19

తా. చూచితే కనుపించే స్వభావము, చూచేశరీరము కేయు

న్నది. చూచేశరీరము లేకపోతే చూడనిదే యున్నది. దీనికి అద్దము దృష్టాంతము. మాయసమ స్తభాషారూపిణిగా నున్నది. యోచనచే యువారికి, యోచనచేయనివారికిని, నిజముగా యీచిత్రమొకటిగా నేయున్నదని భావము.

కం. నీచవిచారముబొందిన । యాచెవటుల కెల్ల భాషలతిగుహ్యంబై వాచాలత్వముకుదిరిన, గోచరమగు శబ్దమంత ఘోషయొక్కటి గా । చప్పన్నభాషలు భేదమాగా । దోషబద్ధులకుయేభాష శా భాషలే । భూషణగానుసంతోషింతురేగాని భాషయొక్కటిగా । చప్పన్నభాషలుభేదమాగా. 20

తా. పరిపూర్ణవిచారణ చేసిన వారికి భేదము లేనేలేదు. శబ్ద మంతా వకటే. యెరుకసంబంధమగు నీచవిచారణచేయు దుష్టుల కేభాష శాభాష యెక్కువయై, మాభాష అతిశయమని కొందరు, మాభాష అతిశయమని మరికొందరు భేదవాదములు చేయుచుందు రని భావము,

పూర్వవాక్యము.

చూచితే కనుపించేది స్వభావము. చూచే శరీరము లేకపోతే చూడనిదేవున్నది అనగా దర్పణవత్ మాయాసమ స్తభాషారూపిణిఅ యివుంటున్నది ఇది విచారించినవారికి భేదము లేనేలేదునీచవిచారము పొందినవారికి చప్పన్న భాషలుచేత మాట్లాడేశబ్దము అంతా వకటే యనియు బద్ధులైనవారికి యే భాషకు ఆభాష అతిశయమని తా త్పర్యము.

నవమశంకాసూచనము.

కం. నడిచేశరీరమైతెను । కదువడియున్నాడుగనుకకనికానకదే । విడిచియుగాబారొందెటి । పశుబొట్లలోగుకువుతనకు పనికిరాదుగదా, రెండొకదారినడుచుటగలదా । నడిచేదివిడిచేదినొడిగాబార్రై నదే,

విడుచుబోధయునునీనడిత్రికెట్లగుగనుక పనికిరాడుగదా । రెండొక దారినడుచుటగలదా. 21

తా. తాను నడిచే శరీరమైయున్నాడుగనుక, శరీరమును విర సనజేసి. యెరుకసత్యమని నమ్మి, తెలిసి తెలియక. గాబారయ్యే గురుడు పనికిరాడు. నడిచేది, విడిచేది, గాబారైన యెరుకే గనుక యెరుక సత్యమని నమ్మే గురువు పనికిరాడని భావము.

కం. వూరికెకోరికతోతా । జేరినదొకయెరుకగనుక చెదరినతనకున్ ।
వారకయెరుకనునిజమను । కారణగురుడెప్పుడైనా కడతేర్చగల
డా । నమ్మినవారి మీారిపోగలడా । వారువీరికిరారు వీరికెవ్వరు
లేరు । వారువారికిదెల్పబూరగఫలరీతి కడతేర్చగలడా। నమ్మినవా
రికిమీారిపోగలడా. 22

తా. పనిలేనిపనిగా, కోరికతోటి చేరినది యెరుకే గనుక, మనస్సుచెదరి సత్యమును తెలిసికొనుటకు ఆత్మానాత్మవిచారణ చేయ బూనిన వానిని, యెరుకే సత్యమనినమ్మిన గురువు కడతేర్చగలడా? కడతేర్చలేడు. అటువంటిముముక్షువు కిటువంటి గురువుబోధ జేసిన బూరుగపండురీతిగా నిష్ఫలమగునని భావము.

పూర్వవాక్యము.

నడిచే శరీరమై తానున్నాడుగనుక విడిచి గాబారైయుండే గురువుపనికిరాడు నడిచేది విడిచేది గాబారైనదేను వూరికవుండేది వక యెరుకగనుక యెరుకసత్యమని నమ్మేగురువు పనికిరాడనితాత్పర్యము.

దశమశంకాసూచనము.

కం. చంచలమగునీతనువుచె నెంచినమునునీశరీరమేమిాలేదా । నం
చునుస్మారకమమరితె । నంచితముగసార్వకాలమందీశరీరా । మే
మిాలేనిసంచునిడేరా । ఖంచితనమతానేగాంచిస్వతస్సిద్ధ । మం

చునెనుటనుగన్పించుచున్నదినిజమునందీశరీరా । మేమీ లేనిసంచు
నిదేరా. 23

తా. చంచలమైన యీ శరీరముచేతనే, యీశరీర మేమీ
లేదని స్మారకమునకు వచ్చినపుడు శరీర మేమీ లేనిదేనని తనకు తానే
స్వతసిద్ధమై యున్నదని భావము.

కం. ఇనుమును తెగనఱకుటకా । యినుమేగత్తియైనయట్లు నీభ్రమరూ
పై జనియించునీశరీరము । గని నేమియు లేదటన్న జ్ఞానసాధనమూ।
తా నెరిగినతనుదా నేపోనూ । గనుకసద్గురుకృప యనుజ్ఞానస్ఫురణని
జ । తనువులో నేకలిగి తెలగవలయునెపుడుజ్ఞానసాధనమూ । తా నె
రిగినతనుదా నేపోనూ. 24

తా. ఇనుమును తెగగొట్టుటకు ఇనుమే సాధనమైన విధముగా
భ్రాంతిరూపమైన యీశరమే లేదనేజ్ఞానము, సద్గురు కృపవలన
యీశరీరమునందే కలుగవలయునని భావము.

పూర్వవాక్యము.

చంచలమగు నీశరీరముచేతను యీశరీర మేమీ లేదని స్మార
కమువస్తే సర్వకాలము శరీర మేమి లేనిదేనని తనకు తానే స్వతస్సిద్ధ
మైయున్నది యినుముచేతనేయినుము యేలాగున తెగునో ఆలాగే
యీభ్రాంతిరూపమైన యీశరీర మేమీ లేదనే స్మారకము యీశరీర
ముననే కలగవలయునని తాత్పర్యము.

ఏకాదశశంకాసూచనము.

కం. తేరకుశాస్త్రముచెప్పిన । వారికితము చెప్పినట్లువడినడవరనే । కా
రణమునకోపముగద । యారముతచ్ఛాస్త్రవాసనాదులలో నీ ।
వారికి బోధసారజ్ఞుపైని । పేరైనశాస్త్రవిచారులుదెల్పేటిదారినడ
వకున్న వారికోపమువాసనాదులలో నీ । వారికిబోధసారజ్ఞుపైని. 25

తా. శాస్త్రమును చెప్పినవారికి తాము చెప్పినట్లు నడవరనే

కారణమున కోపము వచ్చును. శాస్త్రవాసనలచేతనుండు శాస్త్రవిచారులు, ఆరూఢబోధ జెందిన గురుపుత్రునకు వారు దెల్పెటి దారిన నడవకుంటే వానిపైని కోపపడుదురని భావము.

కం. ఈరీతిక్రూరబోధల । వారలకోపములనణచువైపేమనినన్ । సార
విద్వాండడసన్నృశ । పూరితనిజనిష్ఠగురునిబోధవిడువడుగా । ఇతరులు
దెల్పేదారినడువడుగా । యేరీతినైన నకడ తేరుటకై యెరుక । పేరూ
రుగన్నడని దారిలోపరిపూర్ణబోధవిడువడుగా । ఇతరులుదెల్పే
దారినడువడుగా. 26

తా. ఇటువంటి క్రూర బోధ జేయు పండితుల కోపములణచు పద్ధతేమనగా, ఆరూఢజ్ఞానము నొందినవాడు తన నిష్ఠచే తన గురువు చెప్పిన యెరుక పేరు, ఊరు, కన్నడని పరిపూర్ణబోధ విడువడు! ఏలాగునన్నైనా తాను కడతేరుటకై యితరులు దెల్పెడిదారిన నడువడు, తన కారణగురువు జేసిన బోధ విడువకుండుటే యితరులు దెల్పేదారిన నడవకపోవడమని భావము.

పూర్వవాక్యము.

శాస్త్రమును చెప్పినవారికి చెప్పినట్టు నడవకుంటే కోపము శాస్త్రవాసనలచేత నుండేవారికి నిజజ్ఞుడైనను శాస్త్రాదులలో చెప్పినట్లు నడవకుంటే కోపము. తనకు నిష్ఠయేలాగంటే గురువాక్యము విడువకపోవడమే వారు చెప్పినట్లు నడవడమని తాత్పర్యము.

ద్వాదశశంకాసూచనము.

కం. కాయములోపల వెదకిన । కాయము లేనదియెనుండుగాని శరీరా ।
దాయప్రయహేతువలే । ఛాయలలేవనెటి యచలచర్చ చాలును
రా । అదియేమోక్షోపాయముగదరా । కూయుకూతలోనున్న మా
య తెలియబ్రహ్మ । కాయములోగుట్టుబాయక తావెతికే చర్చచా
లునురా । అదియేమోక్షోపాయముగదరా. 27

తా. శరీరమందెంత వెదకినా, శరీరము లేనిద య్యే యున్నది. శరీరము వచ్చుటకును పోవుటకును హేతువెప్పటికిని లేని పరిపూర్ణా నుభవమును జెందితే చాలును. ఇదియే మోక్షమున కుపాయము. యీ శరీరమునకు హేతువేదియని విచారించడమే శరీరమందు వెద కడమని భావము.

పూర్వవాక్యము.

శరీరమందు వెదకి నాశరీరము లేనిదై యున్నది. యీశరీరమునకు హేతువేది అని విచారించడమే వెతకడమని తాత్పర్యము.

కం. జ్ఞానముదోచేవలకును। మానని కర్మలునుబుట్టిమానుగ బెరుగున్।
జ్ఞానభ్రాంతులునిలిచిన। మానుగనేమియును లేక మాయామైపో
రా। కర్మలన్నికాలిపోగదరా। లేనియెరుకనునమ్మి వూనియుండే
వరకు తానేకర్మలుబుట్టి తానేగిట్టుచునుండి మాయామైపోరా।
కర్మలన్నికాలిపోగదరా.　　　　28

తా. జ్ఞానమున్నంతవరకును విరామము లేని కర్మలు పుట్టి పెరుగుచున్నవి. జానభ్రమలు వీడిపోయినప్పుడేమియును లేక, కర్మ లన్నియు పేరు లేకుండా పోవుచున్నవి. లేనియెరుకను నమ్మియుండే వరకున్న కర్మలన్నియు పుట్టిగిట్టుచుండునని భావము.

కం. కుజనులజ్ఞానమునుదెల్పెద। రజకాంబష్ఠకులుగలసి రాజగృహము
లో। యజమానికిపనిశాయగ। రజకుడుతానవ్విపోయే రాటుకో
ప్పగనూ। మంగలిచెప్పకనుపోయే తానూ। ఘాటిగుడ్డలువాడకా
టుకమయలంటు। మోటుకెత్తదెరోమకీటులుండేవరకు రాటుకో
ప్పగనూ। మంగలిచెప్పకనుపోయే తానూ.　　　　29

తా. ఒక రాజగృహమందొక చాకలియు, నొక మంగలియు పనిచేయుచుండి, వస్త్రము లెంత బాగా చలువచేసినా వాడుకచే యగానే మురికి తగులుచున్నదే దీనికి అంతు కనుపడలేదని ఆశ్చర్య

పడి చాకలివాడు పోయెను. నేనెంత నున్నగా పనిచేసినను వెంటనే మొటుకలెత్తుచున్నవి. నే నెన్నాళ్ళీతీరని పనిచేయుదునని విసుకుజెంది మంగలివాడు చెప్పకుండానె వెళ్ళెనని భావము.

కం. ఈపోటీలెటువంటివో । పాపాటము జేసిచూడవగలనిదుష్ట । వ్యాపకభ్రాంతిజ్ఞానపు । పాపాత్మక యెఱుకనమ్మపర్యంతమిటులా । కర్మలుబుట్టికడ బెరుగుచిటులా । ఆపోకనీరాకజూపట్టునిక పరి । తాపముబడ నెవరు కాపాడగలరంతపర్యంతమటులా । కర్మలుబుట్టికడ బెరుగునిటులా. 30

తా. ఈపోటి లెటువంటివనగా, చాకలి, మంగలుల పనియెప్పటికిని, యెట్లంచములేని పనిగానున్నదో, ఆలాగుననే దుష్టవ్యాపక భ్రాంతి జన్యమైన యెరుకను, సత్యమని నమ్మియుండే పర్యంతమున్న భ్రాంతులనే కర్మ లెడతెగకుండా నుంటున్నవని భావము

## పూర్వ వాక్యము.

జ్ఞానమువున్నంతసేపు కర్మలువుండనేవుంటున్నవి. యీరజకుడు సంతోషపడే అంబష్టుడు చప్పకపోయెను. వస్త్రములు యెంతచలవచేసినా వాడుకచాయగానే మలినమువుంటున్నది ధృఢములేనివాని కెంతనున్నగాజేసినా తిరిగి మోటుకయెత్తుతున్నది. వీరికి యేలాగుననున్నదో ఆలాగే యెరుక సత్యమని నమ్మినంతసేపు భ్రాంతులనేకర్మలు వుంటున్నవని తాత్పర్యము.

## చతుర్దశశంకాసూచనము.

కం. చదివినఘనవిద్వాంసుల । కొదకంటెనునంతతంబు రొదలేనిగిరుల్ । కదలనిమొద్దులుమోటలు । యెదుటనునిలుచున్న జడము లెల్లమేలగురా । దృక్సహితులంధులు నొక్కటేరా చదువువచ్చినవారుచదువరానివారు । కదిసివదురుటకంటెకదల కుండని మొద్దులెల్లమేలగురా । దృక్సహితులంధులునొక్కటేరా. 31

తా. చదువుకున్నగొప్ప విద్వాంసు లచేయు రొదకంటెను, యెప్పటికిన్ని రొద లేని కదలకుండానుండె కొండలు, రాళ్ళు, గుంజలు, గుదెకొయ్యలు, మొద్దులు, మోటులు మేలు కండ్లు గలిగినవారును గుడ్డివారును సమానమేనని భావము.

కం. పరతత్వనిర్ణయముతా । మెఱగకసేకుటిలయూకలెల్లను సర్వం ।
బెరిగినగతినిర్ణయముల । పరిపరివిధములను నేమొ బలుకుచుందు
రుగా । పలికినవెల్ల పరిహాసమౌరా । పరిపూర్ణమొక గుప్తపరి
కించితెల్లదీ । సరణిగన్నరెండు తెరగులొక్కటెగనుక పలుకుచుం
దురుగా । పలికినవెల్ల పరిహాసమౌరా.                    32

తా. ఈనిర్ణయరహితమైన పరిపూర్ణమును తాను తెలియక చదువుకొన్న వారును చదువని మూఢులగువారును తమకు సర్వము తెలిసినట్లు సకలనిర్ణయములు చేయుదురు పరిపూర్ణమే నియమములు నుచేయ లేదు. ఇట్లాచదువుకున్న కండ్లున్నవారును, అట్లాయేమీ తెలియనిగుడ్డి వారును సమానమేనని భావము,

## పూర్వవాక్యము.

చదువకున్న విద్వాంసులకంటె పూరికెవున్న రాళ్ళునయును రప్పలునయము గుంజలునయము గుదిగొయ్యలునయము మొద్దులునయము మోటులునయము కండ్లుకలిగినవారు గుడ్డివారు సమానమేను అయితే సమస్తముచదువు తెలిసినవారు యేమిచదువనిమూఢులగువారును యీనిర్ణయరహితమైన సత్యమును తమకు తెలియక సకలనిర్ణయములు తాముచేస్తారుగనుక అదినో నియమములు చేయ లేదు యిట్లా చదువుకొన్న కండ్లుగలిగివారున్ను అట్లా యేమి తెలియని గుడ్డివారున్నా సమానమని తాత్పర్యము.

## పంచదశశంకాసూచనము,

కం. శ్రీకృష్ణుడుసనకాదుల । కేకాంతమహాసమాధి కిదెసూచనగా ।

వైకుంఠమిట్టిదనిమును । తారకమునజూపిపోయే ద్వారాకాపురికీ। మానులుమోక్షమందిరిప్పటికీ । ఆకరణిసూచనచే గనవలెసింహా। లోకామునకిభపంక్తిరాక జనుగతిభ్రాంతి ద్వారాకాపురికీ । మానులుమోక్షమంది రిప్పటికీ. 33

తా. సింహామును జూడగ ఏనుగలగుంపు వెళ్ళిపోయినట్లు శ్రీకృష్ణపరబ్రహ్మము ఏకాంతమహాసభూధికి సూచనగా సనకాదులకు వైకుంఠమిట్టిదని చేతులతోచూపి పోయినారు సనకాదులా సూచన నుగ్రహించి భ్రమవిడచి మోక్షమును జెందిరని భావము.

పూర్వవాక్యము.

శ్రీకృష్ణభగవానులవారు వైకుంఠమిట్టిదని చేతితో చూపిపోయినారు అనగా సూచనచేత కనుక్కోవడమందు హారికే కరివతుగానని తాత్పర్యము.

షోడశశంకాసూచనము.

కం. దిటవుగనద్వైతముము। న్నెటువంటిదటన్న బ్రహ్మమేకంబనువా। గ్భటువుస్వతస్సిద్ధముగా ! ఘటియింపకతనకుతానే గన్పించుకోరకూ। రెండనుమాట ఖండించుకడకూ ! యెటుల యోచించిచాకుటిలమద్వైతమె । ప్పటికీదీనినమ్మకిటుకే భ్రాంతినిమదికీగన్పించూకొరకూ । రెండనుమాట ఖండించూకడకూ. 34

తా. అద్వైతమంటే బ్రహ్మమేకమనుమాట స్వతసిద్ధమై యున్నది. ఉన్నదానియెందు అనగా పరిపూర్ణమందునే యెరుకలేదో, అదే అద్వైతమని భావము.

కం. పరిపూర్ణములోపలసీ । యురుకెట్లుదయించెననగ నెలమినివంధ్యా । వరపుత్రవితుత్సరసిజ । శరమాయా హేమనగరవధ్విధానములా ।గలిగిమరల పరిసిఫోనటులా । నరశముగతృష్ణలో బార

లుజలభా తిగ । నరయురజ్జుసర్పసరణిదనరెనుబావతద్విధానములా।
గలిగిమరలాపరిసిపోనటులా.　　　౩౯

పరిపూర్ణములోపల నీ మెరుకయెట్లు పుట్టినదనగా గొడ్రాలి బిడ్డవలెను, ఆకాశపుష్పమువలెను, ఎండమావులలోని నీళ్ళవలెను, అద్దములోని బింబమువలెను రాతిచెట్టువలెను, కుందేటికొమ్ముల వలెను, తాాటియందుదోచుపాము వలెను నీభ్రమరూపమైన యెరుక పుట్టెను పైన చెప్పినరీతిగా లేనియెరుకను నమ్మడము లోకులస్వభావ మని భావము.

పూర్వవాక్యము.

అద్వయితమంటె తనకుతానే స్వతస్సిద్ధమైయున్నది వున్నదాని యందున నేది లేదో అదే అద్వయితమని భావార్థకము అనగా వున్నదా నియందు వంధ్యాపుత్రవతుగా ఖపుష్పమువతుగా మరుమరీచిక లవ తుగా దర్పణబింబవతుగా శిలాతరువతుగా మృగశృంగవతుగా రజ్జుస ర్పవతుగా యేయెరుక లేదో ఆయెరుక నమ్మడం లోకుల స్వభావార్థ మని తాత్పర్యము.

కం. తనకునశక్యముగానిది । గని ఇతరులు తెల్పబోగ గన్పడనెపుడున్।
తనుదానను పరిపూర్ణము । తనుదానిటువంటిదనుచు దాచి దెలు
పుటకూ । తోచనేతోచదెటుయోాలెంచుటకుకూ । తోచేతనువు
కునెరుకేతోచియున్నదిమొదలు । తోచనియచలము తోచకున్నది
ఇది దాచి తెలుపుటకూ । తోచనేతోచదెటుయోచించుటకూ. ౪౦

తా. తనకు శక్యమేకాదు, యితరులు తెల్పబోతే వారికేమిన్ని జాడదొరకనేదొరకదు, తాను తానన్న పరిపూర్ణమునకు నేనిటువం టిదానినని తోచనే తోచదు। తోచే శరీరమునకు యెరుకే, తోచే దైయున్నది. తోచనిది పరిపూర్ణమేనని భావము.

పూర్వవాక్యము.

తనకు శక్యమేకాదు ఇతరులకు యేమి జాడదొరకదు తాను తానన్న పరిపూర్ణమునకు నేను యిటువంటిదాన్ని అని తోచనేతోచ

దు. తోంచేశరీరమునకు తోంచేద్దైయున్నది తోంచనిది ఇటువంటిదని తా త్పర్యము.

అష్టాదశశంకాసూచనము.

కం. కనిమొరిగేదికనొక్కటి । కనకను మొరిగెద నేకగతులై బెనగున్ ।
వినుదీనికర్ధమేమన । మనసునసజమెరిగిబై టమాట్లాడేదొకడూ ।
పరిపూర్ణసూచనగనునతడూ । పనిలేక వారిమాటనుబట్టుకొని
తాము । వినిపింతురందరిఘనయోగకథలన్ని మాట్లాడేదొకడూ ।
పరిపూర్ణసూచనగనునతడూ. 37

తా. చూచి మొరిగేది వకటి, చూడకుండా మొరిగేవి అనే కము. దీనికి అర్ధమేమనగా, మనస్సున నిజమైన పరిపూర్ణసూచన తెలిసి. బయట మాట్లాడువాడు వకడు, వాని మాటలనుబట్టి యోగ కథలన్నియు మాట్లాడేవారు అనేకులని భావము.

పూర్వవాక్యము.

కని మొరిగేదివకటి కానక మొరిగే వనేకము అనగా నిజము తెలిసిమాట్లాడేవాడు వొకడు వాడిమాటలుబట్టి మాట్లాడేవారు అనే కులని తాత్పర్యము.

ఏకోనవింశతిశంకాసూచనము.

కం. పుట్టనిచావనిబయలుకు । పుట్టుటగిట్టుటలు గ్రహణభాతిగనాగా ।
పుట్టుటవిడుచుటరెండును । వట్టిదియగునట్లుబయలు వొక్కటెరు
గదుగా । యెరుకేపుట్టిగిట్టుచుండునుగా । వట్టిమాటల భ్రాంతిబు
ట్టినచోటెరుగు । పట్టభ్రమనిచెట్టబట్టికడ ఫేరిక ఒక్కటెరుగదుగా ।
యెరుకేపుట్టిగిట్టుచున్నదిగా. 38

తా. పుట్టని చావని పరిపూర్ణమునకు, పుట్టుచున్నది, గిట్టుచు న్నదనేమాట, గ్రహణమువలెగానున్నది. యెట్లనగా, గ్రహణముపట్టి

విడిచినది అని అంటున్నారు, అది పట్టాలేదు, విడువా లేదు, ఇది అనగా పరిపూర్ణము పట్టాలేదు, చావాలేదు, భ్రమరూపమైన యెరుకే పుట్టిచచ్చుచున్నది, గాని, పరిపూర్ణమొక్కటియు నెరుగదు, యీభ్రమ పుట్టేచోటెరిగిన సద్గురుమూర్తి సన్నిధిచేరి కడ తేరుమని భావము,

కం. తెలిసివిచారించితెతన । తెలివంతటనిండియున్న తెలియగవలెపో ।
యిలక్షేత్రక్షేత్రజ్ఞులు । కలకాలము లేనిగతిలో కడకుపోవలదా ।
తెలిసేకలిసే నెళవెరుగవలదా । తడిలేనితీర్ధముపొడిలేనిప్రసాద మెడలేకగురునిచేబడసిసద్గతిలోనకడకుపోవలదా । తెలిసేకలిసే నెళవెరుగవలదా. 39

తా. చక్కగా విచారించితే తెలివి అంతటా నిండియున్నట్లుండవలెను, ఎప్పటికిన్ని దేహిదేహములు లేకపోవలెను. సద్గురుమూర్తి చేత తడిలేని తీర్ధమును పొడిలేని ప్రసాదమును గ్రహించి పరిపూర్ణమును జెందవలెను. తడిలేని తీర్ధమనగా, బోధామృతము, పొడిలేని ప్రసాదమనగా, అఖండమైన పరిపూర్ణమని భావము.

కం. ఇది తెలిసినవారుమహా । పదసింహమువంటివారు భ్రాంత్యజ్ఞానా।
స్పదకరిసంఘములోదవిన । నొదిగినభయమేమిగలుగు నుత్తముకెదుటా । యేమనినాతప్పేతప్పులచటా । ఇదియె సర్వానర్ధములకు మూలముగనుక । నెదురేమిమాట్లాడగదియుబోవుటతప్ప నుత్తముకెదుటా । యేమనినాతప్పేతప్పులచటా. 40

తా. తడిలేని తీర్థమును, పొడిలేని ప్రసాదమును, విచారించిన పరిపూర్ణులు, సింహము వంటివారు, అట్టి వారి ముందర, భ్రాంతిలోబడి కొట్టుకునే జ్ఞానులను, ఏనుగు గుంపు లెన్ని వచ్చినా పర్వాలేదు. వారి ముందరయేమి మాట్లాడినా తప్పే, మాట్లాడినదానిలో కూడా యేమీలేదు గనుక వారితో యెదిరించి మాట్లాడుట సర్వానర్ధములకు కారణమని భావము,

కం. మాటాడెటిదానితోసహా । పటిగయెనుకేమి లేదు పట్టగబోతే ।
యేటక్కరియైపోవునో । పోటీబెట్టుదమటంటే భూమిలో లేదూ ।
ఏమీ లేదు యేమనరాదూ । భ్రమలనువిడువక యేమి లేదనుమాట।
తోమీదికెగబడి యేమిమూఖణము శాయ భూమిలో లేదూ । నే
మీ లేదు నేమనరాదూ. 41

తా. మాట్లాడటనహా లేనియెరుకే, ఆయెరుకను పట్టబోతే కనబడకుండా బోవును దీనితో యింకొక దానిని పోటి బెట్టుదమనిన యెక్కడా లేకపోవుచున్నది. లేని దానికిపోటి ఏమున్నది. తమ భ్రమల నణచకుండా నేమీ లేదని యెగబడే మార్గము పరిపూర్ణముతో సమముకాదని భావము.

పూర్వవాక్యము.

పుట్టని చావని పరిపూర్ణము తానుగనుక గ్రహణముపట్టి విడిచిన దన్నారు అది పట్టలేదు విడువలేదు ఇది పుట్టలేదు చావలేదు వున్నదంటే లేదు లేదంటే భ్రాంతిపోదు విచారించితే అంతా అయి వున్నట్టు అయివుండవలె సార్వకాలమునకు క్షేత్రాక్షేత్రజ్ఞులు లేకపో వలె పొడిలేని ప్రసాదము తడిలేని తీర్థము విచారించిన వారు సింహామువంటివారు నేనుగులు యెన్ని గోచరమైనా ఫర్వాలేదు విచారించినవారి ముందర యేమి మాట్లాడినా తప్పే మాట్లాడిన దానితో కూడా యేమి లేదు ఇది యేమిలేదని యెగబడిచేసే నాశనకృత్యము వంటిది గాదని తాత్పర్యము.

వింశతిశంకాసూచనము.

కం. చిల్లాకొల్లారుగనిరు । వల్లలు గుఱ్ఱములు పరుగువారినవేళ ।
తల్లిని బిడ్డయు బట్టక । నల్లాడుచు తల్లికొడుకు నంటని తెరగూ॥ య
క్కడివారక్కడనిల్చియరుగూ॥కొల్లక బారుటవల్ల నెట్లగుకొనకు ।
ముల్లుముట్టనివాడు అల్లరేమిలేదూ అంటని తెరగూ । యక్కడి
వారక్కడ నిలచియరుగూ. 42

తా. అనేక గుఱ్ఱములు కట్టివేసిన చోట, అవి బెదరి కట్లు తెంచుకొని, నలుప్రక్కలకు యెగబడితే, తల్లిని బిడ్డ, తండ్రిని కొడుకు, పట్టక, యెక్కడివారక్కడి కురికి, గాబారై అల్లాడుచున్నారు, ఇంతే కాని కొసకేమీ లేదని భావము.

కం. పరిపూర్ణముతనువందే । పరికింపగనున్నదిట్టి భ్రాంతిశరీరం । బి
రుపేమిలేదు చూచిన । ధరపుట్టకగిట్టకున్న తత్త్వాము చలమురా॥
అచలంబెప్పుడుసచలమంటదురా । అదెసర్వపరిపూర్ణమదె బట్ట
బయలు నీ । కదియేనాకదియే సర్వముకదియే సూచనతత్త్వామ
చలమురా । అచలంబెప్పుడు సచలమంటదురా. 43

తా. చక్కగావిచారించితే, పరిపూర్ణముశరీరమందే యున్నది. భ్రాంతివలన గలిగిన శరీరమేమియు లేదు. పుట్టకుండా, గిట్టకుండా యుండేది అచలమే. అచలమెప్పుడును, చలనము నంటదు. అదే సర్వపరిపూర్ణము, అదే బట్టబయలు, నీకు, నాకూ, కూడా అదే, సర్వము కదియే. సూచనచేత తెలియవలె నని భావము.

పూర్వవాక్యము.

గుఱ్ఱములుయెగబడితే తల్లిని బిడ్డబట్టక తండ్రిని కొడుకుబట్టక యెక్కడివారక్కడనే గాబారైయున్నారు ఇంతేకాని కొనయేమీలేదు శుద్ధము శరీరమందేవున్నది. శరీరముయేమీలేదు పుట్టనిదిచావనిది పరిపూర్ణమని భావము,

ఏకవింశతిశంకాసూచనము.

కం. ఇదెసర్వావస్థలలో । నిదెసర్వప్రదేశములలోనిదెసర్వములో । ని
దియేచలింపకుండే । దిదెయచలముబట్టబయలునిదియేసూచనరా ।
సూచనసేయకుదిరితేసరిరా । ఇదియాదిమధ్యాంత మెదురుసదురు
లేని । పదసమాధిబ్రహ్మపదముసినాసందునిదియేసూచనరా । సూ
చనసేయకుదిరితేసరిరా. 44

తా. ఇదే సర్వస్థలందును, సకల దేశముల యందును, సమస్తవస్తువులందును, చలింపక, ఆదిమధ్యాంతరహితమై, యెదురు లేనిదై, నీనాసందుండు బ్రహ్మపదసూచనమై, బట్టబయలై యున్న దని భావము.

కం. ఇదియేదుఃఖవిహీనము । ఇదెద్వంద్వాతీతమఖిలమిదెయద్వైతం
బిదెజ్ఞానకర్మరహితం । బిదెనీవును నేను లేనిదిదియేరాతంద్రీ । భ్రాం
తిరహితమునిదియేమాతంద్రీ । ఇదియే యెప్పటివలెనిదెయున్న దిదె
యున్న । దిదెయున్నట్లెయున్నదిదేరా పరిపూర్ణామునిదియేరాతం
ద్రీ । భ్రాంతిరహితమునిదియేమాతంద్రీ. 45

తా. ఇది సుఖదుఃఖ విరహితమై, ద్వంద్వరహితమై, జ్ఞానకర్మ హితమై, నీవు నేనను భ్రాంతి లేనిదియై, యెప్పటివలెనున్నది. ఉన్నది యున్నట్లేయున్నది. ఇది శ్రీ శివరామదీక్షితులవారిచే నాంధ్రభాష యందు తర్జుమాచేయబడిన, యిరువదియొక్క అచలశంకాసూచనల ప్రకరణము సంపూర్ణము.

పూర్వవాక్యము

ఇదే సర్వకాలములయందు సకలదేశములయందు సమస్తవస్తువులయందుచలింపక ఆదిమధ్యాంతరహితమై ఇదిసుఖదుఃఖవిరహితమై ద్వంద్వరహితమై జ్ఞానకర్మరహితమై నీవు నేననే భ్రాంతిరహితమై యప్పటివలెయున్నది వున్నదివున్నట్లేవున్నది. ఇది శ్రీశివరామదీక్షిత ప్రణీతాఖండ పరిపూర్ణ ప్రభావాంతర్గతాంధ్రభాషోక్త యేకవింశత్యచలశంకాసూచనప్రకరణము సంపూర్ణము.

శంకాసమాప్తికరనిజగురుబోధాఖండసాక్షి సాధనము.

కం. పరమగురుచరణసాక్షిగ । పరికింపగయచలపూర్వభావపుశంకల్ ।
పరలీలావిస్మయముగ । పరమరహస్యమునసీకు బయలుపరచితి
గా । లేదికదీనికన్న నధికముగా । పరతత్వజ్ఞుల వలన పరిశీలించి

నాకు । పరమేష్ఠిగురుడొసగు పరిపూర్ణమిదెనమ్మ బయలుపరచితి
గా । లేదికనేనికన్న నధికముగా. 46

తా. పరిపూర్ణానుభవమునకు సాధనభూతములగు అచలశంకా రహస్యమును నాపరమగురుని చరణారవిందముల సాక్షిగా నీకు తేట పరచి చెప్పితినిగదా దీనికంటె అధికమికనేమీ లేదు అచలగురువుల వలన విచారించి నాపరమగురువు నాకిచ్చిన పరిపూర్ణమిదేనమ్మ మని భావము.

అఖండపరిపూర్ణసూచనము.

కం. నిదురింపగ తానెవరై । నది తెలియక లోకసుఖమునంటక వెలిలో ।
నొదలక యచలమహాబ్ధిలో । పడపడి నిర్మగ్నమగుట బ్రహ్మసూచ
నగా। దీనికి యధికమేదందు సరిగా । ముదురు లేతలు లేని మొద
లుతుద లెరుగని । యెదురు నదురుగాని సదమల పరిపూర్ణ బ్రహ్మ
సూచనగా । దీనికి యధికమేదందుసరిగా. 47

తా. నిదురించు సమయమున తానెవరై నదిన్ని తెలియక లోకవాసనలకంటక ముదురు లేతలు లేక మొదలుతుద నెరుగక పరిపూర్ణమహా సముద్రమందు మగ్నమైయుండుటే పరిపూర్ణబ్రహ్మ సూచనని భావము.

కం. ఈ పరవశ మహారముల । వ్యాపకమై సర్వపూర్ణ వైభవముగ
సం । దీపితమైతనువెరుకల । కాపురములులేని సుప్తిగాఢసూచ
నగా॥ ఇదెపరసత్య భోగాలోచనగా । యేప్రొద్దయి నాస్ఫురణ
ప్రాపించుతరిసర్వ । రూపోహమనుచు గురురూపోహ మని బలు
కు గాఢసూచనగా । ఇదెపరసత్యభోగాలోచనగా. 48

తా. ఈపరవశత్వమెప్పటికి నొకటేరీతిగానుండి తనువెరుకలు పుట్టని పరిపూర్ణమందు మగ్నమైయుండుటే అచలసూచన ఒకానొక

ప్పుడు స్ఫురణగలిగి నప్పుడు అంతా నేననే పరిపూర్ణమేను అంతా గురుస్వరూపమేనని యితరమును తెలియకుండా నుండుటే పరిపూర్ణ సూచనని భావము.

కం. ఇంతకు నధికము లేదిక । నింతేపరిపూర్ణసూచనింతేననియే ।
కాంతమునగురుడు దెల్పిన । విం తేనిరాలోమర్మ మింతేరా తండ్రీ ।
నిజప్రభయెంతకం తేరాతండ్రీ । యంత చెప్పుదు దీని కంతుముట్ట
దు నెచట । నంతర్భాహ్యతలేని నంతాతాచలభావమిం తేరా తం
డ్రీ । నిజప్రభయంతకం తేమాతండ్రీ. 49

తా. నాముద్దులకుమారా ! ఇంతకు నధికము లేదు నీలోనాలో నుండుమర్మమింతే పరిపూర్ణసూచన నింతకంటె నేమీలేదు అంతులేని దీనిని గురించి యెంతనిచెప్పుదును. సత్యమైన అచలభోగమునుండే ఆలోచననిది యేనని భావము.

కం. నానిత్యసత్యసుఖమిదె । నానిత్యవిలాసయోగనానార్థమిదే । నా
నిత్యభోగఫలమిదె । నానిత్యానంద కారణాద్భుత మిదెరా॥ సా
ధనకందరానిదికదరా । నేనుగానిదిలేదు నేనైన దెటుబోదు । నే
నౌను కాదనుదాని మానిచూడు మద్భుతమిదెరా।సాధన కందరా
నిదికదరా॥ 50

తా. ఎల్లకాలములయందు నాయొక్క నిజమైన సుఖముంయిదే నేనుభోగించే భోగముయొక్క ఫలమిదే నాయొక్క శాశ్వితమైన అద్భుతానందమిదే యిది సాధనలచేత బొందశక్యము కానిదై యున్నది. నేనుకానిదెక్కడను లేదు నేనైనదెటుపోదు నేనౌనునా కానా యని అనుమానించక చూడుమని భావము.

సంపూర్ణము.



శ్రీగురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్య సంవాదము:
# తృతీయ ప్రకరణము.

## ఉత్తరభాగము.

కం. చిత్తము శ్రీదేశికవర । చిత్తము పరిపూర్ణబోధసిద్ధికి సర్వా । య
త్తపడి మోక్షభిక్షకు । సత్తుగ నేనిల్చినాడ సద్గురుస్వామీ । చరాచ
రసర్వాంతర్యామీ । సత్తారూపము మీచిత్తము నాభాగ్య । మె
త్తెరగో తెల్పి సర్వోత్తము నిజేయవే సద్గురుస్వామీ । చరాచర
సర్వాంతర్యామీ. 1

తా. దేశికవరా! పరిపూర్ణబోధయొక్క సిద్ధికి సర్వాయత్తుడనై మోక్షభిక్షకొరకు తమసన్నిధిన నిలచినాను తమచిత్తము నాభాగ్యమెట్లున్నదో సత్తా దెల్పి యుత్తమునిజేయు మని భావము.

కం. మోక్షాశనార్థివై పర । భిక్షాం దేహియటంచు ప్రేరేపింపన్ । దా
క్షిణ్యామృతరసమున । రక్షించెదనిదిగో పట్టరా మోక్షభిక్షా ।
గైకొనుసత్యాఖండాభూదీక్షా । అక్షయపరిపూర్ణ లక్ష్యబోధరి
గింతు। నిక్షేపమని నీకుక్షిలోదాచుకోరా మోక్షభిక్షా। గైకొను
సత్యాఖండ భూదీక్షా. 2

తా. శిష్యా! నీవు మోక్షాశనము కొరకై మోక్షభిక్షాం దేహి యని నాతావు కొచ్చితివి. నాకు నీమీదయుండు కరుణవలనని నురక్షించెదను ఇదిగో మోక్షభిక్ష పెట్టుచున్నాను. పరిపూర్ణదీక్షచేత గైకొనుము పరిపూర్ణబోధ సిద్ధినికలుగజేసెదను ఇదినిక్షేపమ్ము నీని కుక్షిలో దాచిపెట్టుకొనుమని భావము.

కం. మక్షికనివహాముమధువున । పేక్షించినరీతిఁ రా పేక్షలుతొలగెఽ
రక్షించు మీాముఖోద్గత । సాక్షాత్పరతత్వ నవరసానందబోధా॥
వినుచుండు గురుదీక్షచే మేధా । అక్షీణపరిపూర్ణ లక్ష్యమెల్లను
సత్క । టాక్షత దెల్పు ప్రత్యక్షమౌనటు సరసానందబోధా । వి
నుచుండు గురుదీక్షచేమేధా. 3

తా. తేనెటీగలు మధువునే యపేక్షించినరీతిగా నాకితరమైన కోరికలు తొలగిపోయినవి తమదివ్య వాక్కులచేతచెప్పె అచలానంద బోధ దీక్షచేత వినుచుండెదను తమరు నాయందు పరిపూర్ణకరుణనుంచి నాకు ప్రత్యక్షమగునటుల బోధింపవలయునని భావము.

అచలగురువుచెప్పే ప్రబోధవచనము.

శిష్యా! అచలపరిపూర్ణ ద్వాదశాక్షర బ్రహ్మవిద్యా కల్పమునుబోధచేయు చున్నాను. దీనినెప్పటికిని మరువకుము ఈయుత్తబట్టబయలేమియులేదు అను శృతివాక్యార్థబోధలో యీా అనునదే మొదటిసూచన ఇదే అఖండదర్శనము ఉత్తది బట్టబయలు అనునదే రెండోసూచన అనగా పరిపూర్ణ ప్రభావముయొక్క లక్షణము, ఏమిాలేదనునదే మూడోసూచన అనగా యేస్ఫురణయులేని పరిపూర్ణమంత్రైక్యసిద్ధియగుట సర్వపరిపూర్ణమిదే యికనేమిాలేదు యిదే సర్వదాజ్ఞాపకముంచుకొనుము. ఈత్రివిధలక్షణోపదేశ శ్రీమదచల పూర్ణగురుబోధచక్కగా వినుమని భావము.

కం. పరిపూర్ణబోధజేసెద । పరిపూర్ణాఖండమదుగొపరిపూర్ణము
గా । పరిపూర్ణంబెప్పటికిదె । మరువకు పరిపూర్ణమనుముమ్మా
టికిదేరా॥ నిరతము దీనినెరిగుండవలెరా । పరిపూర్ణ మంతాట
పరిపూర్ణమయ్యేని । పరిపూర్ణమందు సుఖపరవశుడవగు ము
మ్మాటికిదేరా । నిరతము దీని నెరిగుండవలెరా. 4

తా. శిష్యాగ్రణీ! పరిపూర్ణబోధ చేయుచున్నాను. పరిపూర్ణమంతటా నిండినిబిడీకృతమై సందులేక యున్నది అఖండమైన పరి

పూర్ణమదిగో మున్నాటికిదే చలించకుండా శాశ్వతముగా నుండునది దీని నెప్పటికిని మరువకు మని భావము.

కం. బయలేదన నెరుకేదన । ప్రియముగ మరి రూపనామ ప్రేరేపణగా ।
క్రియలలో మెలగును నదిని । శ్చయమగు పరిపూర్ణ మహిమ శా
స్త్రదృష్టముగా। వినుక నుమాత్మ విధము స్పష్టముగా । నయభయ
ములనైన దయ చేసి బోధింతు । బయలుభయలి దెయుని జయభే
రి వేయింతు శాస్త్రదృష్టముగా । వినుక నుమాత్మ విధము స్పష్ట
ముగా. ౫

తా. పరిపూర్ణమనియు ఎరుకయనియు ప్రేరేపణగా రూపనామ క్రియలలో లోకవ్యవహారములలో నున్నవే కాని నిశ్చయానకు పరిపూర్ణమహిమే కాని వేరు లేదు ఆత్మస్వరూపము యొక్క విధము బాగా వినుము నయము చేతనైనను భయము చేతనైనను నీకు బోధించెదను ఇదే పరిపూర్ణ మిదే పరిపూర్ణమని నీచేత జయభేరీ వేయించెదనని భావము.

కం. తానును నేనును కన్నది। దేనికి తానంటబోదు స్థిరబయ లనుగో।
తానుతనలో నమరచిన । లేనే లేసనెటి యహము లేకపోయెను ధా॥
తానొకటున్నా దేని నెరుగదు రా। తానన్న నేనన్న మేనన్న గానన్న ।
నానన్న లేదన్న లేని యెరుకోయన్న లేకపోయెను రా । తానొక
టున్నా దేని నెరుగదు రా॥ 6

తా. తానును, నేనును, అనగా శరీరాత్మలు చూచినది దేనికి నంటదు తానను అహము తనలో మరచి లేని యెరుక లేకపోవుచున్నది. పరిపూర్ణ మొకటుండే నది దేనిని యెరుగదు అట్టి స్థిరమైన బయలదుగో చూడుము తానని నేననిన మేననిన అవునన్న కాదన్న లేదన్న లేని యెరుకేయని భావము,

కం. పరబయలే మనిబలుకును । బయలాభయలందు నెట్లు భల్కెద రెం

దు॥ పరిశీలింపగనొకతరి । పరిశుద్ధము లేనిచోటి బలుకేబయ
లౌరా॥ లేదనియంటె వట్టిపల్కిదిరా । మరి మరి నేపలుకరసీనత
న్నలోనే తిరిగినట్లగపడుసరణి వెలిలో గలుగు పలుకే బయలౌరా ।
లేదనియంటే వట్టిపల్కిదిరా, 7

తా. అచలమేమనిపలుకును, అచలానుభవులా బయలం డెట్లుప
లుకుదురు, ఒకవేళ విచారించిచూడగా మలినసత్వములోనుండు జీవు
నివలనకలిగే పలుకే పరిపూర్ణమగును. అటులకాదంటే జీవుడుండు
టేవట్టిమాట. ఈధ్వనిని బాగాపరిశీలనజేయగా లోపల తిరిగినట్టును
వెలిలో కలిగినట్టును కనుపడుచున్నదని భావము.

కం. పలుకునగలయర్థములో । పలుకెట్టిదొ పలుకువిడిచి పరబయలం
దు॥ నిలచెడిచోటదిగానో । పలుకాకటనేమిగలదో పలుకేటిద
దుగో । పలుకరానిపరిపూర్ణమదుగో। పలుకొక్కటేగనుక తెలివి
దేహములలో । తెలివిదేహముబాసి కలయునిర్బయలందు పలుకే
టిదదుగో । పలుకరాని పరిపూర్ణమదుగో, 8

తా. పలుకుసందలి అర్ధములో, పలుకెటువంటిదో, పలుకు
విడిచి నిలచేచోటేదో, పలుకు కావలనేమియున్నదో, విచారిం
చగా, నిట్టిదని నిర్ణయించ శక్యముగాని పరిపూర్ణమేమైయున్నది.
అదిగో చూడుము, తెలివి, దేహము, యీరెంటిలోనున్న పలుకొ
క్కటే గనుక, తెలివి, దేహమును విడచి, పరిపూర్ణమునం దైక్య
మగునని భావము.

కం. జననముమరణములేనిది । తనుగుణసంకలితమెపుడు తగులకవెలి
లో । కనుచూపుమేరకందని । ఘనపూర్ణానంద వార్ధిగనుగొను
మదుగో । అచలాఖండఘనశైలమిదుగో । జననమరణము గలత
నువెరుకలనునిదె । గనుగొనుగాని వేమనదువినదు త్రినదుగనుగొ
నుమదుగో । అచలాఖండఘన శైలమిదుగో, 9

తా. చావుపుట్టుకలులేనిదన్ని, శరీరగుణముల నంటనిదన్ని, వెలిలో కనుచూపుమేరకు అందని, పరిపూర్ణానంద మహాసమ్రుద్ర మదిగో, అచలమను, అఖండఘనపర్వతమదిగో చూడుము, జననమర్ణ ణమును గల యీ శరీరమును, యెఱుకను. యచలము చూడ గలిగి యుండును గాని, యేమియుననదు, వినదు, తినదని భావము,

కం. జలనిధిలోపలగలిగే । జలచరములజననమరణ జడతలనెల్లన్ । జ లనిధితనుయెటుతెలుగదో । సలలితపరిపూర్ణమట్టి సాక్ష్యమైయుం డూ । యెఱుగుననుటకెట్లు నోరుండూ । ఫలబీజతరువులు కలుగు టతొలగుట । ఇలనెల్లెఱుగదొసాలపెల్లెఱుగను బయలుసాక్ష్యమై యుండూ । యెఱుగుననుట కెట్లు నోరుండూ, 10

తా. సముద్రమునందు నివసించు, మత్స్యములు, మొసళ్ళు, మొదలగు జలచరములయొక్క పుట్టుట, పెరుగుట, నశించుట మొద లగు, అవస్థలను, సముద్రమెల్లెఱుగదో, భూమియందు విత్తనములు బడుట, అంకురించుట, చెట్లగుట, ఫలించుట, మొదలగు కార్యములు, భూమి యెల్లెఱుగదో, నట్లేపరిపూర్ణము, యెఱుకయొక్క సేతలేమి యునెఱుగదని భావము.

కం. నిలచినదే పరిపూర్ణము । నిలువనిదెల్లపుడు నెఱుకనిజమునిజము గా । నిలిచినయచలమునిదిగో । నిలకడ లేనట్టిదాని నెలవువర్ణింపా అలనటగాదె తెలసి తొలిగింపా । నిలచేబయలుతొ యెఱుక కలసి వొచ్చినదైతే । నిలచినబయలుతో నిలువవలదే నెఱుక నెలవు వర్ణింపా । అలసటగాదే తెలసితొలిగింపా, 11

తా. ఎప్పటికిని నిలచియున్నదే పరిపూర్ణము, నిలవకుండాపో దేయ్యే యెఱుక, నిలచియున్న యచలమిదిగో చూడుము, నిలుకడ లేని యెఱుక యొక్కచోటు వర్ణంచి తెలుసుకొని, దానిని, తొలగిం చుట, యలసటకాద, స్థిరముగా నుండు, పరిపూర్ణముతో కూడ

మెరుకవచ్చినదేఅదితే పరిపూర్ణముతోకూడా నుండవద్దో, అట్లుండద
ని భావము.

కం. కనుమూసినకను తెరచిన । ఘనతరపరిపూర్ణ మదుగో గనుపడు
చుండున్ । కనరానిదివినరానిది । యనరానిదియెరుక । గను
కనదియేమీ లేదా । కానని వాదుబూనగ బోదూ । తనువె
న్నెలయందుమునుగన్న వెలగకా । యనునట్లుగతో బయటకనగూ
డదట్లెరుకఇదియేమీ లేదూ । కానని వాదుబూనగబోదూ. 12

తా. కనులుమూసికొనినను, కనులు తెరచికొనినను, పరిపూర్ణముకనుపడుచునే యుండును. చూడుము, చూడరానిది, వినతగనిది, అనకూడనిది, ఎరుకే గనుక, యదిలేనిదే యగుచున్నది. అది వరకు చెట్టునందు జూచిన, వెలగకాయను, వెన్నెలయందు జూచితే నట్లు కానరాదో అట్లే మెరుక కనుపించదని భావము.

కం. కనుచూపులుచేతనువులు । గనుగొనుటదిసహజమానుగానిక మ
రలన్ । కనులనుతనువులుగనెనన । వినసహ్యతపడునె ఛీఛీ విన
రాదామాటా , విపరీతవర్తన లేదెచ్చోటా । పనిలేనిమెరుకాను
బయలుగనుగొనుగాని । కనశక్తిలేనెరుకకనుగొనదుబయలునువిన
రాదామాటా । విపరీతవర్తన లేదెచ్చోటా. 13

తా. భూమియందు, నేత్రములు, శరీరములను జూచుటసహజము, శరీరములు కండ్లను చూచుచున్నవనేమాట, విపరీతముగానుండలేదా, వినుటకు నసహ్యముగా నుండలేదా, ఛీ, ఛీ, ఆవిపరీతమాట వినగూడదు. అక్లేలేనిమెరుకను పరిపూర్ణము చూడగలుగునుగాని, శక్తిలేని మెరుక పరిపూర్ణమును జూడజాలదని భావము.

కం. పరిపూర్ణమునందరికిని । మరుగించుక లేకనిలిచిమనకగుపడగా ।
పరిశూన్యమైన మెరుకయ । పరిశీలించిననుగాన బడనిదెందుకొగా

లేనిదిగనుక గురుతుకందదుగా । పరిపూర్ణమందెరుక ప్రబలిగిట్టి నదన్న । పరమస్వామి ద్రోహపరబోధ వినకునగుపడని దెందుకొగా లేని దెగనుక గురుతుకందదుగా. 14

తా. కొంచెమైనను, మరుగులేకుండా, మనకందరకును, గనబడుచుండగా, శూన్యమైనయెరుకను యెంత వెదకిన గనబడని దెందుకు, లేవిదే గనుక, కనుపడలేను, పరిపూర్ణమందెరుకపుట్టి గిట్టినదన్న, స్వామి ద్రోహపుబోధను నీవు వినకుమని భావము.

కం. పరిపూర్ణాక్షరపంక్తిని । యెరుకాక్షరపంక్తి యెంచనేకముగానీ । విసుపంక్తులలోదోచే స్థిరమస్థిరములనుబాగా తెలుసుకొనుటకునూ ॥ అల్పాధిక మెరిగుండుటకునూ । ధరణివ్రాసియర్థసరణి జూచుమెరుక । యిరుగుపొరుగులేక పరిగెత్తునిది గుర్తు తెలుసుకొనుటకునూ । అల్పాధిక మెరిగుండుటకునూ. 15

తా. పరిపూర్ణము యొక్కయు, నెరుక యొక్కయు, స్థిరాస్థిరములును, హెచ్చుతక్కువలును, తెలిసికొనుటకై, యెరుకాక్షరపంక్తితో, పరిపూర్ణాక్షర పంక్తిని కలిపి, భూమియందు వ్రాసిచూచిన, యెరుక యిరుగుపొరుగులేకుండా పోవుచున్నదని భావము.

కం. నామమురూపమునటన । స్తోమము లెన్నటికి గనదుసుకృతవికృతులకా । కామక్రోధములంటదు, సామర్థ్యముచూపబోదు సత్యమీబయలూ । హాశ్చర్యమే మందునీహాయలూ । యేమనదు వినదుమరేమిబల్కదు దీనికే మ్రొక్కుచుందురు దేవుడనిసురలు సత్యమీబయలూ । హాశ్చర్యమే మందునీహాయలూ. 16

తా. పరిపూర్ణముయొక్క హాయలు యిట్టిదని చెప్పుట కాశ్చర్యముగా నున్నది, నామము, రూపము, నటన లెన్నడు నెరుగదు, సుకృత, దుష్కృతములు, కామక్రోధాదు లెప్పుడును లేవు, వినదు, పలుకదు, తనశక్తిచూపదు, యిట్టి తరిపూర్ణమే దేవుడని, దేవతలందరు దీనికే నమస్కరింపుచుందురని భావము,

కం. ఒకపని తా జేయదు వే । రొకపని చేయించబోదు వల్లదు వికట ।
ప్రకటితభి షలననదిక । యొకనై యెప్పటికి వట్లే యున్నదీబయలూ
మెఱకమఱపు మెఱుగదుహో యలూ । సకలచరాచరనికరమంత
టవెలిగే । సుకృతదుష్కృతులనంటక యుట్టకున్నదియున్నదీ బయ
లూ । మెఱకమఱపు లెఱుగదుహో యలూ. 17

తా. అచలమొక పనితాను చేయదు, యితరులచే చేయిం
చదు, రూభాషలు మాట్లాడదు, యెరకమఱపు లెఱుగదు, సుకృత
మెఱుగదు, దుష్కృతమెఱుగదు, చరాచరము లందంతటా నిండి
నిబిడీకృతమై, యెప్పటికిన్ని నొక్కటే తీరుగా నున్నదని భావము.

కం. తలపులవలపులకందక । ములుమోపను సందులేక మొదలాఖరు
లా । వలనీవలనరిదేలక । చెలగెటిదీబట్టబయలు చర్చింపకదుగో ।
గురుకీలకమర్చించు మదుగో । తొలగదుకలగదు మెలగదునలగదు
కలకాలమొకరీతిగలదానికీ దెలసిచర్చింపకదుగో । గురుకీలకమర్చిం
చుమదుగో. 18

తా. ఈ పరిపూర్ణము, తలపులకు, వలపులకు, నందకుండా,
మొదలని, కడయని, అంతులేక, ముల్లుమోపుటకైనను సందులేక,
కదలకుండ, మెదలకుండా నలగకుండ నెల్లకాలమొక్కటేతీరుగానున్నది.
అదిగో చూడుము, గురుకీలకము, దాని కర్చనజేయుమని భావము.

కం. ఎఱుకగ నగపడుపరబయ । లెఱుగుటకై దానిజాడ లెరిగినయదు
కే । యెఱుగుటయెఱుగకపోవుట । నెఱుకచే నెఱుగంగవశమే యీ
యుత్తబయలూ । బ్రహ్మాదులు నెఱుగరీహో యలూ । తిరిగిచూచి
నలేదు మఱుగులోకనరాదు । తరుగెగాబోదు నందరికొక్కటే
తీరు నీయుత్తబయలూ । బ్రహ్మాదులు యెఱుగరీహో యలూ. 19

తా. ఎఱుకవలె కనుపడే పరిపూర్ణమును తెలసికొనుటకై
పరిపూర్ణజాడలెరిగిన యెఱుకే తెలిసికొనుట, తెలసికొనకపోవుట

గాని, వట్టి మలినమైన యెరుకచేత, నీపరిపూర్ణము నెరుగుటకు బ్రహ్మాదులకును సాధ్యముకాదు. ఇది తిరిగి చూచితే యెన్నటికిన్ని తరుగులేకుండా అందరి కొక్కటే తీరుగా నున్నదని భావము.

కం. ఉదయలయాదులనెరుగక । నుదయలయాదులనుజూడ నొల్లక నె
దుటన్ । కదలక మెదలకనిలచిన । దదుగో రాబట్టబయల ల్లదుగో
రాతండ్రీ । ఎరుకచెనెరుగ వలెరామాతండ్రి । మొదటిదేశికునోట
తుదముట్టమాటనే । మ్మదిదెలసి యరుకానువదలెపెట్టె భాటా
లివిగో రాతండ్రి । ఎరుకచెనెరుగ వలెరామాతండ్రి, 20

తా. పుట్టుచావుల నెరుగక, నెదురుగా కదలి మెదలకుండా నిలచియున్న యెరుకను వదలిపెట్టేభాటయైన, పరిపూర్ణమదుగో చూడుము, దీనిని శుద్ధమైన నెరుకచే తెలుసుకొని, నా యెరుకను వదలి పెట్టుమని భావము.

కం. నాకంటె దేవుడెవ్వడు । నాకంటనుజూడబయలె నటలేదేమిన్ ।నా
కంటనునీకంటను । నా కంటను లేదులేదు నాతండ్రివినరా । చేకో
నిదీని పోకుండాగనరా । నీకునాకునుసర్వ లోకములకునచల ।
మేకాఖండముగాను వెలుగుచున్నదిఇదిగో నాతండ్రివినరా । చే
కొనిదీని పోకుండగనరా. 21

తా. నాతండ్రీ, వినుము, నాకంటె దేవుడెవ్వడున్నాడు, నా కంటితో జూడగా పరిపూర్ణము తప్ప మరేమియు లేదు. నాకంటను, నీకంటను నేమియున్నది, యేమియును లేదు, దీనిని తెలసికొని పోకుండ జాగ్రతగానుండుము. నీకు, నాకు, లోకమంతటికి పరిపూర్ణ మొకటిగా ప్రకాశింపుచున్నదిదిగో చూడుమని భావము.

కం. నేనుత్రిమూర్తులనెరుగను । నేనుత్రిలోకముల నెరుగ నిఖిలము
నెరుగన్ । నేనెరుగన నెడిస్ఫురణను। నేనెరుగనివానిగాననేనెవరం
దూ ।నీనానందులోనిబయలందూ । స్వానుభవాంత బ్రహ్మానంద

వారాశి । లోనాతాను నొరులు లేని నిర్భయులందు నేనెవరందూ।
నీవాపాదులోని బయలందూ. 22

తా. నేను బ్రహ్మ, విష్ణు, రుద్రులని, త్రిమూర్తులను, త్రిలోకములను నిఖిలమును నెరుగను. నేనెరుగననే స్ఫురణకూడా నెరుగనివాడను గనుక స్వానుభవమైన నీనానందుదాను యితరులులేని, పరిపూర్ణబ్రహ్మానంద మహాసముద్రములో, నేనెవరనిచెప్పమని భావము.

కం. నేనెరుగనెరుకనెపుడును । నేనెరుగనునెరిగితనగ నేరనుబయలగ।
నేనెరిగిన దీయచలమె । నేనెరిగినదెరిగినటుల నీకుజూపుదురా ।
సూచనశాయగానే తొలగెనురా । లేనిపోనిశశ విషాణమునకును
భయ । మేనాడంటనీరీతిగాని యెరుకనుబట్టినీకు జూపెదురా ।సూ
చనసేయ గానేతొలగెనురా. 23

తా. ఈయచలమునందెరుకను, నేనెప్పుడెరుగను, నేనెరిగితిననే సంగతిని నేనెరుగను, నేనెరిగినది పరిపూర్ణమొక్కటే. నేనెరిగినదాని నెరిగినట్లు నీకు సూచనజేయుచున్నాను సూచనజేయగానే కుందేటికెన్నటికిని కొమ్ములులేకపోయినట్లు, యెరుకతొలగిపోయెనని భావము

కం. నేగానిదిలేదహహా । నేగానిది కానిదాయ నేనైనదిదే । నేగాని
దినే నైనది । నేగనిగనిపించనట్టి నీబయలల్లదుగో । నీనానందు
దాగెనల్లదుగో । వేగులేదు వెనకసాగిపోదుకంటి । కాగదునీగదు
యేగుతేఁ కెక్కనీ నీబయలల్లగో । నీనానందు దాగెనల్లదుగో, 24

తా. ఆహా! ఆశ్చర్యము అంతా నేనే, నేను కాకుండానుండిన, యెరుకలేకపోయెను, నేను పూర్ణమే, నేనుకనికను పడకుండాయుండే అచలమదిగోచూడుము. దానికి గుర్తులేదు. వెనకసాగిపోదు, యెంతదూరముచూచినా కంటి కాగక నీనానందుదాగియున్నదని భావము.

కం. నేనే నేననద్వైవము । నేనేనీవనెటియెరుక నేనెట్లందుగ । నేనే
నైతినహా । నేనేనీయచలమగుచు నేనిల్వగాను । యెరుకను

మరువ నేనెవరిగనను నీనాసందున వెలుగుదాని పరిపూర్ణాముగా
ను నెరిగియవల నీనాభేదమువిడిచి నేనిల్వగానూ। యురుకనుమరచి
నే నెవరిగననూ. 25

తా. నేననే దేవుడను నేనే, నీవనేయొరుక నేనే, నీనాపంచు ప్రకాశించు దానిని, పరిపూర్ణమని తెలిసికొని, నీ, నాభేదము వదలి, నేనేపరిపూర్ణమైనప్పుడు, యెరుకను మరచుట కింక నెవరున్నారు. ఆహా! నిది చిత్రముగా నున్నదని భావము.

కం. తాబలు కేబలుకులకడ । తా బేలనుకున్న చోట తా బేలనియా ।
తా బేలుతోడమరచిన । తా బే లేనిదియుబయలై తత్వమువత్సా ।
తన్మయసుఖరూపమువత్సా । తాబలుకులోపల నాబలుకునంతట
నేబలుకువిడిచి వెలిగాబల్కునొక్కటై తత్వామువత్సా। తన్మ
య సుఖరూపము వత్సా. 26

తా. కుమారా! తాను పలికే పలుకుయొక్క, అంత్యమున తాను లేననుకున్నయెడల, తానులేనే లేదు తాననేస్ఫురణ సహా మరచిన తత్వమే పరిపూర్ణము, లోపలబలుకును, అంతటను, బలుకును, యీ పలుకులు లేక వెలిగానున్న దొక్క పరిపూర్ణమేనని భావము.

కం. ఏమీ లేదనిమనుపోక । ఏమో కలదనుచుతోచు ఏమో బను
ల౯ । నేమీకలదని లేదని । నేమీయనగూడదింక యాయుత్త
మైటా । అచలభోగాశిమాంలోమాట । యేమీలేనివాని క్షేమలా
భములుముం । దేమో వెనకేమో నేనేమానిదెలుపుదు నీయుత్త
మైటా । అచలభోగ శిమాంలోమాటా. 27

తా. ఈ పరిపూర్ణమందేమీ లేదని యిప్పుడు తోచుచుండుకో, యిదివరకేమో నున్నదని తోచుచుండుకో, యీ నిరామయమైన పరిపూర్ణమందేమియు ననగూడదు. యేమీలేనివాని క్షేమలాభ

ములు నన్నడిగితే, వెనుక నెట్లుండెనో, ముందెట్లుండునో, నేనేమని చెప్పెదనని భావము.

కం. పరిపూర్ణ మెరిగితను వే। పరిపూర్ణంబగుచు నెరుక పరిపూర్ణంబై
పరిపూర్ణ మెల్లెరుంగును । పరిపూర్ణము యెరుక లేని పరిపూర్ణమం
దూ । భ్రాంతివిరహితపరిపూర్ణమందూ । పరిపూర్ణాచలబోధపా
రావారములోన । పరదర్శనాపేక్ష పటులెవ్వరుందురీ పరిపూర్ణ
మందూ । భ్రాంతివిరహితపరిపూర్ణమందూ. 28

తా. ఎరుకరహితమైన, పరిపూర్ణమందు, పరిపూర్ణమిట్టిదని తెలిసికొని, శరీరమే పరిపూర్ణమై, ఎరుక అచలరూపమైనప్పుడు పరిపూర్ణము నెల్లెరుంగును, అచలబోధయను, అంతులేని, మహాసముద్రమందు, పరమపదాపేక్షగలవారెవరుందురు ? లేరని భావము.

కం. ఈపరిపూర్ణంబేమన । నీపరిపూర్ణానుభవము నెంతెంతని నే । నె
పరిమితి నెంతునహో । యీపరిపూర్ణాఖ్యవార్ధి నెట్లుజూపుదురా।
సూచనచేత కాపాడుకొనరా । లోపాలవెలుపల దాపలనిలచి ని।
ర్వ్యాపారమున వెలుగు నీపరమార్థము నెట్లుజూపుదురా । సూ
చనచేత కాపాడుకొనరా. 29

తా. శిష్యరత్నమా ! లోపల, వెలపల, దాపల, అంతటా, నిండి, వృత్తిరహితమై ప్రకాసింపుచున్న పరిపూర్ణ పారావారమనే పరమార్థము నెట్లు జూపుదును, సూచనచే కాపాడుకొనుమని భా.

అఖండసాక్షాత్కారసాధన.

కం. అవికృతపరబయలులోబయ । లవలీలగజూచిచూచియాచూపులో
చూ । పవశీకృతమగునిద్రలో । తవిలిననిర్నిద్రగనుటె తత్వదర్శ
నమూ । యిదిసర్వవిరహితసుఖపదమూ । ప్రవిమలాఖండ శ్రీశివ
యోగాచలభావ । వివరణావరణ భూవలయనిర్వ్యాపక తత్వదర్శ
నమూ । ఇదెసర్వవిరహితసుఖపదమూ. 30

తా. వికృతరహితమైన పరిపూర్ణమందు, పరిపూర్ణమునుచూడగా, ఆచూపులో, చూపులీనమై, వ్యాపకరహితమై, సుఖమును జెందుటే, పరిపూర్ణతత్వదర్శనము, ఇది సర్వరహితసుఖము నిచ్చు, శివరామదీక్షితులవారి, అచలదర్శన తత్వమని భావము.

కం. కోరికెనిదురలోనిదురన । కూరుకుపాటొందిదాని కూరుకులోనే ।
పారెటిభూరినిరామయ । పారావారంబుగనుటే బ్రహ్మదర్శన
మూ । ఇదిగనుపైన లేదుసంశయమునుమూ । చేరిదీనిపొందువారి
తోనితరులె । వ్వారు సాటిరారువారువారిలోగనుట బ్రహ్మదర్శన
మూ ఇదిగనుపైన లేదుసంశయమూ. 31

తా. నిదురలో నిదురనగా, కూరుకుపాటుజెంది, ఆకూరుకులోనే, అఖండనిరామయమై, తూష్ణీంభావమును జెందుటె పరిపూర్ణ బ్రహ్మదర్శనము, ఈ సుఖమును పొందువారితో యెవరున్నూ సాటికారు, దీనిని తెలిసికొనుము, నీకు సంశయముండదు. తూష్ణీంభావమనగా యేస్ఫురణయు లేక నిరామయముగానుండుట యని భావము.

కం. బయలంత ర్బాహ్యాదుల । బయలందియుబాహ్యాభ్యంతర్య భ్రమవిడిచి
మహా।బయలై బయలనుమాటయు । లయమై తానచలమయ్యె
లక్ష్యార్థమిదెరా । గురుకీలక మిదె తెలుసుకోరా । కయిపుకు
దిరినమీాది వయిపులోజూడుని।శ్చయముగనున్నదా బయలు నీలో
నాలోలక్ష్యార్థ మిదెరా । గురుకీలక మిదె తెలుసుకోరా, 32

తా. ప్రపంచభ్రమయును కైవులేని పైవైపులో జూడుము, నిశ్చయముగా పరిపూర్ణము నీలో, నాలో, నంతటానున్నది. చూడుము పరిపూర్ణము వెలుపల, లోపల, అంతా పరిపూర్ణమై, పరిపూర్ణమనే మాటకూడా లయమై అచలమయ్యె లక్ష్యార్థమిదే యిదే గురుకీలకమని భావము.

కం. చూపీచూపనియర్థము । చూపించితిచూడుమిదుగో చూచితివి
గదా।యీా పట్టులోనిరెంటిని।కాపట్యము లేక విడచికదిలేవా వీా

దా । కదిలేదంతా పాపమే కాదా । చూపులోపలనున్న ప్రాపుగం
టివిగద । నూపించచూచేదీన్నే ప్రొద్దుదలపాకు కదిలేవామీదా
కదిలేనంతా పాపమే కాదా. 33

తా. చూపే చూపకుండాయుండు పరిపూర్ణమును చూపించి
తిని, చూడుము. ఈ పట్టుదలలో కపటములేకుండా ప్రకృతిద్వయదోష
ములనే నెగుకమరుపులను రెంటిని విడచిపెట్టుము యికమీాద కదిలేవు
సుమా కదిలేదంతా పాపమేనని భావము.

కం. ఏదెరుగని దీబయలని । లేదీయరుకనుచునీకు లెస్సగదృఢమై । భే
దమువదిలేదాకను । పాదుగనీమంత్రయుగము పఠియించవో యీా
నను మరువక బోధాగనవోయీా । లేదనుయెరుక యభేదమైవిడి
పోతే । యేదెరుగనచలము నీదుధనమె కాదా పఠియించ వోయీా
ననుమరువక బోధాగనవోయీా. 34

తా. పరిపూర్ణమేదీ యెరుగదనియు, ఎరుకలేనిదేననియు నీ,
శారూఢియై భేదమువిడిచే పర్యంతం యీారెండు మంత్రములు పఠిం
చుచు నన్ను మరువవద్దు లేనియెరుక భేదములేకుండా పోతే యేమీా
యెరుగని పరిపూర్ణము నీధనమేనని భావము.

కం. సత్యపరిపూర్ణమిదిగో । ప్రత్యక్షముగానుబోధ పరుచుకొంబుధ
సాం । గత్యమునదాచుకోనుమ । ద్భృత్యుడవై బ్రతుకు వోయీా
భూమున్నదాకా । రవిశశివహ్నికీర్త్యున్నదాకా । నిత్యమదే నని
యత్యుక్తిదెల్పితి । శ్రుత్యంతమోక్షో పరత్యంతసుఖివై యీాభూ
మున్నదాకా । రవిశశివహ్ని కీర్త్యున్నదాకా. 35

తా. అనేకయుక్తులచేత నెప్పటికిని యీాపరిపూర్ణము తప్ప వేరు
లేదని చెప్పితిని, సత్యమైన పరిపూర్ణమిదిగో ప్రత్యక్షముగా జూడుము
పెద్దల సాంగత్యము వలన దాచుకొనుము ఈభూమి సూర్యచంద్రు
లుండేవరకు అనగా శాశ్వతముగా నాభృత్యుడవై బ్రతుకుమని
భావము.



శ్రీగురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్య సంవాదము:

## చతుర్థ ప్రకరణము

### అఖండభ్రమనిరాసము.

కం. స్వామీసకలహృదంత | ర్యామీభవదీయ్యసత్కటాక్షామృతపూ | ర్ణామోదహృదయమగ్నత | నీమహనీయ్యామునుగంటి నిదెప్రత్యక్షముగా | సత్యాసత్య మత్యద్భుతముగా | శ్రీమహాగురుసార్వభౌమనామకచిత్త | భ్రమనుదొలగించిమామహిమజూపవెనిదే ప్రత్యక్షముగా | సత్యాసత్యమత్యద్భుతముగా | 1

తా. దేవా! తమకరుణామృతము వలన సత్యాసత్యములను ప్రత్యక్షముగా గ్రహించితిని ఇకమీద తమరు నాయందనుగ్రహముంచి నాయొక్క చిత్తభ్రమను తొలగించి తమ మహిమను కనుపరచవలెనని భావము,

కం. మునునేదెల్పి నబోధను | గనుమదిపరిపూర్ణమహిమగంటివిగదనా | వెనకనునెదురాడకవిను | ఘనతరమగుయరుకవిడువ గలదొక్క తెరగూ | గురుతెరగునీమన సెల్లకరుగూ | గనుకచక్కనిబోధ కడదాకవినిదాని | కనుపించునీయెరుకకనుమూసిమరిపించు గలదొక్క తెరగూ | గురుతెరగనీమనసెల్లకరుగూ, 2

తా. శిష్యా! యిదివరకు నేనుజేసిన బోధను గమనింపుము పరిపూర్ణాద్భుతమును చక్కగా గ్రహించితివిగదా ఇంకనాతో నెదురుమాట్లాడకుండా వినుము చెప్పెదను గాఢమైన నెరుకను విడుచుటకొక మార్గమున్నది దానిని గ్రహించిన నాయెరుక రెప్పపాటుకాలములో నమసిపోవునని భావము,

కం. తానొరులులేనిబయలులో । తానరుదెంచెరుక గురుసుతాఖ్యాకృ
తులై లేనట్టిప్రశ్న ప్రవచన । జ్ఞానమునొనగూర్చి బోధకళలనగుప
రచీ । బయలెరుకలవివరమేర్పరచీ । పూనియచలముచూపి తాన
గుపడనివి । ధానమొకకథగలిగెదానినీ కెరిగింతుకళలనగుపరచీ ।
బయలెరుకల వివరమేర్పరచీ. ౩

తా. తాను నితరులులేని నిరామయమైన పరిపూర్ణమందు
ఎరుక తానుతోచి గురువని శిష్యుడనిపేర్లు పెట్టుకొని లేని ప్రశ్నో
త్తరములు గలుగజేసి అచలమిట్టిదనియు ఎరుకయిట్టిదనియు వివరము
లేర్పాటుజేసి పరిపూర్ణమును చూపితాను కనబడకుండా బొద్యోవిధా
నమొక కథగలిగెను దానినీకు జెప్పెదనని భావము.

గురువాక్యము.

శిష్యా ! సర్వమును గుత్తెరిగెడి యీశరీరమేమిలేదు దీనినెప్పు
డున్న మరువవద్దు ఇంతకంటె నెక్కువలేదు ఈశరీరము నమ్మవద్దు
కలలో జూచిన శరీరములు మేలుకొని నప్పుడు లేవనేనిశ్చయ
ముండవలెను ఇదే భ్రాంతిరహితము ఇదియే షోడశాక్షర బ్రహ్మ
విద్య. దీని నెప్పటికిని జ్ఞాపకముంచు కొనుము. మూలము లేనిగు
త్తెరిగే శరీరము యేమీలేదు. అను వాక్యములో మూలములేదు
అనునదే మొకటిసూచన. అనగా, శ్లోకం॥ అమూలంచాప్యసత్యంచ
అకార్యం కారణాత్మకం । భ్రాంతిస్మృతిభ్రమాకారం తత్తద్భ్రాంతి
స్తులక్షణం॥ దీని తాత్పర్యమేమనగా, ఎరుక మూలములేనిది, అసత్య
మైనది, కార్యకారణరహితమైనది, భ్రాంతి, స్మృతి, భ్రమలే యాకా
రముగాగలదియై యున్నదని భావము. ఈయర్థములో ఎరుకకు మూల
ము లేదనేభావము సిద్ధాంతమైనది.

కం. లేనెరుకయీయఖండము । లోనేతాదోచిబయలులోనేతొలగెా
లేనికలలోనచిత్రము । గానకనెటుగలుగుమేలుకన్న మీదటనూ ।

తదో్భగముతానొందుటకునూ । లేనిసర్పభ్రమ పూనునే రజ్జుపై ।
తానాబయలులోవచ్చి తానేపోయనుయరుక కన్నమీదటనూ ।
తదో్భగము తానొందుటకునూ. 4

తా. లేనికలలోబొందిన చిత్రమైన యనుభవమంతా మేలుకొనిన లేనట్టును, భ్రమసి త్రాడును సర్పమనినను పరీక్షించిన త్రాడుసర్పముగానట్టును, లేనియెరుక యీ యఖండపరిపూర్ణమందు దోచి పరిపూర్ణమునందే లయించుననని భావము.

కం. ఎరుకమరుపులకు రెంటికి। మరిమూలము లేదు వీటిమరణజననసం।
చరములు గలుగును వేరొక । టిరువున్నదన్నమాట నీయుత్తబై
టా । తలచరాదాతర్వాతామాటా । యెరుకమరుపులు రెంటినెరి
గేదెట్టిబయలు । యెరుకలేనిచోట వేరొకటి గలదనుట నీయుత్త
బైటా । తలచరాదా తర్వాతామాటా. 5

తా. ఆత్మకు, శరీరమునకు మూలము లేదు. ఇవిపుట్టుట, సంచరించుట, మరణించుటలు పైప్రకారం భ్రమవలన దోచుచున్నవేగాని నిజముకాదు. ఈనిర్గుణమైన సందులేనిపరిపూర్ణమందు వేరొకటుండుటకు చోటులేదు. యెరుక మరుపులను పరిపూర్ణమెట్లెరుగును ? యెరుగదని భావము.

కం. ఎరుకమరుపులకు మూలముపరబయలనితలచబోకు భ్రాంత్యాహా
ములునై । ఎరుకకుమూలము మరుపగు । మరుపుకుమూలంబుయె
రుకేమరియునెప్పటికీ। రెంటికిమూల మెరుగమెప్పటికీ । తెరువుమ
రుపులుగనుకసారదివెంటనురాక । నరయమూలము లేకనరుగునవి
రెండెరుక మరియునెప్పటికీ। రెంటికిమూల మెరుగమెప్పటికీ ॥ 6

తా. ఎరుకమరుపులనగా ఆత్మ, శరీరములకు పరిపూర్ణముమూలమని నీవెన్నటికినిదలచకుము. యీరెందును భ్రాంతియనియు, అహమనియు యేర్పడి, ఎరుకకు మూలము మరుపు, మరుపుకు మూలము

యెరుకగానున్నది గాని, యీరెంటికిన్ని మూలమెప్పటికిన్ని లేదు. యీ రెండున్ను లేని యెరుకేనని భావము.

కం. ఎరుగుచుయెరుగుచు నెరుకే।మరుపుననొక వేళజిక్కి మమతై మరుపౌ । తెరవుగన్పించ నెరుకగు । నరయగనవి నెపుడుభేదమని తలచరాదూ । ఎరుకనువిడిచిమరుపుండబోదూ । మరిధూమపావకులిరువురనుచుదోచే । సరణినెట్లగునట్లె నెరుకమరుపులుద్వివిధ మనితలచరాదూ । ఎరుకనువిడిచి మరుపుండబోదూ. 7

తా. ఎరుగుచు, నెరుగుచు నొకవేళ మరుపుచేతమమతై, మరుపగును. తెరవుచిక్కగానే నెరుకయగును. గనుక నీరెండును వేరని తలపగూడదు. అగ్నియు, పొగయు వేరుగా తోచినను, ఒక్కటేఅయినట్లు, ఎరుకనువిడిచి మరుపు, మరుపును విడచి యెరుకలెప్పటికి నుండవు. యివిరెండు నొకటేనని భావము.

కం. బీజముతరువై పుట్టును । బీజము బీజంబురీతి పెంపగు ధరలో । బీజముకుభూజముకునొక । బీజము గలదన్నమాట పెడవాదుగాదా । తమకై బుట్టి తాగిట్టుటరుదా । బీజభూజములను భూమెల్లరు గదానట్లె । తేజమీబయలు నింకేచిత్రమెరుగదు పెడవాదుగాదా । తమకై బుట్టితాగిట్టుటరుదా. 8

తా. భూమియందువిత్తనముచెట్టై పుట్టును. విత్తనములువిత్తనములరీతిగావృద్ధియగును. విత్తనముకును చెట్టునకువేరేయింకొకవిత్తమున్నదనేమాట, పెడమాటగాని సరియైనమాటగాదు. తమకుతాము పుట్టిగిట్టుట అరుదుకాదు. విత్తనమును, చెట్టును, భూమియెల్లరుగదో నట్లే పరిపూర్ణ మేమియునెరుగదని భావము.

కం. తరువేమూలమువిత్తుకు । తరువుకు మూలంబువిత్తు ధరణిలోరెండుగ । పెరుగుటవిరుగుటతిరుగుట । నరయగతానెన్న డెరుగ వదిరాయీధరణీ । యీశరణినెరుగుము నాత్మసరణీ । మరిబుట్టుగిట్టు

చుపొదలుతనువెరుకల । పరికింపబోదు యీబట్టబయలెన్నటికనదె.
రాయీధరణీ । యీశరణీ నెసుగుము నాత్మసరణీ. 9

తా. విత్తునకు చెట్టుమూలము, చెట్టునకు విత్తుమూలము, భూమియందలి పుట్టుట, పెరుగుట, నశించుట, మొదలగు కార్యములభూమియెట్లెరుగదో. అంతులేకుండ పుట్టుచు, పెరుగుచు, గిట్టుచుండే తను వెరుకలను పరిపూర్ణం మెప్పటికి నెరుగదని భావము.

కం. గురుతెరుగేటపుడెరుకగు । గురిమరచిన వేళమరుపుగొనునిదెవరెం
డెరుగనిబయలెరిగించుట । గురుకృపచేయెరుకమొదటి గురివిడువ
రాదా । విడిచినగురుతుమరచేదే కాదా । పరిపూర్ణమెరుకనిపలు
మారుపదిలేవు ! పరబయలునందెరుకపట్టిచూపర మొదటి గురి
విడువరాదా । విడిచినగురుతు మరచేదా కాదా. 10

తా. గురుతెరుగు సమయమందు యెరుకయగును, గురిమరచినప్పుడు మరుపగుచున్నది సద్గురుమూర్తి కరుణవలన యీరెండెరుగని పరిపూర్ణము నెరిగి మొదటి గుర్తైన యెరుకను విడువుము విడచిన గుర్తును మరచిపొమ్ము, అనేకమార్లు పరిపూర్ణమని యెరుకయని వదరెదవెందుకు పరిపూర్ణమన యెరుకను పట్టిచూపగలవా! చూపలేవని భావము.

కం. మరుపనుమోహాతరాబ్ధిలో । మరుపులనేకములుబుట్టి మాయగన
ణగుణ । స్ఫురణించియెరుకచిత్రము । లెరిగించి ననేకవిధము లెం
తోవింతలుగా । ఇంతటికీబయలొక్కటెరుగదుగా । యరుకన్న
మరుపన్న తెరపన్న మరకన్న స్థిరమన్నచరమన్ననివియరుకకున్నపే
ర్లెంతో వింతలుగా । ఇంతటికీబయలొక్కటెరుగదుగా. 11

తా. మరుపనుమోహ సముద్రమందు అనేక మరుపులుపుట్టిలయించుచున్నవి. యీయెరుక అనేకచిత్రవిచిత్రములైన పనులను

కనుపరచి కడకేమియులేక పోవుచున్నది. ఎరుకయనినను మరుపనినను స్థిరమనినను అస్థిరమనినను యెరుకకే పేర్లు యింతటికీ పరిపూర్ణమొక్కటియు నెరుగదని భావము.

కం. మేనెరుకలొకటికొకటియు ! దానికినిదిదీని కదియు ధరబుట్టుగతిం।
నానావిధసంకల్పవి । ధానము చేజగములెల్లతమకై తాగలుగూ ।
సంకల్పముమానినతొలగూ । లేనితను వెరుకలు లేనిమూలమునందు । లేనిదై నీగుండు లేని వేగద జగముతమకై తాకలుగూ । సంకల్పముమానినతొలగూ. 12

తా. లోకములో శరీరమెరుక లొకదాని కొకటి బుట్టుచుండునటులనే అనేక విధములైన సంకల్పములచేత జగములన్నియు తమంతటతామే గలుగుచున్నవి. సంకల్పముమానితే తొలగుచున్నది. మూలములేక తోచేదానియందు అబద్ధపుతను వెరుకలు లేని వేగదా ? లేని వేనని భావము,

కం. ఎరుకతనువులనొకటిగ।పరికింపగ రాదటంచుపల్కెదరుభువిన్।
యరుకతనువులనుకడపట । గురిగురుతులులేక రెండు గూడియొకటౌరా । గురుతగుపడువరకే వేరౌరా। అరమరలేకనవ్వలిబోధవినకను। స్థిరముగనీరెంటిమరచినయచలమే గూడియొకటౌరా । గురుతగుపడువరకే వేరౌరా. 13

తా. ఎరుక వేరనియు, తనువు వేరనియు, ఈరెండొకటి యని చెప్పగూడదనియు భూమియందు కొందరవి వేకులనియెదరు. కడపట నీయెరుక తనువులురెండును గురిగురుతులు లేకుండాకూడుకొని ఒకటియగుచున్నవి. గురుతు అగుపడువరకు వేరుగా నగుపడుచున్నది అరమర లేకుండా నీరెంటిని మరచిన పరిపూర్ణమొకటే యగుచున్నదని భావము

కం. రాకకువిధిలేనెరుకకు ! పోకవిధంబొకటిజేసిబోధింపుమనే । వేకర

ణిదెల్పఁబూనిన । నాకేయపకీర్తిఁగలుగు నన్నడుగఁబోకుమా । లోక
ముగనుచువ్యాకులపడకుమా । రాక కావల లేకపోక కీవలబోక । లేకు
న్నమధ్యనీ దేకరణియొకటుండు నన్నడుగఁబోకుమా । లోకముగనుచు
వ్యాకులపడకుమా. 14

తా. రావడానకు కారణములేని యెరుకకు హాయ్యోవిధి యేర్ప రచి బోధింపమనియెదవు యెట్టులచెప్పబోయినను, నాకే యపకీర్తి గలుగుచున్నది. నన్నడుగవద్దు. రావడానకవతల లేక, నివతల లేక, మధ్య నొకటెట్లుండును ? లేదని భావము.

కం. ఎరుకేయరుకనుయెరుగును । ఎరుకచెపరిపూర్ణమహిమ నెరుగన
శక్యం । బెరుకవుపొడపొళుకువలెక । నెరుగనియీావృత్త జయలెల్లె
రుగు నెరుకకా । ఎరుగుననరకాముగనుకా మరియితరేతర మెరుగ
వెప్పుడునుభా । స్కరతమసములు రెండేతీరోమూరితిగనే యెల్లె
రుగుయరుకకా । ఎరుగునంటెనరకాముగనుకా. 15

తా. ఎరుక నెరుగునది. ఎరుకేగాని మరియొకటిలేదు. ఎరుకచేత పరిపూర్ణమహిమ తెలియబడదు. ఎట్లన సూర్యుని చీకటి, చీకటిని సూర్యు డెరుగనట్లు ఎరుకపొడ నెరుగనిపరిపూర్ణము ఎరుక నెట్లెరుగును? ఎరుగదు, ఎరుగునంటే నరకమొచ్చునని భావము.

కం. ఎరుకనుమరుపునునెరిఁగె। మరివొక్కటిగలదటంచుమహిలోపలనీ ।
యరుకబలపరచి దెల్పెటి । గురుబోధలచాతమనను కుదురునటో
యీ । గురిగురుతులమరచి పోవోయీ । తరుబీజముల కితరేతర
మూలకములవే । తరుబీజములరెంటి కరయమూలము లేదుకుదురు
నటోయీ । గురిగురుతులమరచిపోవోయీ. 16

తా. ఎరుక మరుపుల నెరుగుట కింకొక్కటున్నదని భూమియం దెరుకను బలముచేసి చెప్పె గురుబోధలవల్ల మనస్సుకుదురదు. ఆబోధ లను వినవద్దు, గురిగుర్తునుమరచిపొమ్ము. చెట్టునకును, విత్తునకును

వేరే ఒకమూలము లేనట్లే ఎరుకమహపుల నెరిగేదియింకొకటిలేదనిభా.

కం. ఎరుగేదెరుకైనప్పుడు। పరిపూర్ణంబెందుకెరుకబడదంటివినీ । య
రుకతనురూపు రేఖల । నెరిగేదొక మహగు గాసి। నెరుగదీబయలూ।
తనువెరకలుపొరలేటిగయలూ । ఎరుకబయలును బాగ మెరుగలేన
ప్పుడీ । ఎరుకనుబయలు తానెట్లెరుగురా తండ్రీ ఎరుగదీబయలూ ।
తనువెరుకలుపొరలేటిగయలూ. 17

తా. యెరిగేది యెరుకయైనప్పుడు పరిపూర్ణము నెందుకెరుగదనియంటివి. ఎరుకకు తన రూపురేఖ విలాసముల నెరిగేసంగతోకచే తెలియునుగాని, పరిపూర్ణము నెరుగజాలదు. ఎరుక పరిపూర్ణమును జూడలేనప్పుడు, పరిపూర్ణ మెరుక నెట్లెరుగును. ఎరుగదని భావము.

కం. తనునొకతలిదండ్రులచే । గనబడెమును వారి వారి గనిరిట్లితరుల్ ।
కనికని బెరగెనుగానీ । గనజనకస్థానమిదిగా గానుపించదుగా । యే
దేవతులీమరుగుగానరుగా । వనజభవాండసృజనమింతెయగుగాని
వినునీనావలన యేమనుజూచేనైనట్లుగానుపించదుగా । యే దేవతు
లీమరుగుగానరుగా. 18

తా. తా నొక తలిదండ్రులవలన గలిగెను. అట్లే వారి తలిదండ్రులు వారివారిని గనిరి గాని మొదట పుట్టుస్థానమిదియని యంతుజిక్క లేదు. ఈ ప్రపంచసృష్టి యావత్తు నీ ప్రకారము గలుగుచున్నది. ఈ మర్మము యే దేవతలుకాని, నీవుగాని, నేనుగాని తెలియజాలమని భావము.

కం. భూతప్రపంచకములో । ఖ్యాతిగనాకాశ మొకటి గన్పడుదానిన్ ।
యూతరియచలంబనియమ । ధూతలవలెదెల్పిరమిత దుష్టబోధకు
లూ । వేదార్థసంపదహీనమతులూ । ప్రీతిపరిపూర్ణమిదే తెలును
కొమ్మను । ఘాతకగురుబోధపాతకమిదివినకూ దుష్టబోధకులూ ।
వేదార్థసంపదహీనమతులూ. 19

తా. పంచభూతములచే నేర్పడిన ప్రపంచములో ఆకాశమొకటీ కన్పించుచున్నదనియు, యిదే పరిపూర్ణము గ్రహించుమనియు యమదూతలవలె ఘాతకులైన గురువులు చెప్పే పాతకమైన దుష్టబోధనువినవద్దని భావము.

కం. వేఃకడగానని శూన్యం । బాకాశంబనుచు లోకులందరనగ బా। హ్యకల్పితపవనాదుల । నేకమునికదానిలోన నేబుట్టెననుచూ। బలికిరి రాకపోకగలదనుచూ । చీకాకుబోధలివె కావె వంధ్యాసం । తేకాలమున్నదిని కే తెలియదె మదికి నేబుట్టెననుచూ । బలికిరి రాక పోకకలదనుచూ. 20

తా. ఆకాశంగగనం శూన్యంబని అనగా ఆకాశము లేనిదేనని లోకులవాడుక గదా ? లేనిదానియందు వాయువు, అగ్ని, వుదకము, పృధివి, పుట్టినవని చెప్పుచున్నారుగదా ? ఇవిఅన్నియు చీకాకుబోధలే కదా ! గొడ్రాలి బిడ్డనన్ను కొట్టి వచ్చుచున్నాడంటె గొడ్రాలికి బిడ్డయుండేది లేనిది నీకు తెలియదా ? తెలుసునని భావము.

కం. ఆకాశమఖిలశూన్యము । లేకను తాగలుగుయరుక లేనిదదృశ్యం- బీ కార్యకరణములలో । నీకును నాకొక్కరీతినిలచేసిబయలూ - ఇది తెలిసి తేసోకదామయలూ । యీకథ లెరుగకలోకులెల్లను బయ । లాకాశమని తెల్పెకాకికూతలవినకు యగుపడుబయలూ । ఇది తెలసి తేసోకదామయలూ. ౨౧

తా. అఖిలశూన్యమైనది ఆకాశము, దానియందు కలుగులేని యెరుకకనబడునది గాదు వీనియొక్క నడకలిట్లుండగా పరిపూర్ణము నీకును నాకును ఒక్కటేవిధముగా నిలిచియున్నది. ఈసంగతి చక్కగా తెలిసితే ఎరుకయను మైలసోకదు ఈ సందర్భములు తెలియక లోకములో నున్న దుర్మార్గులు ఆకాశమే పరిపూర్ణమని చెప్పేకాకికూతలునీవు వినకుమని భావము.

కం॥ ఆకాశమెయావరణము । ప్రాకటపరిపూర్ణమమిత బాహ్యామవి
షే । ప్రాకృతమునిరావరణము – జేకొనసీరెంటి తెల్వి చేగనిపెట్టా–
తెలిసిన తెల్వి పోకటబెట్టూ । రాకపోకలకొక్క ప్రాకారమాకాశ
మీాకడాకడలేనియాకడదె నిర్బయులు చేగనిపెట్టు । తెలిసిన తెల్వి
పోకడబెట్టూ. 22

తా॥ ఆవరణమనగా ప్రాకారము నిరావరణమనగా ప్రాకార
ములేనిది ఆవరణమునకు ఆకాశమనియు, నిరావరణమునకు పరిపూర్ణ
మనియు పేర్లున్నవి. ఆవరణమునకు మితిమేరలున్నవి. నిరావరణము
నకు మితిమేరలులేవు ఆవరణమైన తెలవిచేత నిరావరణమైన పరి
పూర్ణము గ్రహించి తెలిసిన తెలివినిబోగొట్టుమని భావము.

కం॥ ఆకసముబయలటంచును । కూకలుబెట్టుచునుభీతి గొల్పుదురత
రుల్ । నీకాభయములువలదిక । ప్రాకటముగబయలులోనపరశబ్ద
మున్నా । నీవదినమ్మియేకరణిగన్నా । ఆకాశమేశబ్దలోకామెరుక
విడువు । మేకపరిపూర్ణామాలో కించిమది నుంచు పరశబ్దమున్నా ।
నీవదినమ్మియేకరణిగన్నా. 23

తా॥ ఎరుకే సత్యమనిచెప్పే దుర్మార్గపు గురువులాకాశమే
పరిపూర్ణమని కేకలుపెట్టి భయపరచెదరు ఆకాశము శబ్దగుణముగల
దినిజమేగదా ? శబ్దమేయెరుకగదా ? పుట్టుటకు గిట్టుటకు ఆయెరుకే
కారణముగాదా ? పరిపూర్ణమందితర శబ్దములుండునా ? వుండవు
ఈ సంగతులు నీకు ఆరూఢియైయున్నది గదా ? నీకాభీతిని గలుగ
చేయు దుర్మార్గులబోధ వలన భయపడకుము. పరిపూర్ణమునే నమ్మి
యుండుమని భావము.

కం॥ కానని దేశూన్యంబని । కానగనౌనట్టిదెల్ల కనుబయలనినే। నానా
డెదెల్పితిమరి । కానగనిదిబయలునిదిగో కనుగొనరాదా । ఎరుకే
శూన్యమనినమ్మరాదా । కానవచ్చెటిబయలు గనినమ్మితేచాలు ।

కానవిదిగానక నేగనుపించకదెపోదా గనుగొనరాదా - ఎరుకేశూ
న్యంబనినమ్మరాదా. 24

తా. కనుపడనిది శూన్యమైన ఎరుకయనియు కానవచ్చెదంతా పరిపూర్ణమని నిదివరకే నేనుచెప్పితిని కానవచ్చే బయలిదిగో చూడుము ఎరుకశూన్యమని నమ్ముము కనబడే పరిపూర్ణమును కనినమ్మితే చాలును కనుపించనిది కనుపడకుండా పోవునని భావము.

కం. యరుకకుతనువింద్రియములు । స్థిరముగనవయవములగుచు తిరుగుచునుండుగ్ । గురిశబ్దజనకనభమును । పరబయలనితలచబోకు పాపివిగాకూ- మరచినప్రభతిరుగగనరాకూ । నిరతమూకాశమేపరిపూర్ణమనువ్యర్థ । గురుబోధలనువిని గురిమరచిపొయ్యేవుపాపివి గాకూ । మరచినప్రభతిరుగగనరాకూ. 25

తా. ఎరుకకు శరీరము, యింద్రియములు, అవయవములై తిరుగుచుండును. శబ్దగుణకమైన ఆకాశము పరిపూర్ణమని నీవెన్నటికిని తలచకుము పాపివిగాకుము మరచినగుర్తును తిరుగాచూడకుము ఆకాశమేపరిపూర్ణమని చెప్పితప్పుడు గురుబోధలను విని పరిపూర్ణగురుని మరచేవు సుమాయని భావము.

కం. మనకెదుట బయలులోపల । కనవినలేదెరుకదీని కలకాలమునే । గనిశూన్యముమాకనముని । యనవలసెనుదీనివిశ్వమనిరి మాతంఢ్రీ దృశ్యమునశ్వరామనిరితంఢ్రీ । విను ప్రకృతివికృతిచే తనమాయ జగమని । పనికిమాలినయరుకపరికరములగువిశ్వమనిరి మాతంఢ్రీ దృశ్యమునశ్వరామనిరితంఢ్రీ. 26

తా. శిష్యా! మనకెట్ట యెదుట కనుపించు నచలమందు యెరుక కనా, వినాలేదు దీనిని నేను కలకాల మనుభవముచే ఆకాశము శూన్యమని అనవలసివచ్చెను దీనినే పెద్దలు నిశ్చయమనియు కనుప.

డేదంతానుంచు నదికాదనియు పెద్దలనిరిగనుక పరిపూర్ణము తప్పమరే మియును లేదని భావము.

కం. ధ్వనిలేనిచోటుబయలని । ధ్వనిగలిగినదెరుకయనగతగురెండింట్లో।
ధ్వనిమొదలగుతన్మాత్రలు । తనువిశ్వభ్రమలనెపుడు తానిండి
యుండూ । ధ్వనిమరచియున్ననిగనుచుండూ । తనలోనిరణగుణ
ధ్వనినిగురుబోధసా । ధనలోనెమరచినఘనుని మహిమంతటతా
నిండీయుండూ । ధ్వనిమరచియున్ననిగనుచుండూ. 27

తా. ధ్వనిలేనిచోటు పరిపూర్ణమనియు, ధ్వని గలిగినదెరుకయనియు జెప్పబడుచున్నది. యీ రెంటిలో నెరుకధ్వని మొదలగు తన్మాత్రలచే దేవవిశ్వభ్రమలచేత నిండియుండెను. నీలోపలి రణగుణ ధ్వనియైన ప్రణవమును గురుబోధసాధనచే మరచి యేమీలేని నిరామయమైనయున్నని భావమును జెందుమని భావము,

కం. నేననియరిగెటిదేదో । మెనందునలేకబయిటమెలగుచునుండు ।
గానదియరిగెయరుకను । మేనితోవిడుచుటకుయచలమెలుకువ
గనరా । దీనికికాలవాలమేలనురా । లేనియనుమానమేమైనగలిగి
యుంటే । మానకసద్గురుస్వానుభవమువిని మెలుకువగనరా । దీనికి
కాలవాలమేలనురా. 28

తా. నేననియెరిగే ఎరుక శరీరమందు వెదకినలేదు. బయటనే యున్నదిగనుక పరిపూర్ణమెరిగే యెరుక శరీరమును విడిచిన పరిపూర్ణమందు జేరేమెళకువను గనుము. దీనికింత ప్రచారమెందుకు, లేనియనుమానమేమైనా వున్నయెడల గురుమూర్తియొక్క స్వానుభవమును విని పరిపూర్ణుడవు కమ్మని భావము.

ఇదియే అఖండభ్రమవిసర్జనప్రకరణంలో భ్రాంతియను యరుక మూలములేదను ప్రథమబోధ వచనమునమాప్తము.

గురువచనము. శిష్య మూలములేక గు తెరిగేశరీరమేమి లేదు అనుశ్రుతి వాక్యార్థప్రబోధలో-

ఈగు తెఁరి గేశరీరము అనునదే ద్వితీయ్యసూచనము.

అనగా శ్లోకం. అహంకారక్రియామూలం । సర్వకార్యవినిగ్ర హం । మాయామయంజగత్సర్వం । వ్యాపకభ్రాంతి లక్షణం। భ్రమేణ త్వంభ్రమేణాహం । భ్రమేణోపాసకంమనః । భ్రమేణేశ్వర భావత్వం। భ్రమమూలమిదంజగత్.

అనునర్థములో యెరుక పూర్వోక్తవిధిగా తనకు మూలములేక తానుసమస్తమై సమస్తమునుగు తెఁరిగి సర్వకార్యకారణ నిర్వాహక ముగా మూలములేకనే వ్యవహరింపుచున్నదని సిద్ధాంతవివరణము.

కం. నీరంబోనారికేళము । చేరినగతియెరుకతాను జేకునుమధ్యన్ । వారణభుక్తకపిత్థసు । సారముగాబోవునెరుకీసరణీసివెరుగూ । రా నిపోనిదానికనుమరుగూ । భూరిపరిపూర్ణము తేరితాజూచెరుక । తారితనుతనుభ్రమింగినూరికేగన్న డేసరణీసివెరుగూ । రానిపోసిదాని కనుమరుగూ. 29

తా. టెంకాయలోనికి నీరు వచ్చిన విధముగా ఎరుక తనం తటతాను మధ్యవచ్చును. ఏనుగుతిన్న వెలగకాయ విధమున కడకే మీఁ లేకపోవును ఈగుర్తు తెలసికొనుము. లేనిపోని దాన్ని చూడ కుము, శుద్ధయెరుక, పరిపూర్ణమునుజూచి తనను తాను భ్రమింగి పరిపూర్ణమయ్యే మార్గమును తెలిసికొమ్మని భావము.

కం. శ్వేతమురుచిమృదుగుణమును । ఖ్యాతి గ నేవస్తువందుగలదో దా నిఁ । మాటురుశర్కరయనుచురు । యా తెలివిసిగదియు నెరుక యదెయనరాదా । తెలియకున్నవినికనరాదా । ఈ తెలివిచేబయ లటోతు తెలిసితివేని । యీ తెలివినేతెలగదీతుతక్షణమునన దెయ నరాదా । తెలియకున్నవినికనరాదా. 30

తా. తెలుపు, రుచి, మృదుగుణముగల వస్తువును చక్కెర యని తెలుసుకొనుచున్నావు, ఆ తెలసికొను, తెలివియే ఎరుకమైయు

న్నది. నీకు తెలియకుంటే వినరాదా, కనరాదా, యీ తెలివిచేత పరిపూర్ణము యొక్క అంతు తెలిసికొంటివేని యీ తెలివిని క్షణము లోపల నేను తొలగచేసెదనని భావము.

కం. అండముపిండములోవెలి । రెండహములు మొదట జేరి రెండాల్మగలై । నిండితనుశుక్లశోణిత । ఖండములోనొదిగినగుణకలితము బెనగీ । నొకటికొకటియండాలై చెలగీ । దండిగనాల్గొక్క ఖండము జేరియా । ఖండా మెరుకసంతునిండే బ్రహ్మాండముకలితము బెనగీ। నొకటికొకటియండాలై చెలగీ. 31

తా. అంతమనగా పంచభూతస్వరూపమగు మహాప్రకృతి, పిండమనగా పంచభూతవికారమైన ప్రకృతి. ఈ ప్రకృతుల రెంటిలో మొదటి రెండహములు జేరి, ఆలుమగలై శుక్లశోణితముల ముద్దలో నణగి గుణములతోగూడి రూపేర్పడి, ఒకదానికొకటి యండలై యుండును. పై జెప్పిన రెండుప్రకృతులును యీరెంటిలోని రెండహములు అనగా (ప్రత్యగాత్మ పరమాత్మలు, అనగా చిత్తును చిదాభాసుడును) ఈ నాలుగు ఖండములును జేరి అఖండాకారము నొంది ఎరుక సంతుబ్రహ్మాండము నిండెనని భావము.

కం. రెండహములలోనెరుకయు । పిండబ్రహ్మాండములును పెంపుగనాల్గుక । ఖండము జేరినయరుకా । ఖండంబై ప్రబలెదీని కనుగొనుమదుగో । మూలము దీనికుండాబోదదుగో । కొండవలె నిదియు ఖండాఖండములగు । చుండుదీనిపట్టిఖండించు నచలము కనుగొనుమదుగో । మూలముదీనికుండాబోదదుగో. 32

తా. ఎరుకయైన ప్రత్యగాత్మపరమాత్మలు అనగా దేహిదేహములున్న పిండబ్రహ్మాండము లనగా ప్రకృతి, మహాప్రకృతులును యీనాలుగు ఖండములును జేరి అఖండాకారమై నిష్కళారూపమై యున్న యెరుకను చూడుము ఇది ఖండాఖండములుగా నగపడుచున్న

ది. దీనికి మూలము లేదు దీనిని ఖండించే పరిపూర్ణ మిదిగో చూడు మని భావము

కం. యరుకకు పేరులునిను మిపు । డెరుకనమరుపనగ చిత్తమింద్రియ మంత్తః । కరణమనమానసంబన । ధరలో సంకల్పమనగ నరేన మ్మాదిగా । నిజపరభేదమరిగేదందురుగా । మరికనుతినునన్న మరు గులన్న జనన । మరణమొందేదన్న యెరిగియరుగనిదన్న దన రేన మ్మాదిగా । నిజపరభేదమరిగేదందురుగా. ౩౩

తా. ఎరుక పేర్లు చెప్పెదను వినుము ఎరుకయనియు మరుపని యుచిత్తమనియు, యింద్రియము లనియు, అంతఃకరణమనియు, మన స్సనియు సంకల్పమనియు తాననియు నితరమనియు కనేదనియు తినేద నియు జననమరణము లొందేదనియు యెరిగేదనియు యెరుగనిదనియు ఎరుక పేర్లని భావము.

కం. ఎరుకే సర్వములగుసీ । కరచరణశిరోజదంత కర్ణసునేత్రా । ధర శీర్షహృదయముఖములు । పరికరములుగాను తిరుగు పరి పరి గతులా । భూజలవహ్ని మరుదభ్రతతులా । యరుకే విశ్వముల గుచు హరిహర బ్రహ్మాది । సురగిరితరుచరా చరకోటులై తిరుగూ పరిపరిగతులా । భూజలవహ్ని మరుదభ్రతతులా. ౩౪

తా. చేతులు, కాళ్ళు, తలవెంట్రుకలు, దంతములు, చెవులు, కండ్లు, అధరము, శిరస్సు, హృదయము, ముఖము, వీనిపరికరములు గాచేసికొని భూమియందును జలమునందును అగ్నియందును గాలియం దును, ఆకాశము మొదలగువాని యందును అనేకవిధముల నెరుక సంచరించుచుండును. ఎరుకే విశ్వములై, బ్రహ్మ, విష్ణు, మహేశ్వ రులై దేవతలై కొండలై చరాచరకోటులై, యున్నదని భావము.

కం. ఎరుకకునగుజననాదుల । నెరుగుటకున్నజభవాది లేఖుల కెల్లా । తెరవగుపడదటహీనవు । నరుడెరుగు నటన్న మాట నగుబాటే

కాదా । మాటలచాత వ్యర్థమే కాదా । గురుభక్తి కేయచల
గురిఁల్వాకనునోటి పారబాటుమాటల మరిజన్మలేదంటె నగుబాటే
కాదా । మాటలచాత వ్యర్థమేగాదా. 35

తా. ఎరుకపుట్టుక మొదలగునవి తెలిసికొనుటకు బ్రహ్మాదుల కలవిగాదు గురుభక్తిచే అచలగురినిల్వాని నరుడు నేనెనుగుదును నిక జన్మములేదనే పారపాటుమాటల వలన ప్రయోజనమేమియులేదని భావము.

కం. జ్ఞానేంద్రియకర్మేంద్రియ । మానసముఖకరణవిషయ మాత్రా
దులుభూ । తానీకముమరిజీవవి । ధానములును స్థూలతనువిధా
నాంచితమెరుకా । కలగితనుతాగల్పించేగనుకా । పంచననీ పి
చ్చిసంచులో బయులున్న । దంచుదెల్పెబోధలించుకా వినకూక
ధాంచితమెరుకా । కలిగితనుతా గల్పించేగనుకా. 36

తా. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనోబుద్ధి చిత్త అహంకారములు పంచతన్మాత్రలు, పంచభూతములు, స్థూలసూక్ష్మ కారణములు యివియన్నియు నెరుకే. ఇట్టిపరక తనంతట తాను కల్పించుకున్నది ఈపిచ్చి సంచులో పరిపూర్ణమున్నదనే దుర్బోధను కొంచెమైనను వినకుమని భావము.

కం. తల్లులుదండ్రులునునుజులు । చెల్లెండ్రాత్మజకళత్ర జనసమితియు
గా । కల్లోలమగుచు నెరుకే । ముల్లోకము లెల్ల తానై మునుగు
మోహామునా । చేటెరుగదు పిల్లమూర్ఖమునా । కల్లతను వెరు
కలవల్ల నేర్పడిబైటి । చల్లాటమెరిగిన నల్లల్లాడదేపోదే మునుగు
మోహామునా । చేటెరుగదుపిల్లమూర్ఖమునా. 37

తా. తల్లులు, తండ్రులు, నన్నదమ్ములు, అప్పచెల్లెండ్లు, పుత్రులు, పుత్రికలు, భార్యా మొదలగు వారుగా నమిత మోహాముచే

నల్లకల్లోలముగా ముల్లోకములు నిండియున్నది. యీ ప్రకారం అబద్ధమైన తనువెరుకలవలన నేర్పడి పరిపూర్ణమును నెరుగగనే మాయమై పోవునని భావము.

కం. వనితానందనచందన । తనువిషయేంద్రియసుఖాది తన్మయభ్రమలం । దనవరతముసోక్కుటియా । మనసగు నెరుకచలవార్ధి మహిమావాసనలా । యొక్కించుక గనిసమయయూనటులా । ఘన పుష్పమకరం దార్జనసేయు భ్రమరమే । దినము చంపకకుసుమమునుసోకి మృతిబొందుమహిమావాసనలా । యొక్కించుకగని సమయునటులా. ౩౮

తా. ప్రతిపుష్పము నందలి తేనెనుగ్రోలి మదించి యానందముచేనుండు తుమ్మెద చంపకపుష్పమునుసోకిన వెంటనే మృతిబొందునట్లు, భార్యా పుత్రులు చందనాది విషయేంద్రియ సుఖముచే నెల్లప్పుడు సొక్కుచు ఆనందించుచున్న మనస్సైన యెరుక పరిపూర్ణ మహిమవాసన కొంచెమైనను సోకినయెడల నమసిపోవునని భావము.

కం. ఎరుకేవర్ణాశ్రమసం । చరయోగవిధానయజ్ఞ జపతపకర్మా । చరణాగమబలివిద్యా పరికరములగానుతాను ప్రబలితిరుగునురా । ఎప్పుడుబయలెరుగబోనిదిరా । యెరుకేఇహపరసౌఖ్య మెరుకేప్రపంచము యెరుకేనీవునేను యెరుకేసమస్తము ప్రబలితిరుగునురా। యెప్పుడు బయలెరుగబోనిదిరా. ౩౯

తా. వర్ణాశ్రమ ధర్మములు, యోగములు, యజ్ఞములు, జపతపకర్మలు, ఆగమములు, బలులు, మొదలగునవి ఎరుకే యిహసుఖము, పరసుఖము, ప్రపంచమంతయు నెరుకే నీవు నేను సమస్తమెరుకేయగును, పరిపూర్ణము దేనిని నెరుగదని భావము.

కం. యెరుకేభక్తివిరక్తియు । యెరుకేభవబంధమోక్ష మెరుకేజ్ఞానం । బెరుకేనాదముబిందువు । లెరుకేకళగురువుశిష్య లెరుకేరాత్రిం ।

యెరుగనిదు త్తబయలానుకొండీ । యెరుకేవిదావిద్య లెరుకేమా యాప్రకృతు । లెరుకేజీవేశ్వరు లెరుకేసర్వమువిను మెరుకేరాతం డ్రీ । యెరుగనిదు త్త బయలనుకొండీ. 40

తా. భక్తి, విరక్తి, భవము, బంధము, మోక్షము, జ్ఞానము అజ్ఞానము, నాదుబిందుకళలు, గురువు, శిష్యుడు, విద్య, అవిద్య, మాయ, ప్రకృతి, జీవుడు, యీశ్వరుడు, సర్వము యెరుకేనని తెలిసికొమ్ము. ఎరుగకుండా నుండునది పరిపూర్ణమేనని భావము.

కం. జపవేదధ్యయనాదులు । యుపవాసవికారజనకయుగ్రతపంబుల్ । అపరిమితయోగకర్మలు । కుపితమనోదానధర్మ ఘోరకృత్యములూ । మంత్రోపాసనాదులమితములూ । విపరీతముగనెరుకేజేసుననోకపరి । కపటబ్రహ్మాత్య దుష్యపములునేయును ఘోరాకృత్యములూ । మంత్రోపాసనాదులమితములూ. 41

తా. జపము, వేదాధ్యయనము, వికారమైన వుపవాసములు, తపములు, యోగములు, కర్మములు, దానధర్మములు, మంత్రతంత్ర వుపవాసనాదులు, బ్రహ్మహత్య మొదలగు ఘోరకార్యము లెల్లను నెరుకే చేయుచుండునని భావము.

కం. గంగాది సర్వతీర్థము । లంగలయుగ దిరిగితరు శిలామృణ్మయులో । హాంగప్రతిమాపూజలు । సాంగముగా జేసిపరమ సాధక మానా । సర్వార్థశ్రుత్యర్థముల్ వినినా । అర్థానర్థబహుళవ్యర్థదుష్క్రియలబ్ధి । వృద్ధికై యరుకే దుర్బుద్ధితో తాజేయుసాధకమానా సర్వార్థశ్రుత్యర్థముల్ వినినా. 42

తా. గంగ, యమున, సరస్వతి, మొదలగు యెన్నినదులలో మునిగినను కొయ్యలు, రాళ్ళు, మట్టిలోహములు మొదలగువానితో జేసిన ప్రతిమలకు పూజలెన్నిచేసినా, యెన్నిపురాణములు వినినా, నేమిప్రయోజనము కలుగును ? ఏమిన్ని ప్రయోజనములేను అనర్థ

మును గలుగజేయు దుష్క్రియలు వృద్ధిజెందుటకై యెరుకేదుర్బుద్ధితో జేయుచున్నదని భావము.

కం. స్నానసంధ్యాచమనవి । ధానమహాయోగభోగదారుణలయసం । ధానసుకర్మసునిష్ఠప్ర । ధానపరాధీన దేవతారాధనములూ । ధర్మా ర్థకామమోక్షముల్వధిమ్యనద్విధులూ । లేనియెరుకేతాను పూని జేసును కాని। కానని బయలు యే కథ లెరుగ దెన్నటికి యారాధనములూ । ధర్మా ర్థకామమోక్షముల్వధిమ్యనద్విధులూ । లేనియెరుకేతాను పూని జేసును కాని। కానని బయలు యే కథ లెరుగ దెన్నటికి యారాధనములూ । ధర్మా ర్థకామమోక్షముల్వధిమ్యనద్విధులూ. 43

తా. స్నానము, సంధ్యావందనము, లయ, హటయోగాదులు దేవతారాధనలు, ధర్మార్థ కామమోక్షములు, మొదలగు విధులు, ఎరుకేచేయుచున్నది గాని పరిపూర్ణమే సంగతి నెరుగదని భావము.

కం. యెరుకేచదివించునువిను । యెరుకేతా చెప్పుకొనును యెరుకేదె లుపుర । యెరుకేయాక్షేపించును । యెరుకేకడజిక్కిజిక్క కెగు రురాపుత్రా । బయలీకళ లెరుగదుపుత్రా । యరుకతానొక వేళపరి పూర్ణసూచన । నెరిగి తేనిల్వక పరిశూన్యమైజిక్క కెగురురాపు త్రా । బయలీకళ లెరుగదుపుత్రా. 44

తా. చదివించేది ఎరుకే, వినేది ఎరుకే, చెప్పుకునేది ఎరుకే చెప్పేది ఎరుకే, ఆక్షేపించేది, ఎరుకే ఇట్లుజేయుచూ నొకప్పుడు పరి పూర్ణసూచననైన యెడల నెక్కడను జిక్కక శూన్యమై యెగిరిపోవు ను. పరిపూర్ణమీ తిప్పలెరుగదని భావము.

కం. కొందరుయరుకనుగనిసా । క్ష్యందురుయదిసాక్షిగా దహంకృతస త్వం । బందురు నేనునునడిగా । నందరిలోనహమెబుట్టి యం దం దేపోనూ । యెరుకహములకు పొందొక్కటేనూ । యెందు జెందనిబయలు నంధహముగల్గిని । స్సందేహమ్ముగ తానే సమసి

తాగనుపడక యుండం దేహోనూ । యెరుకహాములకు పొందొక్క-
టేనూ. 45

తా. కొందరెరుకను జూచి సాక్షియని చెప్పుదురు. కొందరది సాక్షిగాను సత్వగుణ ప్రధానమైన అహమని చెప్పుదురు. నేనట్లు చెప్పను. అందరిలోను అహముపుట్టి యుండేనసించి పోవుచున్నది. ఎరుక అహములు రెండునొక్క-టేయగును. దేనికీనంటని పరిపూర్ణము నందు అహముతోచి అందేసమసిపోవు చున్నదని భావము.

కం. కొందరుకర్మలుశ్రేష్టం । బందురుహరిహరులభజన యత్యంతసు
ఖం । బందురుజపతపములు లె । స్సందురు నీవిట్టి భ్రమల సంశ
యపడకూ । దురపేక్షలు నిందెలకోరకూ । సందేహముల బొం
దీ వెందరినడిగిన । మందియరుకవృద్ధి బొందుకధదెల్పేరు సంశయ
పడకూ । దురపేక్షలు నిందెలకోరకూ. 46

తా. కర్మలు శ్రేష్టమని కొందరును హరిహరాదుల భజన జేయుట సుఖమని మరికొందరును, జపతపములు ముక్తికరములని కొందరును చెప్పుదురు, సందేహము పెట్టుకొని నీవెందరినడిగినను ఎరుక వృద్ధియగు సంగతులే చెప్పెదరు దురపేక్షలు నిందెలకోరకే గాని వేరు కాదు నీవిట్టిభ్రమలు పెట్టుకోవద్దని భావము.

కం. కొందరుభక్తివిరక్తుల । పొందిరమారమణునభవు పూజించుట
బా । గందురు భజనమహాఫల । మందురువ్రతదానధర్మ మహి
మలన్నిటినీ । దెలుపుచుపుణ్యా మందురీభువిని । కొందరు షణ్మత
మునందు మోక్షముగల । దందురీబోధ లానందపడుచూ వినకూ
మహిమలన్నిటిని । దెలుపుచుపుణ్యా మందురీభువినీ. 47

తా. భక్తివైరాగ్యములు గలిగి శ్రీమహావిష్ణును, శివుని పూ జించుట మేలని కొందరెదరు, భజనచేయుట వలన మహాఫలమని

కొందరనెదరు వ్రతములు, దానములు చేయమని ధర్మములు జేయ మని మరికొందరు చెప్పెదరు. మరికొందరు షణ్మతములందు పుణ్యము గలదని చెప్పుదురు. యెవరెన్ని జెప్పినను నీవానందపడుచూ వినకుమని భావము.

కం. కొందరుతారకముద్రల । యందభ్యానంబులేక యపరోక్షములే దందురు సాంఖ్యాదికముల । యందాత్మవిభూతియున్న దందురీ ధరలో । పైబడితెలుపుచుందురందరిలో । నెందరేమిదెల్ప నందు బోకను నేను ముందుదెలిపిన బోధ చందమువిడువకు అందరీ ధర లో । పై బడిదెలుపు చుందురందరిలో. 48

తా. తారకముద్ర లభ్యసింపకుండా అపరోక్షమైన పరిపూర్ణ మెట్లు తెలియునని కొందరనెదరు. సాంఖ్యమునందు ఆత్మవిభూతి యున్నదని మరికొందరనెదరు యీ ప్రకారమీధరయం దనేకులుపై పై బడిబోధింపు చుండెదరు. ఎందరెన్ని చెప్పినను వాటినినీవు వినక నేనిదివరకుచేసిన బోధను విడువకుమని భావము.

కం. స్వామినినీవునెరుంగవు । స్వామెరుగడుసర్వదృశ్య జడమగు నిను నీ । వేమెరుగవునే దెల్పెద । నీమహీచాదస్తబోధ నేమి వినసే లా । చూడుమిదిగో దేవు నీవేళా । నామరూపములేని స్వామి నెరిగినసర్వ । భ్రామికవిడిచిపై దేమోనన్నడుగుము నేమి విన నేలా । చూడుమిదిగో దేవు నీవేళా. 49

తా. నీవు దేవుని నెరుగవు కనుపడే ప్రపంచమును దేవుడెరు గడు. నీకేమిన్ని తెలియదు నేను చెప్పెదను విను ఈభూమియందీ చాదస్తపు బోధవినుటవల్ల నేమిప్రయోజనములేదు. ఇదిగో దేముని నేజూపుచున్నాను, చూడుమని నామరూపరహితమైన పరిపూర్ణమెరిగి నపిమ్మట పైనేమియున్నదో నన్నడుగుమని భావము.

కం. ఎన్నగవన్నెలునైదును । తిన్నగకలసున్నచోటు । స్థిరమ్మాదయ

మునం । దున్న దెయరుకనిశ్శ్రుతులం । దన్నిటిలో నుండి తెలుపు
నదియేమోవింతా । అనుభవ మొక్కటున్నదీచంతా । ఇన్ని గాధ
లునేలా వన్నెలెన్నిమీకీ । యున్న బయలుగాన కున్నము క్తైటు
గల్గు నదియేమోవింతా । అనుభవమొక్కటున్నాదీచంతా. 50

తా. శిష్యా ! పంచరంగులొకటిగాగూడినచోటు హృదయప
ద్మమని, అనగా సహస్రారమనియు, నెరుక యాహృదయపద్మమందు
న్నదనియు, వేదములు వింతగా పలుకుచున్నవి. దీనిని దెలసికొనుట
మోక్షమని పెద్దలుచెప్పిరి. సర్వవర్ణములను మీరిన పరిపూర్ణమును,
అనుభవముమీద తెలసికొనకుండా మోక్షమెట్లుకలుగును ? కలుగద
నిభావము.

కం. కంటికిలోపలికంటిలో, నొంటరిగా నున్న స్పటిక మూర్ధ్వముగా
మి । న్నంటగనీలోగనిము । కృంటివి లోకింపనెదుట గన్పిం
చు చేదీ । యరుకేలేని దంటెతప్పేదీ । కంటిమింటికినే మంటని
జైటనిలు । చుంటెయెరుకనిన్నంట గలుగునే తండ్రి గనుపించు చే
దీ । యెరుకేలేనిదంటె తప్పేది. 51

తా. కంటిలోనుండు పాపలనడుమ స్ఫటికకాంతిగల ఆపోజ్యో
తియను నూర్ధ్వకుండలియున్నది. అదే యెరుక. దానికిపైన నేమియు
లేని నిరామయమైన పరిపూర్ణమేమున్నది. నిల్వని ఎరుక లేదంటేతప్పె
మియున్నది. కంటికి మింటికి నంటని పరిపూర్ణమందునవుంటే ఎరుక
నిన్నంటునా ? అంటదనిభావము.

కం. జోడగుకాటుకపక్షుల । కూడలి మధ్యమున నల్ల గ్రుడ్డున్నది
యా । నీడనడిగ్రుడ్డునడుమను । పోడిమినొక తేజముండు భువి
గనవోయీ । బయలిదెచాల వేడుకొనవోయీ । అవిరళరక్త
శ్వేతారుణపటలమై । భవకేవలాఖండ ప్రవిమలతేజమూ భువి
గనవోయీ । బయలిదెచాల వేడుకోవోయీ. 52

తా. శిష్యా ! కాటుకపిట్టలనగా కంటిపాపలు. అవి కూడియుం
డుటకై నీలతోయదమనెడు నల్లగ్రుడ్డున్నది. అట్టిగ్రుడ్డునడుమ నద్భుత

మైన నొక తేజస్సున్నది. అదియే నిష్కళ, అదియే మహాలింగము, అదియే ఆపోజ్యోతి, అది పరిపూర్ణమందే వ్యాపించియున్నది. ఇదియే పరిపూర్ణము వేదుకొనుము. అది ఎరుపు, తెలుపు, నలుపు, పసుపు, ధూమ్రము, ఆకుపచ్చ, యీ ఆరువర్ణములను మీరి పరిపూర్ణ మందు వ్యాపించియున్నదని భావము.

కం. కంటిలో మెలగెటివస్తువు। కంటిలో వెలిలోను నెపుడు గనువస్తువులుగ। జంటలుగపెణపరంబయి। గుంటలో తానొదిగిమూల కుహరములోనా। మెరుకై పుట్టి రెంటి సఖమునా। మింటి దృష్టిబెట్టి రెంటినట్టనడిమి। తంటేబెరుగుబొక్క టంటురాయి తొక్కుకుహరములోవా। మెరుకై పుట్టిరెంటిసఖమునా,                    ౫౩

తా. కంటిలో ప్రకాశించు తేజమే లోపల వెలుపల నుండు వస్తువులను చూచుచూ, వ్యష్టిరూపమైన నొకమూలనుదాగి మెరుకై పుట్టి భ్రమకు కారణభూతమైనది. ఊర్ధ్వదృష్టిబెట్టి, ఇడాపింగళలనడుమ నాపోజ్యోతిస్థానమైన సుషుమ్నానాళమే యింత తంటాలు బెట్టుచున్నది. ఆరంధ్రమునకంటురాయి తొక్కుము. అనగా దేనిచేతనైతే పరిపూర్ణము నెరిగితివో నా గుర్తును మరచిపొమ్మనిభావము.

కం. పుట్టించదు తా పుట్టదు। పుట్టుటగిట్టుటల యొక్క పొల్పొందాకలే। తట్టెరుగదన్య దుఃఖము। పట్టేదెప్పటికి లేదా పరిపూర్ణము నకూ। ప్రత్యక్షమైనట్టిదైవముకూ। వట్టినిందెలు దీని కెట్లుబెట్టుదు నెరుక। పట్టువిడుపులువిడిచి ఘట్టిబయలికనమ్ము పరిపూర్ణము నకూ ప్రత్యక్షమైనట్టి దైవముకూ,                    54

తా. ప్రత్యక్షదైవమైన పరిపూర్ణమొక దానిని పుట్టించదు, తానుపుట్టదు పుట్టుచావులయొక్క పోలుపొందు తానెప్పుడు నెదురుగ తనకు దుఃఖమే లేదు. ఇతరదుఃఖము తానెరుగదు. ఇటువంటి దీనికి వట్టినిందలు నేనెట్లుపెట్టుదును. ఎరుకపుట్టుటగిట్టుటయును భ్రమనువిడచి ఘట్టిగా పరిపూర్ణమును నమ్మమని భావము.

శ్రీగురు వచనము.

శిష్యా! మూలము లేక గుర్తెరిగే శరీర మేమీ లేదు. అను శ్రుతివాక్యార్థబోధలో ఏమీ లేదు అనున దే తృతీయసూచనము.

గురువాక్యము.

శ్లో॥ భ్రాంతిజ్ఞానం పరిత్యజ్య। సర్వంనాస్తి తినిశ్చితం। ద్రష్టాదృశ్యం జగత్సర్వం। సంభవంనాస్తిసర్వదా। వృథాభ్రాంతిర్వృథాభ్రాంతి। ర్వృథాజ్ఞానం వృథావృథా। వృథాపం దేహసమ్మోహో। వృథాజ్ఞానం పరిత్యజేత్। భ్రాంతిజ్ఞానేద్వయంనాస్తి। నాస్తిసం దేహమద్భుతం। అస్తినాస్తిద్వయంనాస్తి। నిర్ణయో నాస్తి సర్వదా॥

గురువాక్యము.

ఎరుకకు మూలము లేదు గదా? యిట్టి మూలము లేక గుర్తెరిగే శరీరమునకు యిదివరకు చేసిన బోధప్రకారము యేమిమూలాధారమును ప్రవర్తించెనో తెలియదు గదా? యీసందర్భములో యేమీ లేని దేనని యీవాక్యనిజార్థము. అయితే ఏమో కలదని అనాదిగా అనుసరించుచూ వెంటనొచ్చే దే భ్రాంతి ఇదే విభ్రమ ఇదే ఎరుక ఇదే జననమరణమూలము ఇదే జడ అనృతదుఃఖపుంజము ఇదే స్వప్న సమాన భోగము. ఇదియే కలలోని రూపములు మేల్కొనిన నేమియు లేదు ఏమీ లేదను నీవాక్యముచేత సర్వభ్రాంతి జ్ఞానరహితసిద్ధాంతము స్పష్టమైనది.

కం. ఇలలోపల మనుజులకున్। కలకల్గిన వేళ కార్య కల్పితమై యా।
కలమేల్కొనిచూచినలో। పలసర్వవిచిత్రవస్తుభ్రమ లగుపడునా।
కలలో మెల్కొ కలగకపోనా। చెలగిపీయెరుకటుల కలగి మరల
తానే। తొలగినవెనుకది తలపులోపల వస్తుభ్రమ లగుపడునా।
కలలో మెల్కొ కలగకపోనా.

తా. భూమియందుండువారికి స్వప్నమువచ్చినప్పు డనేకపనులు వానియొక్క అనుభవము కలిగి మెళుకువవచ్చినప్పుడు కలలో తాననుభవించిన భ్రమరూపమైన యనుభవము కనుపడునా! కలలో మెలకువరాకపోనా? ఆప్రకారమే యెరుక తోచి తొలగిపోయినపిమ్మట భ్రమ కలుగదని భావము.

కం. కలలోపల నొకపొలతిని । గలసికతాబ్దములుగ కాంక్షలచేతన్
మెలగియపరిమితసుతతతి బలధనసంపదలుగలిగి భాసిల్లెమరలా ।
ఘడియలోమేల్కొనిజూచిబయలా । కలదెలసిపూర్వవికల్పభోగము
లొండ । నలవిగానిరీతి కలయకెరుక తొలగుభాసిల్లి మరలా । ఘ
డియలో మేల్కొని జూచి బయలా.                    56

తా. స్వప్నమునం దొక స్త్రీని పెండ్లిచేసికొని మహాకాంక్షల చేత నూరు సంవత్సరము లనేకసుఖములబొంది అనేకమంది కొడుకులను కుమార్తెలను కనుక్కొని, విశేషముగా బల ధనసంపదలచే విఱ్ఱవీగుచుండి ఒక ఘడియలో మెళుకువవచ్చి చూడగా తాను స్వప్నమందనుభవించిన దేదియు లేకపోయినటులనే ఎరుక లేకపోవుచున్నదని భావము.

కం. హెచ్చుసుషుప్తిలోమెలుకువ । మచ్చికనేలాగు గలిగి మరలసుషుప్తిన్ । జొచ్చెనగుతీఱబయలులో । వొచ్చే పొద్యోటి యెరుక
తెచ్చునతండ్రీ । వొచ్చివిచ్చి చచ్చూరాతండ్రి । వచ్చూపోవుట
లోన అచ్చుగ బయలెరుక । యెచ్చట నిల్వని ముచ్చట వినకుం
టె వొచ్చును తండ్రి । వొచ్చివిచ్చి చచ్చూరతండ్రి.                    57

తా. గాఢనిద్రయందు మెలకువవచ్చి తిరిగి నిద్ర యేలాగువచ్చునో అటువలెనే నీ పరిపూర్ణమందు తోచితోచకపొద్యో ఎరుక భ్రమనుగలిగించును. ఎరుకవచ్చిపరిపూర్ణసూచన కాగానేమాయమైపోవును. యీపరిపూర్ణమందెరుక తోచికనుపడకుండా పొద్యోబోధ వినకుంటె భ్రమకలుగునని భావము.

కం. ఏలాగుననీయెరుకకు । మూలాధారంబులేకమునునుదయులయా । ద్యాలంబమెట్లుకలిగెను । చాలగనాశ్చర్యమంది సంశయపడకూ । జూడగనింద్రజాలామాఖరకూ । ఆలోచింపకు విగ్రహాలకేలాగు ద్దై । వాల పేర్లోచ్చి యవలీలతొలిగినరీతి సంశయపడకూ । జూడగనింద్ర జాలమాఖరకూ. 58

తా. మూలములేని ఎరుకకు పుట్టుట గిట్టుటలనే వ్యాపారమెట్లుగలిగెనని ఆశ్చర్యపడి అనుమానించకుము. విగ్రహాలకు దేవుండ్లపేర్లంతలోవచ్చి నంతలో పోయినరీతిగానున్నది. కడకాలోచింపగాయింద్రజాలముగా నున్నదని భావము.

కం. యంతలోవింతలోవింతగ । నంతంతట యెరుకబుట్టి నానామయమై । యంతటజూచినతనుదా। నెంతటనోమాయమగుచు నేమగుపడదూ । గనుపడనట్టి భ్రాంతి కాబోదూ । సంతోష సుఖదుఃఖమెంతలోనుదయించి । యెంతలోబోనునీ సంతనంతకాద నేమగుపడదూ । గనుపడనట్టి భ్రాంతిరాబోదూ. 59

తా. ఈ పరిపూర్ణమం దెరుక అంతలోనే మహావింతగాబుట్టి, అంతలోనే వృద్ధియై అంతటా వ్యాపించి తనను తా నెరిగినవెంటనే తనంతటతానే కనబడకుండా మాయమైపోవును. కనబడకుండావుండేది భ్రాంతికాదు, సంతోషము, సుఖము, దుఃఖము, ఎంతలో గలుగుచున్నవి. ఎంతలో పోవుచున్నవి. అప్పుడే కలిగి అంతలోనే పోవుచున్నవి ఎరుకసంగతికూడా నిటువంటిదేనని భావము.

కం. వారధిలోపలవనగం । ఝ్హూరికెరతను దామెబుట్టియూరికేననగుణ। ధారుణినీయెరుకటు సా । ధారణముగబుట్టిగిట్టు ద్దైవాధీనముగా । తనకల్మిలేములుతా మెరుగునుగా । నీరీతిపరిపూర్ణ వారాశిలో నెరుక । పేరులేకవచ్చి యూరులేకపోను ద్దైవాధీనముగా । తన కల్మిలేములు తా మెరుగునుగా. 60

తా. సముద్రమం దొడగంల్లు తమకు తామేపుట్టి తమకు దామ ణగిపోవునట్లే జగత్తున నీయెరుక సాధారణముగాదోచి యేమీలేకుం డాబోవుచున్నది. యీ ప్రకారము పరిపూర్ణసముద్రమునం దెరుక పేరు లేకుండావచ్చి పూరులేకుండా పోవుచున్నదని భావము.

కం. కట్టెలోలేక నొకానొక । పట్టునదావాగ్నిబుట్టి ప్రజ్వలితంబై ।
గిట్టునని తెలిసి యచలపు । గట్టునతానిలచిచూడ గనుపించ దెరు
కా । గురుసూత్రపు గుట్టిదేగనుకా । వట్టిబెట తానే పుట్టిగిట్టేయె
రుక । నట్టేటముంచినీ పెట్టుజూపించును గనుపించదెరుకా । గురు
సూత్రపుగుట్టిదేగనుకా. 61

తా. శిష్యా! కట్టెయందు నిప్పు కనుపించకుండా మరియొకస మయమున నాకట్టెను మథించుటవలన నిప్పుగనుపించి, యానిప్పాకట్టె నుకాల్చి తానును సమసిపోవును. తెలిసికొని పరిపూర్ణగట్టుననుండి చూడ ఎరుక కనబడకుండును. ఎరుక తానేవచ్చి, తనకుతానే వృద్ధి పొంది, తనకుతానే నశించిపోవును. చావుపుట్టుకలుకల యీ సంసార సముద్రమున నిలుచుండి పరిపూర్ణమును తెలిసికొనినయెడల నాసంసా రసముద్ర మింకిపోవునని భావము.

కం. వారిదములోన మెరుపులు । వారాశిని బుద్బుదములు వరరవికిర
ణా । ధారమునసీలమణులిక । నూరికెగన్పించుమాడ్కి నుదయిం
చునెరుకా । అంతట నెటకో పారిపోగనుకా । ధారుణికల కాల
మారీతినుండక । మారిమారిపగలు మరిరాత్రులై జరుగు నుద
యించునెరుకా । అంతట నెటకో పారిపోగనుకా. 62

తా. మేఘమందుమెరుపులు, సముద్రములోబుగ్గలు, సూర్య కిరణముల దీప్తివలన నీలమణులు నూరకనే కనుపడేరీతిగా ఎరుకతో చుచున్నది. మరియు భూమియం దొకటేవిధముగానుండక, పగలుగా ను, రాత్రిగాను మారినట్లు ఈయెరుకపుట్టి అంతలోనే మటుమాయ ముగా పోవునని భావము.

కం. దేహికి దేహావస్థలు । దేహములో గలిగి మరల తెరపగురీతిగా। ఊహ లెఱుంగనిబయలులో । సాహసమున లేనియెఱుక సరిబయలుగాంచీ । తనరాకపోకలు తానునెంచీ । వ్యాహింపతుణమయినమోహా రింపకతన । యూహాపోహలతోడ నాహద్దులోనణగు సరిబయ లుగాంచీ । తనరాకపోకలు తానేనెంచీ, 63

తా. శిష్యా! మానవుని దేహమం దనేకావస్థలుగలిగి పిమ్మట నవి లయమైపోవురీతిగా లేనియెఱుక పరిపూర్ణమునుజూచి తననిజమును గహించి కొంతసేపైనను నిలచుటకు లేక తానెందును నిలువక సక లేంద్రియములు తన వెంటరాగా తన ముచ్చటలువిడిచి తనకు తానే మటుమాయముగా బోవుచున్నదని భావము.

కం. తనువెరుకలు రెండునుమరి । తనునోరులును లేనియచల దర్శన మెందా । కనుగాదోనంతవరకును । జననవినాశములు విడువ జాల వెప్పటికీ । నీరెండన్నృతముగా వెప్పటికీ । పనిలేనిపనిబుట్టి పనులుబెరిగివట్టి । పనికిమాలినయెఱుక పనులేపనులై విడువజాల దెప్పటికీ । నీరెండన్నృతముగా వెప్పటికీ. 64

తా. శిష్యా! తనువెరుకలులేని పరిపూర్ణదర్శన మెందాక కాదో నంతవరకు యీరెండునబద్ధములు కావు. పనిలేనిపనిబుట్టి, పను లు వృద్ధియవ్వే పనికిమాలిన ఎరుక పనులు విడువజాలవు. జనన, మరణ, ప్రవాహము తప్పదుగాన, పరిపూర్ణదర్శనము చేసికొమ్మని భావము.

కం. కనుపడికనుపడదెరుకే । కనుపడసాగినను మేఘ గణమెల్లెడలం । పెనుచీకటిపెణపరమై , కనుచూపినమాత్రి తానే కడువిస్తరించూ । అంతలో శూన్యమైపోదలంచూ । కనుపడిభ్రమచేత ఘ నమైలెక్కకుమిగిలి , వెనకతిరగదుధాని కనిపెట్టితగ్గించు కడువి స్తరించూ । అంతలోశూన్యమైపోదలంచూ, 65

తా. ఎరుక కనుపడి కనుపడకుండును, కనుపడ ప్రారంభించిన యెడల నాకాశమున మేఘములు కూడికొని దట్టముగా వ్యాపించి చిక్కచీకటైనట్లు విస్తరించును. నిమిషములో మేఘములెల్ల విచ్చిపోయి నిర్మలమైనట్టే, అంతలో యేమీ లేకుండా పోవును. భ్రమగలవానికి ఎరుకదట్టమై, వెనుకకు తిరుగనివ్వదు. నీవు గనిపెట్టి భ్రమతగ్గించుమని భావము.

కం. అంకెకుడిప్రక్క సున్నలు। పొంకముగానున్న లెక్క భువి పెంపగునా। యంకెకు నెడమనుసున్నలు। సంకోచము లేక నిలుప సంఖ్యలేర్పడునా। లేకుండునట్టుండుదూరమునా। సంఖ్యయెట్టిదో కాననింకనివాయెరుక। వంకమానిననీ రంకురమైపోదే సంఖ్య లేర్పడునా। లేకుండునట్లుండుదూరమునా, 66

తా. శిష్యా! అంకెకు కుడిప్రక్కన సున్నలుంచిన లెక్కయధికమగును. నాసున్నలు అంకెకు నెడమప్రక్కనుంచిన లెక్కకురాకుండా వృధయైపోవును. ఆసంఖ్య యెట్టిదో నీవాలోచించి పరిపూర్ణమును నమ్మి, అబద్ధపుయెరుకజోలి మానిన, ఎరుకే మాయమైపోవుచున్నది. పరిపూర్ణ మేకరీతిగానే నిండియున్నదని భావము.

కం. నాదన్న దెరుకసున్నకు। మీదనుతనువనెటిసున్న మీదనుసున్నై। యేదున్న నన్నిసున్నల। నాదయియున్నట్టిసంజ్ఞ నాకే తెలుసునురా। సున్నలుతుడువ శుద్ధబయలౌరా। అదినీసున్నలకేది దరిగాదోచేపాడు। చేదుడిచినాదిగువ గలసంజ్ఞలన్నియు నాకే తెలుసునురా। సున్నలుతుడువ శుద్ధబయలౌరా, 67

తా. నాదియనునట్టి యెరుకయనుసున్నకు పైగానున్న శరీరమనునట్టి సున్నయు, యింకా నెన్ని సున్నలున్నను, శరీరమనునట్టి సున్నను తుడిచివేసినయెడల నాది యనుదాని సొంజ్ఞ నాకే తెలియుచున్నది, సున్నలన్నియు తుడువగా శుద్ధపరిపూర్ణమగుచున్నది. మొట్టమొదట

నీనున్నల కేదిఆధారముగా నోచెనో నాపాదును గురుకరుణనుపొంది తుడిచి వేయుమని భావము.

కం. నాదములోపలినాదము । నాదములోపలి సునాదనాదాంతనిరా । చ్ఛాదననిశ్శబ్దమహా ! మోదిత పరమార్థతత్వ మూలమునం దూ । సంశయమేమీ లేదు లేదందూ । సూది మొనచూపులోపా దుకొన్న బయట । వీధిలో మెరుకయున్నాదో లేదోచూడు మూల మునందూ । సంశయమేమి లేదు లేదందూ. 68

తా. ఓంకారాంత్య ఘంటానాదాంతమైన నిరామయ నిశ్శబ్ద పరిపూర్ణతత్వమం దెంతమాత్రమును సంశయములేదు. సూదిమొన బెజ్జములోనున్న పరిపూర్ణమందెరుకయున్నదో లేదోచూడుము. అటుల కనిపించిన నీకారూఢియగునని భావము.

కం. కనుపించనట్టిమెరుకను । కనుపించే బయలులోన కనుపించుననే। ఘనవాదమేమిసుఖమగు । పనిలేకను జేసినారో భ్రష్టజనులెల్లా । ఛీవినకూయనహ్యాకథలెల్లా । మునున మేధ్యమునంటి వెనకనీటితో గడుగు । మనుజునిక్రియ రోతయనకెట్లుజేసిరో భ్రష్టజనులెల్లా । ఛీ వినకూ యనహ్యాకథలెల్లా. 69

తా. తానుతప్ప వేరులేని స్వతస్సిద్ధముగా కనుబడుచుండే పరిపూర్ణమం దెప్పటికిని కానరాని యెరుక, కనుపించుననే వాదమును మూఢులగు భ్రష్టులు పనిలేక నెందుకుచేసినారో తెలియదు. ఛీ, ఛీ, యీ యనహ్యాపుకూతలు నీవు వినవద్దు. మొదట నమేధ్యమునుపూసి కొని తర్వాత కడుగుకున్న మనుష్యునివిధముగా నున్నదని భావము.

కం. వినుమీబయలులోనెరుకయు । తనకై తా వొచ్చిమరల తనమూలంబా । ఘనయచలమెరుగదలచిన । తనుదానేదృశ్యమయ్యే దానిగనుమిచటా । కలదోచదేతనకైననెచటా । తనకుదానే తోచు తనకలమేల్కాని । గనబోతేతనులేని దిదియేదృష్టాంతము దానికనుమిచటా । కలదోచదే తనకైన నెచటా, 70

తా. శిష్యా! వినుము. యీ అచలబ్రహ్మమునందెరుక తనంతట తాను తోంచి తనమూలమైన పరిపూర్ణము నెరుగబోగా, దాను తానేయైయున్నది. అనగా తానే పరిపూర్ణమైయున్నది. ఎట్లనగా, తనకుతానే తోంచుకల మేలుకొని తనకుతానే లేకపోవుచున్నది. నీ వీ దృష్టాంతమును చక్కగా గమనింపుమని భావము.

కం. గోడలచిత్తరువులనే । జాడల నెరిగితివాని పుడు చక్కగమనసుం ।
గూడిన విశ్వము నెఱుకను । పోడిమినీ యుత్తపైట బుద్ధినూహించూ । వ్రాహాపోహా లీడవిడిపించూ । తోంచునీడయు లేని వేచుకా
మాటమూ । గాడకకలియ నెవ్వడుజూడునుతత్వబుద్ధినూహించూ ।
వ్రాహాపోహా లీడవిడిపించూ. 71

తా. శిష్యా! భారత, భాగవత, రామాయణాదులలోని ప్రతిమలు మొదలైనవి వ్రాయబడిన చిత్రపుగోడలమీది రంగుల నీ వే తెలివిచేత తెలిసికొంటివో, ఆ తెలివిచేతనే నెఱుకను, జగత్తును, పరిపూర్ణమును తెలిసికొనుము. అటుల దెలిసికొని యీయెరుక జగత్తులను విడచినతరువాత నావలిమాట చెప్పుట కెవ్వరును లేరని నీవు చక్కగా నూహించుమని భావము.

కం. పొడచూపజాలగలుగునే । గడునగుతిమిరంబుసూర్య కాంతికి నెదుటన్ । కడువడిస్వప్నములోపలి । నడతలు మేల్కనిన నిలుచునా
ధరలోగా । యెరుకటునిల్వ బడు నేనిజమూగా । యెడలేనిగురుబో
ధనొడిసినమనుజుని । పడుబాట్లుళ్లక్కి పరిశీలింపకచిక్క బడునే
ధరలోగా । యెరుకటున్నిల్వబడు నే నిజముగా. 72

తా. సూర్యునికాంతి కెదుటగా ధాంధకారము నిల్వలేనట్లును కలయందుదోచు అనుభవ కార్యములు మేలుకొనిన దబ్బరయైనట్లును పరిపూర్ణమందెరుక లేదు. చక్కని గురుబోధను జెందిన మనుజుడు చేయుకృత్యములు వుళ్ళక్కిగాని నిజముకాదు పరిపూర్ణమందెరుకను వెతకినా కానరాదని భావము.

కం. ఎరుకంతటకలదనినిజ । మెఱగనివారెల్లబలుక నెక్కువయగునే ।
మరియెరుగనిచోటులలో । తరయట దాదోచుటెట్లు తానంతకల
దా । నిజమదియైతే నిలచుండవలదా । పరబయలొక్కటేపరిపూ
ర్ణమాగాని । పరిగెత్తెయెరుకానూ పరికింపబూనితే తానంతకల
దా । నిజమదియైతే నిలచుండవలదా. 73

తా. ఎరుక అంతటా గలదని నిజము తెలియని అవివేకులు బలికితే యేమిప్రయోజనము నీటిలోతు తెలియనిచోట నీళ్ళలోదిగక లోతెట్లు తెలియును ఎరుకనిజమైతే నిలచియుండవద్దా ? అట్లుండక వెదకినాకనుబడదు. లేనిదిగనుక కనుపడదు అచలపరిపూర్ణమొక్కటే నిండియున్నదని భావము.

కం. లేనిదియెరుకనకిదిగో । నేనిప్పుడు తెలిసితనకు నీవెరిగేవా । కాన
గరాదనినీచే । కానగవచ్చేది బయిట కనుపడవలదా । లేనిదిగ
నుక లేనేలేదు గదా । పూనియెదిరించకు దేనినెంచకు నెరుక ।
మానినీవేజోలి మానుమింతేచాలు కనుపడవలదా । లేనిదిగను
క లేనేలేదుగదా. 74

తా. శిష్యా ! పరిపూర్ణములేదని చెప్పవద్దు ఉన్నదిదిగో చూడుము నాకు తెలియునని చెప్పకుము. నీకు తెలియుటకది సాధ్య పడదు. దానియందు శబ్దముగాని స్పర్శముగాని రూపముగాని రసము గాని, గంధముగాని అహంకారజోగుణముగాని సత్వగుణముగాని తమో గుణముగాని మితిమేరలుగాని లేనిదిగనుక దానికి సాటియేమున్నది. దానికిసాటిలేదు, శుద్ధయెరుకచేనట్టి పరిపూర్ణమును దర్శించి నీమాయ యెరుకనునెక్కడను నుండనీయక పారదోలుము నిన్నునేవృత్తియునం టనేరదనిభావము.

కం. ఆటలచే పిల్లలుపరి । పాటిగ బొమ్మలకు పెండ్లి పనిపాటలుతా ।
సూటిగనల్పుచునొకపరి । నీటుగ బాంధవ్యకలహ నిగ్రహముల
నూ । మాట్లాడియార్భాటముగానూ । మేటిగాదెల్ప నాట్లోటుల

తల్లులే । పాటినిజమందూరా సాటిమెరుక పనులు నిగ్రహములు
నూ । మాట్లాడియార్భాటముగానూ. 75

తా. శిష్యా! పిల్లలాటలాడుకొను నప్పుడు బొమ్మలపెండ్లిండ్లు జేయుచు బంధుత్వములు కల్పించి ఆర్భాటముగా సొమ్మునుగురించి యు నడవళ్ళనుగురించియు కలహములు జేయుచుందురు. ఇవియన్ని యునాపిల్లల తల్లులువాస్తవమని నెంచెదరా! ఎంచరు ఈప్రకారమే మానవులు కల్లసంసారమును నిజముగానెంచి యెరుక కార్యములు జేయుచున్నను గురుబోధను జెందినవారవి నిజమనినమ్మరని భావము.

కం. మాయలగారడి పెట్టెలో । కాయమునిడి యొరులుబిల్వగా వృ
క్షముపై । కూయగలేకనుగట్టున । హోహోయనితా బలుకుటరు
దాహోహాకనుకట్టూ । వలెనేయెరుకతాపుట్టిగిట్టూ । మాయయె
రుక మరలనేయడబుట్టినీ । ఛాయనీనామధ్య బాయనిదదెబయలూ
హోకనుకట్టూ । వలెనేయెరుకతా పుట్టిగిట్టూ. 76

తా. గారడివిద్య జేయువాడు, ఒకనిపెట్టెలోనుంచి పెట్టెబిగి యించి పిలువగా పెట్టెలోపలలేక నెక్కడనుండియో చెట్టుమీద నుంచి ఓహో యని పలుకుచువచ్చును. ఇదికనుకట్టు ఇటులనే యెరు కపుట్టి గిట్టుచుండును. నీనాసందు, అంతటానిండియున్నదే అచలపర బ్రహ్మమని భావము.

కం. గారడియగు నీయరుకను । పేరణగించుటకు నచల పెనువార్ధి
లోముం । దారడిగముంచివెలిలో । మారదుగిడకుండ నొక్క
మాత్రాగాజేసి । గురుబోధాగ్ని జ్వాలచేగాచీ । పోరిరాతంటు
బడ నూరినీళ్ళగలిపి । చేరెడైతే తాగి యూరికేనిద్రపో మా
త్రాగజేసీ । గురుబోధాగ్ని జ్వాలచేగాచీ. 77

తా. ఇంద్రజాలకుడైన యీయెరుక పేరణగించుటకొక యుపా యము జెప్పెదను వినుము యేమనగా యీ యెరుకను అచల మహా

సముద్రములో ముంచి మారడుగుపెట్టకుండా శుద్ధచేసి గురుబోధ యను నిప్పులో కాల్చి, రాతంటుబడ మెత్తగానూరి. నీళ్ళలోకలిపిత్రాగి వూరిక నిద్రబొమ్మని భావము.

కం. బొమ్మనుమనుజుడుథరయం । దిమ్ముగ తాత్రాడుబట్టి యాడ్లాడించా । బొమ్మగతియరుకయనియెటి । బొమ్మనునాడించునట్టి పురుషుడేకర్తా । సర్వమాయాకీమైనభర్తా । ఇమ్ముగజననమరణమ్ములుమాటికి । నమ్మిభోగించి మహామ్మాయిుగాదిరుగు పురుషుడే కర్తా । సర్వమాయాకిమ్మైన భర్తా. 78

తా. బొమ్మలాటలాడు బొమ్మను కీలుత్రాడుబట్టి యాడించునట్లే యెరుకనే బొమ్మనాడించు పురుషుడే యీమాయానటనకు కర్త గానున్నాడు ఈయబద్ధమైన మాయసంసారమే నిశ్చయమైనదని నమ్మకము గలుగజేసి చావుపుట్టుకలను మాటిమాటికి గల్పించుచూ మహామ్మాయిగా తిరుగుచుండు నని భావము.

కం. వినుమొట్టమొదటబయలని । గనదీనికి పేరులేదు గనరానెరుకే । తనుబుట్టిబట్టబయలని । ఘనమగుపేరొకటిబెట్టి గనుపించదారా । పట్టబోతేవట్టిమాయేరా । తనుదానే పునరపిజననమరణసంజ్ఞ । లనుజెందుచునుగురిచే గనిబయలెరుగతను గనుపించదారా । పట్టబోతే వట్టిమాయేరా. 79

తా. శిష్యా! వినుము ఈపరిపూర్ణముకు మొదట బట్టబయలని పేరులేదు. యెరుకపుట్టి పేరుబెట్టి తాను కానరాక పరిపూర్ణము నందు జొరనేరక పునరపిజననం పునరపిమరణమును సౌజ్ఞచేపుట్టుచు గిట్టుచూ గురిచేపరిపూర్ణమును దర్శించినయెడల నెరుకమరల పుట్టనే పుట్టను హరించిపోవునని భావము.

కం. చదలుప్పినతరువెప్పుడు । మొదటికిబెడునొక్కసమయ మునబీజముకా । పదనొదవుగానిరెంటిని । వచలియువేధింపమూఢోవస్తు-

వుకలదా। బయలకునేది నెను రానకలదా। పొదలువీటివేయు కధలెరుగదీధాత్రి విధినితులమొకలెవుడు వ్యధలుతను వెరుకలకే వస్తువకలదా। బయలకునేదినెనురానకలదా. 80

తా. శిష్యశ్రేష్ఠా! ఒకప్పుడుచెట్టు గాలివానచే నశించును వేరొకప్పుడు విత్తనము నసించును చెట్టుకువిత్తుకు మూలమునూనో దొకటుండునా ? ఉండదు ఈరెంటికి చావుపుట్టుకలు తప్పవు ఈరెంటి యొక్క తిప్పలుభూమెరుగదు. ఇటులనే శరీరాత్మలుండినను పోయినను యీతిప్పలు పరిపూర్ణంబెట్లెరుంగును యెరుగదు పరిపూర్ణము తప్ప వేరొండు లేదని భావము.

కం. మేనికిలోపలవెలుపల। పూనినపరిపూర్ణ మేదొకలువుగనదెవి। శ్వానకులోపలవెలుపల। తానిండియఖండబోధతత్వమైనదిరా। తనుజగములు లేనివెన్నకురా। మానకసద్గురు స్వానుభూతిలోని రెం। డనకబూనక తానేతానై నిలచిబోధతత్వమైనదిరా। తనుజగమూలు లేనివెన్నకురా. 81

తా. శిష్యా! సద్గురుమూర్తియొక్క స్వానుభవబోధచేత తానేతానైన పరిపూర్ణముగాకా శరీరమునకు వెలుపలలోపలనే పరిపూర్ణమునిండియున్నదో నాపరిపూర్ణ మేవిశ్వరూపమునకు వెలుపల లోపలనిండి సందులేక అఖండమై ప్రకాసింపుచున్నది. శరీరజగత్తులు లేనివై యున్నవి, వాటిజోలి నీకెందుకు ? లేనివాటిని విచారించవద్దని భావము.

కం. లేనిదననెదుటగనపడు। నేనెరుగుదుననినరెండునిల్వవుగదన। త్యానకుయనూమికవదలక। దీనికినొకమూలనున్న దెరుగరాదుగదా। దేనినంటరానిదాయగదా। రాను పోను చోటు లేని యరుకకును నే। గానినానాటికిదానిపేరుల్లక్కినెరుగరాదుగదా దేని నంట రాదదాయెగదా. 82

తా. ఎరుక ప్రపంచము లేకంటే, నెదుట గనుపించుచున్నది. నే నెరుగుదునంటే శరీరాత్మలు రెండును నిలువకుండా పోవుచున్నవి. నిజముకు నే నను అహము విడువకుంటే దేనిని అంటని పరిపూర్ణమి ట్టిదని తెలియబడదు. నందులేని పరిపూర్ణమం దెరుకపుట్టుటకును గిట్టు టకును తావులేదు గనుక దాని పేరు పాలుశక్కియని భావము.

కం. బయలుబయలనగ నెరుకే । బయలై లోబయలునిండి బయలాయ నదే । బయలనకుండిననావల । బయలగునో బయలుకాదో బయ లునేమగునో । పరవశమందీ బయలెట్లగుపడునో । బయలుగాని యరుకభయము లేక పెద్ద । బయలులో కనుమూసి బయలులోక ను తెరువబయలు నేమగునో । పరవశమందీబయలెట్లగుపడునో. 83

తా. పరిపూర్ణము, పరిపూర్ణమనగా యెరుకే పరిపూర్ణమై లోపల వెలుపల నిండి అచలమాయెను. అప్పుడు పరిపూర్ణమని నెరు గుట కెవరున్నారు ? బయలను శబ్దముకూడా పరవశమందు లయమై బయలగునో, బయలుకాదో, పరిపూర్ణమెట్లగుపడును ? అనగా ఏమీ లేని నిరామయ నిర్గుణ తూష్ణీంభావము జెందునని భావము.

కం. ఎరుకనుకలవంటిదిగా । గురుముఖమున నెరుగబయలు గురుతగుప దునా । గురిగురుతులికనుగననే । మరి కలలోనైన యరుకమా టదలచకురా । భ్రాంతికిమూలపీఠక మిదెరా । మాటి మాటికి యరుకతోటిప్రస్తావమీ । పూటతో నిల్పిపై బాటలోజేరి యామా టదలచకురా । భ్రాంతికిమూలపీఠకమిదెరా. 84

తా. శిష్యా ! గురుబోధవలన నెరుక కలవంటిదని తెలియగా, పరిపూర్ణమిట్టిదనే గుర్తు తెలియును. గురిగుర్తులనువిడచి కలలోనైన ను నెరుకమాట తలచవద్దు. భ్రాంతికిమూలపీఠ మీయెరుకే. గనుక నెరుకప్రస్తావన యీపూటతోనిల్పి పరిపూర్ణమందుజేరి యెరుకమాట తలచవద్దని భావము.

ఇదియె అఖండ భ్రమవిసర్జనప్రకరణములో భ్రాంతిఅనేయరుక సర్వాబద్ధమను ద్రుష్టాంతతృతీయ్యబోధ సమాప్తము.

గు రు వ చ న ము.

శిష్యా! ఇకను అఖండాచల నిరూపణము జేసెదను = మూలము లేక గుర్తిగే శరీర మేమిలేనిదే, అచలపరిపూర్ణమను చతుర్ధసూచన—అనగా, శ్లోక॥ అఖండబోధరూప స్త్వం। అదీర్ఘ మజమవ్యయం అరూపగుణవర్ణాఖ్యం । తద్బ్రహ్మేత్యవధారయ.

సర్వపరిపూర్ణమూలభ్రాంతిజ్ఞానపరిత్యాగ బోధవివరణము

కం. బట్టబయలందునిపుడే । పుట్టిగ నీవుండి లెస్సకని యరుక వెసన్ ।
బుట్టును నీవని నేనని గుట్టుగ నీవెరిగి యెరుక గోల్పెట్టు తండ్రీ ।
యీమరకుమీపట్టుమూ తండ్రీ । మట్టులేనిబ్రహ్మవిష్ణుశులను గొ
ల్చు । నట్టి విభ్రమ లెల్ల చిట్టచివరకనంటి కోల్పెట్టుతండ్రీ । యీమరకుమీపట్టుమూతండ్రీ. 85

తా. తనయా నీవిప్పుడే పరిపూర్ణమునందుండి పుట్టునవి, గిట్టునవి దేహి దేహము లే నని గట్టిగా తెలిసికొని యెరుకను పోగొట్టుము. ఈ పట్టునేమరవద్దు. బ్రహ్మ, విష్ణు, రుద్రాదులను గొల్చు భ్రమలను బొత్తుగా విడిచిపెట్టి యీమరకుండుమని భావము.

కం. ఇదికదలీకదలనిదెస । నుదయించు లయించు నెరుకనుజ్వాలయచ
లా । స్పద దర్శనాస్త్రమునతల । చిదిమినయావలను బైటచే
రుండే దెవరూ । ఖండాఖండవిధినుండే దెవరూ । చదరాని యం,
డజోనాదుగుచీకటిరీతి । ముదిశినతనువులు తుదముట్టవిడిచి నిక
చేరుండే దెవరూ । ఖండాఖండవిధినుండే దెవరూ. 86

తా. ఈఎరుకమూలము లేని తావునబుట్టి లయించుచున్నది. దీని నచలపరిపూర్ణ దర్శనమనె ఖడ్గముచేత తలచిదియది గొట్టినమీదట పరిపూర్ణమునందు జేరే దెవరు వ్యష్టిసమిష్టి భావముచేనుండే దెవరు ?

ఎండయుం దిమిడియున్న చీకటివలెనే తుదముట్టలేని శరీరములను విడిచిన పిమ్మట పరిపూర్ణమేనని భావము.

కం. ఆకలినన్నముచాతను । చేకొని తృష్ణయును బోనగ చెలువగునీ టం । దాకొనురోగము మందున । యేకరణిన్ బోనునట్లు నిల్వదియరుశా । నా బోధనీ వీనులసోశా । నాకూనతంద్రి కీకీలు దెలిసితే । నీకంటికెదుటకేరాక తానెప్పటికీనిల్వదియరుశా నాబోధ నీవీనులసోశా. 87

తా. నాముద్దుల కుమారా ? నేనుచేయు బోధనీవెరిగితే, అన్నముతిన్న నాకలిబోవునట్లును మంచినీరు దాగివినదప్పితీరునట్లును మంచియౌషధము వలన రోగము కుదిరినట్లును, నీయెరుక మటుమాయముగా బోవును. నీకీకీలుకు తెలిసి నట్టయిన నీకంటి కెప్పటికిని కానరాకుండా యెరుకపోవునని భావము.

కం. పరిపూర్ణంబిదెయిదెయని । యరుగశూన్యంబటంచు నెరిగించితిగా । యరుగుమికయరుకయాకస । మిరుపదములురేక మనుచు నెరిగితే సరిరా, యెరుగనియరుక కెందుకీకథరా । యెరుగవచ్చే బయలుయెరిగి కనుమూసుకో । మరుమాటాడిన నిదునో కొరడా దెబ్బతీతు నెరిగితేసరిరా । యెరుగనియరుక కెందుకీ కథరా. 88

తా. శిష్యా ! పరిపూర్ణంబిదేనని నీకుకనుపరచి లేనిదెరుకయని నీకుదెల్పితినిగదా. ఇప్పుడు ఎరుక ఆకసమను రెండుపదములు నొకటే నని అనగా ఆకాశము శూన్యమే ఎరుకాశూన్యమేనని నీవెరిగితే చాలును లేనియెరుక కింతకథయెందుకు కనుపడే పరిపూర్ణమును కని కండ్లుమూసికొనుము అనగా తూష్ణీంభావమును పొందుము మారు మాట మాట్లాడిన కొరడాతో కొట్టెదనని భావము.

కం. ఎరిగినటులెరుగనటులను । మరి మరి నీపనులుసేయ మరిగిన దెరుకో । పరిపూర్ణజ్ఞము తెలుపుమునీ । పరలేకనుదెల్ప వేనివక దెబ్బ

వేతూ । ఇదిగాక నీయరుక పోదోతూ । గురిమీర నినుదెబ్బ కొట్టయినభయపెట్టి । యరుక మెడ ఫెల్లునవిరిచి బొక్కనుపెట్టి వక దెబ్బ వేతూ । ఇదిగాకనీయరుకపోదూతూ. 89

తా. శిష్యా తెలిసినటుల తెలియనటుల నీప్రపంచనటనలు జేయునది యెరుకా లేక పరిపూర్ణమూ ! నాకిప్పుడరమర లేకుండా జెప్పుము. అట్లుచెప్పవేసి నిన్నుకొట్టైనను ఎరుకనుపోగొట్టైనను నిన్ను కొట్టిగాని భయపెట్టిగాని యెరుకను బొత్తుగా లేకుండా జేసెదనని భావము.

కం. ఎరుకపరిపూర్ణములునీ । కెరిగించుచునీదుకంటికెదుటను నెరుకగా నరిపరచియచలసుఖ సం । భరితపు పరిశుద్ధబోధ పాటిదెలుపుదు రా । మద్గురుబోధాభాట గల్పుదు రా । యరుక యరుకను పేరు తిరిగి స్మరించకు । పరిపూర్ణపరబోధ మరువకు మరువకుపాటిదె ల్పుదురా । మద్గురుబోధబాటగల్పుదురా. 90

తా. శిష్యా ! ఎరుకను పరిపూర్ణమును నీకు చక్కగా బోధ పరచి, నీకంటికెదుట ఎరుకను పోగొట్టి అచలసుఖముతో గూడుకున్న పరిశుద్ధమైన బోధజేసి, నాగురునిభాటయగు పరిపూర్ణమార్గమందు నిన్ను జేర్చెదను. ఎరుకయనేపేరు నీవు స్మరించకుము. పరిపూర్ణబోధ మరువకుమనిభావము.

కం. తనుత్రితయముమనుపొకటిగ । తనరగయరుకయును నాల్గొతనువ కటిగనై । గనుపడబయలులో నెరుకను-నెనయగనద్గురునికృపచే నె గరకొట్టిననూ । పోనుయెరుక లేనిదిగానూ । పెనుగుర్తు యెరుక లే మినిజూచి యవతలివి । కన లేవోగనుకచాలునునిం తెనీ వెరుక నె గరకొట్టిననూ । పోనూయెరుక లేనిదిగానూ. 91

తా. శిష్యా ! మనుపుతోగూడిన స్థూలసూక్ష్మకారణదేహము లను మూడు తనువులును, నాలుగోతనువైన యెరుకయు నొకటిగా

గూడి, ఈ పరిపూర్ణమందు దోచగా, సద్గురుమూర్తి కరుణవలన నెఱుకనువిడనాడినట్టయిన, నాయెరుక మటుమాయముగా బోవుచున్నది. పెద్దగున్నైన ఎఱుకపోగానే, తక్కినమూడుశరీరములు జడములైనందున కనుటకు, వినుటకు శక్తిలేక అవియు లేనివి యగుననిభావము.

కం. తనకన్యము లేదనుటకు । తనకన్యముగలిగిమరల తనె లేదనెనో ।
తనకన్యము లేనప్పుడు । తనకన్యము లేదోకలదో తానన వలెనా ।
పరబయలులో తానునిజమేనా । తనువెరుకల్లను రెండు తనుగురు
నకొసగిన । వెనుక తాను లేని వినువీధిలో తాను తానన వలెనా ।
పరబయలులో తానునిజమేనా. 92

తా. శిష్యా! తనకు నితరము లేదనుటకు తనకంటె నితరమేమైన వుండి లేదనెనా ? లేక లేదనెనా ? పరిపూర్ణమైన తన కితరము లేనపుడు వున్నదని లేదని పరిపూర్ణ మెట్లనును. శరీరయెరుకలను గురువకు సమర్పించినతర్వాత తాను లేని పరిపూర్ణమందవునని కాదని చెప్పుట కెవరున్నారు. యెవరు లేరని భావము.

కం. అరమర లెరుగని శిష్యుని।పరితాపముదీర్చియెరుక బాపినగురుడే ।
గురుడౌనుగాని హీనపు । పరద్రవ్యార్జనముచాత బ్రతికేవారం
తా । గురువేషముల తిరిగేరుకొంతా । జతలుజతలుగశిష్య తతు
లగూర్చిముందు । గతులగానక యరుక స్థితిమతులు దెలుపుచు బ్ర
తికేవారంతా । గురువేషముల తిరిగేరుకొంతా. 93

తా. కపటములేని శిష్యునియొక్క తాపత్రయములను చల్లార్చి యెఱుకను పోగొట్టిన గురువే సద్గురువుగాని పరద్రవ్యాపేక్షచేత గురువేషములు వేసికొని గుంపులుగుంపులుగా శిష్యులనుగూర్చి ముందొచ్చేచేటు తెలియక ఎఱుక సంగతులు చెప్పుచు భ్రమగల్పించి ద్రవ్యమును సంపాదించి బ్రతికెడునీచు లంతా గురువులు కారని భావము.

కం. నేనిన్ను తొలుతగనుగొని । యేనిజమగుమంత్రములను యేర్పడ
సీక । యానాడు చెవిన వేసితి । నోనీవామాటిమాట నేమరువ

బోకూ । ముమ్మాటికి దేనుయామరకూ । మానకమరువక ధ్యేనం దుత్తిరుగాక ॥ నే నేనివనుయాత్మ ధ్యానమొనర్చునమగని మను వబోకూ । ముమ్మాటికి దేను యామరకూ. 94

తా. శిష్యా! నేనునీకుమొదట నేమంత్రములుపదేశము లిచ్చితి నోయామూడుమంత్రములను మానక మరువక, విడువకుండా జపించు చుండుము. మాటికిముమ్మాటికి యెరుకనువిడనాడి మంత్రములనొదలక, నే నేనీవని ఆత్మయందు ధ్యానింపు చుండుము నన్ను మరువకుమని భావము.

కం. మంత్రత్రయములలోపల । మంత్రపుతంత్రములముఖ్య మార్గముగనిస్వా ।తంత్ర్యమగుయచలద్వాదశ । మంత్రంబొకటాత్మనిలుపు మాబుద్ధిశాలీ । ఇకవిడువులోకాంతరపుజోలీ । జంత్రమైనకడమ మంత్రద్వయము వేగ । తంత్రములేక గురుదక్షిణలిటుబెట్టు మాబుద్ధిశాలీ । ఇకవిడువులోకాంతరపుజోలీ. 95

తా. శిష్యా! నేజెప్పినమూడుమంత్రములలోపలననగా, ద్వాదశి, పంచదశి, షోడశాక్షరీ, మంత్రములలోమంత్రముయొక్కయుతంత్రములయొక్కయు ముఖ్యభావమును గ్రహించి తనకైతాను వేరులేక నంతటా ప్రకాసించు అచలమంత్రమగు ద్వాదశాక్షరిని ఆత్మయందు స్థిరపరచి ఎరుకజోలివిడువుము తంత్రములైన పంచదశ షోడశాక్షరి మంత్రములను మనస్ఫూర్తిగా తక్షణమే గురుదక్షిణ లిమ్మనిభావము.

కం. తనుమానసధనములనే । కనకత్రయ దక్షిణలను గరిమగురునకు । ఘనముగనర్పణజేసెటి । యనఘునిసద్బుధునితోటి యవరురాసాటి । లేరికగానక నెసవు రామూటి । ఘనతరబ్రహ్మసుఖానందపరిపూర్ణ । మనుసత్యత్రివిధ ప్రసాదాములందిత్తు యవరు రానాటి । లేరికగానక నెసవు రామూటి. 96

తా. శిష్యవరా! శరీరము, మనస్సు, ధనము యీమూడు ఘనమగు దక్షిణలను గురునకు సమర్పించే నీవంటి బుద్ధిమంతునితో

సాటియెవరైన నున్నారా లేనుగనుక నీకు బ్రహ్మానుఖ ఆనంద పరి పూర్ణములను మూడువిధములగు సత్యమైన ప్రసాదముల నిచ్చెదగ్ర హించుమని భావము.

కం. ఈతీరగు గురుదక్షిణ । లీతక్షణమొసగునాకు నిదియేనిరీశా । భూ
తమహాయోగాద్భుత । జాతకగురుశిష్యులుండే జాడలివేరా । ఇ
దెసర్వభూతహితమనుకోరా । యీతీరుదానప్రతిగ్రహ మెంన్దై
న । భూతలమున చెయిజాతచేతురే బుధులుజాడలివేరా । ఇదే
సర్వభూతహితమనుకోరా. 97

తా. శిష్యా! ఇంకనాలశ్యమెందుకు యిటువంటి గురుదక్షిణల నేతక్షణమేనాకిమ్ము పరిపూర్ణయోగమందుండు గురుశిష్యులు వర్తించే ధర్మములివే యిది సర్వభూతములకు హితమైనదని నమ్ముము భూమి యందిటువంటి దానప్రతిగ్రహము లే పెద్దలైనను చేజేతచేతురా చేయ రని భావము.

కం. మంచగు పనులకునుపయో । గించేమంత్రముల దేశికేశ్వరుడా
శన్ । మించియు రెండడిగిననో । క్కించుక యేమయినమదినీ కే
మోదోచెనుగా । దాచక దెల్పు మంచుకోరితిగా । మంచివయిననీ
వేయుంచుకోనిదివరకు ॥ వుంచుకొన్న ఫలముగాంచి యీవలనిమ్ము
యేమోదోచెనుగా । దాచకదెలుపు మంచుకోరితిగా. 98

తా. శిష్యా! గురుడాశపడి ప్రపంచసుఖముల కనుకూలించే మంత్రములరెంటిని నడిగెనని నీమనస్సులో కొంచెమైనను దోచినదే మో నిశ్చయముగా దాచకుండా దెలుపుము యీరెండు మంత్రము లుమంచివేవైతే నీవుంచుకొని ఇదివరకు వీటిని నీవుంచుకున్న ఫలమి ట్టిదని గ్రహించిన తరువాతనే నాకిమ్మని భావము.

కం. వేడుకననుగూడినతొలి । నాడేతనవెరుకలెటుల నైననువిడిచే ।
జాడలెరిగింపుమనినీ । వాడిన మాటలకునిచ్చు నభయమిదేరా ।

ఆమాటయీనాడేమాయనురా । నాడునాడేనన్ను వేడిన దిదె
యొన । గూడిన దిదిగో మా రాడకు నీకిచ్చు నభయమిదేరా ।
ఆమాటయీ నాడేమాయనురా, 99

తా. శిష్యా! నాతావుకు నీవువచ్చిన మొదటిరోజుననే ఎరుక శరీరము విడిచిపెట్టే మార్గమునాకు చెప్పుమని నీవడిగినందుకు విడిచి పెట్టెదనని అభయమిచ్చితిని యిప్పుడా మాటప్రకారము నెరవేర్చితిని గనుక మారుమాటమాట్లాడకుండా నేనడిగిన గురుదక్షిణాల నా కిమ్మని భావము.

కం. మనసోత్సాహముగాని । చ్చినతృణమేచాలు మేరుశైలము మాకున్ । మనసెరుగకయజ్ఞానత । కనికానకనోసగుద్రవ్య ఘననీచమంతా । యంతైనఛీ వినరాదీవింతా । గనకదీనిమరల కనవద్దు ।
వినవద్దు । కనివినిదలచుటే ఘనగురుద్రోహము ఘననీచమంతా
యంతైనాఛీ వినరాదీవింతా. 100

తా. శిష్యా! మనస్సంతోషముగా నిచ్చినగడ్డిపోచయైనను మాకుమేరుపర్వతముతో సమానము మాకదేతృప్తికరము అజ్ఞానము చేమనస్సు తెలియక యివ్వవలసివచ్చెనని మనోమలికితముగా నెంత గొప్పధన మిచ్చినను నదినీచము ఛీ, ఛీ, ఆసంగతి వినకూడదు. కాబట్టి యీయెరుకను కనవద్దు దీనిసంగతి వినవద్దు కని విని తలచుటేగురుద్రోహమని భావము,

కం. యెరుకతనువులనురెంటిని । గురుదక్షిణకొసగి మరల కోరుటలెల్లన్ । ధరకక్కినకూటికినరు । డరయగనాశించుమాట్కి హాస్యమేకాదా । యతికినిపూర్వ మరులుండకలదా । మరిసత్యవంతులు మారాడుదురేత్యాగ । పరులిచ్చుద్రవ్యము తిరిగి హరియించుట
హాస్యమేకాదా। యతికినిపూర్వ మరులుండకలదా 101

తా. శిష్యా! యెరుక శరీరములను గురుదక్షిణకిచ్చి మరల కోరుట కక్కినకూటికి నాశపడుచున్నట్లున్నది కోరికలొదలి సన్యాస

ముపుచ్చుకున్నవానికి పూర్వపుమమతలుండునా వుండవు సత్యవంతుల న్నమాట తప్పరురా తప్పరు దానపరులిచ్చిన ద్రవ్యమును తిరిగితీసు కుందురా తీసికొనరని భావము.

కం. అడిగినయర్థణములిచ్చెద । కడువేడుక నెరుకనొక్క ఘడియలో నీవెం । బడినందడిసేయకనగు । పడకుండ గుటుక్కుమనుచు పట్టి మ్రింగుదురా । పట్టినపట్టు విడువకుందుదురా ।మడుగుపట్టున చల మ తడిలేకుండగ యెరుక । కడరుణముదీర్చి నిలకడబయలు జేరు ము పట్టిమ్రింగుదురా । పట్టినపట్టు విడువకుందుదురా॥ 102

తా. నీవడిగిన కోర్కెదీర్చెదను యెరుకయొక్క రభసమునీకు లేకుండా దానిని పట్టుకొని గుటుక్కున మ్రింగెదను. నేపట్టినపట్టువిడు వను నీవు యెరుకను మడుగుపట్టు చెలమలో తడిలేకుండాచేసి అనగా నెరుకను బొత్తుగాపోగొట్టి దానిరుణము దీర్చి నిలకడగా నెప్పటికేక రీతిగానుండు పరిపూర్ణమును చెందుమని భావము.

కం. ఎరుకనుసంపూర్ణముగా । గురు తెరిగినసమస్తవిషయ గుణముల తోనా । ఋరురుణముతీరబైటను । తెరతీసినరీతిరుణము తీర్చితిన నుకో । తీరినరుణము తిరిగిరాదనుకో । మరుగేమిబెట్టక గురుపాద సంస్మరణ । పరవశాబ్ధిలో నెరుకమరచిపొమరచిపోతీర్చితిననుకో , తీరినరుణముతిరిగిరాదనుకో॥ 103

తా. శిష్యా! యెరుకయొక్క సమస్తవిషయ గుణములు సంపూర్ణముగా తెలిసికొని దానిగుణగణాదులతోటి వదలిపెట్టి ఆఖరు రుణము దీర్చుచున్నానని అనుకొనుము తీరిపోయిన రుణము తిరుగా రాదనుకొనుము సందేహమేమియు లేకుండా గురుచరణ స్మరణపర వశమునందు నెరుకను మరచి పొమ్మని భావము.

కం. గురుబోధలోననెరుకను । నరిపరుచుకొనచలభోగ సౌభాగ్యవశీ । కరమహదైశ్వర్యాధిక । పరవశుడగునీకుయెరుక పాటులగుపడు

నా । యెరుగుటకింక కొరతలగుపడునా । గురుడేతల్లిదండ్రి గురు
డిష్టదైవాము । గురేడేసర్వంబనుచు ధరణినమ్మినకష్ట పాటులగు
పడునా । ఎగురుటకింక కొరతలగుపడునా॥ 104

తా. శిష్యా! గురుబోధవలన నెరుకనువిడిచి పరిపూర్ణభాగ్యమును నంపాదించి పరిపూర్ణభోగైశ్వర్యముచే మైమరచిననీకు యెరుక భ్రమలగుపడునా కొరత యుండునా ? కొతరలుండవు తల్లి, తండ్రి, దైవము, సర్వము గురుడేనని నమ్మినయెడల యెరుక భ్రమతోచదని భావము.

కం. పరిపూర్ణ ద్వాదశాక్షర । పరమంత్రవిచారపూర్ణ పరవశవా
ర్ధి । పరిపూర్ణషోడశాక్షర। పరమంత్రమునీటగలపి బైట నిలు
చోరా । నిలచినబోధ నిజమచలమురా । గురిగురుతు లనెబోధ
మరుగులారెంటిలో । గురుతుషోడశ మొదలు గురినీవై ద్వాదశి బై
టనిలుచోరా । నిలచినబోధ నిజమచలమురా॥ 105

తా. శిష్యా! పరిపూర్ణద్వాదశాక్షరి మంత్రవిచారము వలన కలిగిన పూర్ణమయిన పరవశమహాసముద్రములో పరిపూర్ణషోడశాక్షరిమంత్రమును కలిపిపరిపూర్ణమందునిలుపుము. నిశ్చయంగా నిలచియున్న దచలమే గురిగురుతులనురెంటిలో గురుతైన షోడశాక్షరిని వదలి గురినీవై పరిపూర్ణమునందైక్యముకమ్మని భావము.

కం. అనుమానించకవినుమీ , తను వెరుకల జననమరణ ధర్మములె
ల్లన్ । కనుగొనస్వప్నసమానము । జననవినాశములు లేని జయభే
రిబయలూ । కలలోనయినా కానాదాహాయులు । మునువుబుట్టి
నతానే వెనకగిట్టినతానే । జనవార్తలో నిజము కనిపెట్టిచూచి
తే జయభేరిబయలూ ।కలలోనయినా కానాదాహాయలూ॥ 106

తా. శిష్యా ! యీశరీరమెరుకలయొక్క పుట్టుటగిట్టుటలు వాని ధర్మములువిచారించగా స్వప్నముతో సమానమైయున్నవి. జననమరణములు లేని శాశ్వితమైన జయభేరి పరిపూర్ణమొక్కటే మొదటపుట్టినా యెరుకే వెనకగిట్టినా యెరుకే గాని పరిపూర్ణముకు పుట్టూ లేదు. చావూ లేదు. యెప్పటికి నొక్కతీరుగానే యున్నది. నీవనుమానించ వద్దని భావము.

కం. మానవులందరు దేవుడు । గానంబడడనెటిలోక కధనిశ్చయమా ।
గానసకలాగ మోపా । ఖ్యానపు నవరత్నఖనియు గదరాయీ బ
యలూ । విడువడుభ్రాంతి జ్ఞానద్వైవిధిములూ । గానవొచ్చేటిరూ
పనామకర్మము లెరుక । దానివినకనుకనక మానిన నదేపోవు గ
దరా యీబయలూ।విడువడుభ్రాంతి జ్ఞానద్వైవిధములూ॥ 107

తా. శిష్యా ! దేవుడెవరికి కానరాడనియు నామరూపకర్మములుగాని జననమరణములుగాని యాతనికి లేవనియు జనులుబలికే వాక్యములు నిశ్చయముగా పరిపూర్ణముకేనని చెప్పబడుచున్నవి. నీవను మానించక నామరూప, కర్మ, జననమరణములుగలయెరుకనుచూడక వినక దానిని విడచిపెట్టిన పోవునని భావము. ఇదే అఖండభ్రమవిసర్జన ప్రకరణములో భ్రాంతియగు యెఱుక అచలగురు ప్రభావసూచనచే సర్వపరిత్యాగ మొనర్చు చతుర్థబోధము సమాప్తము.

గురువచనము.

శిష్యా ! సర్వపరిపూర్ణ మిదియె నికనేమియులేదు. ఇదేసర్వాధారాపకము మూలములేక గుర్తెరిగే శరీరమేమీలేనిదే అచలపరిపూర్ణముగదా సత్యము ఇదేబోధగదా ఏమీలేదను నట్టివాక్య సూచనకూడా యేమీలేదను బావైక్యార్థమగు పంచమసూచనము అనగా॥ శ్లో॥ అఖండాకారమచలం । అఖండాకారమద్భుతం । అఖండపూర్ణరూపత్వం । తద్బ్రహ్మేత్యవధారయ॥ అను వాక్యార్థముతో

సర్వప్రతీతి రహిత అఖండసమర సైక్యబోధయే సర్వపరిపూర్ణమని భావము.

కం. పరిపూర్ణాచలతత్వము । పరసత్యాఖండయోగ ప్రామాణ్యాలస । త్పరమార్థబోధ శ్రీగురు । పరమేశ్వరుకృపను నెరుగబలికితిగదరా। పరసుఖమొసగినిల్పితిగదరా । పరిపూర్ణమంతటపరిపూర్ణమని తెలిసి । పరనిష్ఠమరువకు పరిపూర్ణమైయుండబల్కితిగదరా । పరసుఖమొసగినిల్పితిగదరా. 108

తా. శిష్యా! పరిపూర్ణాఖండయోగ ప్రమాణములచేత పరిపూర్ణాచలతత్వమును నాసద్గురుమూర్తి కృపచే నీకు తెలిసేటట్టుగా బోధించితిని పరిపూర్ణసుఖము కలుగజేసితిని పరిపూర్ణము లోపలవెలుపలనిండి అంతాతానై యెప్పటికి నొక్కటేతీరై కదలి మెదలక పూర్ణముగా నున్నదని తెలిసికొని పరిపూర్ణనిష్ట నొదలకుమని భావము.

కం. ఇదెసర్వభోగసమరస । ము దెసర్వాఖండమచలమిదె పరిపూర్ణం । బిదెమద్గురు పాదద్వయ । మిదె రాననుగన్నతండ్రీ ఇక నేమీలేదూ । యేమీలేద నే దేమీలేదూ । అదిఇదియనుభేద మొదలి లోపలవెలిలో । ముదురు లేతలులేని నిదురలోనిదురింప । నిక యేమీలేదు । యేమీ లేద దేమీ లేదు. 109

తా. శిష్యా! సర్వభోగసమరసమనినను అఖండమనినను అచలమనినను పరిపూర్ణమనినను నాగురుపాదములనినను నీపరిపూర్ణమే ఇక నేమీలేదు. యేమీలేదనే మాటకూడా నేమీలేదు ఇదియను భేదము నొదలి లోపలావెలుపలాఅంతానీ వేయైఅనగానచలమైనిదుర లోనిదురింపుము అనగా నున్ననిని చెందుమని భావము.

కం. బయలెరిగితిబయలెరిగితి । బయలెరిగితిననుచు తిరగబడవలదిక నీ । వయమచలబోధలోత । న్మయముగనీవుండినన్ను మరువకు తండ్రీ । బయలెరుకాలావలిలయలేతండ్రీ బయలునకు ఎరుకనకు

భయము జెందకుముందు । బయలుగాని బైట పరిపూర్ణమై నిలచీమ
రువకుతండ్రీ । బయలెరుకాలావలిలయలేతండ్రీ. 110

తా. ప్రియతనయా ! పరిపూర్ణమెరిగితి పరిపూర్ణమెరిగితిననినీ వనకుము. పరిపూర్ణమందు నీవు తన్మయముగానుండి నన్ను మరువకుము. నీవు బయలనియు, నెరుకనియు ననవద్దు. బయలెరుకలున్నం వాయుండువరకే, బయలుగాని, నిర్బయలునందు పరిపూర్ణమై యుండుమని భావము.

కం. మనమిరువురమొకచోటను । పనులెల్లనుమాని యచలపదమెరు
గుటకై । వినుకనుతినుపనిజేసే నినునీలోపలనెనెరుక నిజముగామ
రచీ । నినునీబయిటగనికన్నుదెరచీ । మనసందునేచోటుగనసందు
లేదుసా । ధనకందబోమ పరిపూర్ణబ్రహ్మము జెందునిజముగామ
రచీ । ననునీబైటగని కన్నుదెరచీ. 111

తా. శిష్యా ! మనమిద్దరమేపనిలేక నచలము నెరుగుటకై, యీస్థలమందు జేరితిమి, వినే, కనే, తినే, పనులు చేయునవైన యెరుకను మరచి, పరిపూర్ణమేనీవై, మనసుకిట్టిదని గోచరముకానిదియు, యేసాధనచేతను సాధింప నలవిగానిదియునైన, పరిపూర్ణబ్రహ్మమును జెందుమని భావము.

కం. ఈబోధనరిసమానము । నేబోధలుగావటంచు నేయుపదేశ । పాత్రి
బలికుడై నగురునిచే । నేబోధనువింటిదానినీకు దెలిపితిరా । దుష్టుల
కిదియుకాబట్టునటరా । యేబోధగురునైన నీబోధనివ్వకస । ర్వావి
బిద్ధమగుయెరుకాలాబోధ దెలుపుమరునీకు దెలిపితిరా । దుష్టులకిది
యుకాబట్టునటరా. 112

తా. శిష్యా ! ఈబోధకు సమానమైన బోధనే బోధయుకాదనినా అచలగురువుచేత విన్నానో నాబోధను నీకు తెలియజేసితిని. దుష్టులగు నీచులకీ బోధ కాబట్టదు. సాధారణముగా లోకమందేగు

రుషై నా నీబోధ నివ్వక, సర్వాబద్ధభ్రమరూపకమైన యెరుకబోధే జేయుదురని భావము.

కం. ఎన్నోయుక్తుల దెలుపుచు । నన్నేనీవాశ్రయించినావనిబయిటన్ ।
కన్నారజూచితివిగో । తిన్నగగనుగొనుము శిష్యతిలకయిదేరా ।
బట్టబయలై యున్నావుపోరా । నన్నునాబోధింకెన్నాటికికమరువ ।
కన్నాయన్ననునుగన్న చిన్నిశిష్యాతిలకయిదేరా । బట్టబయలై
యున్నావుపోరా. 113

తా. నాచిన్నిశిష్యతిలకా! నన్నే నీవాశ్రయించినావని, యె న్నెన్నో యుక్తులచే బోధించితిని, కన్నారాజూడుము, యిదే పరిపూర్ణము, నీవు పరిపూర్ణుడ వైతివి. యింతకంటె నెక్కువేదియును లేదు. నన్నును, నేను జేసిన పరిపూర్ణబోధయు నీ వెప్పటికిని మరువకుము, నీకింక కొరతలేమియు లేవని భావము.

కం. ఎరుకచెపరిపూర్ణమునిది । యరిగుండుమటంచుచూపియరుకనుత
నచే । బెరికికడవై చిబ్రోచెటి గురుడేనద్గురుడుకానీకుంభినీలోనూ ।
ఎరుకనునిల్పే గురుడెందుకికనూ । స్థిరముగనిజ దివ్యకరకమలమం
దున । ఎరుకబొలిగించేటి బిరుముగట్టినగురుడేకుంభినీలోనూ । ఎరు
కనునిల్పే గురుడెందుకికనూ. 114

తా. శిష్యా! పరిపూర్ణమిట్టిదని చూపి ఎరుకను, అంకురములేకుండా పోగొట్టే బిరుదును, కరమందు గట్టిన గురువే సద్గురువుగాని, ఎరుకను బోధించేగురు డెందుకు పనికిరాడు. అట్టివారి సాంగత్యమెన్నటికిని కూడదు, వారు చెప్పుమాటలను వినకూడదని భా.

కం. ఇలలోనతిపతులిరువురు । గలిసియు రతిక్రీడలేకగతిసల్పినను ।
పుత్రులవలసిసొలసియవతల । తెలివొందియుపూర్వక్రియలు దెల్పబూనునురా । నిర్లజ్జతో నిలిచిబలుకుదురా । విలసితగురుబోధక

లసి తెలిసిన వెనుక మలికితవృయరుక చే । ష్టలునిట్లిట్లనిమరల తెలప బూనుదురా । నిర్లజ్జతో నిలిచిపలుకుదురా. 115

తా. శిష్యా! భూమియందు, భార్యాభర్తలు కలసి, రతియు పరతులచే నలసి, నిద్రించి లేచిన పిమ్మట నాయిద్దరు తా మొకరొకరు పడినపాట్లు సిగ్గువిడిచి చెప్పుకొందురా? చెప్పుకొనరు. అటులనే సమానరహితమైన, అచలబోధ పొందిన తరువాత, మలినమైన యొరుక చేష్ట లిట్టివని తెల్పుదురా? తెల్పరని భావము.

కం. తరుణులుతమరతిచతురత । తరుణులకును తమనుగన్నతలిదండ్రులకుఁ । గురు తెరుగనివరులమతము । పురుషుల కే తెలుసునన్న పోలికవలెనూ । అట్లనెశిష్యవరుడుగురువులునూ । చాలాబోధింప గురుఁడాలసింప శిష్యు । డాలకింపగతత్వమూలముతా జెందూ పోలికవలెనూ । అట్లనెశిష్యావరుడుగురువులునూ. 116

తా. శిష్యా! లోకమందు స్త్రీలు తమ రతిచాతుర్యములు తమవంటి స్త్రీల వల్ల తమ తండ్రు లెరుగరనియు, తమ భర్తలుమాత్రమే యెరుగుదురనియు, తలంచెదరు. అటులనే గుణశాలి యగు శిష్యుడు తన గురుబోధించుట కాలస్యము చేసినను, దానా బోధ యందపేక్షగలిగి క్రమేణా బోధ విని కడతేరునని భావము.

కం. పరిపూర్ణబోధజేసెటి । తరుణములో కేవలాత్మ ధర్మముచేతఁ । గురుశిష్యులేకముఖముగ । పరిశుద్ధబ్రహ్మతత్వపదరహస్యములా । ఎరిగించేటియెరి గేటివిధులా । నిరువురుదీపకర్పూరమువలెవెలిగి । తిరిగికనుపడనట్టి సరణినిచ్చుటదెలియుపదరహస్యములా । నెరిగించేటియెరి గేటివిధులా. 117

తా. శిష్యా! సద్గురుమూర్తిఁ తన గురువు తన కిచ్చిన పరిపూర్ణబోధము, శిష్యున కెరుగించెడు సమయమందును, ఆశిష్యుడా బోధ నెరుగునప్పుడును, వారిద్దరు, అగ్ని, కర్పూరములవలె వెలిగి,

మరల గనుపించరు. అటువలెనే, పరిపూర్ణము నెరిగిన పెద్దలు మరల నెరుక భావమును పొందరని భావము.

కం. పరిపూర్ణమైనబయలులో । నెరుకేగురుశిష్యరూపులేర్పడియేమో సరిసరిగాగురిగురిగా మరిమరివాదించి యెరుకమాటనిల్చెనుగా। నానాటికామరుపుగెల్చెనుగా । ఎరుగవలసినబయ లెరిగినపిమ్మట । ఎరుకతనువృక్షమేననునీ వృక్షమాట నిల్చెనుగా । నానాటి కామరుపుగెల్చెనుగా. 118

తా. అచలమైన బయలులో శుద్ధమెరుకే గురుడని, శిష్యుడని, రూపములేర్పడియేమేమో, ప్రశ్నలు, ప్రవచనములేర్పడి, కడకు మెరుక కనబడకుండా మాయమై పోయెను. తెలుసుకోవలసిన పరిపూర్ణము నెరిగిన పిమ్మట భ్రమరూపమైన, ఎరుకశరీరము వృక్షే నీవు అబద్ధమే, నేను అబద్ధమేనని భావము.

కం. ఎరుకనుమరిచినవెనుకను । నిరువుగతనువున్న కార్యమెవరితోజేయుణ । మరిదంపతులిరువురిలో । మరలనుభోగించుభర్తా మరణించియున్నా । సంసారభారకు లెవ్వరున్నా । పురుషుడులేనట్టి తరుణిజీవించిన । కరణిగానీపూర్వసరణి భోగములెట్లు మరణించియున్నా । సంసారభారకు లెవరున్నా. 119

తా. శిష్యా! లోకమందు భార్యాభర్తలలో, భర్త మరణించిన, సంసారమును భరించువారెవరు? యెవరును లేరు. పురుషుడులేని భార్య జీవించినట్లుగానే. ఎరుకను విడచినవెనుక, శరీరమున్నను, యెవరితో కార్యములు జరుపును, యేమియు ప్రయోజనము లేదని భావము.

కం. ఎరుకనుబయలునుగురిచే । నెరిగియునొకకొంతకాల మెరుకతో మెలగిక । యెరుకనువిడుమని గురుడన । యెరుకనువిడిపించిశిష్యుడెట్లుండుననినా । నిష్ఫలమతనిచర్యలు వినినా । చిరుస్థనిమ

కోరలబెరికి విడిచినపెద్ద । ఉరగశరీరముతిరుగ నెవరికి భయము
యట్లుండుననినా । నిష్ఫలమతని చర్యలువినినా. 120

తా. శిష్యా! యెరుకిట్టిదనియు, పరిపూర్ణ మిట్టిదనియు,
సద్గురువు వలన, శిష్యుడు గ్రహించి, కొంతకాలము శిష్యుడే మరక
మార్గము లోనే వర్తించుచుండగా, ఎరుకను, విడువమని గురుడాన
తిచ్చిన, శిష్యుడెరుకను విడచి యెట్లుండునంటే, విషముగల కోరలు
పెరికిన సర్పమును జూచిన నెవరికి భయము? ఎవరికిని భయములేదు.
అలాగుననే వాని చర్యలు నిష్ఫలములని భావము.

కం. నిజముగనిలువని తనువులు । నిజముగ మనమెంతవరకు నిలువవ
శంబా । నిజపరిపూర్ణప్రభగురు । నిజదేహముసీవటంచు నెరిగితే
నరిరా । యరిగేవరకు గజిబిజిగదరా । అజభవాదులున్నైన నిజగు
రుప్రభగని । విజనదేశములలో సుజనులై తమమహిమ నెరిగి తేసరి
రా । యరిగేవరకు గజిబిజిగదరా. 121

తా. శిష్యా! నిలువకుండా పొయ్యే మాయాశరీరములను,
మన మెంతవరకు నిలుపశక్యమగును? నిలువుటకు వశముగాదు,
బ్రహ్మ, విష్ణు, శివు లయినను, గురుస్వరూపమైన పరిపూర్ణమే తమ
నిజదేహమని తెలుసుకుంటే చాలును. ఈ మర్మము తెలిసేవరకు,
చిక్కుగా నుండునుగాన పరిపూర్ణమే నీశరీరమని నమ్ముమని భా.

కం. తెలవారినిదురమేల్కని । సలలితనిజవస్తుజనిత స్వానుభవోక్తుల్
తెలియుచుమదిసత్కుశలత । గలిగిప్రవర్తించు జన్మగలిగినందుల
కూ । సద్గురుపదముపట్టినందులకూ । కలకలేనిభక్తినలిపి నీవిటు
శాయ । తెలిపినమద్బోధఫలమునీకు జూవుగలిగినందులకూ । స
ద్గురుపదముపట్టి నందులకూ. 122

తా. శిష్యా! నీవు సద్గురువు పాదము పట్టినందుకును, జన్మ
మెత్తినందుకును, తెల్లవారగానే, నిదుర లేచి, పరిపూర్ణస్వానుభవమును

దెలియుచు, కలంకములేని గురుభక్తిని గలిగి యుంటే నేను నీకు జేసిన పరిపూర్ణబోధ ఫలమును బొందెదవని భావము.

కం. పరిపూర్ణమానసోత్సవ। పరమానందైక్య సత్యపరవశయోగ। స్ఫురణయధేచ్ఛాలాభక। పరులగుపెద్దలకుమొ్రక్కి బ్రతుకుముతండ్రీ। తరుణోపాయమిదియే మాతండ్రీ। పరమతహితమిహపరగతులకుముఖ్య। కరమునర్వసౌఖ్యకరమనినను దలచీబ్రతుకుముతండ్రీ। తరుణోపాయమిదియే మాతండ్రీ. 123

తా. శిష్యా! పరిపూర్ణ బ్రహ్మానందైక్య సుఖానుభవులగు, యధేచ్ఛాలాభసంతుష్టులైన, పెద్దలకు వందనములు చేయుము. ఇదియే నీవు తరించుట కుపాయము పెద్దలసేవజేసి వారి హితమును బొందుటే, నిహపరములకు ముఖ్యసాధనయని, నన్ను దలచి బ్రదుకుమని భావము

కం. పెద్దలగనుగొనిశరణను। పెద్దలకందరికి ముఖ్యప్రియశిష్యుడవై పెద్దలసంతర్పింపుము। పెద్దలసేవాత్మసిద్ధి ప్రియమైనబుద్ధీ। వినుభయభక్తిగలిగిప్రసిద్ధీ। పెద్దలొకవేళ పరమార్థ రహస్యము। లొద్దికదెల్పగశ్రద్ధచేవిను మదియుప్రియమైనబుద్ధీ। వినుభయభక్తిగలిగిప్రసిద్ధీ. 124

తా. శిష్యా! పరిపూర్ణానుభవులయిన పెద్దలనుజూచి, వారికి శరణుజేయుము. పెద్దలందరికిని ప్రియశిష్యుడవై, వారికి నన్నపానాదులిచ్చి పూజించుము. పెద్దలను సేవించుట వలన నాత్మసిద్ధియగును. ఒకానొక వేళ పెద్దలు పరమార్థరహశ్యము చెప్పగా, శ్రద్ధచేత వినుమని భావము.

కం. పెద్దలననుగాదలపుము। పెద్దలకందరికి నాత్మపెద్దలె పెద్దల్। పెద్దలపోవలసు మెప్రుము। పెద్దలసేవాత్మసిద్ధి ప్రియమైనబుద్ధీ।

నీకిదిసర్వసత్యసమృద్ధీ । పెద్దలుదెల్పెటి విద్యాబుద్ధులు బ్రహ్మ ।
విద్యాభ్యాసము నభివృద్ధిజేయునునీకు ప్రియమైనబుద్ధీ । నీకిదె
సర్వసత్యసమృద్ధీ. 125

తా. శిష్యా! పెద్దలనగా, నాత్మానుభవులే, పెద్దలు. అట్టి పెద్దలను నన్నుగా దలవుము, ఎప్పుడును పెద్దలను వదలకుము, ప్రియమైన బుద్ధిచే పెద్దల సేవించిన నాత్మసిద్ధి కలుగును. పెద్దలు చెప్పే, విద్యాబుద్ధులు, నీయొక్క బ్రహ్మవిద్యాభ్యాసమును వృద్ధిజేయునని భావము.





శ్రీగురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైత ప్రబోధ గురుశిష్య సంవాదము:

## ఉత్తరభాగము—పంచమ ప్రకరణము.

కం. పరమేశపరమకారణ । పరమానుగ్రహావిహార ప్రణవాకారా । పరమానందసుధీరా । పరశివతత్వార్థసార బ్రహ్మావిచారా । శరణుగురు శ్రీపరమావతారా । పరమవిజ్ఞాన సంభరితముగని హా । పరసౌఖ్యకరమైన స్థిరబోధనెరిగింపు బ్రహ్మావిచారా । శరణుగురు శ్రీపరమావతారా. 1

తా. పరమకారణులైనట్టియు, ప్రణవస్వరూపులైనట్టియు, పరమానందమయులైనట్టియు, పరతత్వసారభూతులైనట్టియు, బ్రహ్మవిచారులునైన సద్గురువరా, పరిపూర్ణ జ్ఞానముతో గూడుకొని, యిహపరములకు సాధనయగు స్థిరబోధనొసగుడు. శరణుజేయుచున్నానని భావము.

కం. పరమగురునాజ్ఞగొనినే । పరిపూర్ణాఖండయోగ ప్రభజూపిమహా । పరిపూర్ణముచే నెరుకను । పరిశీలనజేసితీసి బైటవేసితిగా వేసినయెరుక పరిసిపోయెనుగా । గురుతులేని యచలపరిపూర్ణజలధిలో । పరవశసత్యసంభరితుడవై వెలుగుబైటవేసితిగా । వేసిన యెరుకపరిసేపోయెనుగా. 2

తా. శిష్యా! నేను నాపరమగురునాజ్ఞతీసికొని, అఖండపరిపూర్ణప్రకాశమునుచూపి, ఎరుకను బోగొట్టితిని, ఎరుకపరసిపోయెనుగదా? యింకనీకేమికొరత యున్నది. యింతంతనరాని. పరిపూర్ణజలధిలో పరవశుడవై ప్రకాశింపుమని భావము.

శేషప్రారబ్ధభోగానుగతజీవపరితాప శిష్యవైరాగ్యము.

కం. గురుడిట్లనిబోధించిన । వరశిష్యాగ్రణివివేకవన నిధియనిమా । పరిపూర్ణబోధపరసుఖ । పరవశమునజూడలేక భ్రాంతితొలగెనుగా । నిజపరదేహస్ఫురణే మరచెనుగా । యెరుకతనువులరెంటినెరిగితొలగించేమీ । చరణాబ్జముల నొరిగిమరిచినిద్రబోగా భ్రాంతితొలగెనుగా । నిజపరదేహస్ఫురణేమరచెనుగా.

తా. గురువరా! నేను దేవరవారి పాదపద్మములమీదబడి పరిపూర్ణ పరవశనిద్రబోగా, ఎరుకశరీరముల భ్రాంతి తొలగిపోయి నేను నితరులను స్ఫురణే మరచిపదని భావము.

కం. నేనెక్కడనీమలినవి । ధానాద్భుతసర్వసంస్థితా శేషజగ । ద్ధానంబెక్కడతత్సం ధానముఖరశృంగవిధ మధర్మముగాదే । శగనోద్యానసూనముగలదే । వానలేనిపిడుగు మానులేని తొడుగు । కానరానియడుగు గానుపించునెయట్టిధర్మముగలదే । గగనోద్యానసూనముగలదే. 4

తా. నేనెక్కడ, అనగా పరిపూర్ణమైన నేనెక్కడ? మలినముతో గూడుకున్న భ్రమరూపకమైన, యీకనుపడే ప్రపంచజ్ఞానమెక్కడ? నేనైన పరిపూర్ణమునకును, యీ ప్రపంచజ్ఞానమునకును యేమి సంబంధమున్నది? సంబంధమేమియును లేదు. ఈ సంబంధమెట్లున్నదనగాగాడిదకు కొమ్ములున్నటులను, ఆకాశవనమునందలి పుష్పములవలెను, వానలేని పిడుగువలెను, మండలులేని తొడుగువలెను, కానరానియడుగువలె నున్నది. అనగా నీపైన జెప్పినవన్నియు లేవి వేనని భావము.

కం. నాకొకటిదోచుచున్నది । యీకాపురమెల్ల నెవరికెక్కునోనికమం । దేకరణిజరుగునోవిధి । లోకాలోకములు నాకులోకువపధ్మునా । లోకువపడకయేకత్వమగునా । స్వాకారాముననిరాకారత్వ

నివేసు । లేకున్న తెల్పునేలోకవార్తలునాకు లోకువపడునా । లో
కువపడక నేకత్వమగునా. ౫

తా. గురురాయా! నాకొక సంగతి తోచుచున్నది. ఈదిక్కు లేని భ్రమ లోక కాపుర మెవరికొరకు ? ముందెట్లు జరుగును ? పరిపూర్ణామందేదియు దోచని నాకీలోకాలోకములగుపడునా ? అగుపడకపోతే నొక్కటైన పరిపూర్ణ మేయగునా ? సాకారమని, నిరాకారమని, వ్యత్యాసము లేనప్పుడు లోకవార్తలు నాకెట్లు తెలియును ? తెలియవని భావము.

కం. యెవరికిబట్టని కాపుర । మెవరికిసంసారధర్మ మెవరికివిశ్వం । బెవ
రికినెవరంటకహరి । శివయనరేముందుమాయ ఛీఛీనాకేలా । పో
యినపీడ వివరింపనేలా । కవలబిడ్డలరీతి భువిలో తనువెరుకలు ।
తవిలిబెరిగియెరుకయవలీలగాబోవు ఛీఛీనాకేలా । పోయినపీడవివ
రింపనేలా. 6

తా. భూమియందు శరీరము, ఎరుక, అమడబిడలవలె పుట్టి, రెండు నొకటిగా బెరిగి, వ్యష్టిరూపములై, ఒకరికొకరు వేరై, హరి, శివయని నామముల నుచ్చరించుచుండి యవలీలగా ఎరుక ఎప్పుడో చెప్పకుండా పోవుచున్నది. ఛీ, ఛీ నిలువకుండా పోయ్యె పీడ నాకెందుకు. ఈ సంసారమెవరికి కావలెను. పోయినపీడను నెందుకు వివరించవలెనని భావము.

కం. నా తెలివిమరుచునప్పుడీ । నీతినిషిద్ధములు లేనినీచప్రపంచం । చేత
త్వవిలయములలో । నేతావునసీడ లేక నేమిాంగాబోనో । లయకా
రులఘాత కేమగునో । పాతిపెట్టినయకు కేయీాతీరుబోవ యేజాతి
కెక్కనిపంచభూతాకృతులురజమై నేమిగాబోనో । లయకారులఘా
త కేమగునో. 7

తా. నాయొక్క తెలివి మరచిన కాలమందనగా. నేను పరిపూర్ణమైనప్పుడీనీచ ప్రపంచముండుట కెక్కడను తావులేక యేమిగాబోవుచున్నదో, భ్రమకు కారకులైనవారిపని యేమగునో, పాతిపెట్టిన, ఎరుకే యీప్రకారము లేనిదైపోతే, యేజాతినీతి కెక్కడని పంచభూతములచే నేర్పడిన శరీరములు దుమ్మైపోవునని భావము.

కం. తానుంటేనే విశ్వము । తానొప్పగ కన్నమూయు తరినేమగునో ।
తానెంతని కనిపెట్టును । తానే తానగుచు నెరుక తానే పోయెనుగా
అచలములోన గానదాయెనుగా । తానెరుగని ప్రజ్ఞ లేనే లేదని యూ
హము । బూనిన నీబయిట దేని నంటక తనలో తానే పోయెనుగా ।
అచలములోన గానదాయెనుగా. 8

తా. తానను నెరుకయుంటే నీవిశ్వమున్నది. తాను నిద్రించినప్పుడేమగునో, తానెంతని కనిపెట్టగలడు. ఎరుక తానులేని దానినని నెరిగి తానే తానై పరిపూర్ణమందు దేని నంటక, కానరాక పోయెను. అనగా, పరిపూర్ణమైన, ఎరుకే పరిపూర్ణమని భావము.

కం. తానున్నప్పుడె లోకులు । నానాజాగ్రతత నిదినాదన రేమో
తానెరుక మరచు క్షణమున । పోనేమో జగము సర్వపూర్ణాముగా
నూ । పోకున్న జడమేమి జేసునూ । తానేమి జేయక పీనుగపలె
తనువు । దేనికైననుకలసిరానే రాదను తోలగె పూర్ణాముగానూ ।
పోకున్న జడమేమి జేసునూ. 9

తా. తానుండే సమయమందే లోకులు, లోకములు, నీది, నాదియనుట, మొదలైన జాగ్రతలున్నవి తానెరుకను విడచిన తత్క్షణమే జగము పరిపూర్ణముగా పోవునేమో, పోకుంటేయీజడమైన ముద్దు యేమిచేయగలదు. ఎరుకపోయినప్పుడు, శరీర మెందుకును పనికి రాదు, ఎరుకే లేనిదైనప్పుడు శరీరమున్న లేనిదేనని. భావము,

కం. ఓహోహోయెరుకేమో । సాహసమున సర్వవిషయ సంసార
ముని । ర్వాహకమొనర్చునను తన । యూహానునిష్ఫలము జేసి
యొక్కటేగునుగా । తనువిపుడొకటే చిక్కబడియెనుగా । దేహి
దేహములలో మోహాభావహుళ్యమై । కుహకమున బెరిగి తానహి
తము నిల్వకయొక్కటే గెనుగా । తనువిపుడొకటే చిక్కపడి
యెనుగా. 10

తా. ఓహో యిదియేమి చిత్రము, దేహికిన్ని, దేహము
నకున్ను, యింతనురాగము గలిగివుండి, ఒకదాని నొకటి యెడబాయ
లేక నొకటిగా బెరిగి, దేహి తాను యావత్తు సంసారము నిర్వహించె
దను, యేమేమో కార్యములు చేసెదనను, తన యావత్తు యూహ
లును నిష్ఫలముచేసి తానొక్కటే చెప్పకుండా, పేరూ, వూరూలే
కుండా పోవుచున్నది. ఇప్పుడు శరీరమున కొక్కదానికే చిక్కు గలి
గెనని భావము.

కం. గురువులయెరుకనువిడిచే । తెరవడిగితిగాని రెంటితెగదీసినికో
కొరతలునిల్పకుమనియే । తరుణములోనడుగనట్టి తప్పనాదాగా ।
అందుకుశిక్షమరలనంటెనుగా । యెరుకతొలగినవెనుక గురిగురు
తులేనియీ । మఱికిశరీరమేకరణినూరేగింతూతప్పనాదాగా ।
అందుకుశిక్షమరల నంటెనుగా. 11

తా. మొదట ఎరుకనువిడచు మార్గము చెప్పుమని నా సద్గు
రువు నడిగితినిగాని ఎరుక శరీరముల రెంటిని విడిచే మార్గమొక సమ
యమందైనను అడుగకపోతిని అడగనితప్పునాదే దానికి తగినశిక్షమర
లనాకంటివచ్చెను. యెరుకపోయిన మీదట నీగురుతులేని జడమైన
మురికిశరీరమును నెట్లు జరుపుదునని భావము.

కం. దానికిసదిదీనికినది । మేనెరుకలకొకటికొకటి మొళసమనిము ।
న్నేనూరుమార్లువింటిని । గానియొకానొక్కనాటి కాలమందైనా ।

రెంటినివిడుచు జ్ఞానాభ్యాసమునా । పూనియడిగినది లేనిలేకను పోయే । గానతనువిపుడే విధానచరించు నేకాలమందైనా । రెంటి నివిడుచుజ్ఞానా భ్యాసమునా. 12

తా. శరీరము, యెరుక నొకదానికొకటి మేళనంగానున్నవని యనేకపర్యాయములు నేను వినియుండిన్ని రెంటిని విడిచిపెట్టే సంగతినొకకాలమందైనా నడుగకపోతిని గనుక నిప్పుడీయెరుకలేని శరీరమే ప్రకారము చలించును ? నాకేమియునుదోచకున్నదని భావము.

కం. ఇతరేతరమూలకమై । స్థితితనువెరుకలకు భోగచర్యలు నొకటై। జతగాపోకనుమృతి సం । గతికాలముభేదమైతే కడగండ్లే నిజమూ తనువున్నపుడే వెతలున్నవనుమూ । మతిలేనియీ దేహపతన పర్యంతమూ । గతకార్యములలోన గతులుదుర్గతులేమో గడగండ్లేనిజమూ । తనువున్నపుడే వెతలున్నవనుము. 13

తా. శరీరమున కెరుక ఎరుకకుశరీరము ఒకదాని కొకటియాధారములై భోగకార్యము లొకటిగా జరుపుచు రెండునొకసారి పోకుండా, మృతికాలము భేదమైనప్పుడు నిజముగా తిప్పలుగలుగును. శరీరమున్నపుడే కడగండ్లున్నవి. జడమైన శరీరముపడిపొయ్యే పర్యంతము జరుగుకార్యములలో కష్టమేనని భావము.

కం. ఘడియయొక బ్రహ్మకల్పము । గడిపినవిధమానుయల్లకాలమునేనీ గడుసెరుకదొలగవిశ్వము । నడుపుదునావల్లగాని నాటికేమౌనో తనువికశుద్ధ జడమగుదుబోనో । నడమంత్రమగు లోకనడతలకేనులో । బడలేనికాలముకడగండ్లేగదనాకు నాటికేమౌనో । తను వికశుద్ధజడమగుచుబోనో. 14

తా. ఈనడమంత్రమైన, ఎరుకపోయిన వెనుక నీవిశ్వనటనల నేనెట్లు జరుపుదును. గడియయొక బ్రహ్మకల్పముగా నున్నది. ఈ

లోకనటనలునాచేగానినాడు, నాకు కడగంఢ్లేనిజము. నేనేమి జేయు దునని సంశయము గలిగెనని భావము.

కం. అనియిత్తెరగునసంశయ । వననిధిలోమునిగి శిష్యవరుడేమియు తో । చనిమనమునతనుగుణవే । దనతోతనగురునిపైన తాను మూర్ఛిల్లి । పలికేనునశ్రువులు నుప్పతిల్లీ । తను శేషప్రారబ్ధమును భవింపగజాల । ననిదీనికేమినాధన దెల్పుమని మ్రొక్కి తాను మూర్ఛిల్లి । పలికెనుయశ్రువులు నుప్పతిల్లీ. 15

తా. సద్గురువర్యా! ఇటువంటి సంశయ సముద్రమునందు మునిగి యేమియు తోచకున్నాను. నేనుయీశేషించినశరీరప్రారబ్ధము అనుభవింపజాలను. దీనికేమైనా సాధన యున్నదేమో తెల్పుమని అడుగుచూ, కన్నులవెంబడి నీరుకారుచు, గురుని పాదములమీద బడెనని భావము.

కం. స్మృతిలేకనుపదములబడి । నతిసంశయశోకభయము లమరినశిష్య । స్థితిగతులుదెలసి శ్రీగురు । పతికరకమలముల లేవబట్టి తాన నియే । కౌగిటనుంచియతి ప్రేమగనియే । క్షితినిమద్భక్తసంతతు లలోనీకన్న । మతిమంతులెవ్వరీవెత లెందుకని లేవబట్టి తాననియే కౌగిటనుంచి యతిప్రేమగనియే. 16

తా. అతిసంశయముతోను, దుఃఖముతోను, భయముతోను, దేహముమీద స్మృతిలేక, తనపాదములమీద బడియున్న శిష్యునియొక్కస్థితి తెలిసి, గురుమూర్తి తన శ్రీహస్తములతో లేవనెత్తి, మహా దయచే కౌగిటజేర్చి, నాయనా, నాశిష్యులలో నీకంటె బుద్ధిమంతులెవరును లేరే, నీ వెందు కిట్లువ్యాకులపడెదవని గురువరుడు శిష్యునియడి గెనని భావము.

కం. ఈలాటియల్పసంశయ । మేలాగునతోచెదీనికేమని నాతో । నాలోచింపగవలదే । కాలమునమకూడితనువు కడచెందే వర

కూ । భోగింపకతీరదా ఖరకూ । యేలీలనైన నాకాలములో
బ్రతికె । మూలమువిని గుణశీలుడవై మెలగుకడెజెం దేవరకూ ।
భోగింపకతీరదాఖరుకూ. 17

తా. శిష్యశ్రేష్ఠమా ! నీ కీలాటి స్వల్పసంశయ మేలాగుతోచి
నది. తోచితే నన్నడుగగూడదా ? కాలముతీరి శరీరము పడిపోయ్యే
వరకు ననుభవింపకతీరదు యేలాగునైనను నాకాలములో నెట్లుండ
వలెనో నామార్గము చెప్పెదను. విని, ఈశరీరముండువరకు బుద్ధిమం
తుడవై యుండుమని భావము.

శ్రీమదఖండగురుప్రార్థన.

కం. బ్రహ్మశ్రీపరమేశ్వం । బ్రహ్మాదిబుధేంద్రహృదయపంకజహితస ।
ద్బ్రహ్మానంద పరాత్పర।బ్రహ్మాండాఖండచర్యబ్రహ్మగురువర్యా ।
సకలమోక్షశాశ్వితైశ్వర్యా । బ్రహ్మవిద్వర్యమీ బ్రహ్మసుఖా
నంద బ్రహ్మజ్ఞులకు నేనుబద్ధుడనై యుందు బ్రహ్మగురువర్యా । స
కలమోక్షశాశ్వితైశ్వర్యా. 18

తా. పరబ్రహ్మస్వరూపా, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదుల
హృదయకమలములకు మిత్రుడా, పరానందస్వరూపా, బ్రహ్మాండాఖం
డరూపా, నిత్యమోక్షమనే శాశ్వితైశ్వర్యా । బ్రహ్మవిద్వర్యా, సద్గు
రువర్యా, పరిపూర్ణసుఖానందులైన బ్రహ్మవేత్తలందరికిని నేనుదాసు
డనై యుండెదనని భావము.

అఖండసమాధిబోధలక్షణము.

కం. గురుపరమేశ్వరుకరుణను । గురుబోధోపరతిమరిగిగురుతరభావ్య।
త్పరిపూర్ణభావహార్మ్యం । తరశ్రుతి నవహేమపుష్పతల్పమునం
దూ । పవళించితత్పరసుప్తినొందూ । మరిచి నిద్రించితే మరుపు
దానిలోకన్ను । దెరచితేనాస్మరణమరువకు మరువకు తల్పమునం
దూ । పవళించితత్పరసుప్తినొందూ. 19

తా. శిష్యా! గురుమూర్తి కరుణచే బొందిన, బోధోపరతి మరిగి పరిపూర్ణభావమనే, మేడలోనుండు శృత్యంతమను బంగారు పూలపాన్పుపై పవ్వళించి, అచలనిద్రపొమ్ము. మరచినిద్రించితే బ్రహ్మానంద పరవశమనుభవింపుము, కన్నుతెరచితే నాయొక్క స్మరణము మరువకుమని భావము.

కం. నిదురించెటివేళలగురు। పదకమలామృతరసా ప్తిపరవశమువనే।
నిదురించి నిదుర మేల్కన। పదపడినీయుత్తబట్టబైటా నీబోధా।
గనుగొనుమచలపదమనుచుమేధా। పదుగురు కేదహామొనదియే
నీకు రాత్రి। యేదహాముసీకగునదిలోకనిశియుగుబైట నీబోధా।
గనుగొనుమచలపదమనుచుమేధా. 20

తా. శిష్యా! నిదురించే నమయములం గురుపాదారవిందమక రందపాన పరవశమున నిద్రించి, నిదుర మేల్కని, యీ పరిపూర్ణమే అంతటా నిండియున్నదనిచూడుము. లోకమున కేదిపగలో నదియే నీకురాత్రి, నీ కేదిపగలగునో అదియే లోకమునకు రాత్రియనిభావము.

కం. ఎన్నెన్నోబోధలను। విన్నావుగదా యనేక వేదార్థములన్।
గన్నావుగనుక దెలిపెద। నిన్నటికిని బదులుకన్ననిక లేదు మిన్నా
యేబోధలెవ్వరిచాతవిన్నా। వున్నదున్నట్లు నేమున్న సాధుల
వలన। విన్నట్లు కన్నట్లు నన్నిట్లు దెలిపితినిక లేదుమిన్నా। యేబో
ధలెవ్వరిచాతవిన్నా. 21

తా. శిష్యా! ఎన్నియోబోధలను, వేదార్థములను వింటివిగదా! నెవరిచేత నెన్నిబోధలనువినినా, పరిపూర్ణమునకంటె యెక్కువైనదేదియును లేదు. నే నిదివరకు పెద్దలవలన వినినట్లు చూచినట్లును న్నదున్నరీతిగా నీకు చెప్పితిని. యింతకంటె నెక్కువ లేదని భావము.

కం. నేనిట్టిబట్టబైటను। తనకొరులకునలవిగానితత్వార్థముబ్ర। హ్మా
నందమహార్ణవయగు। నానిజరూపమున నిలచినాగురుని భాటా।

వెంబడిదెలుపునానోటి మాటా । దేనికర్థమొ నీవుదానిపై వెలుగ
వి । జ్ఞానభాస్కరయభిధాన మొసగుదు నింక నాగురుని భాటా
వెంబడిదెలుపు నానోటిమాటా. 22

తా. శిష్యా! నేనిట్టిపరిపూర్ణమందుండి తనకు నితరుల కలవి
గాని నాసద్గురుని భాటయగు పరిపూర్ణమును నీకుదెల్పితిని. నీవా
పరిపూర్ణానంద మహాసముద్రమున ప్రకాసింపుచుండుము. ఇది మొద
లుకొని నీకు జ్ఞానభాస్కరుడని పేరుపెట్టుచున్నాను. జ్ఞానభాస్కరు
డనగా పరిపూర్ణజ్ఞానమను సూర్యుడని భావము.

కం. తనవృత్తికెరుకబొడమిన । ఘనబ్రహ్మజ్ఞానశూన్య కళతానొం
దుఁ । తనుపరిపూర్ణవిలాసము । దనరినయాతత్వ చిహ్నముత
నకగుపడుగా । తరుకోటరాంతరవహ్నిజెలగా । కొనలిగిర్చనివృ
క్షమువిరళించునే । మననశీలుడటులబెనగూనే విషయాశతనకే
నగుపడుగా । తరుకోటరాంతరవహ్ని జెలగా. 23

తా. శిష్యా! తానుజేయుగువృత్తులలో యెరుకభావములోచిన
యెడల నాత్మజ్ఞానములేని శుద్ధపామరుడగును. తానెచ్చట జూచినా
పరిపూర్ణవిలాసమును పొందిన యెడల, నాపరిపూర్ణము తనకే
యనుభవముగాని, యెరుకయందుండువానికి గోచరముకాదు. అగ్నివ
లన కాలి, కొనలిగిర్చనిచెట్టు ప్రబలునా? ప్రబలము కాదు. అటులనే
గురువాక్యార్థమును మననముచేయువాడు విషయాశలను బొందడని
భావము.

కం. ఆకలినిద్రాతురరతి । వ్యాకులనమయముల నన్యవార్తలు చెవు
లఁ । సోకగతీవ్రాశలనీ । వేకరణినపేక్షపడుదువీకరణీ బోధా ।
నాదలకుమటుల నీకున్న మేధా । ఆకార్యములరీతి చేకొని సంతు
ష్టి-సీకీబోధలసుఖమునా కొలదిగలదనకో యీకరణీబోధా । నా
దలకుమటులనీకున్న మేధా. 24

తా. శిష్యా! నీవాకలిగొనినప్పుడును, కంటిమీదికినిద్రవచ్చి నప్పుడును, రతివ్యాకులసమయమందును, నీకితరవార్తలేవియు వినబడక, వాటియందే నీమనస్సెట్లుమగ్నతజెందునో యావిధముననే నీతెలివికొద్ది సద్గురుబోధను వదలకుము. పైకార్యములయందెట్లు సంతుష్టిపొందెదవో నీకీబోధసుఖము, నాకొలదివున్నదనుకొనుమని భావము.

కం. గురుబోధకొరకు నెరుకను । గురుదక్షిణగా నొసంగిగురుగుహ్యాంత । గురుదయోగ సప్తభూముల । గురు తెరిగిమదీయ్య భక్తకోటి
లోతిరుగూ । గురుమంత్రార్థ స్మరణనుమరగూ । గురుజునూపి
నపెద్దగురుతులోగురిమరచే । పరిపూర్ణమగువరకు పరిపూర్ణమి
దెభక్తకోటిలోతిరుగూ । గురుమంత్రార్థ స్మరణనుమరుగూ. 25

తా. గురుబోధకొరకెరుకను, గురుదక్షిణగానిచ్చి పరిపూర్ణ సప్తయోగభూముల నెరిగి, గురుమంత్రార్థమును స్మరణ జేయుచు నాగురు పుత్రులతోటినుండుము. గురుడుజూపిన గురుతులో, ననగా నచలమందు గురిమరిచేపర్యంతమిదే పరిపూర్ణమని భావము.

యోగసప్త భూములనగా

(1) సుఖేచ్ఛ, (2) విచారణ, (3) తనుమానసి, (4) సత్వాపత్తి, (5) సంసక్తినామిక, (6) పదార్థభావన (7) తురీయము — (1) సుఖేచ్ఛ:-బహుజన్మార్జిత సుకృతపరిపాకమువలన, జ్ఞానముగలవాడై, యీయసారసాగరమెట్లుదాటగలనని పరితపించి, పెద్దలజేరి, వారికారణమువలన, సత్కర్మాచరణంబును, వేదాంతశాస్త్ర పరిజ్ఞానంబును గలిగిమోక్షమునపేక్షించుట, సుఖేచ్ఛయనంబడు — (2) విచారణ:-అద్వైతశాస్త్రపరిజ్ఞాన, సత్సంగవైరాగ్యంబులు గలిగి, బ్రహ్మమెయ్యదియని విచారించుట, విచారణ యనబడును— (3) తనుమానసి :- పై రెండుభూమికల సాధనపూర్ణముగాగలిగి, దారుణములగువిషయేంద్రియముల యేపులతో దగులక, మనస్సునుక్షీణింపజేయుట తనుమా

నసియనబడును. దీనికేఅసంగమనిమరియొక పేరు— (4) సత్వాపత్తి:- యీమూడుభూమికల నభ్యసించి, ఇంద్రియార్థములందాశమాని, యితరసంకల్పములులేక బ్రహ్మనిష్ఠగలిగియుండుట సత్వాపత్తియనంబడును— (5) సంసక్తినామిక:- ఈ నాలుగుభూమికల అభ్యాసమువలన విషయసంగమము, గుణత్రయసంగము లేక బ్రహ్మనిష్ఠయందు పట్టుదప్పకయుండుట సంసక్తినామికయనంబడును — (6) పదార్థభావన:- ఈ యైదుభూమికల విశేషాభ్యాసముచేత బాహ్యాంతరదృశ్యములేక, స్వాత్మారాముండై బ్రహ్మము నేననుట పదార్థభావనమనంబడును— (7) తురీయము:- ఈ యారుభూమికల మార్గ మెరిగి, నేమిటను భేదములేదని తెలిసికొని, పరబ్రహ్మమాత్రుండై యుండుట తురీయమనంబడును— ఇందులో మొదటి మూడు భూమికలు జాగ్రదవస్థయనియు, నాలవభూమికస్వప్నావస్థయనియు, అయిదవభూమిక సుషుప్త్యావస్థయనియు, ఆరవభూమిక తురీయావస్థయనియు, యేడవభూమిక అవాఙ్మానసగోచరమైనదనియు దెలియవలెను.

కం. నానిజరూపమెనీవని । నానావిధరూపనామ నటనాదులనీ । వేననినీనాభేదము । లేనేలేదనుచు యచలలీలజూపితిగా । చూచినగురుతుమాను మంటినిగా । నేనేమిదాచకనీనియమాఖండ । జ్ఞానసమాధివిధాన మెరిగించి యాలీలదెలిపితిగా ! జూపినగురుతుమానుమంటినిగా. 26

తా. శిష్యా ! నారూపమైన పరిపూర్ణమేనీవని అనేకమైన రూపనామనటనలన్నియు నీవేనని, నీ, నా యనుభేదము లేనేలేదనియు, బోధింప పరిపూర్ణగురుతును చూపినానుగదా ? చూచిన గురుతును మరచిపొమ్మని చెప్పితినిగదా? నేనేమియు దాచకుండా పరిపూర్ణజ్ఞానసమాధిమార్గమునంతయు కొరతలేకుండా నమ్మజెప్పితినని భావము.

కం. ననుమరువకు ననుమరువకు । ననుమరువకు మచలబోధనాటినదాక । ననుమరువకు ననుమరువకు । ననునీవై మరచిపొమ్మ్యేనాటి

కేహో రా। మరిచేగు ర్తు వెనక దేకదరా । వినుకనుతినుపనులుత
నువుకలదాకను । ననుమరచు టెందుకీ యనుమాన మెందుకా నాటి
కేహో రా। మరిచేగు ర్తు వెనక దేకదరా. 27

తా. శిష్యా! మాటికి మున్మాటికి నీకచలబోధ మనస్సున స్థిరమై నన్ను నీవై మరచిపోవ్యే వరకును, నన్ను మనువకుము. విను, కను, తినే మొదలగుపనులన్నియును, శరీర ముండువరకుంటున్నవి. ఇంత అనుమానమెందుకు, శరీరమున్నంతవరకును నన్ను మరచుటెందుకు. నన్ను ధ్యానింపుచుండుమని భావము.

కం. నీకికఘటప్రారబ్ధము । సోకగతనువిషయపూర్వస్మృతిచే కార్యా।
నీకములు జరుపుటకును వి । వేకములగు బ్రహ్మబుద్ధివిధినియమ
ములా । దెల్పెదప ట్త్రింశాఖ్యలక్షణలా । నాకరణీతనువున్ననాట
నుంచికడ । లేకనుపరిపూర్ణ లోకమందునజెందు విధినియమములా
దెల్పితిప ట్త్రింశాఖ్యలక్షణలా. 28

తా. శిష్యా! ఇకముందునీకు శరీరసంబంధప్రారబ్ధముసోకగా, ప్రపంచవిషైక కార్యములు జరుపుటలో, శరీరమున్నంతవరకు, పరిపూర్ణావలోకమందే నిలుపుటకు నియామకముతైన, క్రింద జెప్పబడిన ముప్పదియారు ఆఖ్యలుగల బ్రహ్మవిధులచే నీకు దెల్పెదనని భా.

అఖండప్రసాదనియమము.

కం. త్రివిధభవద్దీక్షలలో । త్రివిధాకృతమద్గురూప దేశకళావి । ర్భవ
రూపత్రయములచే । త్రివిధబోధలను జేసి తెల్పితిముందూ ప్రవి
మలశివజీవై క్యమందూ । త్రివిధదీక్షాక్రమ త్రివిధోపశమములకు ।
త్రివిధప్రసాదములివిగో గైకొనువత్సా తెల్పితిముందూ ప్రవిమల
శివజీవై క్యమందూ 29

తా. శిష్యా! జీవేశ్వరై క్య సంధానము జేసినపుడు, నా గురువు నాకిచ్చిన యనుభవరూపమైన, తత్పద, త్వంపద, అశిపదరూప

త్రయములచే, మూడుబోధలను బోధించితివి. త్రివిధదీక్షలు, త్రివిధాశ్రమములు, త్రివిధోపదేశములకుగాను, త్రివిధప్రసాదము లిచ్చెదను. గ్రహింపుమని భావము.

కం. అంగసుదీక్షనుగురుపర । మాంగప్రసాదమున । భావయంతదీ-
క్షా । సంగతిభావప్రసాదము । పొంగికళాదీక్షచాత పొందువై
భవమూ । గురుకళ సుప్రసాదాశోభితమూ । రంగుమీరగసు
స్థానాంగభావాత్మల । శృంగారశిశ్రూష సాంగోపాంగ క్రియల
పొందువై భవమూ । గురుకళసుప్రసాదాశోభితమూ. 30

తా. శిష్యా! అంగదీక్షచే గురువు యొక్క పరమాంగమైన పరిపూర్ణప్రసాదమును అట్టి గురుకళ అంతరమందున్నదనే భావము గల, అంతర్దీక్షచే భావప్రసాదమును, అట్టి గురుకళాదర్శనము కలుగజేయు, కళాదీక్షచే, కళాప్రసాదమును పొందుము స్థాన శిశ్రూష, అంగశిశ్రూష, భావశిశ్రూష, ఆత్మశిశ్రూష, యీనాలుగుశిశ్రూషలు గురుమూర్తికి సాంగముగాజేసి కడతేరుమనిభావము.

కం. ఏతత్త్రివిధప్రసాదవి । భూతులజెలువొంది యచలభూతార్ణవ
సం । భూతమహాపరవశవి । ఖ్యాతిగననుసీలోనిల్పి ఘనుడవై తిరు
గూ । నాయోగాంతర్ఖ్యాతి గురుతెరుగూ । భూతములలో సర్వ
జాతినీతిమత । భీతులొందక బ్రహ్మజాతులలోయోగ ఘనుడవై
తిరుగూ । నాయోగాంతఖ్యాతి గురుతెరుగూ. 31

తా. శిష్యా! ఇటువంటి త్రివిధప్రసాదము లనుభవించి పరిపూర్ణమహాసముద్రమునందు గలిగిన పరవశముచేనున్న నీలోనిల్పు ఘనుడవుకమ్ము సర్వభూతసమ్మతముగా జాతి, నీతి, మతభేదములు విడచి బ్రహ్మజ్ఞులలో శ్రేష్ఠుండవై నాయొక్క అంతర్యోగమైన పరిపూర్ణబ్రహ్మను గుర్తెరిగి ప్రవర్తించుమని భావము.

గురుశిష్యరహస్యపరమ గృహాకృత్యవిధి.

కం. నేనున్నదాక నాయా। ధీనముసీప్రాణమాన దేహాదులు నే। కాన కుపిక్కము నాయా। జ్ఞనిహపరములకు నింకేమి లేనను కో। ఆజ్ఞ కుమించి కానే కాదను కో। లేనే లేనియవల నానిజబోధాజ్ఞ। మా నా కాజరుపుమన మేనులుండేవరకు రేమి లేదను కో। ఆజ్ఞకుమించి కానే కాదను కో. 32

తా. శిష్యా! నేనెంత కాల ముందునో నంతపర్యంతం నీప్రాణ మాన దేహాదులు నాయధీనము ఇహపరములకు నాయాజ్ఞతప్ప యితర మేమియులేదు నాఆజ్ఞకుమించి యేదిన్ని కాదనుకొమ్ము కాబట్టి మన శరీరములుండువరకును నాబోధాజ్ఞను విడువకుండా జరుపుకొనుమని భావము.

కం. నను నెచట నెచటగనుగొన। మననగునోనచటనచటమహనీయ్య ము చే। ననిశమునగుపడుదును నీ। మన మే నామనమువత్స మన మొక్కటేరా। ఇదిగురుసూత్రమని తెలుసుకోరా। కనికరముగ నిన్నుగని నేవిడువకున్న। మనమునవాభక్తిమానాకని వున్నమన మొక్కటేరా ఇదిగురుసూత్రమని తెలుసుకోరా. 33

తా. శిష్యా! నన్నేసమయమందైనను నెచటనెచట జూడ వలెనని నీవు కోరెదవో అచ్చటనెల్ల నేను నీకు దర్శనమిచ్చుచుందును మనసున నామీద భక్తిమానక నీవుండి నీమీదికనికరముచే నేను న్ను విడువకుండిన నీమనస్సే నామనస్సు మనమిద్దర మొకటేయగు దుము. ఇది గురుసూత్రమని గ్రహించుమని భావము.

కం. నీవంటగలుగుభక్తికి। నావంటనుగల కటాక్షమటనెను రెదురై। దేవీ దేవరవలె పర। దేవతలుగభూనభమ్ము తిరుగుచుందుముగా నీవు నేననుభానైక్యవిధిగా। నే వేళ నెచ్చోట నీవాత్మలోదలఫ।

నా వేళగన్పడుదు దేవునివలె నెద టత్తిరుగుచుందుముగా । నీవు నేన
ను భావైక్యవిధిగా, 34

తా. శిష్యా ! నాయందు నీకుగల భక్తియు, నీమీద నాకుగల కటాక్షము, నీరెండు నొకదానినొకటి యెదురుపడి రెండు నొకటేననే భావముచే, పర దేవతలవలె భూమ్యాకాశాదులసంచరించుచుందుము. ఏవేళ నెక్కడనైతే నన్ను నీ నాత్మలో దలచెదవో, నప్పుడు దేవుని వలె నీముందర ప్రత్యక్షమగుదునని భావము.

క౦. విడువగజాలము మన మొక । ఘడియైననురొకరికొకరు గనిపెట్టు
టలా । జడివర్షములోపలబడు । వడిగల్లుకుశకలమునకు వకరూపై
నటులా । వకటికి వకటి విడుచుండనటులా । విడువవునన్నీవు విడు
వనినునీతావు । గుడమధురములు రెండువిడిబడియగు పనునేవక
రూపైనటులా । వకటిని వకటివిడిచుండనటులా. 35

తా. శిష్యా ! జడివానలోబడే వడిగల్లుకు, దాని శకలమునకును ఒకటేరూపై, ఒకదాని నొకటి విడచియుండవు. ఆలాగుననే మనమిద్దర మొక గడియయైనా నొకరికొకరము విడచి, యుండజాలము. బెల్లము, మాధుర్యము, వేరువేరుగా గనుపించునా ? కనుపించవు, ఆ ప్రకారమే మనమిద్దర మొకటేననిభావము.

క౦. తనుమనధనములుమునునా। కొనరగనపేక్షించినితరకోరికలేక ।
ధనమొసగి మరలనిచ్చిన । ధనము నపేక్షించనీకు ధర్మమేనట
రా । నీతనుమనధన మెవరోగనరా । కనికనినీకొక్కతృణమైన
నీకిచ్చె - దను కానాకొకటున్నాదని పలుకనీకిదిధర్మమేనటరా ।
నీతనుమనధనమెవరోగనరా. 36

తా. శిష్యా ! మొదట నీతను, మన ధనములు నాకు గురు దక్షిణగానిచ్చి, యేకోరికలులేక యుండి, యిచ్చినధనమును కోరుట నీకు ధర్మమేనా ? నీయొక్కతను మన ధనములెవరో కొంచెమాలో

చింపుము. నిన్నుచూచి పాపమని తృణమైనా నేను శిక్షిచ్చేవరకు, నాకోకటున్నదని నీవనుకొనుట న్యాయమేనా ? న్యాయముకాదనిభా.

కం. మనపరమరహస్యార్థము ! కనుగొనవ లెననుచు సాధుకంటకులె
పుడుఁ । కనిపెట్టియుందురేమో । కనిపెట్టియు(బ్రతుకునన్నుఁ కన్న
కుమారా । కనుగుట్టుగకడ తేరిపోరా । ననునీవువిడుచుట నినునేను
మరచుట । కనురెప్పపాటులోగని హసింతురునన్నుఁ కన్నకుమారా
కనుగుట్టుగకడ తేరిపోరా.　　౩౭

తా. చిన్నికుమారా ! మనరహస్యార్థము తెలిసికొనవలెనని సాధుజనకంటకులైన దుర్మార్గులు కనిపెట్టి యుందురు. అటువంటి వారికి తెలియకుండ కడతేరిపొమ్ము. నీవు నన్ను విడచిపెట్టినను, నేను నిన్ను మరచినను వారు నిమిషమాత్రములో కనిపెట్టి నన్నుహేళనజేయుదురు. గాన జాగ్రతతో నుండుమని భావము.

కం. పుట్టనిగిట్టనియచలపు । నట్టడవినితిరుగువాని నమ్మికమనిచే । ప
ట్టితివిగానచెప్పిన , మట్టుకువిని పెట్టి నంతమట్టుకేతినరా । నన్నిక
మీదరట్టుసేయకురా । పట్టువిడువకచచ్చినట్లు బడియుండుమీ
గుట్టుతనువికపోయ్యేమట్టుకీ దేవట్టుమట్టుకేతినరా । నన్నికమీద
రట్టుసేయకురా.　　౩౮

తా. శిష్యా ! జన్మమరణములు లేని, పరిపూర్ణమహదారణ్యమధ్యను తిరిగే నేను మహానమ్మికమని నన్నాశ్రయించి, నాచెంత చేరితివి, గనుక నేనుచెప్పిన మట్టుకువిని, పెట్టినమట్టుకు తిని, యనగా నేను బోధజేసినవరకు గ్రహించి, నీకు నేనిచ్చిన పరిపూర్ణానందము ననుభవించుచు, నీమూలములేని శరీరము పొయ్యేవరకు చచ్చినట్టు పడియుండుమని భావము.

శ్రీగురుకటాక్షములేక పరిపూర్ణసాక్షాత్కారముగలుగదు.

కం. గురుడెరుకపరచిచూపిన । పరిపూర్ణముక్షణములోన బట్టబయల
గుఁ । గురుడెరుకపరచకుండిన । పరిపూర్ణము తనకునెటులబట్ట

బయలగురా । బయ లెరుగాని దెరుక కాదటరా । గురుహా స్తమి
శితసత్పరిపూర్ణ రత్నము । గురుకృపగలిగితే గురుడే గు ర్తెరిగించు
బట్టబయలగురా । బయ లెరుగాని దెరుక కాదటరా. 39

తా. శిష్యా ! సద్గురుమూర్తి శిష్యునకు పరిపూర్ణమిట్టి
దని బోధించి, కనుపరచినట్టయిన, నిమిషములో బట్టబయలుగా దెలి
యుచున్నది. గురుమూర్తి కనుపరచకపోతే తనకు పరిపూర్ణ మెట్లు
తెలియును ? తెలియదు. పరిపూర్ణ మెరుగనిది ఎరుకే గదా ! గురు
రాయుని యధీనములోనున్న పరిపూర్ణరత్నమును, వారి యనుగ్రహ
ముగలిగిన వారే గుర్తెరిగించెదరని భావము.

కం. చక్కెరమాధుర్యమురుచి । మెక్కనివరు లెరుగనటుల మేల్కనలే
కనే । చిక్కనిదక్కనిమిక్కిలి । టక్కరిసేతలకు ముక్తితాయిగ
న్పడునా । చదువులవలన తిక్కలణగునా । చక్కనిగురుబోధనె
క్కువవినకున్న । దక్కునేపరిపూర్ణ మక్కమలభవుకైనతాయిగ
న్పడునా । చదువులవలన తిక్కలణగునా. 40

తా. శిష్యా ! శర్కర నెన్నడును తినని వారికి చక్కెరమాధు
ర్యము తెలియదు. అటువలెనే పామరులు గురుమూర్తికి పరిచర్యలు
చేసి బోధనుజెందుటకు పాలుమాలి టక్కరిగా అనుభవము లేకుండా,
నూరికి గ్రంథములుచదివిన మాత్రమున నే పరిపూర్ణసుఖముగలుగునా?
చదువులవలనతిక్కలణగునా? అణగవు. గురుబోధచక్కగా వినకుంటే
బ్రహ్మదేవునకైనను పరిపూర్ణమును దెలియుటకలవిగాదని భావము.

కం. నదినీదు కాంక్షచేనరు । డొదలకదరిజేరినోటనొదరిన నగునే । అ
దురునుబెదురునులేకను । పదపడినట్టేటిమీద పడితానీదకనూ ।
యీ దెటివారిగదియకెట్లగునూ । యిదెవినముగురుచేత మొదలె
రుగకతన । మదిచమత్కృతి బ్రహ్మపద మెట్లు సాధించుబడితానీద
కనూ । యీ దేటివారిగదియకెట్లగును. 41

తా. శిష్యా ! ఈతగొట్టుటకు నేర్చుకొనవలెనని ఇష్టముగల వారు నదియొడ్డున జేరి, యీతమాకురావలెనని యెంతసేపు గోరినను యీతయెట్లువచ్చును ? ఈత నేర్చినవారిని నదిలోదించి, భయములేకుండా, వారితోకూడా, నట్టేటిలో చేతులతో నీదకుంటె యీత రానేరదు. ఇదేవిధముగా నచలగురువులను సేవించి, పరిపూర్ణభావమును గ్రహించవచ్చునేగాని, యితరగురువులనగా యేకకభావము నొందినవారి వల్లను, తమ తమ చమత్కారము వల్లను, నచలబోధను పొందనేరడని భావము.

కం. వినుముపనయనవిహీనుడు । తనుముందుంగసంధ్యనేర్చి తద్విధిన ల్పే । పనిలోశాశ్చర్యమునా । మనుజుని దాద్విజుడటంచుమహిలోనెంచుదు రే । చంచలవృత్తిగనినహించుదు రే । తనుశూద్రజేలిజముతనవిద్యవిపరీత । జనవాడికగుయోగిజనులతో సరియగునేమహిలోనెంచుదు రే । చంచలవృత్తిగని నహించునురె. 42

తా. శిష్యా ! వుపనయనముకానిదే సంధ్యావందనము నేర్చుకొని, సంధ్యవార్చిన వానిని బ్రాహ్మణుడని చెప్పుదురా ? వాని చపలత్వమును గురించి సహించెదరా ? వానిని శూద్రునిగానే చూచెదరు. ఈ విధముగానే సద్గురుని వలన, నుపదేశము బొందకనే, తానాయుపదేశమునకు మీాదిభానము నెరిగిన, నది మిగుల విపరీతమగునేగాని, తెలిసినవాడు కానేరడు. అట్టివాడు చపలుడనబడును. అట్టి కపటాత్ముడు సాధులతోటి సాటిగాడని భావము.

కం. తనకఖిల వేదవిద్యా । ఘనబలచాతుర్యమెంత గలిగినగురునా । ధునిమహాదుపదేశములో । విననేవిననట్టివాని విద్యనిల్వదురా । తెలియనిజ్ఞానమేధలెందుకురా । మునువర్షబిందువులనుపొంద శిలమీా । దనుబడిపారలిపోయినగతి తద్బోధవిద్యనిల్వదురా । తెలియనిజ్ఞానమేధలెందుకురా. 43

తా. శిష్యా! బండమీఁద నెంత వర్షము గురిసినా, నీరు నిలువక జారిపోవు విధమున, దానెంత చతుర్వేదములు చదివినా, నెంత బలచాతుర్యముండినా, సద్గురుమూర్తివలన నుపదేశము పొందని వాని విద్య నిల్వదు. తెలియని జ్ఞానచాతుర్య మెందుకు? యేమిన్ని ప్రయోజనము లేదని భావము.

సర్వసాధుకోట్లకు సద్గురుకటాక్షము ప్రాముఖ్యముగా దెల్పుట

కం. హరిహరబ్రహ్మేంద్రసురా। సురకిన్నరసిద్ధసాధ్య సుజనాళులలో। గురుకారుణ్యము నొందని। పురుషుండొకడైనకలడే పూర్వకాలమునా। గురుమహి మెరుగతరమే లోకమునా। గురిమీఁరయఖిల చరాచరకోటులు। గురుడేసర్వాధార గురుడనుచు గొలచిరి పూర్వకాలమునా। గురుమహిమెరుగతరమే లోకమునా. 44

తా. శిష్యా! పూర్వకాలమందు విష్ణుమూర్తి, ఈశ్వరుడు, బ్రహ్మ, యింద్రాది దేవతలు, రాక్షసులు, కిన్నరులు, సాధ్యులు, మొదలగు సుజనులు గురుకటాక్షము బొందని వారొక్కరైననులేరు. గురిచే, చెరాచరకోటులెల్లను గురుడే సర్వాధారమని, సద్గురుని సేవించి కృతార్థులైరి. లోకవాసనచే నుండువారికి, గురుమహిమ తెలియుటకు సాధ్యమగునా? సాధ్యము కాదని భావము.

కం. జననీజనకులమూలము। గనుగొనగురుయోగ కళలుగావేతన కుక్షి జననప్రభృతులజరిగే। పలిపలిలోబోధచేసి ప్రబలెశ్రీగురుడూ। నినువిడచియేదినమున్నాడతడూ। వినుబాల్యమోహాయవ్వనవయోవృద్ధనం। తనలతద్బోధోపరతిగురుశిష్యులై ప్రబలె శ్రీగురుడూ। నినువిడచియేదినమున్నాడతడూ. 45

తా. శిష్యా! నీతల్లిదండ్రులమూలము విచారించగా, గురుకళలే గాని, వేరుకాదు పుట్టుక మొదలు జరిగే కార్యకోటులలో, నీలోనేయుండి, నిన్నెడబాయకుండా, బాల్య, యవ్వన, కౌమార,

వార్థిక, దశలయం దేనేకాలమం దేయేబోధ జేయవలెనో, ఆయా కాలములయం దాయాబోధ జేయుచు, గురుశిష్యులై, సదా నీతోనే యున్నాడు గాని, నిన్ను విడచియుండలేడని భావము.

కం. నీమనమున నేటికిగురు । దేవునిగనుగొంటిననుచు తెలియని మోహా । భ్రామికపీడునే నెపుడును । స్వామిగనే మేలగ లేదే సర్వాస్వరూపములా । సాధకబోధనసత్కాలాపములా । నామరూప క్రియలే మోవేరగుగాని । యీమహిమ లెరిగినన్నే మరక పూజించు సర్వ రూపములా । సాధకబోధనసత్కాలాపములా. 46

తా. శిష్యా! నేటికి గురుమూర్తి దర్శన మాయెను. నేను కృతార్థుడనయ్యెదననే తెలియని భ్రమను విడిచి పెట్టుము, సర్వకాలములయందు, సర్వస్వరూపములచేత, సాధకములచేత, బోధచేత నేను మెలగుచుండలేదా? పేరు, రూపము, క్రియలు వేరుగా తోచును గాని, యేకానకు నేనేకదా, ఇన్నివిధములచేతనుండువాడను, యీ మహిమ చక్కగా తెలిసికొని, నన్నే మారకుండా పూజింపుచుండుమని భావము.

గురుకటాక్షముకొరకు చతుర్విధ బాహ్యాంతర శుశ్రూషలొనర్చు క్రమము.

కం. గురుకులవాసము సేయుచు । గురుగృహమున సర్వకార్యకోటుల నెల్లన్ స్థిరముగ జరుపుచు బాహ్యత । గురుమదిసంతోష పరచుకొనుటాత్మనిష్ఠా । యిదె స్థానశిశ్రూషసన్నిష్ఠా । గురుసర్వసత్కార్యపరిపాలకాధార । పరుడై నిరతమునాత్మగురుని సమ్మతిపరచుకొనుటాత్మనిష్ఠా । యిదే స్థానశిశ్రూషసన్నిష్ఠా. 47

తా. శిష్యా! సద్గురుమూర్తి యుండు వింట పలుమారుండుచు, గురుని యింటి యందలి కార్యముల జరుపుచు, గురుసంబంధమైన సర్వ సత్కార్యములు నెరవేర్చుటయం, దాధారభూతుడవై,

ఆత్మనిష్ఠచేత గురునిమనస్సు, సంతోషపరచుచుండుట, బాహ్యస్థాన పరిచర్యయని భావము,

అంతస్థానపరిచర్య.

కం. పరమార్థదేశికునిచే । పరమాణుప్రభృతి బ్రహ్మపర్యంతమునం ।
స్ఫురణాను రాగద్రష్టా । వరణముగనుటంతరంగ వైభవనిష్ఠా ।
యిదెస్థానశిశ్రూషప్రతిష్ఠా । పరిపూర్ణసభ్భక్త పరవశమునదీని ।
నెకుకమరపులులేక నరయుటంత రాత్మవైభవనిష్ఠా । యిదెస్థానశి
శ్రూషప్రతిష్ఠా. 48

తా. శిష్యా! గడ్డిపోచ మొదలు బ్రహ్మపర్యంతం, కంటికికను
పడే యావత్తు సద్గురురూపమేనని, గురునిచే దెలసికొని, అంతరంగము
నందిది పదిలపరచికొని, పరిపూర్ణభక్తిచే నెల్లకాలము, మొకకమరు
పులు లేక, గురురూపమైన పరిపూర్ణబ్రహ్మమును సేవించుటే, అం
తస్థానపరిచర్యయని భావము.

బాహ్యాంగపరిచర్య.

కం. గురునకుశయనాసనసుఖ।పరిమళచందనసుపుష్ప పరమార్చనలిం ।
పరయగమజ్జనభోజన । పరిచర్యలుదానొనర్ప ప్రబలుప్రతిష్ఠా । ఇ
దెబాహ్యాంగశిశ్రూషనిష్ఠా । గురుగర్భజనితసద్వరపుత్రాదులనెల్ల।
మరిపించియుపచారసరణిజరుపుచునిలవ ప్రబలుప్రతిష్ఠా । ఇదెబా
హ్యాంగశిశ్రూషనిష్ఠా. 49

తా. శిష్యా! సద్గురునకు పడక, పీఠము, సువాసనగలచంద
నము, పుష్పములు, స్నానము, భోజనాదుల తృప్తిపరచుచూ, కాళ్లు
చేతులు పట్టుచూ, గురుగర్భవాసమందు పుట్టిన పుత్రాదులను మరి
పించి, పరిచర్యచేయుచుండుటే బాహ్యాంగ పరిచర్యయని భావము.

కం. పరతత్వవిలోకనమున । హరిహరవిధిసూర్యచంద్రఅనలామరభూ
చరఖేచరబ్రహ్మాండము । పరదేశికుఁడోశమనుచు ప్రబలుప్రతిష్ఠా ।

అంతరాంగశిశ్రూషనిష్ఠా । స్థిరమాత్మదృష్టి గోచరమెంతవరకూ ను । స్ఫురణించునదె బ్రహ్మగురురూపమనుచును ప్రబలుప్రతిష్ఠా అంతరాంగశిశ్రూషనిష్ఠా. 50

తా. శిష్యా! పరిపూర్ణదృష్టిచే, బ్రహ్మ, విష్ణు, రుద్రాదులు, సూర్య, చంద్రా, అగ్నులు, దేవతలు, భూచరులు, ఖేచరులు, బ్రహ్మాండము, యావత్తును, యింతయెందుకు, ఆత్మదృష్టి యెంతవరకువ్యాపించుచున్నదో, అది యంతయు శ్రీగురురూపమని అంతరంగమందు స్థిరపరచుకొని, సేవించు చుండుటే అంతరంగపరిచర్యయని భావము.

బాహ్యభావపరిచర్య.

కం. గురుడేతల్లియుతండ్రియు । గురుడేయిలవేల్పు బంధుకోటులు నెల్లన్ । గురుడిహపరదైవంబని । నిరతముభావించు టాత్మనిజబాహ్యనిష్ఠా । ఇదెభావశిశ్రూషప్రతిష్ఠా । కరణత్రయము లేకసరణిజేసియాత్మ । గురుసేవలోనబహు గురిగలిగిమెలగుట నిజబాహ్యనిష్ఠా । ఇదెభావశిశ్రూషప్రతిష్ఠా. 51

తా. శిష్యా! గురుడే తల్లియు, తండ్రియు, యిలవేల్పు, బంధుకోటి, యిహపరదైవమని మనస్సున, భావించి, మనోవాక్కాయకర్మములచే నెల్లపుడును, గురుసేవయందు గురిగలిగి యుండి. సద్గురుడు భావమున దలచిన వస్తువును శక్తికొలది దెచ్చి సమర్పించుటే బాహ్యభావపరిచర్యయని భావము.

అంతర్భావపరిచర్య.

కం. గురుముఖసూచనచాతను । గురువరవాక్యార్థనిగమగోప్యంతర్భాసురబ్రహ్మకళయుతానని । నిరతముభావించుటాత్మనిఖిల ప్రతిష్ఠా అంతర్భావశిశ్రూషనిష్ఠా । తరగులేనియోగగురుతుగో పరిపూర్ణ । గురుపరాత్పరురూపమరిసి తాననుటాత్మనిఖిల ప్రతిష్ఠా । అంతర్భావశిశ్రూషనిష్ఠా. 52

తా. శిష్యా! గురుమూర్తి సూచనసేయగానే బ్రహ్మకళను దర్శించి, ఆకళయే పరిపూర్ణ పరబ్రహ్మమనియు, ఆపరిపూర్ణబ్రహ్మమే తానని యు భావమున నిశ్చయించుకొని యుండుటే అంతర్భావపరిచర్య యని భావము

బాహ్యాత్మపరిచర్య.

కం. గురుమతమాత్మప్రియముగ । గురుతరపరమాత్మ ప్రియముగురురూపంబా । పరికింపననుచు క్రియలం । దిరిగెటిదీయాత్మయనే దేక ప్రతిష్ఠా । ఇదె బాహ్యాత్మశుశ్రూషనిష్ఠా । గురునాకు ప్రియుమే దోనెరిగి కార్యకోటి । జరుపుచు తానిహపర సౌఖ్యమందుటయేక ప్రతిష్ఠా । ఇదెబాహ్యాత్మశుశ్రూషనిష్ఠా. 53

తా. శిష్యా! గురుమతమే తనకు ప్రియముగాతలచి, గురురూపమే పరమాత్మస్వరూపమని, సర్వకార్యములయందు గురుమూర్తిననుసరించి వారి మనోభావమును గుర్తెరిగి, సర్వకార్యములు జరుపుచు, తాను యిహపరసుఖము పొందుటే బాహ్యాత్మ పరిచర్య యని భావము.

అంతరాత్మశుశ్రూష.

కం. పరమాత్మకుపరమాత్మే । పరమాప్తముగానెపుడు పరభావల నా । దరణమొనర్చక వెలిలో । పరిపూర్ణోహంబటంచు ప్రబలు ప్రతిష్ఠా । అంతరాత్మ శుశ్రూషనిష్ఠా । పరమాత్మచైతన్యపర తతనలోతానే । పరనిష్ఠతోలగక పరమప్రీతినొంది ప్రబలుప్రతిష్ఠా అంతరాత్మశుశ్రూషనిష్ఠా. 54

తా. శిష్యా! సద్గురుబోధచే జూపబడిన పరమాత్మ గుర్తై పరిపూర్ణముగనుక వెలిలో నేనేపరిపూర్ణమని, గురునిచే నెరిగి, యే భ్రాంతులును లేనివాడై, యీలోకసంఘాతమును విడచి, లోకాతీతమైన పరిపూర్ణమే తానై యానందించుచుండుటే అంతరాత్మశుశ్రూష యని భావము.

బాహ్యనిష్ఠ అంతర్నిష్ఠకుసాధన.

కం. ఈసాధనబలసంపద । లోనముచితబాహ్యక్రియలలో మెలగుచు
తా । నాసక్తిగవర్తించుట । భాసురమంతర్విహారపరశుశ్రూష
లకూ । సాధనలగుచుసౌఖ్యమొసఁగుతుదకూ । దాసభావములోనవే
సాటనొందక । దేశికేంద్రునికాత్మోల్లాసముగను జేయుపరశుశ్రూ
షలకూ । సాధనలగుచుసౌఖ్యమొసఁగుతుదకూ. 55

తా. శిష్యా! ఈప్రకారము సద్గురువునకు బాహ్యపరిచర్య లోనర్చుచు, ధ్యానముచేయుటలో విసుకు జెందకుండా నాసక్తిగ నుండుటవలన, నీబాహ్యశుశ్రూషలంతర్నిష్ఠకు సాధకములై తుదకు పరిపూర్ణసుఖమును గలిగించునని భావము.

కం. వెలుపలగురుశుశ్రూషలు । సలుపకనాంతర్యబోధ సాధనలందన్
దలచెటిజడునకుజ్ఞానము । కలుగుననేవార్తవ్యర్థ కలగాదాతండ్రీ ।
పై వలపులు నిలుచునేతండ్రీ । యిలహాటకములేక కలుగునేభూ
షణ । మలవడగురుభక్తిసలుపని ఫలమటులకలగాదాతండ్రీ ।
పైవలపులునిలుచునే తండ్రీ. 56

తా. శిష్యా! వెలుపలగురుశుశ్రూషలు చేయకుండా అంతర్య బోధయనగా పరిపూర్ణబోధ జెందుదమని తలచే దుర్మార్గజడునకు జ్ఞానము కలుగు ననుమాట కల్లోవార్తగాదా? పై తలపులు నిలుచునా? బంగారములేకుండా నాభరణము లొచ్చునా? అట్టి మందమతికి పరమజ్ఞాన మెన్నటికిని గలుగనేరదు. గురుభక్తి సలుపనిది నిష్ఫలమని భావము.

అఖండగురుసేవావిధానము.

కం. పరమగురుడనుచునిహపర । వరసాధకుడనుచునాత్మ పరిపాలకన।
త్పరిపూర్ణుడనుచు కేవల । పరమేశ్వరుడనుచుబ్రహ్మభావజ్ఞుడనుచూ
పరమానంద భరితుండగుననుచూ। నరుడిష్టదైవముకరసిపూజను జే

యు । కరణినాదరణ నీధరణిగురుపూజించు భావజ్ఞుడనుచూ । పర
మానందభరితుడగుననుచూ. 57

తా. శిష్యా! పరమగురుడనియు, యిహపరగతులకు సాధన
భూతుడనియు, ఆత్మను పరిపాలించు పరిపూర్ణుడనియు, పరమేశ్వరు
డనియూ, బ్రహ్మస్వరూపుడనియు, పరమానందమయుడనియు, భావించి
నగుడిష్ట దేవునకు పూజసేయునట్లు గురుపూజ సలుపవలయునని భా.

కం. గురువరపరచరణద్వయ । సరసీరుహములను జెలగి సర్వనదీసా ।
గరతీర్థమహిమగలదను । గురుగీతార్థంబు నెరిగి గురుపాదజలమూ।
స్నానము సేయగలుగుతత్ఫలమూ । గురుపాదోదకధారాపరిపూర్ణా
భిషిక్త । పరునిపదసంస్పర్శధరణీపావనమగుగురుపదజలమూ। స్నా
నము సేయగలుగుతత్ఫలమూ. 58

తా. శిష్యా! సద్గురుని పాదారవిందములకు సర్వపుణ్యన
దులు, సాగరములు, సరికావనే గురుగీతల భావమును తెలిసికొని,
గురునిపాదజలము స్నానము జేయ దానిఫలము గలుగును. గురుపాద
జలములధారచే పరిపూర్ణ రాజ్యాభిషిక్తుడైన పావనుని పాదస్పర్శ
చేత ధరణి పావనమగునని భావము.

కం. గురుచరణతీర్థములతో । సరియగునే యితరపుణ్య జలపానము
లున్ । గురుచరణధూళిధారణ । కరయగసరియగునె కోటియధ్వ
రములెల్లా । సత్కృత్యసాధనతపము లెల్లా , గురుగృహవాసముక
రయగహరిహర । పురనివాసములై ననరిగతూగజాలునే యధ్వ
రములెల్లా । సత్కృత్యసాధనతపములెల్లా. 59

తా. శిష్యా! యెన్నిపుణ్యనదులజలము పానముజేసినను, సాల
గ్రామరాళ్ళు కడిగిన నీళ్ళు యెన్ని త్రాగినను, గురుపాదతీర్థములతో
సమానమగునా? సమముకావు. యజ్ఞయాగాదికృత్యము లెన్నిచేసి
నను గురుపాదధూళిని శిరస్సున ధరియించిన దానితో సమమగునా?

సమము కాదు. హరిహరాదుల నివాసములు సద్గురుమూర్తి నివసించుచోటుతో సమానమగునా ? సమానములు కావని భావము.

కం. గురుభుక్తశేషభోజ్యము । గురుమూర్తిధ్యానమాత్మ గురుపుత్ర ప్రభా । కరకోటితోటిసఖ్యము । పరిపూర్ణసమాధికివియే పట్టుకొమ్మలురా । గురుదేవుచేగురు తెరుగవలెరా । గురుసేవలోతానుపరిపూర్ణజయభేరి । కరణిమెరసిన జన్మకడతేరుటకునివియే పట్టుకొమ్మలురా । గురుసేవచే గురు తెరుగవలెరా. 60

తా. శిష్యా! శ్రీసద్గురుని భుక్తశేషభోజ్యము గురుమూర్తిని ధ్యానించుటయు, తనగురుపుత్రులతోటి సహవాసము, యివి పరిపూర్ణసమాధికిపట్టు కొమ్మలు, ఈసంగతి గురుమూర్తిచే తెలిసికొనవలెను. గురుసేవయందు పరిపూర్ణత నొందుటే కడతేరుటకు సాధనయని భావము,

కం. గురుమందిర మొకకాశీ । పురమని గురుపాదజలముపుణ్యానదీనం । చరజలముగురుడెసాక్షాత్పరమేశ్వరుడంచుభక్తి చేతనుడాసీ । గురినుతిజేసిగురితానుదెలసి గురుమంత్రపఠన శ్రీగురుతారకంబని । పరిపూర్ణకైలాస పదవినొందుముపుత్రాభక్తిచేడాసీ । గురినుతిజేసి గురితానుదెలసీ. 61

తా. చిన్ని కుమారా! గురునివాసమొక కాశీపట్టణమనియు, గురుపాదోదకము పుణ్యగంగోదకమనియు, గురుడే సాక్షాత్పరమేశ్వరుడనియు, గురుడుచెప్పిన మంత్రపఠనే తారకమనియు, భక్తిచే నుతిజేసి పూజించి, గురిచే నచలపరిపూర్ణ కైలాసపదవిని బొందుమని భావము.

గురు ఋణప్రభావము.

కం. గురుమూర్తికరహంబుల । పరిచర్యలొనర్చిశిష్య పటలములాత్మా । దరణతతనుమనధనముల । నరయగనర్పితము జేసి రనుమా

టతోనే । గురురుణమంతటితోనరిపోనే । వెరువకకడజిక్కు ము
రికితనుసేవల.। స్థిరపూజాద్రవ్యసత్సరికరముల నొసగిరనుమాట
తోనే । గురురుణమంతటితోనరిపోనే, 62

తా. శిష్యా! గురుమూర్తికి నెల్లప్పుడును పరిచర్యలుజేసి, శిష్యులు తనుమనోధనము లర్పించిరనే మాటతోనే గురురుణము తీరునా? తీరదు. కడపటజిక్కినమూలములేని మురికి శరీరమునకు సేవలుజేసి పూజాద్రవ్యాదులర్పించినారను మాటతోనే గురురుణము తీర్చుకొనజాలరని భావము.

కం. గురురుణముతీర్ప శిష్యుల । తరమగునేజన్మజన్మతరతరములను ।
ప్కారప్రారబ్ధప్రపీడిత । పరితాపముదీర్చి బ్రహ్మపదమునజేర్చ్యా ।
గురురుణమెటులగురుతెరిగితీర్చ్యా ॥ స్థిరముగతనుకడతేరు యాఖరు
జన్మ ॥ తరుణములోదీనినరిపుచ్చు ఔట్లాగొపదమునజేర్చ్యా । గురు
రుణమెటుల గురుతెరిగితీర్చ్యా, 63

తా. శిష్యా! శిష్యులయొక్క ప్రారబ్ధసంబంధమైన పరితాపమును బోగొట్టి గురుమూర్తి శిష్యులను బ్రహ్మపదమున జేర్చుచున్నాడు శిష్యుల జన్మాంతరములకైనను, గురురుణము తీర్చగలరా? తీర్చజాలరు, తాను కడతేరే ఆఖరు జన్మములోనైనా రుణముతీర్చుకుందామంటే ఆరుణమింతయని పరిమితిలేనందున తీర్చుటకు శక్యముకాదని భావము.

కం. ధరన ప్తకోటిజన్మాం । తరములుపరికింపగురుచిదాత్మకరుణసా ।
గరమునబడిపొరలుచుజల । చరమేటిగశిష్యకోటిజరియించుగానీ ।
శిష్యులుతీర్చే తెరగులేదవనీ । వరునసాగరమెంతవడితృష్ణగొన్నజల
చరకోటిజేసునే మరల ప్రత్యుపకృతీజరియించుగానీ । శిష్యులు
తీర్చే తెరగులేదవని, 64

తా. శిష్యా!సముద్రము జలచరములకునివాసమైయున్నది. సము ద్రమెంత దాహముగొన్నను జలచరములు ప్రత్యుపకారముచేయజాల

నటుల శిష్యులు సప్తకోటి జన్మాంతరములకైనను సద్గురుమూర్తి కరుణాసముద్రమునబడి జలచరములవలె చరియించవలసినదే కాని శిష్యులు గురురుణము తీర్చుకొనజాలరని భావము.

పరిశుద్ధబోధానక్తలక్షణము.

కం. గురుమంత్రము చెవిసాటిన । తరువాతనుజన్మవిడచి తనుమరణించే । పరియంతముతద్బోధో । పరతిన్ సుఖయించునతడు బ్రహ్మవిద్వరుడూ । శాశ్వితభోగపరుడు చిన్మయుడూ ॥ పరిపూర్ణరవికిరణపరివేషమధ్యను । స్థిరజ్ఞానభాస్కరపరి శుద్ధుడై వెలగు బ్రహ్మవిద్వరుడూ । శాశ్వితభోగపరూడూ చిన్మయుడూ, 65

తా. శిష్యా! సద్గురువు మంత్రము నుపదేశముచేసిన తర్వాత శరీరమంత్యమయ్యే పర్యంతరమున్ను బ్రహ్మవిద్వరుడు గురుబోధోపరతినిమరిగి శాశ్వితపరిపూర్ణభోగము ననుభవించు చుండును. వాడుస్థిరమైన పరిపూర్ణజ్ఞాన సూర్యుడై ప్రకాశించుచుండునని భావము.

క. రమణికి మంగళసూత్రము । రమణీయంబెటులనటుల రయమున నాత్మ । క్రమమెరుగు శిష్యవరునకు, స్తిమితంబగు నచలబోధ శృంగారమా ॥ । వానిచర్య బంగారమారా । గంగాయమునల మహిమకంగుజలము లెకాదా । సంగీతమునకు కంఠస్వారస్యమేము ఖ్యశృంగారమారా ॥ వానిచర్యబంగారమారా, 66

తా. శిష్యా! స్త్రీకి, మంగళసూత్ర మెటుల నలంకారమో నటువలెనే నాత్మజ్ఞానమెరుగు శిష్యునకు స్థిరమైన నచలబోధశృంగారము వాని చర్యలు మహోయింపుగా నుండును. నదులకు జలమున్ను సంగీతమునకు కంఠస్వారస్యమును నెంత శృంగారమో అట్లే బుద్ధిగల శిష్యున కచలబోధశృంగారమని భావము.

పరిపూర్ణశుద్ధసాధుప్రవర్తన.

కం. పరిపూర్ణ బోధజెందిన । నరుడితరులస్తోత్రములను నాదనడెవుడున్ । పరనిందెలకనునలగడు । పరసంభాషణము చెవులబట్టితా వినడూ ।

హరిమిత్ర సంకరములబడడూ। పరులుతానను భ్రమపరుగులు బా రడు। ధరకలిమిలేముల కరుడండడిక మనసుబట్టితావినడూ। అ రిమిత్రసంకరములబడడూ, 67

తా. శిష్యా! గురునిచే పరిపూర్ణబోధ జెందిన సత్పురుషుడిత రులుతననుస్తోత్రముచేయ సంతసపడడు పరులు తనను దూషించినకోప పడడు యితరులమాటలను కావలెనని వినడు, శత్రులనియు మిత్రుల నియు భేదముంచడు తానని నితరులని భ్రమనుంచడు కలిమిలేము లోకరీతిని జూచునని భావము.

కం. తరుణులు సిరిశ్రీవరులును। పరిచరులరిమిత్రబంధుజలవర్గములున్। పరిపరివిధములతనుగని। పరిహాసముచాయబుధుడు పరితాపపడ డూ। ప్రస్తుతిసేయ పరవశుడుగాడూ। మరులుకొనిసేయ డభి మానకార్యములెపుడు। మనవడునిజబోధ సరణీవిడువడునాత్మ పరితాపపడడూ। ప్రస్తుతిసేయ పరవశుడుగాడూ, 68

తా. శిష్యా! స్త్రీలు, సంపదగలవారు తనకుపచారముచేయు వారు, శత్రులు, మిత్రులు, బంధువులు మొదలగు వారనేకవిధములు గాతనను పరిహాసము చేసినను బ్రహ్మవేత్తపరితాపము జెందడు పొగి డితే సంతోషపడడు, కార్యములు మరులుకొని చేయడు తాను సద్గు రునిచే పొందినపరిపూర్ణ బోధనుమరువడని భావము.

కం. నళినీదళమునకనపడు। జలకణములరీతికలశజలమునరవిదీ। ప్తుల భాతికార్యములలో। చెలగియుతాచెలగనటులచెలగుసజ్జనుడూ। అంటియునంటడిలసర్వసముడూ। ఇలమృత్తికాటకము కేపులినమంట నియటుల। మెలగిప్రారబ్ధదుష్కలుషమంటకనెపుడు చెలగుసజ్జను డూ। అంటియునంటడిలసర్వసముడూ, 69

తా. శిష్యా! భూమియందు సర్వముండగా నుండు పరిపూర్ణ బోధజెందిన సాధువరుడు కార్యములు జరుపుటలో తామరాకుమీది

నీటిబిందువువలెను, కలశోదకమందు ప్రతిబింబించు సూర్యునివలెను, నంటియుంటక నుండును, కుమ్మరపురుగు బురదలో తిరిగిననుదానికా బురదయంటనటుల ప్రారబ్ధకలుషము నంటకుండునని భావము.

క. దినకరుడు సర్వరసములు తనుగ్రోలుచు తద్వికారతరసారములన్ । బెనగొనని కరణికేవల । ఘనతరపరిపూర్ణనిష్ఠగాంచు సజ్జనుడూ। విషయములంటియుంట డెల్లపుడూ । అనఘుడగ్నిహోతృడనిశము సర్వభ । క్షణగలిగినిర్దోషమున తేజరిలురీతిగాంచుసజ్జనుడూ। విషయములంటి యుంటడెల్లపుడూ. 70

తా. శిష్యా! సూర్యుడు భూమియందుండు సర్వరసములను పీల్చుకొనుచు నారసములయందలి మాలిన్యమును జెందునట్లును అగ్నిహోత్రుడు సర్వవస్తువులను భక్షించుచూ, నాదోషమును జెందనిరీతిగాను, పరిపూర్ణనిష్టజెందిన సజ్జనుడు విషయసుఖముల యందంటి యంటకుండ నుండునని భావము.

కం. పరపురుషాసక్తతగల । తరుణీమణినిజగృహోచిత క్రియలందున్। పురుషసుతసోదరాదుల । పరిచర్యలొనర్చ వేదాభావభేదముగా । అట్టి భావమెరుగుచోటదెగా । నిరుపమపరిపూర్ణ నిష్ఠవిడువనినరుని । పరగృహకృత్యమానరణిజగుచుండు భావభేదముగా । అట్టి భావమెరుగుచోటదెగా. 71

తా. శిష్యా! పరపురుషునియం దిష్టముగల స్త్రీ తనయింటి యందలి పనులెల్లజేయుచు తనభర్తకు, సుతులకు, సోదరులకు పరిచర్యలు జేయుచు పరపురుషునియందు మనసేలాగు పెట్టియుండునో అట్లే అచలబోధహొందిన యోగి యోపనులుజేయుచుండినను పరిపూర్ణనిష్టనొదలడని భావము.

కం. గానమునోటను బాడును । తానాడును నెడమకరముతగుచిటికెల చే । బూనుకకుడిహస్తముశృతి । చేసటుమీటుచునుదొంతిశిరము

నబెట్టూ । దానిమనసుచేబిగియబట్టూ । ఆనిలకగానేయూనానోపా
ధికకర్మ । తానుజేయుచు యచలజ్ఞానదృష్టిని నిలచి శిరమునబె
ట్టూ । దానిమనసుచేబిగియబట్టూ. 72

తా, శిష్యా! నోటితోసంగీతము బాడుచు తానాడును యెడమచేతితో చిటికెలు వాయించుచూ, కుడిచేతితో తంబురమీటుచు, తననిపుణత జూపుచూ, చమత్కారియగు నాట్యముచేయువాడు తన నెత్తిమీదనున్న దొంతరను కొంచెమైనా నేమరక చిత్తమునంతయు దానియందే నిల్పియుండుట లోకమున జూచుచున్నాము. ఇట్లే బ్రహ్మజ్ఞాని సర్వేంద్రియములతో సర్వవిషయముల ననుభవించుచున్నను తనపూర్ణ స్వరూపమును జూచుచునేయుండునని భావము.

క. తనుదానెరుగని మనుజుని । మనమతి చంచలముచేత మరలికదిరు
గున్ । తనుదాగనుపరసాధకు । మనమచలానందవార్ధి మగ్నమై
పోరా । తనలోమనముతానేకాదటరా । తన్నుదాగనుదాని మన
ముదహనజ్వాల । బెనగునింధనమగ్నికణజాలమగురీతి మగ్నమైపో
రా । తనలోమనముతానుకాదటరా. 73

తా, శిష్యా! ఆత్మావలోకనము చేయలేని వాని మనస్సు చంచలముచేత నిరోధింపబడక నటునిటు బరుగెత్తుచుండును, భ్రాంతికివశుడైనందున వాని మనస్సువానిని చిక్కులుబెట్టుచుండును, ఆత్మావలోకనముచేసి తనను తానుయెరిగిన మహాత్ముని మనస్సు అగ్నియందువేసిన కట్టె యగ్నియైనట్లు పరిపూర్ణానంద సముద్రమునందు మగ్నమై యుండునని భావము.

కం. కమఠమునిజదేహములో । నిమిడించును యింద్రియము లనేకినొక
వేళన్ । సమముగ స్వేచ్ఛవిహార । క్రమముగతనుసంచరించుకాల
కాలములా । నట్లనెనీవు సమయోచితములా । విమలయచలసర్వ
సముడై మనోనియమ । క్రమముగనిజవృత్తులమరనిగ్రహించుకాల
కాలములా । నట్లనె నీవు సమయోచితములా. 74

తా. శిష్యా ! తాబేలు తన యింద్రియములనెల్ల తన దేహ
ములో నిమిడ్చి నొకానొక సమయమునందు తాను స్వేచ్ఛగా సంచ
రించు వేళల నింద్రియముల వెలికి తోపజేయును. అట్లనే నీవును పరి
పూర్ణమందు వర్తించుచూ సమయోచితముగ వృత్తులను నిగ్రహించు
మని భావము.

కం. ఇలప్రాప్తదుఃఖసముదయ । ములకునుభయపడకనోర్చి సూహావి
తానా । జ్వలితయసంప్రాప్తసుఖా । దులుకోరినవాడెభువినిదుర్ని
రీక్షకుడూ । కాలత్రయములకులోబడడూ । లలిత దేహేంద్రియా
దులు నేనని యాత్మలో । పలనిలచివర్తించు సలలితానల యోగ
దుర్నిరీక్షకుడు కాలత్రయములకు లోబడడూ. 75

తా శిష్యా ! భూమియందు దా ననుభవించు దుఃఖములకు
భయమునొందక ప్రాప్తములేని సుఖములు మొదలైనవానిని గోరక,
దేహము, వాయువులు, యిందిౖయములు, చిత్తము, మనస్సు, బుద్ధి
యివియన్నియు, నేనని తన యాత్మలోరూఢిచేసుకున్నవాడు దుర్ని
రీక్షకుడనబడునని భావము.

చతిర్విధబ్రహ్మవేత్తలలక్షణము.

కం. వినుమానసదేహేంద్రియ । ఘనతరకర్తృత్వసహితగతుడై తద
పే । క్షనుగోరకఖిలసత్క్రియ । లొనరగ తాజేసిచేయనొల్లనటు
లుండూ । నతడొకబ్రహ్మవిదుడై తానుండూ । కనిచేసే పనులైన
తనయాత్మ సాధన । కనుకూలముగజేసి పనికిరానివి జేయనొల్ల
నటులుండూ । నతడొకబ్రహ్మవిదుడై తానుండూ. 76

తా. శిష్యా ! బ్రహ్మవిదుడు, బ్రహ్మవేత్తయయ్యును సర్వ
ప్రపంచంబును బ్రహ్మస్వరూపముగా భావించుచు, దేహేంద్రియాదు
లకుగల కర్తృత్వమును దనపై మోపుకొనక ప్రతిఫలమును గోరక
నిత్యనైమిత్తికకర్మలను జేయుచు, పుత్రమిత్రకళత్రాదుల యందు
వైరాగ్యము గలవాడయ్యును యదృచ్ఛాలాభముగా దొరికినధనము
తో వారిని పోషించుచుండెను. ఆత్మయందు తృప్తిజెంది ఆత్మస్వరూ

పావలోకనముచే సంతసింపుచూ నెన్ని కార్యములు చేయుచున్నను తనయొక్క స్వస్వరూపమైన పరిపూర్ణత్వమందే సర్వదానొప్పు చుండు నని భావము.

కం. ధ్యేయాధ్యేయ కృత్యములని । రాయూపతనన్యసించి రహిమీరగని ।
ర్వ్యాయామతనశరాద్ధోఁ । పాయుస్వకార్యములనెలగు పరమా
ర్థవిదుడూ । రెండవయోగబ్రహ్మవిద్వరుడూ । హేయాహేయా
కార్యమ్మాయామోహాది । దుర్వ్యాయామాదుల నెల్ల. డాయక
తావిడుచుపరమార్థవిదుడూ । రెండవయోగబ్రహ్మవిద్వరుడూ. 77

శిష్యా! రెండవవాడైన బ్రహ్మవిద్వరుడు లౌకికవైదికకర్మ ములవిడచిపెట్టి తనపోషణార్థమైన స్వకార్యమును మాత్రము జేయుచు శాంతి శమదమాదిగుణములపై వానితో సమానముగానుండి గుణా తీతలక్షణములు ప్రధానములై సర్వదాతన స్వరూపమైన పరిపూర్ణావ లోకనముచేయు చుండునని భావము.

కం. కార్యాకార్యములన్నిటి । నిర్యాణము జేసితుధనునిర్వేర్పుటకై ।
యార్యులు మేల్కొల్పినత । త్కార్యములను నెరుగు ఘనుడు కారం
ణాత్మకుడూ । మూడవబ్రహ్మవిద్వర్యుడితడూ । వారివీరిగనడువా
రిపేరులనడు । యేరీతిపరులనగనారీతిలాబలుకు కారణాత్మకుడూ ।
మూడవబ్రహ్మవిద్వర్యుడితడూ. 78

తా. శిష్యా! మూడవవాడైన బ్రహ్మవిద్వర్యుడు పైలక్షణము లతో నొప్పుచుండి, సర్వకాలములందు నిదురించువానివలె నిర్వి కల్పసమాధియందు నుండునుగాని, ఆయా వుచిత సమయములందు పెద్దలచే మేలుకొలుపంబడి తగినవరకు నాహారవిహారాదుల నంగీ కరించునని భావము.

క. పరిపూర్ణనిజానందా । పరిమితసుఖవార్ధిమునిగి పరహితస్వాత్మ ।
తరదృష్టివిడచి కేవల । పరమోత్సాహమునునుండు పరమసాధకు
డూ । నాల్గవబ్రహ్మవిద్వరిష్ఠకుడూ । ఘొరుక మరువులు లేక పరులు

తానన కయే । స్ఫురణదోచకనాత్మబరగునజగర వృత్తిపరమసాధకుడూ । నాల్గవబ్రహ్మవిద్వరిష్ఠకుడూ. 79

తా. శిష్యా ! నాలుగవవాడగు బ్రహ్మవిదర్విష్ఠుడు పైవారివలె గాక నెప్పటికిని స్వయముగా గాని పరులప్రేరణవల్ల గాని మేలుకొనక నెల్లప్పుడును పరిపూర్ణబ్రహ్మముకంటే వేరు గాక పరబ్రహ్మమే తానై ప్రపంచమును మరచి యజగరవృత్తిచే నుండునని భావము.

క. యీనలువిధజ్ఞానులలో । మానుగన పూర్వద్వయముమాగఁస్థితులన్ । దానమితములగు కర్మలుపూనినతమమదికిమిధ్యాభూతమైతోచూ । వర్యునకేమో లేనిదై నిలచూ । లేనిప్రారబ్ధమురానిపోనిదిగనుకలేనేలేదనినాల్గోజ్ఞానికిమరిమిధ్యా భూతమైతోచూ । వర్యునకేమో లేనిదై నిలచూ. 80

తా. శిష్యా ! ఈనలుగురిలో మొదటి యిద్దరికిని ప్రారబ్ధము కలదుగాని యిది శూన్యరూపమైయుండును, మూడవవానికి కొంచె ముండునుగాని యదిలేనిదే యగును నాలుగవవానికి బొత్తిగా ప్రారబ్ధము లేనే లేదని భావము.

క. అనుభవ మొకటిగయున్నను । ఘనయోగులవృత్తు లొకటిగానుండవునీ । వనవరతమాత్మదృష్టిని । గనువారలనటన లెపుడుకనిసించబోకుూ । అల్పాధికులనుచు పొరబడకూ । మనకువృత్తులతోటిపని లేదు పని లేదు । ఘనులదర్శించివందనము జేయు టెజాలుకనిసించబోకూ । అల్పాధికులనుచు పొరబడకూ. 81

తా. శిష్యా ! ఈ నలుగురు బ్రహ్మవేత్తలయొక్క యనుభవ మొకటేయైనను యోగులవృత్తులొకటిగా నుండవు నీ వెల్లప్పుడును వారి యాత్మమహిమను గనుగొందువేగాని వాండ్లను కనుపెట్టవద్దు ఇందులో నొకరు హెచ్చని నొకరుతగ్గని పొరబడెదవునుమా, పొరబాటు పడవద్దు మనకు వృత్తులతోటి పనియేమున్నది. అట్టి ఘనుల దర్శనముచేసికొని వారికి వందనము లాచరించుటే చాలునని భావము.

## ప్రారబ్ధత్రయనిరూపణము.

క. కారణగురుబోధాగ్నిచే । ధారుణి నాగామిసంచితాదులు రెండున్ ।
పేరణగిపోయె మూడవ । ప్రారబ్ధము దేహరీతి ప్రతిఫలించెనుగా। ఇది
ముందొక్కసారి బోవునుగా । ప్రారబ్ధమిక దగ్ధ పటన్యాయముగ దే
హా । ప్రారబ్ధమున్న నిష్ఫలమై నీకంటాదు ప్రతిఫలించెనుగా । ఇత
ముందొక్కసారి బోవునుగా. 82

తా. శిష్యా! సద్గురుమూర్తి కారణబోధాగ్నివలన నాగామి సంచితములు రెండును పేరులేకుండా బోయెను. మూడవదైన ప్రారబ్ధము శరీరముగా ప్రతిఫలించెను, ఇదిన్ని ముందున్నను పోయ్యేదే, యీశేష ప్రారబ్ధమైన శరీరమిక మీద కాలినగుడ్డవలెనే నిష్ఫలమగును యిది నీకంటదని భావము.

క. యెరుకను తనువును నొకపరి । విరివిగ తొలగింప రెంటి విధములు వే
ర్వే । రరయగ జననలయాది । స్ఫురణల చే భేదమనుచు శృతులుగ్గ
డించూ । కాల కాలసరణీజరియించూ । తిరిగే కాలములొక్క తెర
గేగాని వీటి। మరణసమయములొక్క తరిగల్గవని బుధులు శృతులు
గ్గడించూ । కాలకాలసరణీజరియించూ. 83

తా. శిష్యా! ఎరుక, శరీరముల భ్రమను నొక్కసారె తొలగింపవలయునని వాటిరెంటియొక్క విధములు వేరువేరుగా విచారించగా పుట్టుట గిట్టుట మొదలగు స్ఫురణలు భేదమని శృతులు చెప్పుచున్నవి పుట్టే కాలము గిట్టే కాలములయొక్క సరణియొక్కటేగాని వీటిమరణ సమయము లొక్కసారే గలవని, పెద్దలు చెప్పుచున్నారని భావము.

కం. జ్వాలానలసందీప్తవి । శాలమహారణ్యమందు జనవిహగవిష। జ్వా
లోరగమృగనివహము । చాలగ నచ్చోట నిల్వజాలని యటులా । పు
ణ్యాపాపగోళకమటులా । మేలుగ నీయచల శిలాగ్ని ప్రభ కెదుట ।
మూలమెరుగని భ్రమజాలాంధమెట్లుండు జాలానియటులా । పుణ్యా
పాపగోళకమటులా. 84

తా. శిష్యా! అగ్నిచేత దహింపబడుచున్న విశాలారణ్యమందు మనుష్యులు. మృగములు, పక్షులు, పాములుమొదలగు జంతుజాలములు, ఎట్లునిల్వలేవో నటువలెనే, పరిపూర్ణాగ్ని ప్రకాశమున కెను టమూల మెరుగని భ్రమయను చీకటెట్లుండును? వుండదని భావము.

జీవన్ముక్తునకు పునఃప్రారబ్ధసంస్మృతి కలుగదు.

క. శివజీవైక్యసమాధిలో । నవలీలంగలసిపూర్ణుఁడగు ధీరునకున్ ।
భవవిషయస్మృతిగలిగిన । తవులునె ప్రారబ్ధకర్మ తరువాత నెపు
డూ । పాలును పెరుగై తరువబడునపుడూ । కవగూరి వేరై నవనీత
కబళము । భువిచల్లగలసునేవివిధోపాయతఝూడ తరువాతనెపుడూ।
పాలునుపెరుగై తరువబడునపుడూ. 85

తా. శిష్యా ! పాలుపెరుగై, పెరుగునుతరునగా మజ్జిగలో వెన్నవేరై ముద్దయగుచున్నది. యెన్ని యుపాయములు కేసినను నా వెన్నముద్ద చల్లలో గలియనట్లు శివజీవైక్యసమాధిలో గలసి, పరిపూర్ణుడైన సిద్ధునకు, జన్మప్రారబ్ధముయొక్క స్మృతి గలుగునా ? కలుగదని భావము.

కం. దిననాధుడ స్తమింపగ । జనుతరికిరణములువెంట జనువిధమునని।
మననగు యెరుకటుబోలసిన । వెనుకను సర్వప్రపంచవిభ్రమలెల్లా
తోచునేమరల తనుపీడలెల్లా । ఘనకాష్ఠమందగ్నికాంతి చల్లారిన।
వెనుకనుష్ణప్రభవిలసిల్లునేపూర్వ విభ్రమ్మలెల్లా । తోచునేమరల
తనుపీడలెల్లా. 86

తా. శిష్యా ! సూర్యుడ స్తమించుసమయమున సూర్యకిరణములతో కూడానే బోవునట్లును, కట్టెయందగ్ని చల్లారిన వుష్ణము దానివెంటనే బోయినట్లును మనస్సైన ఎరుకపోయిన పిమ్మట ప్రపంచభ్రమలు తనుపీడలు దాని వెంటనే బోవునని భావము.

కం. వుప్పును చక్కెరయును రెం। డెప్పుడునుదకములబడగవిరవగుపడ
కన్ । తప్పకకరిగినగతికను। తిప్పకతనుదానెగాంచు ధీరునియెరుకా

కనుబడిబయిటసమయునేమనకా । నిప్పులకుప్ప కెల్లప్పటికిని చెదలు కప్పనేవిప్పునే చెప్పసూపగరానిధీరునిమెరుకా । కనుబడిబయిటసమయునేమనకా. 87

తా. శిష్యా! ఉప్పును, చక్కెరయును, వుదకమునందు వేయగా వాటిరూపములు కనబడకుండా నీటి యందు కరగిపోయి నట్లును, నిప్పుకెప్పటికిని చెదలంటనట్లును, తనను తాను గాంచు సత్పురుషునకెరుకకనబడి నమసిపోవునని భావము.

క. తలపగగాఢవిరక్తియు । విలసితపరిపూర్ణబోధ వెలసినపరిమోహజ్వలదివ్యదేహునకునిక । మలినమనోదృశ్యవిషయమహిమ లగుపడునా । ఛీఛీవాటితలచమేలగునా । కలలోపలనుగన్న బలిమిగజరాజమే । కొలదిమెలకువపడిన కలసినిలుచుయగుట మహిమలగుపడునా । ఛీఛీవాటితలచమేలగునా. 88

తా. శిష్యా! స్వప్నమందుకనుపడిన మదపుటేనుగ మేల్కొనిన కనబడకుండా పోయినట్లు, విరక్తియు, పరిపూర్ణబోధ జెందిన మహనీయునకు, మలినమనస్సుచే కనబడు ప్రపంచేచేష్టలగుపడునా? అగపడవు. ఛీ ఛీ వాటి ప్రస్తావనే తలచరాదని భావము.

క. పురుషుడుస్త్రీవేషమ్మును । ధరియించినమాత్రమునను తరుణౌనదగునా । అరయగస్థాణువుభ్రమనుగన । పురుషునివలె దోచుగానిపురుషుడనదగునా । తద్దృష్టాంతసరణెరుగుగానా । యెరుకజీవేశ్వరమరుగువేషము లోదలి । పరికింపగా మొదటిపరిపూర్ణమేనిజము పురుషుడనదగునా । తద్దృష్టాంతసరణెరుగుగానా. 89

తా. శిష్యా! పురుషుడు స్త్రీవేషము వేసికొనిన మాత్రముననే ఆడుదని చెప్పవచ్చునా? భ్రమచే చీకటియందొక కొయ్యమోటును చూచి దొంగయనుకున్న మాత్రముననే అది మానవుడగునా? కాదు. యీలాగుననే ఎరుకజీవుడనే, యీశ్వరుడనే, మరుగు

వేషము లొదలి విచారించగా నొకటైన పరిపూర్ణమే నిజమని భావము.

కం. వారణవిభ్రాంతినిచెలు । వారినపురుషునకు దారువనుజ్ఞానమునిం। పారగ చేకురు నేనటు । దారువ నేనిజము తెలియదంతి యగుపడు నా । దేనికదియే సరిపోయెగానా । ఆరూఢి బ్రహ్మవిచార మెరిగిన నాత్మ । ధీరూనికీసర్వమేరీతిస్ఫురణించు దంతియగుపడునా । దే నీ కదియే సరిపోయెగానా. 90

తా. శిష్యా! బచ్చన ఏనుగును చూచి, యిది ఏనుగు అని తలంచువానికి, ఇదియేనుగయనే కాని కొయ్యయని తోచదు. ఇదికొయ్య ఏనుగని తెలసికొన్న మీదట ఏనుగయని తోచునా? తోచదు. అట్లే యిది ప్రపంచమని గూఢిగానుండు అజ్ఞానికి బ్రహ్మస్వరూప జ్ఞానము కలుగదు. ఇది బ్రహ్మము అని నిశ్చయంగలజ్ఞానికి ప్రపంచ భ్రాంతి గలుగదని భావము.

కం. ఏవేళ కేమిబోధల । నేవ్యాధుల నెట్టిచోట నేకర్మలచే । జీవన్ము క్తుడు దేహము । బోవిడిచిన బ్రహ్మపద మేబొందు సత్యముగా । అఖండైక్యమందు నిత్యముగా । భావాతీతముముందెజీవన్ముక్తిలో గన్న । నావలతనుకర్మమే విధితానెవరిబొందు సత్యముగా । అ ఖండైక్యమందు నిత్యముగా. 91

తా. శిష్యా! జీవన్ముక్తుడే సమయముననైనను, ఎచ్చోటనైనను, యేకర్మచేతనైనను దేహమును వదలిన అఖండైక్యమైన బ్రహ్మ పదమునే జెందును జీవించియుండగనే బాహ్యాతీతమైన పరిపూర్ణ కళాదర్శనముపొంది అశరీరియైనవానికి శరీరకర్మ తరువాత నెట్లు యెవ రినిపొందును యెవరిని పొందుటకేమీ లేదు. గనుక నట్టిపరమ పురుషుడు పరిపూర్ణబ్రహ్మ పదమునేజెందునని భావము.

కం. వినుతమతమజన్మాంతర । ఘనతరప్రారబ్ధదోషకౌటిల్యాస । జనన మరణనివహములు గని । మనుజులు తమలోనబలుకు మహిమల

ద్భుతమూ । యోగుల మృతులకిదియసంగతమూ । పనికిమాలి
నపుణ్యపర్వదినములలోన । చనిపోవు మూర్ఖులను । గని సంతసి
లిబలుకుమహిమ లద్భుతమూ । యోగులమృతులకిదియ సంగ
తము. 92

తా. శిష్యా! వినుము వారివారి జన్మాంతములందు చేయబడిన ప్రారబ్ధదోషమువల్ల కలిగిన పెద్దల మరణమునుజూచి పామరుల్శోకులుతమలో ననుకొనుమాటలు మహావిచిత్రముగా నున్నవి. పనికిమాలిన పుణ్యదివసములలో పండుగదినములలో చనిపోవునట్టి మూర్ఖులనుచూచి సంతోషపడు జనులనుకొను మాటలున్ను అద్భుతముగా నున్నవి. బ్రహ్మవేత్తలకివి యేవియునంటవు వారు పరిపూర్ణబ్రహ్మమందే చేరుదురని భావము.

కం. ఈలాటిలోకవిభ్రమ । కాలోచిత ధర్మశాస్త్ర కల్పితమోహా ।
స్యాలోలజీవనిర్గమ । కాలము లెడ తెగకవచ్చు కల్పాంతములకూ ।
దేహములలరురాకపోకలకూ । మేలుగానకయాత్మకీలక మెరుగక ।
తోలుప్రతిమలునాడి మూలబడినయటుల కల్పాంతములకూ, దే
హములలరురాకపోకలకూ. 93

తా. శిష్యా! కాలమునకు తగినటుల కల్పనజేసి వ్రాయబడిన ధర్మశాస్త్రములలో చెప్పినట్లు మూఢమానవులునమ్మి యీలాటి భ్రమలయందే మనస్సువృథము చేయుచున్నందున పుట్టుచావులకీ దేహము లెడ తెగకుండా కల్పాంతరముల పర్యంతముగలుగుచుండును జీవశివైక్యానుసంధానమనే కీలుదెలియకుంటే తోలుబొమ్మలాడిమూలబడినవిధముగా జన్మలు కలుగుచుండునని భావము.

కం. వాదార్థభేదకప్రతి । పాదకమేగాని మొదటపర దేశికుచే । నీడు
ష్టత్రివిధప్రార । బ్ధాదులు కాలత్రయములపరమాత్మ కెపుడూ । వంట
వంచు నెరుగించేనపుడూ । ఆదివ్యతేజాముగాదా నిపుడున్న

దీ। నీదివ్యతత్త్వము కేదుఃఖమికనంటుపరమాత్మకెపుడూ। నంట
వంచు నెరిగించేనపుడూ. 94

తా. శిష్యా! ఇదియంతయు యనర్ధభేదవాదమే కాని మరేమి లేదు. ఆగామిసంచిత ప్రారబ్ధాదులు త్రికాలములయందును పరమాత్మకంటవని యిదివరకే సద్గురుడు చెప్పియుండెను ఇప్పుడా దివ్యతేజమేకదా మన్నది ఇంకనీపరమాత్మకే దుఃఖమంటును యేదిన్ని అంటదని భావము.

కం. తొలుతొలుతలోనెగురుముఖ। విలసిత బ్రహ్మైక్యబోధ విజ్ఞానా
గ్నిక। పొలసినతనుప్రారబ్ధము। నిలవగ్గపటప్రభాతి నెసగు సా
ధునకూ। తగులునె పూర్వఫలిత మాఖరకూ। మొలమితొడిమే
నొదలుఫలసుఖకష్టము। చెలగి వృక్షముమరలజెందునే నటులనిల
నెసగుసాధునకూ। తగులునేపూర్వఫలితమాఖరకూ. 95

తా. శిష్యా! సాధువునకు మొట్టమొదట గురువువలన పొందబడిన బ్రహ్మైక్యబోధయను విజ్ఞానాగ్నిచే కాలిపోయిన శరీరప్రారబ్ధము కాలిపోయిన వస్త్రమువలెనే యుండునుగాని ప్రయోజనములేదు తొడిమవ్రాడి క్రిందబడిన ఫలముయొక్క తిప్పలుతిరుగా చెట్టుకుజెందునా చెందవు అటులనే పోయినతను భ్రమబ్రహ్మజ్ఞానికి తిరుగారాదని భావము.

అఖండపరిపూర్ణమహాతారక పంచముద్రవిధానము.

కం. యేలక్ష్యము పరిపూర్ణము। నాలోచించుమను బాహ్యతఖిలేం
ద్రియస। ర్వాలంబముగనుఖేచరి। మూలమదేత్రివిధలక్ష్యమూల
ము గదరా। సర్వార్ధసాధనగనుగొనరా। చాలగ నచల విశాల
దృష్టిచెనంత। ర్లీలవృత్తులచూడనీలోభూచరి ముద్రమూలముగద
రా। సర్వార్ధసాధన గనుగొనరా. 96

తా. శిష్యా! బాహ్యమందు యింద్రియములకు గోచరమయ్యే సర్వప్రపంచమును పరబ్రహ్మమును దృష్టిచే చూచుటే ఖేచరీముద్ర

యనబడును. అంతరవృత్తులెల్ల పరిపూర్ణమని యచలదృష్టిచే చూచు టేభూచరీముద్రయని భావము.

కం. యేచూపుయచలసూచన ॥ లోచూపున వెలిలోసర్వలోకాంత ములో । దా చతురత్వముగనుగొన । సిచిన్మయమధ్య లక్ష్యమి దియేకుమారా । లక్ష్యత్రయగోచరమిదెరా । పాచీనమాన సాద్యుచితమీపట్కము । ఖేచరాచరదృష్టిచూచుటెషణ్ముఖి ఇ దియెకుమారా । లక్ష్యత్రయగోచరమిదేరా. 97

తా. శిష్యా ! లోపల, వెలుపల, సర్వచరాచరములందు సర్వలోకములంతా పరిపూర్ణమేనని నిశ్చయమైనదే మధ్యలక్ష్యము, అనాదినుండివచ్చే భ్రమసంబంధమైన జ్ఞానేంద్రియము లైదును, మనస్సున్ను, పరిపూర్ణమందు లయింప జేసి సర్వపరిపూర్ణమేనని చూచుటే షణ్ముఖియని భావము.

కం యీనలులక్ష్యమ్ములలో । గానంబడఖండయోగకళమైయచల । జ్ఞానపరిపూర్ణయోగని । ధానముశాంభవిను ముద్రతన్మయమి దెరా । పూర్వోత్తరారణిశాంభవగురా । చిన్మయపరతత్వ చిత్స మాధిలోపూర్వ । తన్మనోస్ఫురణపరయున్మనిజెందెటి తన్మయమి దెరా । పూర్వోత్తరారణిశాంభవిదెరా. 98

తా. శిష్యా! ఈపైన జెప్పబడిన నాలుగు లక్ష్యములలో నేపరిపూర్ణకళ గోచరమగుచున్నదో ఆ పరిపూర్ణము తానై సమాధి యందు దాను పరిపూర్ణుడనైతిననే జ్ఞప్తి సహా మరచి నిరామయు మై, ఉన్మని భావము జెందుటే శాంభవీముద్రయని భావము.

కం ఈతారకముద్రాదిప్ర । భాతతులాపూర్వయోగ భాగస్థితిగా । జూతువదేమోవిషయ । జ్యోతకములుగావుతనువు శోధించి తెలి యా । శక్యమెవీటిసాధించికలియా । ప్రీతిపరిపూర్ణవిఖ్యాతనిజానం

ద। భూతుడవై బ్రహ్మజా తెరిగితే కాని శోధించి తెలియా। శక్య
మెవీటిసాధించి కలియా. 99

తా. శిష్యా! నీపరిపూర్ణ మహాతారకముద్రల ప్రభావములు పూర్వము జెప్పిన తారకముద్రల వలె చూచెదవేమో, శరీరమందు శోధించితే విషయముల కెంతమాత్రమును గోచరములు కావు. ఎంతకాలము శ్రమపడినను కాయక్లేశమే కాని ఫలితము లేదు. కాబట్టి పరిపూర్ణానుభవమును జెంది పరిపూర్ణము నెరిగితేనేగాని యీ ముద్రలనుభవమునకు రావని భావము.

అఖండపరిపూర్ణసాధకాష్టాంగయోగవిధానము.

కం. సమతంభూజలపావక । సమమారుతగగన సర్వస్థూలాకృతవి ।
శ్వముబహిరంతర్లక్ష్య । క్రమమిదిదృగ్బ్రహ్మమూల కారణమిదె
రా । దృగ్దృశ్యరహితపదముగద రా । రమణీయ్య నిత్యనిరామ
యపరిపూర్ణ । విమలశుద్ధసత్వప్రముదితయమయోగ కారణమిదె
రా । దృగ్దృశ్యరహితపదముగద రా. 100

తా. శిష్యా! పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, స్థూలసూక్ష్మకారణదేహములు, యింద్రియములు, ప్రాణము, మనోబుద్ధ్యహంకారములు, సర్వప్రపంచము, పరబ్రహ్మము కంటే వేరు కాదనియు, ఆపరబ్రహ్మమే తానని నిర్ణయించుకొనుటయమమను యోగమని భావము.

కం. ద్రష్టసుదర్శనదృశ్యవి । చేష్టలునెచ్చోటలయము జెందునొనచ
టక్ । దృష్టినిలుపంగవలయువి । శిష్టతయమనస్కబోధశిష్టుల
కంతా । నాసాగ్రసుదృష్టివలదెంతా । వ్యష్టిపూర్వభోగనిష్ఠ
తారకయోగ । కష్టవిద్యలువిడచిస్పష్టమెరిగిన యచలశిష్టులకం
తా । నాసాగ్రసుదృష్టివలదెంతా. 101

తా. శిష్యా! అమనస్కబోధజెంది పూర్వతారకయోగము యొక్క వ్యష్టిసంబంధకష్టవిద్యలు విడిచి స్పష్టమెరిగిన అచలశిద్ధులు,

చూచునది, చూపు, చూడబడువస్తువు, నెచ్చటలయమగునో అచ్చట చూపు నిలుపవలయును గాని యొంత మాత్రమున్ను నాసాగ్రమున దృష్టి నిలుపరాదని భావము.

కం. కనుగొనుచువినుచువానుచు । తినుచునుమూర్కొనుచుమాట తెల్పుఁలచేతన్ । పనిపాటలొనరజేయుచు । ననిశముతా జేయుక్రియల నాయాతరుణములా । సర్వార్థసాధన రూపకములా । కనిసించి వీటినంటనిసాక్షినని తన్ను । తనుదాగాంచెటియోగము నునియమమిదిగాదే నాయాతరుణములా । సర్వార్థసాధన రూపకములా. 102

శిష్యా తననుతానెరుగు పురుషుని సీమమేమనగా చూచుచు, వినుచు, త్రాగుచు, తినుచు, వాసనజూచుచు, మాటలాడుచు ప్రతి దినమూ యాతరుణములయందు తాను జేయు పనులయందంతటా కనిసించివీటినంటని సాక్షినని త్రిపుటిలయమగుచోట దృష్టినిలుపుటే వానిని యమాననమని భావము.

కం. ఇలసంకల్పముచలనము । నలసటజాడ్యతసుషుప్తి యాలస్యము దు । ర్మలికిత కాయక్లేశము । కలుగనిదై యునికినది సుఖాసనమ గురా । సర్వాధారోపాసనగదరా । తలపువాక్కులనెల్ల నిల్కజిక్కకయోగ । ములకుమూలంబగుచు వెలసిన సర్వసుఖాసనమ గురా । సర్వాధారోపాసనగదరా. 103

తా. శిష్యా! తారక సాంఖ్యయోగుల యాసనములొకదాని కంటె భేదములుగా నేర్పర్చ బడినవి ఒక్కొకప్పుడవి చాంచల్యమును శరీరకష్టమును, పాలుమాలిక జడత్వము, నిద్ర, ఆలస్యము మొదల గువానివి గలిగించు చున్నవి అమనస్కయోగుల యాసనము పైకాయక్లేశములు లేనిదై శాశ్వత సుఖప్రదమైన బ్రహ్మనిష్టయోగనుక చలనాదులను గలిగింపవు ఇది యోగములకెల్ల మూలమగు సుఖాసనమని భావము.

కం. వెలిలోనిరూపనామా । దులు విలయము జేయుబుద్ధితోడను రే
చిం । చలవడనచ్చిత్సుఖమి । మ్ముల మదిపూరించి బ్రహ్మమూలము
నందూ । నిజపరిపూర్ణస్థలవిహరణందూ । నలలితహోరాత్రు
లువిలసితకుంభక । బలయోగనిష్ఠచే నిలువప్రాణాయామ మూ
మూలమందూ । నిజపరిపూర్ణస్థలవిహరణందూ. 104

తా. శిష్యా! వెలిలోని రూపనామాదులను విలయముసేయు టే రేచించుట. సర్వమును బ్రహ్మమేనని నిశ్చయించుటే కుంభకము. ఇట్లు గ్రహించిన ప్రాణాదిరూపనామ క్రియలన్నియు నశించును. ఈ ప్రకారము సర్వమును తన రూపముగా జూచుటే ప్రాణాయామ మని భావము.

కం. సత్యానృతవిషయాఖిల । వృత్త్యంతరములను బ్రహ్మవృత్తిచెబోధ।
కృత్యంతరాత్మవిలస । త్ప్రత్యగ్యోగమును జేయ ప్రత్యాహారము
రా । అహరహమేకాశ్రితభోగమురా । సత్యమైనయాత్మ సత్య
మునేనను । నిత్యానందముతోటియత్యుక్తి నిలుచుట ప్రత్యాహా
రమురా । అహరహమేకాశ్రితభోగమురా. 105

తా. శిష్యా! లోకమందజ్ఞానులు కొన్ని వస్తువులు సత్యమని కొన్ని అసత్యములని చెప్పుచున్నారు. నిజములో ప్రపంచముశూన్యరూపమే అయినను కొంత యాలశ్యముగానుండు వస్తువులను సత్యమని యుత్వరలో బోవువాటి ననత్యమనియు వ్యవహరించుచున్నారు. ఇటువంటి సత్యాసత్యములను దొలగించి సర్వకాలముల యందును, సర్వపదార్థములను పరబ్రహ్మ స్వరూపముగా జూచుట ప్రత్యాహార మని భావము.

కం. తనువింద్రియప్రాణాసిల । మనసంతఃకరణదృశ్య మయమగు
వీటిన్ , గనుదృక్స్వరూపమునుతా । ఘనతరపరిపూర్ణనిష్ఠగనుట
ధ్యానమురా । ధ్యానముతో సమానమేదగురా । వినుమహం

బ్రహ్మాస్మియనుమంత్రసాధన । తనలోనహరహ మొక్కక్షణము
నొదలక మేలుగనుటధ్యానము రా । ధ్యానముతో సమానమేద
గురా. 106

తా. శిష్యా! దేహము, యింద్రియములు, మనస్సు, పంచభూతములు మొదలగు కనుపడే పదార్థములన్నియు, నాస్వరూపములు కావు. నేను పరిపూర్ణస్వరూపమని సర్వకాలములయందును అహం బ్రహ్మాస్మియను మంత్రమును మరువకుండుటే ధ్యానయోగమని భావము.

కం. తాననిశమేదిగనుగొను । తాననిశంబేది వినునోతగనది పరిపూ
ర్ణానుభవమనెటిబ్రహ్మ । జ్ఞానముమది నిలుపుటదియే జ్ఞానధారణ
రా, ధారణకను సంధానమిదెరా । ధారణానిల సంహారణని
ర్ఝయ । కారణాయోగవిహారపరమహంసజ్ఞానధారణరా । ధారణ
కనుసంధానమిదెరా. 107

తా. శిష్యా! తాను దేనిని చూచునో, దేనిని వినునో అనగా మనస్సు దేనిని సంకల్పించునో తన వృత్తిచేత దేనిని ప్రకాశింపజేయునో దానిని పరిపూర్ణబ్రహ్మస్వరూపము జూచుటే ధారణ యోగమని భావము.

కం. సర్వపరిపూర్ణమిదిగో । సర్వప్రభూతాంతరాత్మసర్వజ్ఞుడవై । స
ర్వావస్థలయందున । సర్వముతాకనుటయాత్మసత్యసమాధీ । ఇ
దెపరిపూర్ణనిర్గుణోపాధీ । నిర్విషయానంద నిర్వాణసుఖబోధ ।
సర్వభావాతీత సద్గురూపదేశసత్యసమాధీ । ఇదెపరిపూర్ణనిర్గుణో
పాధీ. 108

తా. శిష్యా! జాగ్రదాది సర్వావస్థలయందును అనుభవింపబడు సర్వపదార్థములును పరిపూర్ణబ్రహ్మమని తాను తెలిసికొనుటే సమాధియోగము. యిదేపరిపూర్ణనిర్గుణ, నిర్విషయానంద, భావాతీతమైన యోగమని భావము.

కం. అష్టాంగయోగసిద్ధులు । శ్రేష్ఠతమణిమంత్రతంత్రసిద్ధ్యాదితపో ।
నుష్ఠానఖేచరాదివి । శిష్టాదిసమస్తకార్యసిద్ధులలోనూ । లేదు
ఫలమిాచేష్టలతోనూ । కష్టకాయక్లేశ దుష్టమహిమలునాత్మ ।
భ్రష్టుజేయును బ్రహ్మనిష్ఠతప్పకుతంద్రీ సిద్ధులలోనూ । లేదు ఫల
మిాచేష్టలతోనూ 109

తా. శిష్యా! సాంఖ్య, తారకసంబంధములగు అష్టాంగయోగ సిద్ధులు, మణిమంత్రతంత్రసిద్ధులు, తపోనుష్టాన ఖేచరాదిముద్రలు మొదలైన చేష్టలవల్ల నెంతమాత్రము ప్రయోజనము లేదు. యివి యన్నియు కష్టకాయక్లేశములే లోకులకు భ్రమను కలుగజేయుచు, ముముక్షువులను భ్రష్టులజేయును గనుక నీవువీటిజోలి బోకుము పరిపూర్ణబ్రహ్మనిష్ట వదలకుమని భావము.

కం. నీలోపలిమహిమలునీ । వాలోకించుటయె కేవలాఖండమహా ।
మూలపరిపూర్ణ మెరుగుట । చాలదెయీజన్మములనుచక్కజే
యగనూ । ఇతరమహిమలేలబొందగనూ । మేలుసేయని భ్రమ
జాలములకునాల । వాలములగు వీటిజోలిదలపకునాత్మ చక్కజే
యగనూ । ఇతరమహిమలేలబొందగనూ. 110

తా. శిష్యా! నీలోపని మహిమలు నీవెరుగుటే అఖండపరిపూర్ణము నెరుగుట. జన్మకడతేరుట కిది చాలదా? నీవితరమహిమల బొందుటెందుకు? మేలుసేయని భ్రమలు కలిగించుటకు మూలకారణములైన యోగములు, ముద్రలు, మణిమంత్రసిద్ధ్యాదులజోలి నీవు తలపవద్దు పరిపూర్ణ నిష్టను వదలవద్దని భావము,

తుర్యాతీతపరమహంసలక్షణము.

కం చిత్తమును పరతిజెందిన । తత్వజ్ఞుండంధబధిరతన్మయబాలో ।
న్మత్తజడమూకయజగర । సత్తామాత్రప్రభూతజాతులవలెనూ ।
తిరుగునుయోగమత్తగజముగనూ । ఉత్తమోత్తమ బ్రహ్మవేత్త

మైయిలజీవ । త్యక్తునిగతి యాత్మవేత్త దిరుగును భూతజాతులవలె
నూ । తిరుగును యోగమత్తగజముగనూ. 111

తా. శిష్యా చిత్తశాంతిగలపురుషశ్రేష్ఠుడు సర్వకాలములయందును ప్రపంచమును మరచి, యింద్రియవికారములులేక బాలునివలెను, పిచ్చివానివలెను, జడునివలెను, మూగవానివలెను, అజగరమువలెను ప్రవర్తించుచుండునని భావము.

కం. మదిరాపానమదాంధుడు । విదితముగను యాత్మపటము వ్రేలాడి
నపై । మొదలుండక పడిపోయిన । మదివెరుగునె నెరుగడమితమ
త్తతతోనూ । తద్వజ్జీవన్ముక్తుడు తానూ । పదిలముగను బ్రహ్మపద
యోగసంప్రాప్తి । మదిరాపానముచేత నెరుగు తన్నెరుగక మ
త్తతతోనూ । తద్వజ్జీవన్ముక్తుడు తానూ. 112

తా. శిష్యా! మధిరాపానము జేసిన పురుషుడు మత్తుచేత తనుకట్టుకున్న వస్త్రము వీడిపోయినను, జారిపోవుచున్నను, లక్ష్యముంచనట్లు జీవన్ముక్తుడు, బ్రహ్మానంద పరవశముచే తాను కూర్చున్నను, లేచినను, నడచినను, తనశరీరస్పృహలేకుండునని భావము.

కం. జనమృగవిహగోరగములు । యనుపమగానప్రమోద మభిరుచి
యైన । ధ్వనవేణుపూరుమానవు । గని విడువనిరీతి నాత్మఘనుని
విడువరుగా । భూతములతని వెనుక దిరుగునుగా । వినుసర్వప్రియ
రూపమైనబ్రహ్మనిష్ఠ । తనయందున్నదిగనుక దాని ననుసరించి
ఘనునివిడువరుగా । భూతములతని వెనుక దిరుగునుగా. 113

తా. శిష్యా! జనములు, మృగములు, పక్షులుసర్పములును, పిల్లనగ్రోవిస్వరమునం దభిరుచిగొని, పిల్లనగ్రోవి ఊదువానిని విడువనట్లు నాత్మవేత్తను భూతములాశ్రయించియుండును. సర్వప్రియమైన పరిపూర్ణబ్రహ్మత్వంతనయందుండుటను బట్టి యాఘనుని వెంట దిరుగుచుందురని భావము

కం. భూరజముగప్పుకొన్నను । దారుణగాఢాగ్నియాత్మ తనువంటిన ము । న్నారడిగవానముంచిన । మారుతహతిచాతతనువుమరితూలి పోయినా । దేహభ్రమలేదేరీతినైనా । ఘోరసర్పమువిడుచు భూరి కంచుకముపై । కోరికబెట్టునె యారీతిగను యోగిమరితూలిపోయి నా । దేహభ్రమలేదేరీతినైనా. 114

తా. శివ్యాపరిపూర్ణనిష్ఠగలయోగి తనశరీరమందుదుమ్ముకప్పు కొనినను అగ్ని తన శరీరమునకంటినను, జడివానలో తడిసినను, గాలి దెబ్బచే శరీరముతూలిపోయిన లక్ష్యపెట్టడు కృష్ణసర్పము కుసుమను విడిచి తిరుగా దానియందు భ్రమయుంచనట్లాయోగికి నేవిధముచేత గూడా దేహభ్రమ లేదని భావము.

కం. ఒకపరిజగములుతనలో । సకలముకల్పితమటంచుసంభ్రమమొం దుచు । ఒకపరిభూతములనుగని । పకపకతానగుచుమిగుల పరవశ మందూ । ఒకపరిసాక్షినని విరతిజెందూ । ఒకపరినాకన్యమిక లేదనుచుబలుకు । ఒకపరివికృత సుకృతము లెరుగనని పరవశమం దూ । ఒకపరిసాక్షిననివిరతిజెందూ. 115

తా. అట్టియోగీశ్వరుడొకసమయమున నీజగములెల్ల నాలోనే తోచుచున్నవని సంతోషించును. ఇంకొకసారి చరాచరభూతములను జూచి పకపకనవ్వి పరవశమును జెందును. మరియొకతేప నివియన్ని యు నేను కాదు. నేను సాక్షినని విరక్తిజెందును. ఇంకొకదఫానా కంటె నితరమేదియులేదని, పలుకును. మరికొంతసేపటికి నేను సుకృత వికృతుల నెరుగనని చెప్పునని భావము.

కం. ఒకపరినేనెవరనుకొను । నొకపరినీ వెవరటంచునొప్పకతిరుగున్। ఒకపరి నూరికేనిలుచు । నొకపరిసర్వాత్మననుచు నుల్లాసమందూ। పరిపూర్ణాబోధోపరతులందూ । ఒకపరినేనెచట కేగుదునని నిలు చు । ఒకపరివిధినిషేధములు లేదనిదలచునుల్లాసమందూ । పరి పూర్ణబోధోపరతులందూ. 116

తా. శిష్యా! అటువంటిబుధుడు యింకా నొక పరి నేనెవరిని అనుకొనును ఒకపరినీవు యెవరని తిరుగును, ఒకపరి నేమియు ననక వూరికె నిలుచుండును. ఒకసారి నేను సర్వాత్మనని వుల్లాసపడి గంతులువేయును. ఒకపరి నేనెచటికి పోవుచున్నానని నిలుచుండును. ఒకపరి నాకు విధినిషేధములు లేవని వుల్లాసమందునని భావము.

మహాభోగిలక్షణము.

క. ఏదేసమయమునలనుభు । క్తాయాసములేకజిహ్వకలవడిపడ్రు ।
చ్చాయతవస్తువులమృత । ప్రాయముగభుజించి దేహపరవశమం
దూ । తద్ఘనుడే మహాభోగియందూ్రు । వాయుపైత్యశ్లేష్మశా
యజనితదోష । మెయుడనంటకస్వాయత్తమునదిరిగి పరవశమం
దూ । తద్ఘనుడేమహాభోగియందూ్రు. 117

తా. శిష్యా! శరీరజన్యములగు వాయు పైత్యశ్లేష్మములు తన కంట కుండా జిహ్వకు రుచిగల పదార్థములను భజించి భుక్తాయాసము నొందకుండా దేహపరవశము జెందు చిన్మయుడు మహాభోగియని భావము.

క. ఆచారమనాచారము । లేఛాయలనంటకుండ నింద్రియవిజయా
ద్యుచితవైరాగ్యముచే । నేచందపుసుఖము దుఃఖమెరుగని యో
గి । తద్ఘనుడేమహానందభోగీ ॥ చూచిచూడక కాల్చెయాచిద
గ్నికిదోష । సూచవలోకమైనతోచకతను విశ్వమెరుగని యోగీ
తద్ఘనుడేమహానందభోగీ. 118

తా. శిష్యా! ఆచారమనియో, ననాచారమనియో, భేదము నెంచక వైరాగ్యముచే నేవిధమైన సుఖదుఃఖము లెరుగక, ప్రపంచ దోషసూచకము లోకమైనా, దనకు తోచక తనను విశ్వము లెరుగని ఘనుడే మహానందభోగియని భావము.

క. కలకాలమచలధర్మా । కలతక వ్యాపించి యఖిలగురుతరయోగా
దులమెలగునరునిచిన్మయు । కలితుండనియోగిజనులు గణనసేయు

దురా । వానికిమనమలర మ్రొక్కుదురా । బలుభూతములున
తనియలఘుదీవ్యతేజ । మలరదర్శించి మహాభోగియని చాలగణ
నసేయుదురా । వానికిమనమలర మ్రొక్కుదురా 119

తా. శిష్యా! ఎల్లపుడును, పరిపూర్ణావలోకన జేయుచు తత్సంబంధమగు యోగములచేనుండు మహాపురుషునిజూచి, చిన్నయు డని పెద్దలాయనను పొగడి, ఆయనకు వందనములు చేసెదరు. యోగి జనులాతని బ్రహ్మతేజమును దర్శించి, మహాభోగియని వినుతించెదరని భావము.

౧౯. మహాత్యాగిలక్షణము.

కం. స్వానందాచలపరిపూ । ర్ణానంతమహాబ్ధిమునిగి యపరిమితాత్మ ।
జ్ఞానమునమోహవిషయసువి । తానమునిరసించు పరమతత్వసం
యోగీ । తద్ఘనుడాత్మభోగీవరత్యాగీ । ఇదిస్వర్ణమిది మృత్తు
విదికార్యకారణ। మిదియదియని భేదమొదలితిరుగును బ్రహ్మతత్వ
సంయోగీ । తద్ఘనుడాత్మభోగివరత్యాగీ. 120

తా. శిష్యా ! స్వానుభవపరిపూర్ణానంద మహాసముద్రము నందు మునిగి, ఆత్మజ్ఞానముచే విషయసుఖము నిరసించి, యిదిబం గారు, యిది మట్టిపెళ్ళ, యిది కార్యము, యిదికారణము, యిది, అది, యను భేదములేక సంచరించువాడు మహాత్యాగియని భావము.

కం. ఏవస్తువనిజసాన్ని । ధ్యావిర్భవమైనతరిని యావస్తువతా । నైవె
లసిలోనువెలుపల । నేవొస్తువుగాకవెలుగు నేకవిరాగీ । తద్ఘను
డాత్మభోగీవరత్యాగీ । జీవభావజ్ఞులకావిధిగాదోచు । కేవలస్ఫటిక
ప్రభావమైతానిలుచునేకవిరాగీ । తద్ఘనుడాత్మభోగీవరత్యాగీ. 121

తా. శిష్యా! స్ఫటికసాన్నిధ్యమందే వస్తువునుంచితే దానివికా రమే స్ఫటికమునం దారోపించ బడుచున్నది. జీవభావముగలవారా వికారమే స్ఫటికగుణమని భావించెదరు. అటులనే పరమవేత్తసాన్ని

ధ్యమం దేవస్తువుకనబడినను, నావస్తు వేత్తాన్నై వెలుపలలోపల నేవస్తు వుతానుగాక ప్రకాసించుచున్నాడు అనగా లోపలిజ్ఞానేంద్రియ మూన సాదులును వెలుపలరూపనామక్రియలుగల, చరాచరములును తాను గాక ప్రకాసించుచుండును అట్టివాడు మహాత్యాగియని భావము.

కం. ధారుణిలోవై రాగ్యవి । హారవినిర్మలునిగాంచిహాశ్చర్యభయా ।
కారమనోవిభ్రాంతుల । దేరికనుంగొనగలేరు దేవతులెల్లా । సం
సారమోహితులగుటవల్లా । పోరిప్రాణాధాఁశ లేరీతివిడిచెనో । నే
రముమనమంత వారముగామని దేవతులెల్లా । సంసారమోహితు
లగుటవల్లా. 122

తా. శిష్యా! లోకమందట్టి మహాత్మునిజూచి, భయాశ్చర్యవిభ్రాంతులచే వారిని సందర్శించుటకు శక్తిలేక వారు ప్రాణమువిూదను, అర్థము విూదను ఆశ నెట్లు విడిచిరో మనము సంసారమోహితులమగుట వలన మనమంతవారముగాము, మనచేత గాదని యనెదరని భావము.

పరభూతహితమే పరమేశ్వరారాధనము.

కం. పరమేశ్వరుడఖిలచరా । చరకోటిహృదబ్జసదన సర్వాసితుడై । చరి
యించుచుగాననికా । పరమేశ్వరపూజగాదే పరభూతహితమూ ।
సంతతమదియేసర్వసమ్మతమూ । పరమతహితమేదో నెరిగి బోధిం
చిత । త్పరమానందముచాత పరిపూర్ణమైయుండూ పరభూతహి
తమూ । సంతతమదియే సర్వసమ్మతమూ. 123

తా. శిష్యా! పరమేశ్వరుడు చరాచరములందెల్లెడల హృదయకమలములందుండి చరించును గనుక, పరహితమే పరమేశ్వరునిపూజ ఎల్లపుడును నిదియే సర్వసమ్మతము పరులెట్టివారో వారి మతమునకు తగినట్టుల బోధించి పరమానందముచేత పరిపూర్ణుడవై యుండుమని భావము.

కం. గురుపుత్రులనెటిసూచన । గురుకృపచేగని తదార్యకోట్యాదులు
నే । తరగతులనడుగుదురో త । త్పర భాషల ననుసరించి పలుకుస
త్యముగా । పరహితక్షేమకరముమంచిదిగా । పరులెట్టివారో త
త్పరమార్థమే తెల్పి । పరహాని లేక నిహపరములలో మెలగి పలుకు
సత్యముగా । పరహితక్షేమకరముమంచిదిగా. 124

తా. శిష్యా! గురుపుత్రులెట్టివారో గురు కరుణచేత తెలిసి కొని వారేయేతరగతులుగా నిన్నడిగెదరో వారివారి భాషల ననుసరించి వారి వారికి హితముగలుగునట్లు సత్యముగా బలుకుము నిన్ను బోధింపుమని అడుగువా రెట్టివారో ఆపరమార్థమే దెల్పి యిహపరముల సుఖింపుమని భావము.

కం. పలుకేశుద్ధప్రణవము । పలుకే నిశ్శబ్దమును బయలగు వెలిలో ।
వలనిజపరకోశములో । పలుకదితొలిపలుకుగాదే. పరమార్థతిల
కా । నీకెదురగుపలుకన్యమనకా । పలుకేబయలు గనుక పరి
పూర్ణముద మొలుక । పలుకుముద్దులుగులుక పరమానందము
జిలుక పరమార్థతిలకా । నీకెదురగు పలుకన్యమనకా. 125

తా. పరమార్థతిలకా! పలుకునట్టి పలుకే శుద్ధప్రణవము. ఆపలుకే నిశ్చయమందు పరిపూర్ణమగుచున్నది వెలిలో నీకోశమందును నితరకోశములందును నీకెదురగు ప్రతిశబ్దమున్నూ ప్రణవమయ్యే యున్నది. అట్టి పలుకే పరిపూర్ణము గనుక పరమానందభరితమైన పరిపూర్ణముతప్ప నింకేమి లేదని భావము.

మహాసాధుసన్మానవిధి ప్రబోధము.

కం. గురుపుత్రులనిది మొదలుగ । ధరణిలో మత్కళలటంచుదలచి శు
భశ్రీ । కరులగుతత్సాధువశీ । కరమహదైశ్వర్యధుర్య ఘనుడవై
బ్రతుకూ । నీకభివృద్ధికొరకు యామరకూ । మరి వారిలోనుండే
మరుగేమరుగనిస్థిర । బుద్ధితో సన్నుమనువకు మనువకు ఘనుడవై
బ్రతుకూ । నీకభివృద్ధికొరకు యామరకూ. 126

తా. శిష్యా ! నీవిది మొదలుకొని భూమియందుండు గురుపుత్రులు నాయొక్క కళలుగా భావించి నీయభివృద్ధి కొరకు వారిని వశీకరులనుజేసికొని వారిలోనుండే మరుగెరిగి స్థిరమనస్సుతోటి పరిపూర్ణ ఐశ్వర్యుడవై నన్ను మరువకుమని భావము.

కం. పెద్దలగనుగొను వేళల । వద్దికతో నన్నుగన్న వహిగనునీవా । పె
ద్దలసన్నిధిలోపల । ముద్దుగసద్భక్తినిలచి ముదముతొ గొలచీ
తత్పరిచర్యశ్రద్ధలగుపరచీ । పెద్దలనేననేబుద్ధినిలపి యూత్మ । పెద్ద
లందరికొక ప్రొద్దుదండము పెట్టుముదముతొ గొలచీ । తత్పరిచ
ర్య । శ్రద్ధలగుపరచీ. 127

తా. శిష్యా ! పెద్దల దర్శనమైనపుడు నన్ను జూచులాగుననే వారిని జూచి వారి సన్నిధిలో భక్తితోటి నిలచి వారిని సేవించి నీయొక్క సేవానిపుణత్వము గనుపరచుము పెద్దలు నేననేబుద్ధిచే వారికి పరిచర్య చేయుటలో శ్రద్ధ గనుపరచి ఆత్మవేత్తలగు పెద్దలకందరికిని నమస్కరింపుమని భావము.

కం. పెద్దలవాజ్ఞలమీరకు । పెద్దలకెదురించబోకు పెద్దరికముగా ।
పెద్దలతో వాదించకు । పెద్దలుసభచేసిపిల్వ పెడత్రోవజనకూ
పెద్దలకివ్వవద్దువద్దనకూ । పెద్దలయినవారి బుద్ధివృత్తులుగనపో ।
వద్దువద్దు వెనకదిద్దజాలరెవరు పెడత్రోవజనకూ । పెద్దలకివ్వవ
ద్దువద్దనకూ. 128

తా. శిష్యా ! పెద్దలయొక్క యాజ్ఞలనుమీరవద్దు. పెద్దలతో నెదిరించి మాటలాడకుము నేను గొప్పవాడినని వారితో వాదించకుము. పెద్దలు సభచేసి నిన్ను పిలచినట్టయిన వేరే దోవనబోకుము పెద్దలకు యివ్వవద్దని చెప్పకుము. అమ్మహానుభావులయొక్క బుద్ధివృత్తులను పరీక్షింపబోకుము. తర్వాత నెవ్వరునుదిద్దజాలరని భావము.

కం. పెద్దలమరుగొకటనిచే । ప్రొద్దునుమనసత్య దృష్టిబొదలుచునీ
వా । పెద్దలకందరికినినొక । పెద్దకుమారునిగతిరిగి ప్రియమొం

దుతండ్రీ ॥ కుచ్ఛితబుద్ధులొద్దురాతండ్రీ। ముద్దుముద్దుగవారివద్ద
నీవునా। ముద్దుబిడ్డనుపేరుపద్దు ధరలోనిలుపుప్రియమొందుతండ్రీ॥
కుచ్ఛితబుద్ధి లొద్దురాతండ్రీ. 129

తా. శిష్యా! పెద్దలమరుగే అభివృద్ధికి కారణమని నత్య
హృదయముచేనుంకి నీవాపెద్దలకందరికిని పెద్దకుమారునివలెసేవజేసి
వారి దయను పొందుము నీకు కుచ్ఛితబుద్ధి వలదు. వారిసన్నిధిలో
నీవు నాప్రియశిష్యుడవనే ప్రఖ్యాతి ప్రపంచమందు నిలుపుమని భావము.

క౯. కలగోలది పెద్దలకుపూ। జలుసేయుతదీయమానసాభీష్టాధా।
దులనెరిగియలవియగు న। త్ఫలమధువరభక్ష్యభోజ్యపాకసద్విధు
లా। నర్పించుసాధనధనతతులా। ఇలనుసాధులహృదయములలో
నన్నోదక। ములుజేరబ్రహ్మాండమలర తృప్తినిజెందు పాకసద్విధు
లా। నర్పించుసాధనధనతతులా. 130

తా. శిష్యా! నీకు శక్త్యానుసారముగా పెద్దలకు పూజలు
సేయుము. వారికిష్టమైన పదార్థముల నెరిగి అలవియగుమట్టుకు ఫల,
మధు, భక్ష్య, భోజ్యాదిపాకములచే వారినితృప్తిపరచి సాధ్యమగు
నంతవరకు ద్రవ్యముతో పాదపూజసేయుము. భూమియందు సాధుల
హృదయములలో నన్నోదకములుజేర బ్రహ్మాండము తృప్తిజెందునని
భావము.

కం. మనముననని శముశ్రీగురు। తనయులగుణనామరూప ధామీణకచ
ర్యలో। వినియానందమ మూర్ధిని। మునుగుచుతత్సాధునివహము
లనుజేర్కొనుచూ। నుండుముపరమగుణి సంతసిలుచూ। తనగృ
హము శ్రీగురుతనయాశ్రమంబని। తనధనములు నత్యధనులపాలని
సౌఖ్యములనుజేర్కొనుచూ। నుండుముపరమమునిసంతసిలుచూ.

తా. శిష్యా! సద్గుణముగల గురుపుత్రుడెల్లప్పుడును తనతోడి
గురుపుత్రుల గుణములను, నామములను, రూపములను, ధర్మకార్య

ములను విని, మహానందమును పొందుచు తన యిల్లు గురుపుత్రుల యాశ్రమంబనియు, తన ధనము బ్రహ్మవేత్తల పాలనియు సంతోషపడుచుండునని భావము.

కం. మీనములు కృపాదృష్టిచే । మానుగవిహగాదు లమితమమకారముచే । మానససుఖసంకల్పని । ధానతకమఠములునిజ సంతానపోషణలూ-జేసెటివిధముగాను రక్షణలూ-జ్ఞానులెరిగిమహినన్మానమొనతుఱారే । కానికితత్సన్నిధానములలో నిజసంతానపోషణలూ ।జేసెటివిధముగాను రక్షణలూ. 132

తా. శిష్యా! మీనములు కృపగల చూపులచేతను నిండా మమకారముచేతను, మంచి సంకల్పముచేత తాబేలును వాటి వాటి సంతానముల నెటుల బోషింపునో నటులనే జ్ఞానులు శిష్యకోటికి బోధలొసగి రక్షించెదరు. గాకానకు వారి సన్నిధిన జేరితే రక్షించెదరని భావము

కం. మతసమ్మతబోధాంత । స్థితిగతులను దెలసి యార్య సేవలొనీవు। న్నతితీవ్రసూక్ష్మప్రజ్ఞా । మతివై చరియింపుమాత్మ మతమిదెవత్సా సర్వభూతహితమిదెవత్సా । అతులితపరతత్వచతుర యోగాభ్యాసవితతబ్రహ్మానంతతులగలసి బ్రతుకుము మతమిదెవత్సా । సర్వభూతహితమిదెవత్సా. 133

తా. చిన్నికుమారా ? పెద్దలసేవలో నీవు సూక్ష్మప్రజ్ఞగలవాడవై వారి వలన మతసమ్మతబోధయొక్క స్థితిగతులను చక్కగా గ్రహించి సంచరించుము నామతమిదే. సర్వజనసమ్మతమిదే. పరిపూర్ణ యోగాభ్యాసులైన బ్రహ్మానంతతులలో గలసి బ్రతుకుమని భావము.

కుటిలదుస్స్వభావదుష్టజనమాన నలక్షణము.

కం. కుటిలవ్యభిచారులు తమ । రెటువలెనో జనులనటుల నెంచుట సహజం । బటుదుష్టాత్ములు పెద్దలతృటిమాత్రము గానకెంచి

తూలనాడుదురూ । తామే శ్రేష్ఠులనుచు బలుకుదురూ । ఘటకు
లైతే లోకనటనాన్నపానసం । కటములెందుకొవట్టి మటుమాయలి
వియని తూలనాడుదురూ। తామే శ్రేష్ఠులనుచు బలుకుదురూ. 135

తా. లోకములో కుటిలులైన దుష్టులు తామెటువంటివారో, లోకులందరును నట్టివారే నని తలచుట సహజము. యిట్టిదుర్మార్గులు బ్రహ్మవేత్తలనుజూచి వీరు పెద్దలైతే వీరికి లోకనటనలెందుకూ, అన్నపానాదుల కష్టములెందుకు, యివి యన్నియు బూటకములుగానున్నవి, వారికంటే మేమే శ్రేష్ఠులము, అని వారిని తూలనాడెదరని భావము.

కం. వాయసములునద్యోదక । మాయడలన్విడచితృష్ణయధికంబై కుం।
భాయతజలములుగైకొను । ఛాయగదుష్టాత్ములచల సద్గురుబోధా।
తెలియక యేమొ సేయుచు మేధా । యీయాత్మసాధకోపాయాము
మీాకుసరి । పోయెమాకిదిపట్టదాయపొమ్మందురు సద్గురుబోధా ।
తెలియక యేమో సేయుచు మేధా. 135

తా. శిష్యా! కాకులు, విస్తారముగా నిర్మలమైన జలములుండునదిలో తాము దాహమార్చుకొనుటకు నీరు త్రావక, కడవలలోనుండు మురికి నీరు త్రాగుచున్నవి. అటువలెనే దుష్టాత్ములచలసద్గురువుచేయు పరిపూర్ణ బోధ తెలియక నీయాత్మబోధ నీకే సరిపోయినది మాకు బట్టదు పొమ్మందురని భావము.

కం. మానవులనవరతముని।జ్ఞానవివేకాదిపుణ్య కార్యఫలాపే।క్షానుగ
తులగుచునుందురు । గాని మహాదోషములను కాంక్షించరెవరూ।
కోరికెతోటికొనసాగనియరూ । పూని జేసేదఘపుంజమే కానియే ।
కానికొకసారైన జ్ఞానసాధనబుద్ధి కాంక్షించరెవరూ । కోరికలాక
టికొనసాగనియరూ. 136

తా. శిష్యా! లోకమునందెల్ల మానవులు ఫలములను బొందుదమయపేక్షచేత, పుణ్యకార్యములే చేయవలయునని కోరెదరు

గాని, దోషముల నెవరును గోరరు, యిట్లు కోరికలతోటి కొనసాగ కుండా దోషకార్యములే చేయుచుండెదరుగాని, నిత్యసుఖము నిచ్చు పరమాత్మావలోకనసాధన నెవరును కోరరని భావము.

కం. యీలాటిదుష్టకష్టపు। హాలాహలమనుజులకు సహాయమగునేసా।
ఖ్యాలోకనబోధస్థితి। యాలోచననీకదేల యల్పాభోగములా।
కాంక్షించెటి వారివర్తనలూ। చాలాసాధుల గుణజాలములోర్చ
క। మేలుతామందక మూలమూలల చెలగు యల్పభోగములా।
కాంక్షించేటివారివర్తనలూ, 137

తా. శిష్యా! ఇటువంటి దుష్టులైన కష్టజనులకు శాశ్వతసు ఖమునిచ్చు అచలబోధ స్థితి యేలాగున కలుగును, అల్పభోగములను గోరుచు, సజ్జనులయొక్క గుణముల నోర్చకుండా, తాము మేలు జెం దకుండా, మూలమూలదిరిగే వారి నడతలు నీకెందుకు, వారుకోరే అల్పభోగములు నీకేల, నీకు పనిలేదని భావము.

కపటశిష్యవర్తనము,

కం. కపటశిష్యవర్తన। మపవిత్రముదుశ్చరిత్రమనివార్యము నీ।
యపసవ్యవికటభాషణ। తపసులపంచలవసింపతగదుకుమారా। అ
దివినమనకు నపవాదమగురా। వృపమింపతద్భృత్యవిపరీత దుర్వ్యా
త్యయ। మపరిమితపాపశ్వపచజన్మార్జితమూ తగదుకుమారా। అ
దివినమనకునపవాదమగురా, 138

తా. శిష్యా! కపటముగల శిష్యులనడతలు, అపవిత్రములు, దుర్మార్గము, అనివార్యము, అపసవ్యము, వికటము, మన మట్టివారి పంచల నహా నివసింపగూడదు. అదిమన కపవాదము, వారి సాంగ త్యము వలన, జన్మజన్మాలకు, కుక్క మాంసము తినువాడు చేసిన పాపమునకు పాలుపడుదుమని భావము.

కం. గురుసన్నిధిలోతానొక।గురుపుత్రానివలెను జేరకుటిలాత్మండై।గు
రుశతమరహస్యము విని। మరిసద్గురువిడిచి తిరుగు మానవాధము

సీ। ఛీఛీతలచనరకమాగానీ। గురుద్రోహిగురుభక్తిగురిజేరి బోధ
రిగి। తర్వాత గురువిడచె దౌర్భాగ్యులలోనీచమానవాధముని।
ఛీఛీతలచనరకమాగాని. 139

తా. శిష్యా! గురుని సన్నిధానమందు తానొక గురుపుత్రుని
వలె చేరి, కపటము గలవాడై సద్గురువు చెప్పె పరమ రహస్యార్థ
ములు విని, గురుమూర్తిని విడచిపెట్టి ద్రోహబుద్ధిచే దిరుగు నీచ
పుదౌర్భాగ్యుని తలచరాదు, ఛీ ఛీ వానిని తలచితే నరకము గలు
గునని భావము.

కం. గురుధిక్కార మొనర్చుచు। గురునిందకులైననరులగూడుచు ధర
లో। గురుస్మరణమరచితనుసుఖ। పరవశమున విషయమోహప
రవశుడైనా। వానినితలపబోరెవరైనా। గురునాజ్ఞలేక తాగు
రువై బోధచేసు। గురువంచకముచాతగురుతునిల్వని మోహపర
వశుడైనా। వానిని తలపబోరెవరైనా. 140

తా. శిష్యా! గురువును ధిక్కరించుచు, గురువును నిందించు
వారితో స్నేహము జేయుచు, గురుస్మరణను మరచి, శరీర సంబంధ
మైన సంసారవిషయసుఖముచే మోహపరవశుడై గురునాజ్ఞలేకుండా
తాను గురువై బోధజేయుచునుండు, గురుద్రోహిని నెవరును దలచ
రాదని భావము.

కం. గురుయాజ్ఞలోన నిలువక। గురువరుచేవిన్ని తెలుసుకొనిగురుకంటే।
మరిచక్కగ బోధించెటి। తెరవెరుగుదు సకలశాస్త్ర ధీరుడనను
చూ। పలుకును పీఠాధికారిననుచూ। గురుమర్మములుశిష్యవ
రులగూర్చి తెలిపి। ధరవిత్తముడుగు సంసారపోషణకొరకు ధీరుడ
ననుచూ। పలుకునుపీఠాధికారిననుచూ 141

తా. శిష్యా ఇట్టిగురువంచకుడైన దుష్టుడు, నేను గురువుచేత
సన్యాసగ్రహించి, సకలశాస్త్రములుచదివినాను, గురునికంటే మెక్కు

వగా బోధజేయగలను. యిప్పుడు నేనే పీఠాధికారిని, నని చెప్పుచు శిష్యులను గూర్చుకొని, గురుమర్మములు వారికి చెప్పి సంసారపోషణ కొరకు ద్రవ్యము నడుగుచుండునని భావము.

కం. తనశిష్యగణమువినగను । ధనకనకాభరణ వస్త్రతతులొసగుట కై । పనిలేని పనిగగురువును । వినుతించును వారికెదుటవిపరీతము గనూ । జపతపయోగధ్యానవిధులుగనూ । తనయింటి కెపుడైన జనుదెంచిగురుడున్న । క్షణమైననుతి జేసి తృణమైన నివ్వడు విపరీతముగనూ । జపతపయోగధ్యానవిధులుగనూ. 142

తా. శిష్యా అట్టికుటిలశిష్యునింటికియెప్పుడైనగురుడొచ్చిన క్షణమైనను వినుతించి, ఒక దమ్మిడైనా సమర్పించడు. అట్టి దుర్మార్గుడు తనకు తన శిష్యులు ధనము, బంగారు, ఆభరణములు, వస్త్రవాహనము లిచ్చుటకు గాను, పనిలేనిపనిగా, తన గురువు జపమునందును, తపమునందును, యోగధ్యానాదులయందును నిపుణుడని వారియెదుట పొగడునని భావము.

కం. గురునిమదిలోన విడిచిన । తెరవగుపడనీకకుటిల తెరవుల మాటల్ పరులకు బోధింపుచు నే । గురుభక్తులలోన నధిక గుణశాలినను చూ । వుండును సర్వగురువు నేననుచూ । గురుసంస్మరణే లేక గురుపుత్రదర్శన । స్ఫురణైనదోచకపరద్రోహబుద్ధిచే గుణశాలినను చూ । వుండునుసర్వగురువునేననుచూ. 143

తా. శిష్యా ! కపటగురుపుత్రుడు, తాను తన గురువును మనసునందు వదలిపెట్టిన సంగతి, పైకి కనుపడనియ్యకుండా కుటిలమార్గపుమాట లితరులకు బోధింపుచూ, నేను గురుభక్తులలో నధికుడను, నేనే సర్వగురువునని చెప్పుకొనుచుండును. వీడెప్పుడును గురుస్మరణే లేక, గురుపుత్రుల దర్శించు ధర్మమను స్ఫురణే కలుగక, యెల్లపుడును పరద్రోహబుద్ధిచే నుండునని భావము.

కం. తనుదేశికుగృహమునకును । జనుదెంచుటలేనె లేదుసద్గురుఁడొక వే-ళనుతనయింటికి రాగను । గనుగొనియటుబోతు మీరెక్కడి కొచ్చినారో । ఇకయన్నటికగుపడుతారో । మనకున్నమట్టుకే మైననిచ్చేగమంటే । వనరూగనాచేతనొక కాసైన లేదెక్కడికొచ్చినారో । ఇకయన్నటికగుపడుతారో. 144

తా. శిష్యా! నేనేమి చెప్పుదును, తాను సద్గురువు నింటికెప్పుడైనను వచ్చుట లేనే లేదు. యెప్పుడైనా, నొకవేళ సద్గురుడు తన యింటికి వచ్చినట్టయితే చూచి, అయ్యగారెక్కడికి వెళ్ళుచు, యేమి పని నిమిత్తము వచ్చినారో, యిక నెన్నటికి దర్శనమగునో, మన కున్న మట్టుకేమయిన సమర్పించుకుందామంటే నిప్పుడు నాచేతులో నొక కాసయినలేదు. అని సాగనంపునని భావము.

కం. ఈలాటికుటిలశిష్యుని । జోలాంత్రపుకథలు చెవులజొరనియ్యకు నీ యాలోచనచేనిహపర । మూలము చెడి నరకకూపములలో బడుటేరా । జన్మజన్మప్రారబ్ధమిదెరా । చాలగనిట్టిచండాలకృత్యముసర్వ । కాలములందుమనకేల విడువదినరకములలో బడుటేరా । జన్మజన్మ ప్రారబ్ధమిదెరా. 145

తా. శిష్యా! నీవీలాటి కుటిల శిష్యుల సంగతులు వినకుము. ఈలాటి ఆలోచనలవలన, నిహపరహాని కలిగి, నరకకూపములో బడుటయే నిజము. జన్మజన్మానికినిదే ప్రారబ్ధము, యిటువంటి చండాల కృత్యము మన కెన్నటికిని పనికి రాదు. నీవు నేను జేసిన బోధను విడువకుమని భావము.

గురునిరాదరణభావము.

కం. దేశముదూరంబగుటను । కాశీజలములకు మహిమగల్గెనుమును తా । జేసినపుణ్యముచేనీ దేశమెయాకాశిగాదా తెలిసేనాలేదా । ఈజలమెగంగాజలముకాదా । కాశీవాసులుమైలాపాచీపను

లాడిగ । జేసీమిగులపారపో శేసీళ్ళవి కాదా దెలిసేనాలేదా ఈ జలము గంగాజలము కాదా. 146

తా. శిష్యా! కాశి, గంగా, చాలాదూర దేశములో నుండుట వలన, నానీళ్ళకు మహిమగలిగెను, యిదివరకు జేసిన సుకృతముచేత తనను తాను తెలిసికొని పూర్ణభావమునొందితే, ఈదేశమే యీ కాశీగదా? ఈనీళ్ళే గంగాజలము కాదా? కాశీపట్టణమునందు కాపురముచేయువారు, పాచిపనివగైరా పనుల కుపయోగించి పారబోయు నీరు గంగాజలమే కాదా? ఈసంగతి నీకు తెలిసినదా? లేదాయని భావము.

కం. అటుగాన సకలమహిమలు । ఘటింయింపగ జేయు పరమ కారణు డింటగ । నటియింపగ నానాటికి । తృటిమాత్రముగాను గురుడు తోచూశిష్యులకూ । దూరస్థుడతిమాన్యుడందరకూ । మటు మాయదూర మెంతటిభక్తిజేసునా । కుటిలభ్రమవిడిచియప్పటికో కటిగనుండు తోచుశిష్యులకూ । దూరస్థుడతిమాన్యుడందరకూ.

తా. శిష్యా! అటులనే సకల మహిమలు గలుగజేయు గురుడింటియందే యున్నయెడల, శిష్యులకు, నానాటికి గడ్డిపోచమాత్రము తోచి, గురువునందు మర్యాదనుంచరు. దూరమందుండు వాడెట్టివాడైనను మిగుల మర్యాద కనుపరచెదరు. మాయదూర మెంత భక్తి చేయునో చూడుము. నీవటువంటి కుటిలభ్రమ విడచి, యెప్పటికిని నొకటే విధముగా నుండుమని భావము.

దుస్స్వభావగురులక్షణము.

కం. ఆశాపాశములుడగని । దేశికుడునుయర్థలుబ్ధీరపిశాచా । క్రోశముఖశిష్యువరుడిత । రాశలచే బెనగి మోక్షమందొక్కరికినీ । లేదుబుద్ధికుశలమ త్తరినీ । వాశిగనిరువురుపదేశమునకుబూన । లేశముమర్యాదకోసినదక్కడు మందొక్కరికినీ । లేదుబుద్ధికుశలమ త్తరినీ. 148

తా. శిష్యా! ఆశాపాశములొడలని గురువును, ద్రవ్యలుబ్ధపిశాచియగు శిష్యుడును ఎట్లయినా శిష్యునివద్దనుంచి ద్రవ్యములాగుదమనెగురుడును, ఒకదుగ్గాణికైనను శలవుచేయగూడదనె శిష్యుడును వీరిద్దరు నుపదేశమునకు బూనినట్లయిన నిద్దరికినికోసినా మర్యాద దక్కదని భావము.

కం. దేశఖ్యాతిగవీరలు । దేశికుడనిపించుకొకడుదిటవగుసన్న్యో । తూ
శకుపరచెటిశిష్యుడు । వాసికెనెక్కుదుమటంచు వారనుకొనుటా ।
వ్యర్థము కాదా జేశెదమచటా । దేశికేంద్రునకుని రాశాముఖ్యము
శిష్యు । డాశవంచనలేక భాసిలుట ముఖ్యము వారనుకొనుటా ।
వ్యర్థము కాదా జేసేదమచటా. 149

తా. శిష్యా! ఇట్టి శిష్యునకు నేను గురువగుదామని అట్టిగురుడనుకొనుటయును యిట్టి గురువువలన మోక్షమునుబొందుదమని అట్టి శిష్యుడనుకొనుటయు వ్యర్థము, సద్గురునకాశ లేక యుండుట ముఖ్యము శిష్యునకరమర లేక యుండుట ముఖ్యమని భావము.

జ్ఞానవిహీనగురుశిష్యలక్షణము.

కం. పరమార్థబోధనెరుగని । గురువర్యునిశిష్యుడొకడు కోరినమరి
యా । గురుశిష్యులకిద్దరికొక । గురుమూర్తిఘటింపకున్నకుద
రదుబోధా । ఫలరహితమందురువినుడిమేధా । తరుణిపురుషవే
షతరుణితొరతిగలసి । పరులనిద్దరిమనకువనకూర్చు మన్నటుల
కుదరదుబోధా । ఫలరహితమందురు వినుడి మేధా. 150

తా. శిష్యా! ఒకస్త్రీ మరియొక పురుషవేషము వేసికొనియున్న స్త్రీనిజూచి మోహించి యిద్దరును రతిక్రీడకుపాల్పడి తమ యిద్దరికి నిద్దరు పురుషులు కావలెనని యనుకొన్నట్లు పరిపూర్ణబోధ నెరుగని గురుని నొకశిష్యుడు అచలబోధ జేయుమనిగోరిన యెడల నాయిద్దరికిని పరిపూర్ణబోధ నెరిగిన యచలగురువు సందర్భపడకుండిన వారిద్దరికిని బోధకుదరదని భావము.

క౦. గురుడుపరిపూర్ణుడైనను । గురుబోధనుగొనిన శిష్యకోటి తరించున్ । గురుడుపరిపూర్ణనిష్ఠను । గురు తెరుగకయున్నశిష్య కొరత లెట్లగురా । గురుబలిమి మొదలెరిగి దిగవలెరా । ధరద్రవ్యదాత తత్పరునికొలచిన బ్రతుకు , మరిలుబ్ధునిగనుమరుగ నేమి ఫలము కొరత లెట్లగురా । గురుబలిమి మొదలెరిగి దిగవలెరా. 151

తా. శిష్యా ! ప్రపంచమం దెవరైనను ద్రవ్యముగలదాతను గొలిచినట్లయిన బ్రతుకునుగాని, ద్రవ్యహీనుడైన లుబ్ధునిసేవించిన ప్రయోజనమేమి గలుగును? ప్రయోజనము లేదు. అటువలెనే, గురుమూర్తిపరిపూర్ణుడైన వారిని యాశ్రయించు శిష్యకోటి తరించెదరు. గురుడు పరిపూర్ణభావము నెరుగకపోతే శిష్యులకొరతలు తీరవు మొట్టమొదట గురువరుని శక్తి తెలిసికొని వారిపాదము లాశ్రయించవలయుననని భావము.

గురువిశ్వాసప్రియులక్షణము.

క౦. అతిదూరముగలశిష్యుం । డతిభక్తితొ గురునిజేరి యటుబొందందున్ । మతిలేనదుష్టమానవుడతి దగ్గర జేరి ఫలమునంద డెప్పుడునూ । దూరసమీపవిధు లెందుకిలనూ । వెతకిభృంగముకమలగతమధువుగ్రోలునీ । స్థితిమండూకముగననిగతిజలపడి ఫలమునంద డెప్పుడునూ । దూరసమీపవిధు లెందుకిలనూ. 152

తా. శిష్యా ! అడవిలో చెట్లమీదనుండు తుమ్మెద వెదకుచూ వచ్చి తామరపుష్పములో నుండు మధువును పానముచేసి యానందించును మండూకమాకమలమునకు సమీపమందుండియు నా మధువును గ్రహింపలేదు నీ విధముగనే గుణశాలియగు శిష్యుడు దూరమందుండువాడైనను మిగుల భక్తిచే గురు సార్వభౌముని జేరి బోధనుబొందును బుద్ధిలేని దుష్టుడు సమీపముననుండియును విషయాశలచే ఆత్మబోధను పొందనేరడని భావము.

కం. జలసంగతజలచరములు । జలసాంగత్యంబు విడిచిజననొల్లనియా।
చెలువున దేశికనాథుని । తలపున నేమరకుశిష్యధర్మమిది వినరా ।
గురుపూజలు సలుపుకుమారా । సలలితగురుబోధ దెలసి కలకాల
ము । తలిదండ్రిగురుదైవములుగా దలచుము శిష్యధర్మమిదివినరా
గురుపూజలు సలుపుకుమారా. 153

తా. కుమారా! జలములలోనుండు జలచరములు జలములను విడువనిచ్ఛలేనట్లు నీవు సద్గురువును నీమనస్సున సదానిల్పి గురుపూజలుజేయుచుండుము. గురుబోధ స్థిరపరచుకొని తల్లి, దండ్రి, గురువు, దైవము, అంతాసద్గురుడేనని తలచుకొనుము. యిదే శిష్యధర్మమని భావము.

సత్వ్రిభావగురుశిష్యస్వరూపసూచనము.

కం. గురుశిష్యులెట్టివారన । కరమరుదుగ దీపకళికకప్పురములగా ।
నిరుపురకనుపైగనుకను । పరుచుము నీవచలబోధపట్టుగురు తెరి
గీ । యీదృష్టాంతము గుర్తెరిగీ । కట్టెపాకముగాక వట్టిభ్రమల
పోక । నట్టిట్టుచదరకగట్టివారలమదిలో పట్టుగురు తెరిగీ । యీ
దృష్టాంతము గుర్తెరిగీ. 154

తా. శిష్యా! నీవు కట్టెపాకముగాక వట్టి భ్రమలజెందక మనసు నటునిటు ద్రిప్పక అచలగురువులలో పట్టుదెలసికొని పరిపూర్ణబోధ పట్టు గుర్తెరిగి గురుశిష్యుల కిద్దరకు దీపకళిక కర్పూరము రెంటిని దృష్టాంతముచేసికొనుము ఈ దృష్టాంతమును మరువకుమని భావము.

అన్యపరమార్థోపదేశము పరసాధుల కతికష్టము.

కం. వున్నతమాతంగముతను । కన్నారగనిద్రమేపుగానకచెత్తన్।తిన్న
గదినునులిచీమలు . చిన్నవిదైచక్కెరెపుడుచేరిమెక్కునుగా ।
పెత్తనమున కెన్నోతిప్పలుగా । పిన్నపెత్తనములిట్లున్నవీరెంటిలో।
దేన్నిబొందుటకిష్టమున్నదో దాన్నడుగు చేరిమెక్కునుగా । పె
త్తనమున కెన్నో తిప్పలుగా. 155

తా. శిష్యా! జంతువులన్నిటిలోను పెద్దదైన ఏనుగ కన్నార నిద్రపోక కడుపార మేతలేక ఆకులు, చెత్త మొదలైనవానినితినును. అన్నిటికంటె స్వల్పజంతువులగు నులిచీమ లెప్పుడును చక్కెర తినును. పెత్తనమున కెన్నితిప్పలున్నవో చూడుము. ఈ రెంటిలో నీకు పెత్తనముకావలెనా పిన్నతనము కావలయునా చెప్పుమని భావము.

కం. పదివేలకోట్ల గురువుల । మదిమెచ్చగసేవజేసి మరిశిష్యుండై । ప దిలపడిమేలుగనదగు । కుదురుగ నొకశిష్యునకును గురువుగారా దూ । పరులకుదెల్ప మదిసరసపడదూ । కదలకతమమూఖ్ఖ్య మొ దలకనిదురించి । పదురుచుమీబోధ కుఱరదనువారికి గురువుగా రాదూ । పరులకుదెల్ప మదిసరసపడదూ. 156

తా. శిష్యా! అనేకమంది గురువులకు సేవజేసి వారి శిష్యుడై వారికి మెప్పుకలుగజేసి వారివలన మేలు పొందవచ్చునుగాని బోధ జేయుచుండగా తమమూర్ఖము వదలక నిదురించుచు లేచి తమ బోధ నాకు తెలియదనిచెప్పే నొక శిష్యునకు గురువగుటకష్టమని భావము.

కం. పరమతహితమెరుగనియా । పరమార్థము నిహపరములపరిహా సంబై । పరతత్వబోధవార్ధిని । గరగింప మహానలంబుగాదేకు మారా । తరణోపాయసరణిదెట్లగురా । పరమతహితరహిత పర ధర్మబోధచే । పరభేదభవనివహ ప్రారబ్ధమంటునుగాదేకుమారా । తరణోపాయసరణిదెట్లగురా, 157

తా. శిష్యా! ఇతరుల మతధర్మముల ననుసరించని పరమార్థ బోధ నిహపరములకు పరిహాసమగును. పరిపూర్ణబోధయను సముద్ర మునింకింపజేయను మహా అనలంబగును దీనివలన జననప్రారబ్ధమంటు నని భావము.

గురునాజ్ఞ లేకుప దేశాధిపత్యమువహింపకూడదు.

కం. నేగురువని నేగురువని । లాగులుకొట్టుచునుపరులలావల్పములుక

భాగరుగక వోగరుగక। వాగుచు గురునాజ్ఞమీరువాడే గురుత్యాగీ । దుర్విషయదుర్భోగీబైరాగీ । రాగవిషయద్రవ్యభోగ దురాశల । లోగిపెద్దలకెదుట జోగిమైతాదిరుగువాడే గురుత్యాగీ । దుర్విషయదుర్భోగీబైరాగీ. 158

తా. శిష్యా! గురునాజ్ఞమీరి, నేను గురువును, నేను గురువనని గంతులువేయుచు, పరులయొక్క హెచ్చుతక్కువలు, మంచి శ్రేభలు తెలియకుండా విషయ, ద్రవ్య, భోగదురాశలకు లోబడి పెద్దల కెదురుతిరుగుచుండే జోగియే గురుత్యాగి యని భావము.

కం. గురునాజ్ఞ లక్ష్యపెట్టక । గురువైతనుదానె శిష్యకోటులకెల్లన్ । గురుమర్మము దెల్పెటియా । గురుదోహియపారఘోరకుంభీపాకమునా । గూలుటనిజము క్రూరనరకమునా । గురుదోహియనితాము నెరిగియాగురునిచే । పరమెరుగునరులిహపరశూన్యులై తుదకూకుంభీపాకమునా । గూలుటనిజము క్రూరనరకమునా. 159

తా. శిష్యా! గురువుయొక్క యాజ్ఞ లక్ష్యపెట్టక, తాను గురువై తనకు తానే శిష్యుల గురుమర్మములు తెల్పేవాడు గురుద్రోహి, వాడు ఘోరమైన కుంభీపాకక్రూరమైన నరకమున గూలుట నిజము. వీడు గురుద్రోహియని నరులెరిగియు, యిట్టి గురువు వలన పరబోధ నెరుగు నరులు యిహపరముల కెక్కక వీరును నరకమునకు పోవుదురని భావము.

కం. వేదశాస్త్రములలో । వాదములన్ బ్రహ్మవిదులవంచించుటకై । చీదరచదువులచేమీ । రేదడిగిన దెలుపుదంచున రేనసమనుచూ। సంస్కృతభాషతో దెల్పెదనుచూ । తాద్రవ్యకాంక్ష దుర్వాదములనుతన కే-బోధలేక పరులసాధింతుమనుచు వరేనసమనుచూ । సంస్కృతభాషతో దెల్పెదనుచూ. 160

తా. శిష్యా! ఇట్టి గురుత్యాగియగు దుర్మార్గుడు బ్రహ్మవేత్తలగు పెద్దలను వంచించి, తాను ద్రవ్యమును సంపాదించవలెనని తన

శిష్యులతో మీరేదడిగినను సంస్కృతభాషతో చెప్పుచుండెదను. నేనేమి చెప్పినను సరేయని మీరనుచుండుడని చెప్పును, గాని తనకు నేబోధయును తెలియదని భావము.

కం. ఈయల్పభోగ దేశిక । మాయోపాయముల తిరిగి మదమున ద్ర
 వ్యా-దాయముల కెల్లలోబడి । నాయాజ్ఞకుమీరి నటులనటియించ
 బోకూ । నీయెడదయ బాయునునాకూ । నీయోగశక్తివిధాయక
 మేగని । నాయుక్తినీకెరుక జేయకమున్నె గురువై నటించబోకూ ।
 నీయెడదయబాయునునాకూ. 161

తా. శిష్యా! ఈలాటి అల్పభోగముల గోరు గురువుల మాయోపాయములలో జేరి, ద్రవ్యాదాయములకు, నీవు లోబడెదవేమో నాయాజ్ఞకు మీరి నటియింపకుము. నాయాజ్ఞకు నీవు మీరినట్లు నాకు తోచిన యెడల నాదునీయందుండు కరుణ తప్పును. నీయొక్క పరిపూర్ణయోగమును నేను పరీక్షించి నాయుక్తి నీకెరుకసేయక ముందే నీవు గురువై నటియించవలదని భావము.

పరమహితోపదేశమునకు సామర్థ్యముగలశిష్యునిదయ
మెరింగి గురుండాజ్ఞయొసంగుట.

కం. ఈపట్టురహస్యార్థము । కాపట్యములేక నిస్తిగదతత్వములో ।
 నేపట్టెరుగనినరులకు నీపట్టివకింద్రపదము నిచ్చినవత్సా ॥ సర్వ
 ముధారబోసినవత్సా । పాపాత్మకులు దుష్టవ్యాపకులతిమూర్ఖ
 కోపతాపకులునీకే పరధనమైన నిచ్చినవత్సా । సర్వముధారబోసి
 నవత్సా. 162

తా. ముద్దులకుమారా! పరిపూర్ణ తత్వములో రహస్యార్థము, కపటములేకుండా నీకెచ్చితినిగదా? నీకు నింద్రపదము నిచ్చినను బ్రహ్మవిచారములేనివారికి బోధ నివ్వకుము. సర్వము ధారబోసినను, నింకా యెంతధనమిచ్చినను, పాపాత్మకులు దుష్టకార్యముల

యందు వ్యాపకులు, మూర్ఖులు, కోపతాపములు గలవారు. ఇట్టివా రలకీబోధ నెంత మాత్రము నివ్వవద్దని భావము.

కం. నానావిధదుష్కృతములు । నానావిభ్రమలనీది నాదనుభేద । జ్ఞా నులకీపరమార్ధని । ధానమునిక । నీవు తెలుపతగదుకుమారా ।
అదెఇహాపరహాని దెచ్చునురా । జ్ఞానులవలె బ్రహ్మజ్ఞానమడిగినవా రి । జ్ఞానమజ్ఞానములపూని తెలియక తెల్పతగదుకుమారా । అ దెఇహాపరహానిదెచ్చునురా. 163

తా. శిష్యా! అనేక విధములగు దుష్కార్యములు, అనేకవిధ భ్రమలుగలిగి, నాది, నీదను భేదజ్ఞానము గలవారికి పరమార్థము దెల్పతగదు. యిదే యిహాపరహాని దెచ్చును. జ్ఞానులవలెనే వచ్చి నిన్ను ఆత్మజ్ఞానము బోధింపుమని యడిగినట్టయిన వారి జ్ఞాన అజ్ఞా నము తెలిసికొనకుండా నీపరమార్థబోధ నివ్వకూడదని భావము.

కం నినుశరణనుబుధమానస । వనజాంతర్నియమసత్ప్రవర్తనల్లన్ కనివిని నానాటికిదిన । దినముకు నొక యోగమహిమ దెల్పగవలె రా । పట్టువిడుపుగని మెలగవలెరా । తనకు తనగురుమూలమున కుహానిలేని । ఘనతరాత్మబోధగనిపెట్టి తుదముట్ట దెల్పగవలెరా పట్టువిడుపుగని మెలగవలెరా. 164

తా. శిష్యా! నిన్ను శరణుజొచ్చినను బుధులయొక్క మనోనిమ ములను, మంచినడతలను, నీవు కనిపెట్టి యితరుల వలన విని, దిన మున కొకసంగతివంతున క్రమేణ తెల్పవలయును. పట్టు విడుపులను తెలిసికొని నీకును నీగురు మూలమైన పరిపూర్ణమునకును హానిలేని యా త్మబోధ కడముట్ట బోధించవలెనని భావము.

పరమహంస గురుదీక్షావిధానము.

కం. అద్యంతమునాయంత । ర్వేద్యంబగు సకలబ్రహ్మవిద్యల నిపుడే। బోధ్యముగ తెలుసుకొనిత । ద్విద్యాసంగ్రహము మరలవినుపింపు

తంఁడ్రీ । నా తనయుడవనిపింపుతంఁడ్రీ । ఘనయోగిజనమధ్య నిను జూచువారికి । ననుజూచునటుకోచె నెనరునిలుపుము బుద్ధివినుపింపుతంఁడ్రీ । నా తనయుడవనిపింపుతంఁడ్రీ. 165

తా. శిష్యా ! నాయొక్క హృదయమందుండు సకల బ్రహ్మవిద్యలను నిపుడే చక్కగా తెలిసికొని, నీవు తెలిసికొనసదానిని ముక్తసరిగా నాకు వినిపింపుము. తండ్రి బ్రహ్మవేత్తలమధ్యను నీవుండగా నిన్ను చూచువారికి నన్ను చూచునట్లుతోచే ప్రఖ్యాతిని నిలుపుమని భావము

కం. తలిదండ్రిగృహములోపల । మెలగెటిబాలికను నెనసుమీల్కడనరా । పొలతుకనాటలపాటల । తలపులమురిపెముల మురిశి తలితండ్రికెదుటా । పనిజేయక తెలవార్చు మొగటా । ఇల నత్తవారింటచెలగినిందెలుపెట్టి । కలహించి తనుతిట్టికొట్టకపోదురే తలితండ్రికెదుటా । పనిచాయక తెలవార్చుమొగటా. 166

తా. శిష్యా ! బాలిక పుట్టింటియందు పనిచేయకుండా తల్లిదండ్రుల కెదుట మురిపెములు జూపుచు నాట పాటలచే కాలము గడుపుచుంటే నొకరును నేమియనరు. ఆచిన్నది నత్తవారియింటనుండు నప్పుడు పనిచేయనియెడల నాయత్తవారు నిందలుపెట్టి పోట్లాడి తిట్టి కొట్టకపోదురా ? కొట్టెదరని భావము.

కం. అటుగాననిన్నునాముం । దట నెవరేమాటలిపుడు తటుకునన రేం । తటివారలైననావల । తృటిమాత్రముపరులమదికి తోచూ నీబ్రతుకూ । వ్యర్థుడవయ్యేఘటనేమోతుదకూ । ఘటికులగుపెద్దల నటనల కెదుటనీ । హాటములు సాగవిచ్చట బాగావినుమిటులతో చూనీబ్రతుకూ । వ్యర్థుడవయ్యేఘటనేమోతుదకూ. 167

తా. శిష్యా! అటువలెనే నాముందట నెంతటివారైనను నిన్ను తటుకున నొకమాటైనను ననరు. తరువాత నిన్ను గడ్డిపోచకంటే

హీనముగా జూచెదరు. వ్యర్థుడవై పోయెదవు. ఘటికులైన బ్రహ్మ వేత్తల ముందర నీహాటములేమియు సాగవు. నేను చెప్పినసంగతులు చక్కగా గ్రహించుమని భావము.

కం. తనయానీవెటుబల్కిన, వినిసంతోషింతునచలవిస్మయమున నే । మనజాలగదాయరుకను । కనివిడిచినదెరుగవేర కన్నకుమారా । కనువినుపనులు వెనకటివేరా । కనుమూసిలోబయలుకని బోధిం చెటినాకు। కనుదెరచివినునీకుగలవార తెలుసునకా। గన్నాకుమార । కనువినుపనులువెనకటివేరా. 168

తా. కుమారా ! నేను పరిపూర్ణానంద విస్మయముచే నీ వెట్లు పలికినను విని సంతోషించెదను. నే నేమియు ననజాలనుగదా ? యెరుక యిట్టిదని తెలిసికొని విడిచిపెట్టినది నీవెరుగవా ? కనే వినే పనులు వెనుకటివేగదా? కనుమూసి పరిపూర్ణమును కని బోధించేనా కును కను తెరచే వినే నీకునుగల వ్యత్యాసము తెలిసికొమ్మని భావము.

కం. తనయుండుదయించగనే । జనకునిమదినంతసంబుజలగునెమరియా తనయునిసద్బుధనివహము । ఘనుడనికొనియాడ విననగలుగునం తసమూ । నాటికిజనకునకు పుత్రోత్సవమూ । గనుకనిజశిష్యుని గనియోగిజనులెల్ల । వినుతింపగురుడదియు విననాటికెకాదా గ లుగుసంతసమూ । నాటికిజనకునకుపుత్రోత్సవమూ. 169

తా. శిష్యా ! కొమరుడు గలుగగనే తండ్రికి సంతోషము గలుగదు. తన కుమారుని గని బుద్ధిమంతుడని పెద్దలు కొనియాడు నాడు తండ్రికి పుత్రోత్సవము గలుగును. అటులనే తనయొక్క శి ష్యుని గని బ్రహ్మవేత్తలు మెచ్చుకొనినప్పుడు గురుడు సంతోషపడు నని భావము.

గురుశిష్యసమాగమాశ్చర్యవిధానము.

కం. నేనెవరోనీవెవరో । మానుగనొకరొకరిమునుపుమన మెరుగము యే । కానికిద్దైవీకృతమున । నీనెలవునమనము జేరుటనిమేగును

మహిమో । ఎవరికి తెలియ దేజన్మఫలమో । లేనిసంకల్పముమా నాకపనిగలిగి । ఘనియొనర్చు విధానమేమందు నిదివే గురుమహిమో । ఎవరికి తెలియ దేజన్మఫలమో. 170

తా. శిష్యా! నేనెవరో, నీవెవరో, మనమిదివరకొకరి నొకర మెరుగము. దైవకృతముగా మన మిద్దర మీచోట జేరుటే గురు మహిమో, యేజన్మఫలమో, లేనిపోని సంకల్పమొకటి గలిగి, అంతు లేని పనియొకటి గలిగెను. యీ ఆశ్చర్యమేమని చెప్పుదునని భా.

కం. వననిధిలోగలలవణము । వనమునగలయుశిరికలనువక చోటనుజేరినబహురుచిబుట్టినగతి । మనమిరువుర మొకటైన మహిమగల్గెనురా । నీనామనసుకలిసేకన్గొనరా । నిను నేగను వేళేమో ననుగన్న వేళేమో । మనమనసులో ప్రేమతనివితీరనియోగ మహిమాగల్గెనురా । నీనామనసుకలిసేకన్గొనరా. 171

తా. శిష్యా! అడవిలోని నుసిరకకాయలకును, సముద్రోదకము వలనబుట్టిన లవణమునకును సంబంధముగలిగి, రుచిపుట్టునటుల మనమిద్ద రమీస్థలమున గూడి మహిమగలిగెను, నీ, నా, మనసుకలసిపోయినది, నిన్ను నేను చూచిన వేళ యెట్టిదో, నన్ను నీవు చూచిన సమయమెట్టిదో, మన నొకరి మీద నొకరికి తనివిలేని ప్రేమ గలిగినదని భా.

కం. నిన్నే తలిదండ్రులో భువి। కన్నప్పటినుంచిబెంచికడసారివృధా । సన్యాసికిచ్చిరిదిమన । సున్నట్లుగ దైవకృతమునమరెకుమారా । నను నీవుగలుసుకున్నదిల్లారా । యున్నిశ్రమలకోర్చి తన్నానినాసందే । యున్నాపరిపూర్ణజ్ఞాముగన్నానన్నాదాశ నమరెకుమారా । నను నీవుగలుసుకున్నదిల్లారా. 172

తా. శిష్యా! భూమిలో నిన్నే తల్లిదండ్రులు కనుకొని పుట్టినప్పటి నుంచి పెద్దవానిని జేసి, కడపట వృధాగా నొక సన్యాసి కిచ్చిరి నన్ను నీవు కలుసుకొనుట, యెన్ని కష్టములకో నోర్చి, నీ,

నా, నందున్న పరిపూర్ణ బ్రహ్మమును దర్శించినావని, నీవన్వంతవరకు నీకథ గలుగుట, మనమనుకున్నట్లు దైవకృతము తటస్థించినదని భావము.

కం. తొట్టతొలినీవునేనొక । పట్టుగపరపురుగుచెవినబడకుండగలో। గుట్టునజరిగినపనికిటు । రట్టడినేబెట్టిబోధరాపీడిబెట్టీ । విడిబడితిట్టివిసికినినుగొట్టీ।వట్టిమాటలకేమిఇట్టిబాధలుసేయ । ఘట్టిబిడ్డవుగనుక పట్టజెప్పితిబోధ రాపీడిబెట్టీ । విడిబడితిట్టివిసికినినుగొట్టీ. 173

తా. శిష్యా! మొట్టమొదట నీవు, నేను, నొకచోటజేరి పరపురుగు చెవిన బడకుండా, నీకు నేనుపదేశమిచ్చిన పనికిట్లు రట్టడిచేసి, రాపిడిబెట్టి విసుకుచేత తిట్టి, దెబ్బలు కొడితిని. యిట్టి బాధలు పెట్టినను గట్టి బిడ్డవు గనుక బోధ నీమనస్సుకు స్థిరముగా పట్టేటట్లు చెప్పితినని భావము.

కం. యెవరెవరేమనుకున్నను । చెవిబెట్టకఘట్టిమనసు జేసుకనిగు । ట్టెవరికిదెలుపకనిలిచియు । నవిశేషముగానుబోధనమకూరువరకూ నేబెట్టుబాధలకోర్చికడకూ । ప్రవిమలపరిపూర్ణ బ్రహ్మనిష్టుడవైతి । భువిదివికలదాకసువివేకివై యుండునమకూరువరకూ । నేబెట్టుబాధలకోర్చికడకూ. 174

తా. శిష్యా! యెవరే మనుకున్నను, వినకుండా మనసు, ఘట్టిచేసికొని, నీగుట్టు నెవరికిని తెల్పక, నావలన పరిపూర్ణబోధ శేషము లేకుండా గ్రహించువరకును నేను బెట్టే కష్టములకోర్చి, కడకు నిర్మల పరిపూర్ణ బ్రహ్మనిష్టుడవైతివి, భూమ్యాకాశాదు లుండువరకును, పరిపూర్ణానందముచే నుండుమని భావము.

పరబ్రహ్మనిష్ఠప్రభావము

కం. సర్వనదీస్నానాదులు । సర్వక్షితిదానయజ్ఞ సత్ఫలంబుల్ । సర్వాను పైతృకకర్మలు । సర్వామరపూజఫలితసాధనలెల్ల । సర్వ

యోగసత్ఫలములెల్లా । సర్వాత్మదృష్టిలోక్షణముమదినిల్చిన । సర్వఫలములు దీనిసాటిరావు ఇతరసాధనలెల్లా । సర్వయోగసత్ఫలములెల్లా. 175

తా. శిష్యా! పరిపూర్ణ బ్రహ్మదృష్టిలో నొక క్షణము మనసు నిల్పిన కలుగు ఫలముకు భూమి యందలి సర్వ నదులలో స్నానముచేయుటవలనను, సర్వదానములు చేయుట వల్లను, యజ్ఞయాగాదులు చేయుటవలనను, పితృకర్మలు చేయుటవలనను, సర్వదేవతాపూజలు చేయుటవలనను, యోగములు సాధించుట వలనను గలిగిన ఫలములు సాటిరావని భావము.

కం. అట్టిమహాపరిపూర్ణము । ఘట్టిగనీమనసు నెల్లకాలమునొకటై । పట్టెరిగినగురుబోధలో । పుట్టితివికనీవుమరలపుట్టగబోవూ । మరణములునీతట్టుకేరావూ । మొట్టమొదటమనలో నెట్టిప్రమాణము । బుట్టెనోనదికడగట్టెక్కెనేటికి పుట్టగబోవూ । మరణములునీతట్టుకేరావూ. 176

తా. శిష్యా! అటువంటిపరిపూర్ణము సర్వకాలసర్వావస్థలయందును నొకటియై యుండు ఘట్టిపట్టు నీవెరిగితివి గనుక నీకిక జన్మలేదు. మరణములు నీతట్టిరావు. మొట్టమొదట మనమే ప్రమాణము జేసికొంటిమో నది నేటికి సఫలమైనదని భావము.

కం విలసితముగనేకులమున । సలలితనిజబ్రహ్మవేత్తజన్మించిననా । కులముపవిత్రముజననియు ! తలపోయకృతార్థురాలు తండ్రీధన్యుడూ । బంధుకోటిపావనులెపుడూ । ఇలపూర్వత్రిసప్తకులజులనఘులుపుణ్య । కలితులాశ్రితమిత్రబలసంతతులు నతసితండ్రీధన్యుడూ । బంధుకోటి పావనులెపుడూ. 177

తా. శిష్యా! అనుభవజ్ఞానియైన బ్రహ్మవేత్త యేకులమందు జన్మించునో నాకులము పవిత్ర మవును, తల్లి కృతార్థురాలు, తండ్రి

ధన్యుడు, బంధువులు పావనులు, ఆశ్రితులు, స్నేహితులు, త్రిసప్త కులజులు పుణ్యులగుదురని భావము.

కం. నీవిట్టిబ్రహ్మవేత్తవు। గావుననిస్సంశయముగకడతేరియుమ।ధ్భావ జుడవైతినీకుల। పావనమైజలగెమత్ప్రభావమువలనా। పరతత్వా నుభవమిదేగానా। నీవేనేననునాత్మ భావమునీవైతివి। గావున పరిపూర్ణదేవుడ విక మత్ప్రభావము వలనా। పరతత్వానుభవ మిదేగానా. 178

తా. శిష్యా! నీవిటువంటి బ్రహ్మవేత్తవుకాన సందేహము లేకుండా కడతేరితివి. నాయొక్క మానసపుత్రుడవైతివి. నాప్రభావ మువలన నీకులము పావనమయ్యెను. పరిపూర్ణానుభవమిదే నీవే నే నను నాత్మభావము నీవైతివిగనుక శుద్ధపరిపూర్ణ పరబ్రహ్మవు నీవే నని భావము.

గ్రంధబోధానక్తలక్షణము.

కం. పరమార్ధవేత్తలకు నిది। పరమార్ధగ్రంధమనుచుభావనగలుగున్। పరమార్ధసారమెరుగని పురుషార్ధమకోటిదీని పొందెరుగగలరా। ఇ దిగనినయర్ధముశాయగలరా। నరులు టెంకాయలుదొరికిన తిన గలరు। మరిమర్కటమువాటితిరిగ్గినజూచునే పొందెరుగగలరా।ఇ దిగనిన యర్ధముసేయగలరా. 179

తా. శిష్యా! ఈగ్రంధము పరమార్ధవేత్తలకు పరమార్ధగ్రం ధమని తోచును. పరమార్ధ మెట్టిదో తెలియని యధములకు దీనినం గతేమియు తెలియదు. దీని అర్ధము వారికిదెలియదు. ఎట్లనగా టెం కాయలు నరులకు జిక్కిన భక్షించగలరుగాని, కోతులు వాటిని జూడ నైనను చూడవని భావము.

కం. ఈబోధామృతగంధము। లోబలికెటి పద్యములకులోవెలితోచే। ప్రాబల్యార్ధద్వయములు। నీబుద్ధిచెచదివియర్ధ నిల్కడగనరా।ని

జపరిపూర్ణాకె మెలుకువగనరా । నేబయలుపరచితినీబయలుగనుబో
ధ । లోబుద్ధిచెదరక నాబుద్ధిమరువకనిల్కడగనరా। నిజపరిపూర్ణ
మెలకువగనరా. 180

తా. శిష్యా! ఈ అమృతసారమైన గ్రంథములో వ్రాయబడిన పద్యములను చదివి వీటియొక్క అంతర్బాహ్యార్థములు చక్కగా గ్రహించి నిజపరిపూర్ణానుభవమునందలి నీయొక్కబుద్ధి చెదరకుండా నేను చెప్పినబోధ మరువకుండా పరిపూర్ణుడవై యుండుమని భావము.

కం. యేపెద్దలచలనిష్టులో । నాపెద్దలవద్దచదివి యర్థవిచారం। బేప్రొ
ద్దుజేసిగ్రంథము । కాపాడగవలయునన్ను కన్నకుమారా । ఇదెప
రమనిక్షేపమనుకోరా । యేపెద్దలును గన్నదీ పరిపూర్ణమే।యా
పరిపూర్ణనిక్షేపమేనీకిస్తి కన్నకుమారా । ఇదెపరమనిక్షేపమను
కోరా. 181

తా. నన్ను కన్నకుమారా! ఎల్లపుడును అచలనిష్ఠులగు పెద్దలసన్నిధిలో నీగ్రంథమును చదివి, అర్థవిచారముచేయుచు గ్రంథమును కాపాడుచుండుము ఇదే పరమనిక్షేపమని తలచుకొనుము. యేపెద్దలు గనినను నీపరిపూర్ణమే. అట్టి పరిపూర్ణమును నీకిచ్చితినని భావము.

## పరమరహస్యాంతర్గురుబోధ.

కం. నినుపరిపూర్ణసుధాకరు । డనినమ్మితి నేటివరకునదిశమునీయా।
త్మనుచల్లబడుటనోకును । వసజభాండములకెల్ల వడిచల్లనా
యా । నీనాజన్మలును సఫలమాయా । మనయాత్మచల్లనై మానము
కడతేరెన । దినమేసర్వయోగిజననివహములు నలరివడిచల్లనాయా
నీనాజన్మలును సఫలమాయా. 182

తా. శిష్యా! నేటివరకు నిన్ను పరిపూర్ణచంద్రుడవని నమ్మినాను, నీయాత్మచల్లబడుటచే నాకును, బ్రహ్మాండముల కెల్లను చల్లనాయెను, నీనాజన్మములును సఫలమాయెను, మన యాత్మస్థిమితపడి మనము కడతేరినప్పుడే, సర్వబ్రహ్మవేత్తల సమూహములును సంతసించి తృప్తి జెందిరని భావము.

కం. మనమొక దురుశిష్యాఖ్యల।గనుపడి ప్రశ్నోత్తరాది కార్యస్థితులన్। తనువెరుకల భ్రమలౌదవే। పనితీరేవరకు బోధపరచితి నేనూ।విను చుంటివికథనీమనముననూ। వినుపించు వేళలను దీపకర్పూర। తనువులలరికడకుఘన తేజముగ యగుపరచితి నేను। వినుచుంటివి కథ నీమనమునసూ. 183

తా. శిష్యా! మనమిద్దరము గురువనియు, శిష్యుడనియు, కనుపడి, ప్రశ్న ప్రవచనాది కార్యములో శరీర, ఎరుకల, భ్రమపోవువరకును, బోధపరచితిని, నీవుగ్రహించుచుంటివి, దీపకర్పూరముల వలెమన శరీరములుండి కడకు తేజమొకటైయైనట్లు నగుపరచితినని భా.

కం. తెలిపితి తెలిపితి యచలము। తెలిపితినికమీద మరల తెలపవలదనే। పలుకిపుడు నీదునోటను। పలికితివికచాలుచాలుపరమార్థపుత్రా। నిజపరిపూర్ణశీలసుమిత్రా। ఇలలోన నాతపోఫలమున గలసిన। వెలలేనిమద్వంశజలధిచంద్రుడవీవే పరమార్థపుత్రా।నిజపరిపూర్ణశీలసుమిత్రా. 184

తా. పరమార్థపుత్రా! నీకచలబోధ విస్తారముగా జేసితిని, యికమీద బోధచేయవలదు చాలుననే మాట యిప్పటికొచ్చినది, యింకచాలును, పరిపూర్ణుడవైతివి, నాతపోఫలము వలన, పావనమైన, నావంశమను సముద్రమునకు చంద్రుడవు నీవేనని భావము.

కం. గురువరమీసత్కృపచే । పరిపూర్ణుని జేసినన్ను బ్రహ్మమయునిగా।
గురు తెరిగించితిరిక । మరు గేమియు లేదుయచలమహిమలోపలనూ।
కొరతయు లేదీపరమబోధకునూ । పరబయ లెరిగినమీద పరభాష
లు । పరమేశ్వరాజ్ఞచే పరిపూర్ణమైయుండూ । మహిమాలోపల
నూ । కొరతయు లేదీపరమబోధకునూ. 185

తా. సద్గురువరా! దేవరవారి పరిపూర్ణ కటాక్షముచే నన్ను పరిపూర్ణుని జేసి, బ్రహ్మమయుని జేసితిరి. అచల మహిమలో కొరత లేమియు లేవు. పరిపూర్ణ మెరిగిన మీదట పరమేశ్వర కృప వలన పరభాష లెల్లను పరిపూర్ణమయ్యే యున్నవని భావము.

పంచమ ప్రకరణము సంపూర్ణము.



శ్రీగురుభ్యోనమః.

# శ్రీ శుద్ధాద్వైతప్రబోధ గురుశిష్య సంవాదము:

## ఉత్తరభాగము—అష్టమ ప్రకరణము.

### మహదానంద ప్రకరణము.

శిష్యపరిపూర్ణానుభవ మహదానంద ప్రశంస.

కం. గురుపరమేశ్వరకారణ । గురుభావానందతత్వగుణవిస్తారా। గురుభూమండలభాస్కర । గురుపరిపూర్ణావతార గురుతత్వధీరా। పరాత్పరగురుబోధసారా । గురుసార్వభౌమమీపరమయోగానంద పరవశాబ్ధిలో మునిగి పరిపూర్ణుడనై యుంటి గురుతత్వధీరా । పరాత్పరగురుబోధసారా. 1

తా. గురుసార్వభౌమా! పరిపూర్ణస్వరూపా, మండల భాస్కర, పరాత్పరా, పరిపూర్ణానంద పరవశ మహాసముద్రమందు మునిగి పరిపూర్ణుడనై యున్నానని భావము.

కం. స్వామీనాయనుభవసుఖ । మేమోమీకృపను యచలమికనిశ్చలమై । యేమనదువినదు కనదిక। నామహిమేమహిమగానునాకగుపడెగా । నామనవివినుడేమనకనరిగా । ఓమహాత్మకసర్వభ్రామికథొలగినే । నీమహాపరిపూర్ణ దేవుండనై నటులనాకగుపడెగా । నామనవివినుడేమనకనరిగా. 2

తా. స్వామీ! గురునాథా, నాయనుభవముయొక్క సుఖమేమో తమకృపవలన నే నేమని చెప్పుదును, పరిపూర్ణము చెలించదు. యేమీయనదు, వినదు, కనదు, నామహిమే మహిమగా నాకగుపడుచున్నది, ఓమహాత్మా! నాకు సర్వభ్రమలు తొలగి నేను పరిపూర్ణబ్రహ్మమైనటుల నాకు నిశ్చయమైనదని భావము.

కం. తెలియగదగు పరమార్థము । తెలిపితిరికసకలశ్రుతుల తెలిసితినా త్మ్రక్ । వెలిలోపల నహరహముల । నిలిచినపరిపూర్ణ బ్రహ్మనిష్ఠ గలిగెనుగా । గలిగినభ్రమవిలయమందెనుగా । తెలిపేదేలేదు నే తెలిసేదేలేదునీ । తెలివిలేదు నేనుకలసితిమీలోననిష్ఠగలిగెనుగా। గలిగినభ్రమ విలయమందెనుగా. 3

తా. గురువరా! తెలియవలసిన పరమార్థమును కరుణించితిరి. సకల శ్రుతులునే గ్రహించితిని. వెలుపల లోపల నిండియున్న పరిపూర్ణ బ్రహ్మనిష్ట కలిగెను. తోచినభ్రమయెన్నడో పోయెను. యిక మీరు తెలిపేదేలేదు. నేను తెలిసేదేలేదు. తెలివేలేదు. నేను తమలోనైక్యమైతినని భావము.

కం నాయనుభవపరిపూర్ణము । నాయతిశయభోగమహిమ నాపరవశమున్ । నాయపరిమితానందము । నాయంతర్బాహ్య సుఖము నాలోననేనూ । నేమందహాహామీ యోగకృపనూ । నాయాత్మ మీయాత్మ వే యచలమునజెందూ । నాయఖండము నెడబాయక నిలిచితి నాలోన నేనూ । నేమందహాహామీ యోగకృపనూ. 4

తా. గురుదేవా! తమ యోగకృపచే నాపరిపూర్ణానుభవము నాయొక్క యతిశయమైన పరిపూర్ణభోగ మహిమ నాపరమానందము. నాయంతర్బాహ్యసుఖము. ఆహా యేమని చెప్పుదును. నాయాత్మ మీయాత్మయే పరిపూర్ణమందు జెందినదో యాపరిపూర్ణము నెడబాయక నిలచితినని భావము.

కం. తెలివికివెలిలో వెలిగే । తెలివినిగనలేక మొరక తెలివిచెనేమో। తెలిపెడ తెలిసెదననిమును । బలికిన పలుకులను వినగ పరవశమాయా । పలుకావలను పలుకే లేదాయా । తెలియచెప్పినదేదో తెలుసుకున్నదియేదో । తెలియనలవిగాదు తెలివిలేదుచూడ పరవశమాయా । పలుకావలనుపలుకే లేదాయా. 5

తా. గురువరా! తెలివికి వెలితోవెలిగే యనగా నేప్రజ్ఞ ప్రపంచజ్ఞానము నెరుగుచున్నదో నాకూటస్థునకు వెలిలో ప్రకాశించు పరిపూర్ణము నెరుగలేక నెరుక తెలివిచే నేను తెలిపెదనని నేను తెలిసికొనెదనని యిదివరలో నన్నమాటలు వినగా నాశ్చర్యమగుచున్నది. పలుకు కవతల పలుకే లేకపోయెను. తెలుసుకునే తెలివిపోయిన మీాద తెలిసినదేదో తెలిసికొన్నదేదో, తెలియుటకు నలవిగాదని భావము.

కం. నాకును నావందనమెం। దాకనొనర్చెదనొనంతదాకాత్మస్వతం।
తాకల్పితకర్తృత్వము। నాకును నాలోనజెంద నాయాత్మగనగా।
తనుదాజేయులోకసమ్మతిగా। నాకు నేక ర్తనుగాకున్నా ననుకు
న్న ఏకపరిపూర్ణమందెవరి నెట్టులగందు నాయాత్మగనగా। తను
తాజేయులోకసమ్మతిగా. 6

తా. దేశికేంద్రా! నాకు నేను నమస్కారమెంతవరకు జేసెదనో నంతపర్యంతరమాత్మకు గలిగిన కర్తత్వము నాలోనేచెంది లోకనటన జరుగుచుండును, నాకు నేకర్తనుగాదనుకుంటే నిండిన యఖండపరిపూర్ణ బ్రహ్మమందెవరని నెటులజూచెదనని భావము.

కం. పరిపూర్ణాంభోనిధినై। బరగెటినాయందునకల బ్రహ్మాండంబుల్।
వరఫేనబుద్బుదాదుల। కరణిన్ తనుదా నెకలిగికడక దేపోగా। భ్ర
మపడి వేర్వేరనుకుంటివృధగా। పరమాఖండసూర్యకిరనాళిలోలో
క। మరయమృగతృష్ణిక సరణీదోచియదియే కడకదిపోగా।భ్రమ
పడి వేర్వేరనుకుంటివృధగా. 7

తా. సద్గురునాథా! అలలు, నురుగు, బుగ్గలు మొదలగునవి సముద్రమునందే బుట్టి యందే నణగిపోవురీతిగా, పరిపూర్ణమహాసముద్రమై ప్రకాసించు నాయందు సకలచరాచరబ్రహ్మాండములు తమంతటతామె గలిగిపోవుచుండగా భ్రమపడివృథాగా వేరనుకుంటిని

అఖండపరిపూర్ణమందీ ప్రపంచము చూడగా నెండమావులవలెదోచి అబద్ధమైపోవుచున్నదని భావము.

కం. ఘనచిత్సమాధిసాధన । కనకాచలమెక్కి నూర్ధ్వఖచరుడనగునా। కనిశముతనుమనవిభ్రమ । బెనగునధోలోకదృష్టి ప్రియమెటుల చాలా । కలదోలేదో ననుభయమేలా । మునుజెందు భ్రమకింత పని బుట్టిపెరిగిచి । ఘనగురు మహిమచే కడతేరితిలోకప్రియమెటు చాలా । కలదోలేదో ననుభయమేలా. 8

తా. పరమగురురాయా! తమ మహిమవలన నేను బ్రహ్మావలోకన సమాధియందు నూర్ధ్వదృష్టి యనగా, పరిపూర్ణావలోకన జేయునాకు, శరీరమనోభ్రమతో గూడుకొనిన యధోదృష్టి యనగా, ప్రపంచస్ఫురణనేలాగు ప్రియమగును, లేనిభ్రమ కింత పని గలిగి పెరిగి తమ బోధచే కడతేరితిని, ప్రపంచమున్నదా లేదా యను భయము నాకెందుకని భావము.

కం. అందెరుగని పొందెరుగని।సందేహము లేదుబయలు చక్కగ వెలుగన్ । నిండేమొరాకపోకకు । సందున్నదటంచుబలికే నర్వాబద్ధముకూ । యంతగదెల్పితెంగుకోనాకూ । యెందుకై నదీని పొందు దలపగసమయ । నందర్భములభ్రమబొంద పెట్టితెచాలు నర్వాబద్ధముకూ । యంతగదెల్పితెందుకోనాకూ. 9

తా. కారణాచార్యా! గోమియు నెరుగని పరిపూర్ణము సందేహము లేకుండా నిండి ప్రకాసింపుచుండగా దీనియందు రాకపో కలకేమా సందుకలదని చెప్పె నర్వాబద్ధపుమాట లెందు కింతగా నాకు బోధించితిరి. ఎప్పుడో నొకప్పుడెరుక పొడమిన సమయమున నీభ్రమను నిర్మూలము జేసితే చాలునని భావము.

కం. అదెబయులల్లదెయచలం । బిదెబ్రహ్మమటంచుబోధ నందేవరకే । గదయురుకరాకపోకలు । కదలనిమొదలెరుగుమీాద కధలునాముం

దూ ♦ తనువెఱుకాలు మొదలానిసందూ । అదిగన్నపిదప నేకుదురుని
లువకదాని । కదెలయమగుదీని కిది రోలయమగుబైట కధలునా
ముందూ । తనువెరుకాలు మొదలానిసందూ. 10

తా. గురుచంద్రా! అల్లదే పరిపూర్ణమని బోధనొందేవర కేగదా! నీయెరుక రాకపోకల భ్రమగలుగు చున్నది. శరీర యెరుక లభ్రమ రహితమైన తర్వాత పరిపూర్ణబ్రహ్మదర్శనమైన తర్వాత నెరుక యెక్కడ నున్నది. యెరుక తనకు తానే మూలములేక పోవు చున్నది. శరీరము దీనికిదియే పోవుచున్నదని భావము.

కం. తెలవారెనునాజన్మము । తొలుతొలుతటినాదుభ్రమల తొలగిం
చుటకై । ఇలలోగురుశిష్యాఖ్యల । చలగిన తత్కాలమహిమ చ
ర్యాలుదెలుపా । నాకదిపెద్దకలగాదే దలుపా । కలయరుకమేల్క
నిమెలగిచూచిన బయలు । కలిమిలేములులేక కలిగేపరిపూర్ణాము
చర్యాలుదెలుపా । నాకదిపెద్దకలగాదె దలుపా. 11

తా. గురుప్రభో! ఇప్పుడు నాజన్మకడతేరెను మొట్టమొదట నాకుండిన భ్రమను బోగొట్టుటకై గురుశిష్యుల పేర్లచేత నటించిన పనులిప్పుడు తలచితే నాకొక కలగా దోచుచున్నది. భ్రమమూల మగు కలలో నుండి మేల్కని చూచిన పుట్టుచావులులేని స్థిరమైన పరిపూర్ణము తప్ప మరేమియు లేదని భావము.

కం. ఎరుకనునొక తెరచాటున । పొరబాటుగనాడు తోలుబొమ్మలవలె
నీ । మరుగువనీనాయాటలు । జరిగెనుబహుకాలమింద్ర జాలము
గానూ । యరుకనుమోహపర వశములోనూ । పరిపూర్ణవాయు
వా తెరగ్రొత్తికొనిపోయే । తెరలేని తెరగాయె మనయాట నరిపో
యే జాలముగానూ । యరుకనుమోహపర వశములోనూ. 12

తా. దేశికేంద్రా! ఎరుకయను తెరచాటున యింద్రజాల ముగా తోలుబొమ్మలాడినటుల చాలకాలము నీ నా యాటలు జరి

గెను. ఈభ్రమయను మోహపరవశమందు మనముండగా పరిపూర్ణమహా వాయువా యెరుక తెర నెగరగొట్టుకొని పోగా, తెర లేక పోయెను. మనయాట నంతటితో సరిపోయెనని భావము.

కం. మేటిగనను నాలోనే । సూటిగ గనుమన్నమాట సూక్ష్మము మదిలో । నాటనికాలములోనొక । కోటిపురాణాగమాది గురునియమములా । దెలుపుచునితర పోటిసాటువలా । ఆమాటకొరకు గనే ఘ్యాటతొంబై యయిదు । పాటలుపాడి నన్నాటలాడి స్థిరి గురునియమములా । దెలుపుచునితర పోటీసాటువలా. 13

తా. దేశికవరా! నిన్ను నీవు తెలిసికొమ్మని మొదట తమరానతిచ్చి యామాటయొక్క సూక్ష్మము నామనస్సున స్థిరపరచుటకు ననేక పురాణాదులు, సాటువలచే బోధింపుచూ యేడువందల తొంబదిమైదు పాటలు బాడి నన్నాటలాడించి తుదకుకడ తేరిచితిరని భావము.

కం. పరిపూర్ణము నుజూపుచు । పరమకృపాలోకనమున భక్తుడనగుమ । త్వరవిభ్రమ మెరుకణచియు । పరహిత మొనరించునట్టి పరగురుస్వామీ । కడ తేరితి మరుగు లేదేమీ । పరిపూర్ణమిక నేనై పరవశాబ్ధిలోనిలువ । పరభాషవినబడదు పరబయలు పలుకదు పరగురుస్వామీ । కడ తేరితి మరుగు లేదేమీ. 14

తా. పరమకృపచే భక్తుడనగు నాకు మొట్టమొదట పరిపూర్ణమును జూపి, తరువాత భ్రమరూపమైన నెరుకను నిర్మూలము జేసిన పరమగురుస్వామీ, నేను కడ తేరితిని. అనుమాన మేమియు లేదు. పరిపూర్ణ బ్రహ్మము నేనై పరవశముచే నేనుండగా నాకితర భాష వినబడదు. పరిపూర్ణము పలుకదని భావము.

కం. అనియిట్లఖండపరవశ । ఘనపూర్ణానంద వార్ధిగతుడై శిష్యుం । డనుపమవాఙ్మధురసనం । జనితోక్తులు బలుక గురుడు సంతసమందీ పలికెను మహదానందమందీ। తనయా నీసత్యసాధనభూత పరిపూర్ణ

యనుభవదశకునామనమలరెనినిసర్వ సంతసమందీ । పలికెనుమహా దానందమందీ. 15

తా. ఇట్లు పైనిచెప్పిన ప్రకారము శిష్యుడచలానంద మహా సముద్రమందుండి మధురసమొలుకు పలుకులు బలుకగా సద్గురుడానంద మగ్నుడై, కుమారరత్నమా! నీయొక్క పరిపూర్ణానుభవదశకు నాకు చాలా సంతోషమాయెనని భావము.

కం. ఆనందమహార్ణవమున । ఆనందవిలాసదివ్య హర్మ్యాంతరయో ।
గానందతల్పమునబ్ర । హ్మానందసుషుప్తిజెంది తద్భుతమాయా ।
నాలోసుఖము నాదేనాదాయా । ఆనందమయమాయ ఆనందసు
ఖమాయా । ఆనందపరవశ మానంద మొకటాయ యద్భుతమా
యా । నాలోసుఖము నాదేనాదాయా. 16

తా. పరమగురుచంద్రా! ఆనంద మహాసముద్రము నందానంద విలాసమగు మేడలో పరిపూర్ణానందశయ్యపై, బ్రహ్మానంద నిద్రజెందితిని. నాలోని సుఖము నేనే జెందితిని. బ్రహ్మానందసుఖముచే నంతా యానందమయమై యఖండానంద మొకటేయాయెను. యిది మహా అద్భుతముగా నున్నదని భావము.

శ్రీమదఖండ బ్రహ్మపరత్వైకాంత గురుశిష్య సంవాదము.

కం. గురుశిష్యులటుల కేవల । పరమానందమున నాత్మబ్రహ్మవిలాస ।
స్ఫురణానురాగమానస । ఘనులగుచునుపూర్వ శిష్టగణములతో
డా । సల్పిరిబ్రహ్మనందరతిక్రీడ । పరిపూర్ణచలయోగ బ్రహ్మ
పరత్వైక । పరమాఖండవిలాసపరవైభవము శిష్యగణములతోడ।
సల్పిరిబ్రహ్మనంద రతిక్రీడా. 17

తా. ఈప్రకారము గురుశిష్యులందరును పరమానందముచే పరిపూర్ణాచలయోగ మహిమగల యేకాంత బ్రహ్మనందక్రీడ పూర్వపుబ్రహ్మవేత్తలచే పరమానందముగా జరుపబడెనని భావము.

కం. పరచక్రమండలాకృతి । పరమవిలాసాను మోదపావీణ్యాశుభా ।
కరపరమహంసతారక । పరిషేవముమధ్య శీతభానునికరణి । శ్రీ
గురుమూర్తి మెరసేనీధరణీ । వరరాసమండలసరణిజేయగ బ్రహ్మ
నిరుపమ సత్యసంభరితగురుడు శీతభానునికరణీ । శ్రీగురుమూర్తి
మెరసేనీధరణి. 18

తా. ఆత్మవేత్తలందరును కేవలాత్మ విలాసకుతూహలులై చక్రాకృతిగా నిలచి రాచక్రీడలు సలుపగా పరమవేత్తలనే నక్షత్ర సమూహముమధ్యను పరిపూర్ణస్వరూపుడగు సద్గురుమూర్తి చంద్రునివలె ప్రకాశించెనని భావము.

కం. గురుపరమేశ్వరుడద్భుత । కరనిరుపమయోగ మహిమకల్పనచాతక । గురునిజరూప సమావృత । గురుశిష్యమహావిలాస కోటులిట్లతిగా । నిలచిరిరాస మండలప్రభగా । గురుగురు మధ్యనస్వరశిష్యాగ్రిణియుత । ద్వరశిష్యద్వయమధ్యగురురూప ములవిభుధకోటులిట్లతిగా । నిలిచిరిరాసమండలప్రభగా, 19

తా. గురుపరమేశుని అద్భుతమహిమవలన, గురుని రూపములతో గూడిన గురుశిష్య సమూహము లెల్లను రాచమండలముగా నిద్దరు గురువుల మధ్య నొక్క గురువును, యీ ప్రకారముగా మహదానంద విలాసముతోటి నిలచిరని భావము.

కం. వలయవలయముల గన్పడి । చెలగిగురుండతనిచెంత శిష్యుండిట్లా । వలలోపలనిలువంబడి । రెలమిప్రకాశించెసర్వమేక బ్రహ్మముగా । పరవైభవమండలప్రభగా । వెలయునేదేశికుగలయు శిష్యునికచట । నలలితాచలబోధనల్పినటుల సర్వమేకబ్రహ్మముగా । పరవైభవమండలప్రభగా. 20

తా. ఒక గురువును, నొక శిష్యుడును, నీ ప్రకారము వలయములు నిలుచుండి, ఏగురువుచెంతనున్న శిష్యునకా గురువు

అచలబోధజేయుచు, సర్వమును పరిపూర్ణబ్రహ్మమయమైనటుల ప్రకాసించిరని భావము.

కం. మండలమెల్లను యచలా । ఖండంబై యాత్మబోధమత్యంత మహీ । మండలమున దివ్యముగా । నిండెను బ్రహ్మాండ భాండనిఖిలము లెల్లా । పరమహంసమండలీవల్లా।తండోపతండములండకండలుగన । త్పండితకోటిప్రచండమై భవకీర్తినిఖిలము లెల్లా। పరమహంస మండలీవల్లా. 21

తా. పరమవేత్తల సమూహము లెల్లను, నిట్లు పరిపూర్ణాచార్యక్రీడ సలుపగా, నఖండమైన పరిపూర్ణానందము బ్రహ్మాండ భాండము లెల్లను, నిండినిబిడీకృతమై, భూమండలమున ప్రకాసించెను. ఈ బ్రహ్మవేత్తల కీర్తి లోకము లెల్లను వ్యాపించెనని భా.

కం. కొందరుపరమశివోహం । బందురు మరియందు కొందరాత్మస్వసోహం । బందురుకొందరజోహం । బందురఖండోహమచల మందురుసరిగా । బ్రహ్మైవాహ మందు రేకముగా । కొందరా నందోహమందురుమరికొంద । రందురు పరమోహమందు రనంతోహమందురు సరిగా । బ్రహ్మైవాహమందు రేకముగా. 22

తా. కొందరు బ్రహ్మవేత్తలు పరమశివోహమనియు, మరి కొందరు సోహంఅనియు, కొందరుఅజోహమనియు యింకాకొంతమంది యుఖండాచలోహమనియు, కొందరానందోహమనియు, పరమోహమనియు, కొందరనంతోహమనియు నందురు. అందరును గలసి బ్రహ్మైవాహమనియందురని భావము.

కం. ఇతరేతరయోగముతో । నితరేతరపరమయోగ నిజవిద్యలతో । నితరేతరానుభవముల । నితరేతర చిత్సమాధినిష్ఠలతోనూ । రొకరితో నొకరుహితము దెలుపుచునూ । అతులితబ్రహ్మానంతతు లెల్లనంతోష । మతిశయిల్లగ గురుపతిని సేవించుచు నిష్ఠలతోనూ । రొకరితొనొకరు హితము దెలుపుచునూ, 23

తా. గురుపుత్రులైన బ్రహ్మవేత్త లెల్లరును బ్రహ్మానంద ముతో నోలలాడుచూ, నతిశయమైన నిష్ఠలచే సద్గురురాయుని సేవించుచు, వారి వారి యోగవిద్యలతోను, వారి వారి యనుభవముతోను, సమాధిసిద్ధులతో నుండి యొకరితో నొకరు వారి వారి యనుభవములను జెప్పుకొనుచు, బ్రహ్మవిచారము చేయుచుండిరని భావము.

కం. గానస్వరశృతిలయసం । ధానమృదంగాది సప్తతాళధ్వనినా । ట్యానుగతసరససంగీ। తానందోల్లాసక్రీడలతివిహితముగా । సల్పిరి బ్రహ్మమానసులతిగా । స్వానుభవానందజ్ఞానసమాధుల । బూని తనుమనభ్రాంతి । మానపరరక్తిక్రీడలతిహితముగా । సల్పిరి బ్రహ్మమానసులతిగా. 24

తా. పరమ హంసలు తమ శరీరమనో భ్రాంతులు లంఘించుటకు వారి స్వానుభవానందముచే మృదంగ, తాళ, గాన, స్వర, శృతి, లయ, సంగీతములచే నాట్యముచేయుచు పరిపూర్ణానంద రతిక్రీడలు, పరవశులై సలిపిరనిభావము.

కం. ఏకాఖండమహార । త్యేకాంతరహస్యక్రీడలే కాకృతమై । ఏకాగ్ర బ్రహ్మనిష్ఠత । దేకతపోమహిమజెలగియే కాధికమై । పరమండల మేకచిన్మయమై । ఏకపరిపూర్ణ నిర్వ్యాకుల నిశ్శబ్ద । లోకనమై బ్రహ్మలోకనమై యలరియే కాధికమై । పరమండలమేక చిన్మయమై. 25

తా. ఈయఖండమైన ఏకాంత రహస్యక్రీడయే కాగ్రబ్రహ్మనిష్ఠ చే నేకాకృతమై పరమండలమెల్ల చిన్మయబ్రహ్మమై నిర్వ్యాకుల నిశ్శబ్ద నిరామయాఖండ పరిపూర్ణ బ్రహ్మలోకమై ప్రకాసించెనని భావము.

కం. ఈవిధమున శ్రీగురుపర । దేవుడుశిష్యప్రశిష్యధీరులతో బ్ర । హ్మావిర్భవపరమోత్సవ । భావైక్యక్రీడసల్పిపరవశపరచీ । నిజరూపవిభవమునరిపరచీ । యావలపూర్వస్వభావరీతిగగురు । దేవశిష్యు

లుమాత్రనూవిధముననిలచీ పరవశపరచీ । నిజరూపవిభవము సరి
పరచీ. 26

తా. ఈప్రకారమున పరదేవుడగు శ్రీసద్గురుస్వామి శిష్యపరం
పరలతోటి పరిపూర్ణ బ్రహ్మరాసక్రీడ భావైక్యవిధిగానల్పి, వారిని పర
వశులనుజేసి తన నిజస్వరూపమిట్టిదని యనుభవముచే కనుపరచిన
తరువాత మునుపటివలె గురుశిష్యులరూపములతోటి నిలిచిరనిభావము.

కం. అంతట గురుశిష్యులుబా । హ్యాంతరపరిపూర్ణచిత్సమాధియశశ్రీ।
కాంతులు పరవశమున భూ । కాంతులునై వెలసిరఖిలఘనతరమ
హిమా । సమరససత్యశాంతసన్మహిమా । సంతతానంతవిశ్రాంత
చరచరా । ద్యంతహ్యాద్యంతస ర్వాంతరనివసితఘనతరమహిమా ।
సమరససత్యశాంతసన్మహిమా. 27

తా. అంతట గురుశిష్యులసమరస, సత్య, శాంత, శమద
మాదులుగల పరిపూర్ణచిత్సమాధియొక్క యశోకాంతులు ప్రపంచ
మందంతటను వ్యాపించెను. సర్వకాలము లందును వారు చరాచర
ముల యంతర్బాహ్యముల సందులేక ప్రకాసించుచుండిరని భావము.

గ్రంథపఠనమా హాత్మ్యము.

కం. మహనీయ్యులారశ్రీగురు । మహనీయ్యకటాక్షలబ్ధమహిమాద్భు
తస । న్మహనీయ్యవిబుధకోట్లకు । మహిలో సువివేకవనధిమ
హిమగుకధనూ । దెల్పితిబోధ నాద్యంతముగనూ । అహర
హమాత్మసద్విహితాచలాఖండ । బహుళవిధిజ్ఞసాధకనివహముల
కెదుటమహిమగుకధనూ । దెల్పితిబోధనాద్యంతముగనూ. 28

తా. శ్రీ గురుకటాక్షము గలిగి, యఖండ పరిపూర్ణవిధిని
సాధించు మహనియ్యులగు బ్రహ్మవేత్తలారా! తమసన్నిధిలో సువి
వేకవనధి యను బ్రాహ్మణుని కదను బోధనరూపముగా నాద్యంత
ములు వివరించి చెప్పితినని భావము.

కం. ఈపరిపూర్ణవిలాసము । నీపరిపూర్ణానుభవము నెంతంతని నే । నే
పరిమితి నెంతునహో । నీపరిపూర్ణాబ్ధి నెంచ నెవరికితరమా । శ
క్యముగాదీయపరోక్షసుఖమా । యేపట్టుచూచిన నాపట్టుపరిపూ
ర్ణా । దీపితమై సర్వవ్యాపారముగదోచ నెవరికితరమా । శక్య
ముగాదీయపరోక్షసుఖమా. 29

తా. ఆహా ! యీపరిపూర్ణ విలాసము, యీ పరిపూర్ణాను భవము నెంత పరిమితియని నే నెంచెదను. యెచ్చటజూచితే నచ్చటంతా పరిపూర్ణమే ప్రకాసింపుచున్నది. అపరోక్షసుఖమైన పరిపూర్ణ మహాసముద్ర మిట్టిదని నెంచుట కెవరికి శక్యమగును? ఎవరికిని శక్యముగాదని భావము.

కం. నావలననెన్నదరమే । భావాతీతముగబట్టబయలై వెలిలో । నా
వలనీవలయుచలము । హావనసింధుమధ్యనిలచి నటులదోచెనుగా ।
దోచినదాత్మభావసూచనగా । నేవిధికార్యము గావింతునిక దేని ।
భావింతు నెద్దానిబోవిడిపింతు నాకటులదోచెనుగా । తోచినదాత్మ
భావసూచనగా. 30

తా. వెలిలో నావల నీవలభావమున కతీతమైన పరిపూర్ణ సముద్ర మధ్యను నేను నిలచినట్లు భావసూచనగా నాకుదోచెను. యీపరిపూర్ణ మిట్టిదని చెప్పుటకు నాకు శక్యమగునా ? కాదు. నేనే విధిచే కార్యము జేయుదును. దేనిని భావింతును దేనిని బోగొట్టెదను, పరిపూర్ణమైన నేనేమియు జేయజాలనని భావము.

కం. యీశుద్ధాద్వైతార్థము । వాసిగకందార్థములుగవర్ణించితి మ ।
ద్దేశికనాథునిమహదుప । దేశమహాద్భుతప్రబోధదివ్యముగానూ ।
పూర్వోత్తరభాగద్వయముగనూ । యేశాస్త్రవిద్యాదు లాసింపక
నుబ్రహ్మా । కోశగురుకృపవలన జేసితి గ్రంథముదివ్యబోధగనూ ।
పూర్వోత్తర భాగద్వయముగనూ. 31

తా. నేను యేశాస్త్రవిద్యాదుల నాసింపకుండా, బ్రహ్మస్వ రూపుడగు నాసద్గురుని మహదుపదేశములో నాకు జేసిన బోధ మగు నీయద్వైతార్థమును పూర్వభాగము నుత్తరభాగములని రెండు భాగ ములుగా, కందార్థములు జేసి వర్ణించితినని భావము.

కం. ఇలపూర్వభాగమందున । సలలితగురుతారకాది సాంఖ్యామన స్కా । దులనారుప్రకరణంబుల ! దెలిపితినే దెలసినంత దేశికుకృ పనూ । యోగశాస్త్రముల మర్మములనూ । తొలినేజేసినపుణ్యా ఫలముకొలది మోక్ష । ఫలితార్థశృతివాక్య పఠనశామగలిగే దేశి కూంకృపనూ । యోగశాస్త్రముల మర్మములనూ. 32

తా. పూర్వభాగమందున నేదెలసినంత వరకు నాదేశకుని కృపచేత యోగశాస్త్రమర్మములను తారక, సాంఖ్య, అమనస్క ముల నారు ప్రకరణములుగా జేసి తెలసితిని, యిదివరకు నేచేసిన పుణ్యఫలముకొలదిని మోక్షమార్గమునిచ్చు శృతివాక్యములు పఠించు భాగ్యము నాకు గలిగెనని భావము.

కం. ధరనుత్తరకాలమునను ! పరమచలముజూపియరుక భ్రమవిడిపిం చే । మరుగెరుకపరచిశిష్యుని । పరిపూర్ణునిజేయు బ్రహ్మపదవైభ వమూ । బ్రహ్మానందపరవశాద్భుతమూ । గురుకటాక్షలబ్ధ పరి పూర్ణసూచన । స్థిరముగనారుప్రకరణములదెల్పితి పదవైభవ మూ । బ్రహ్మానందపరవశాద్భుతమూ. 33

తా. ఉత్తరభాగమందు పరిపూర్ణమును జూపి, తరువాత నెరు క భ్రమను విడిపించే గోప్యమును శిష్యున కెరుకపరచి శిష్యుని పరిపూ ర్ణునిజేయు మార్గము బ్రహ్మానందపరవశము గురుకటాక్షము వలన గలిగిన పరిపూర్ణసూచన వీని నారు ప్రకరణములు జేసి తెలిపితినని భావము.

కం. ద్వాదశప్రకరణములనిటు ! నాదులమధ్యాంతములను నచటచట నునను । ద్బోధలనవశ్యవిద్యల । వేదాంతమహా రహస్యవిధులొక

కథగా । గ్రంథము జేసిబోధ జేసితిగా । వేదశుద్ధాద్వైతబోధగు
రుశిష్యసం । వాదములో బ్రహ్మబోధగలుగ సర్వవిధులొకకథగా ।
గ్రంథము జేసిబోధ జేసితి గా. 34

తా. ఈ శుద్ధాద్వైతప్రబోధ గురుశిష్యసంవాదములో, బ్రహ్మ
బోధ గలుగులాగున నానులమధ్యను, అంత్యమునను, అచ్చటచ్చట
వేదాంతరహస్యవిధులు జేర్చి పంద్రెండు ప్రకరణములు గల యొక,
కథగా గ్రంథము జేసి బోధజేసితినని భావము

కం. మున్నూటిరువదితొలికథ । నెన్నగనన్నూట డెబ్బదేనొకకథగా ।
నన్నియుకందార్థమ్ములు । పన్నగనొకసరణిగూర్చిపలికితి కృతిగా
నీపరమార్థమేకపాఠముగా । మున్నుసద్గురునిచే విన్నకన్నబోధ ।
లన్నిజేర్చియుమద్విన్నప మిదేయనిపలికితి కృతిగా । నీపరమార్థ
మేకపాఠముగా. 35

తా. ఇదివరకు నేను నాసద్గురుని వలన విని అనుభవమునకు
దెచ్చుకొనిన బోధలన్నియు, జేర్చి, మొదటి కథ యిన్నూటిరువది.
రెండవది నన్నూట డెబ్బదియైదు, కల్లు (795) యేడు వందల తొం
బదియైదు కందార్థము లొకటే పుస్తకమునందు గూర్చి, కృతిజేసితి
నని భావము.

గ్రంథరచితభక్తాభిధానము.

కం. అన్నంరాజుసువంశో । త్పన్నుడశ్రీగురుకటాక్ష పాత్రుడమోక్షా
పన్నుడభూసురుడనుసుగుణో । న్నతమానసుడైన రామయోగిని నే
నూ । నార్యులుప్రేమగన్నపుత్రుడనూ । విన్నపమిదేపెద్దలన్న
మహాత్ముల । సన్నిధిశిష్యుడై యున్నట్టిశ్రీరామయోగిని నేనూ। నా
ర్యులుప్రేమగన్న పుత్రుడనూ. 36

తా. అన్నంరాజువారి వంశమునందు బుట్టినవాడను, గురు
కటాక్షమునకు పాత్రుడను, మోక్షేచ్ఛగలవాడను, బ్రాహ్మణు

డను, సుగుణములుగలవాడను, పెద్దలు ప్రియముచే గన్న పుత్రుడను, పెద్దలనబడిన మహాత్ముల సన్నిధిలో శిష్యుడనై యున్నట్టి రామయోగిని నేనని భావము.

కం. శ్రీరామనామపరశివ । తారకమంత్రాభిధానత నుపాసనవి । స్తా
రముగ జేసియాత్మవి । చారులచే యోగశాస్త్రసమ్మతి గానూ । గు
రు తెరిగి నేపరమార్థముననూ । తారకత్రయబోధలారూఢిగను స
ర్వ । కారణపరిపూర్ణధీరయచల బోధానమ్మతిగానూ । గురుతె
రిగి నేపరమార్థముననూ.                                      37

తా. పరశివునకు నాధారమగు తారకమంత్ర మనుపేరుగల శ్రీరామనామమును విస్తరముగా, నుపాసనజేసి బ్రహ్మవిచారులచే యోగశాస్త్ర సమ్మతిగా పరమార్థమును గ్రహించి, తారకత్రయ బోధలారూఢిజేసికొని దేశికస్వామి కటాక్షమున పరిపూర్ణబోధను జెందితినని భావము.

కం. బాలత్వము మొదలుగ యో । గలంబికమైనకృతులుగావించి త
దీ । య్యాలోలతఖండాచల । మూలము బోధించుటకును ముఖ్యా
ర్థముగా । గ్రంథము జేసి మేలు జెందితి గా । చాలగమునికుల శీలు
లైనయాత్మ । లీలావిలాసుల కాలవాలంబైన ముఖ్య గ్రంథము
గా । గ్రంథము జేసి మేలు జెందితిగా.                           38

తా. నేను బాల్యమునుండియు యోగాలంబికమగు కృతులు జేసి తద్విచారముచే నఖండపరిపూర్ణమూలము బోధించుట కుపక రించు గ్రంథము జేసి కృతార్థుడనైతిని. ఈగ్రంథము గురుపుత్రులగు బ్రహ్మవేత్తలకెల్లరకు ముఖ్యమైన గ్రంథమని భావము.

క. ఈసువివేకవిలాసము । భాసురమభ్యుదయమగుచు పరిపూర్ణమ
న్నో । ల్లాసపరంపరవృద్ధివి । శాసతనాచంద్ర తారకస్థితిగానూ ।
వాసికెక్కు నీసద్గ్రంథమునూ । యీసుచరిత్రమత్యాశ చదివినవినిన

దాసకోటులు మోక్షధీసమన్వితులౌతారకస్థితిగానూ । వాసికె
క్కు నేనీసద్గ్రంధమునూ. 39

తా. ఈసువివేక విలాసము పరిపూర్ణబోధను జెందగోరువారి పరంపరాభివృద్ధి జేయుచు సూర్యచంద్రులుండువరకు వాసికెక్కును. యీగ్రంధమత్యాసక్తితో చదివినవారికిని వినగురుపుత్రులకు తప్పక మోక్షము గలుగునని భావము

కం. ఈకంధార్థములనుజను । లాకర్ణించినను చదువనర్థగ్రాహ్యా ।
లోకనగలిగినమోక్షము । చేకురు నిహసౌఖ్యములును జెందుదు
రిలనూ । అష్టైశ్వర్యాధిక భోగములునూ। ప్రాకట ధనకనకనీ దా
పుత్రమిత్రలోకబంధులతోటి । శ్రీకరులై ముక్తిజెందుదు రిలనూ
అష్టైశ్వర్యాధిక భోగములునూ.

* ప్రక్షిప్తము. *

తా. జనులీ కందార్థములను వినినను, చదివినను, అర్థగ్రాహ్యజ్ఞానము కలిగినను మోక్షమును జెందుదురు. ఇహపరసౌఖ్యములు గలుగును. అష్టైశ్వర్యభోగము లనుభవించెదరు. ధన, కనక, వస్తు, వాహన, దారాపుత్ర, మిత్ర, బంధువర్గములుగలిగి లక్ష్మీసమేతులై ముక్తి జెందుదురని భావము.

కం. సకలాఘనిరాకరణ । వ్యాకరణంయాదినారాయణగురుకృపచే ।
శ్రీకరకందార్థమ్ములు । చేకొనిశ్రీరామయోగిచేనవ్యా నరిగా ।
నవరించినది వేంకటప్పయగా । యారామయోగివ । రారాధకు
డువేంక । టరామిశెట్టి శిష్యరాజధనముచేనవ్యోనునరిగా । నవ
రించినది వెంకటప్పయగా. 41

తా. అపరోక్షవిధవృద్ధినట్టియు, పుట్టుక లేనట్టియు. అచల స్వరూపుడైనట్టియు, ఆత్మప్రకాశుడైనట్టియు, బ్రహ్మానంద మయుడైనట్టియు, దివ్యమంగళ విగ్రహులైన యాదినారాయణ గురుసార్వభౌమునకుమంగళమని భావము.

కం, మంగళముగురుమహాత్మక। మంగళమపరోక్షవిభవమంగళమభవా,
మంగళమచలమహార్ణవ । మంగళమాత్మ ప్రదీపమహితకలాపా ।
ఆదినారాయణగురురూపా । మంగళప్రదదివ్య మంగళ విగ్రహా ।
మంగళమానందమంగళాత్మకజయమహితకలాపా । ఆదినారాయ
ణగురురూపా. 42

శ్లో. నమోబ్రహ్మస్వరూపాయ। నమోబ్రహ్మకళాత్మనే । నమ స్తేకారణే
శాయ । గురూణాంగుర వేనమః॥

ఇది శ్రీమత్పర బ్రహ్మవిద్యాధికారగురు సాంప్రదాయక శ్రీమదాదినా
రాయణ గురుపాద పద్మారాధక శ్రీరామ యోగియతీంద్ర విరచిత
శ్రీమదఖండపరిపూర్ణాచల బ్రహ్మానందామృత సాగరంబను
శుద్ధాద్వైత ప్రబోధగురుశిష్య సంవాదంబున నుత్త
రభాగంబున శిష్యస్వాత్మగోచరాఖండ పరిపూ
ర్ణలక్షణ శ్రీమదఖండ బ్రహ్మైపరత్యై
కాంత గురుశిష్య విలాసలక్షణ
గ్రంథ పరిసమాప్త మహా
జన స్తవమహదా
నందవిధానాదులుం
గలపష్ఠమప్ర
కరణము.

సంపూర్ణము.

శ్రీ కృష్ణార్పణమస్తు.

---



శ్రీఘూళిపాళ్ళ గోపాలకృష్ణయోగీంద్ర విరచిత

# వేదాంతకీర్తనలు



## చూర్ణిక.

నిత్య శుద్ధ బుద్ధ నిరంజన రూపం । ప్రత్యగాత్మ స్వరూపం । నిరవంద్య నిర్వికార నిశ్శేష నిశ్శబ్ద నిరామయరూపం । జగద్దీపం । పరమజ్ఞాన దు:రంధరాధిపత్య శ్రీరాజయోగప్రబోధ ప్రసన్న పూర్ణం। స్వయం జ్యోతిరానంద పరిపూర్ణం । క్షేత్రత్రయ దీక్షాత్రయ నేత్రత్రయ లక్ష్యానుభవవేద్యం । ప్రకృతి విచ్ఛేద్యం । అస్థూలమణవ్యమ నిర్దేశ్య మగ్రాహ్యమస్పర్శమ రూపం । నిర్వికార స్వరూపం । గోపాలకృష్ణయోగి హృత్కమల కర్ణికాంతర్గత నిక్షిప్యమాన మార్కండ గురుపాదారవిందం । జగదేకకందం । భజామి । భజామి॥

## కీర్తన - హిందుస్తాని - తోడి.

చిన్నికృష్ణుని పాదాములు చిత్తామందూ నుంచారే । నన్నా తరమూ కానీ వానీ పన్నూగా ధ్యానించారే॥ చిన్ని॥ సంసారాలతాల విత్రు సాన్నిధ్యామూనొందారే । హింసారహితాధర్మామూనా । హాం సోహంబనుచుండారే॥ చిన్ని॥ పదమూలాంగము జూడాజూడా మదికీవింతా తోచూనే । విదితా తేజముచాలా జూట్కికి విస్మాయం బొనరించూనే॥ చిన్ని॥ ముక్కోణపు చుక్కాణిలో వ్యక్తీచే గనుచుండారే । నెక్కాడాచూచినా వకడై పిక్కాటిల్లూమందూనే॥ చిన్ని॥ వాదాభేదారహితామైనా సాధూ సంగతిజేరారే । ఆదీ మధ్యాంతములూ లేసి ఆపోజ్యోతినిగానారే॥ చిన్ని॥ వెల్లివిరిసీ గోపాలాహృత్పల్లావమునా వెలసీనా । చల్లా మార్కండేయూ గురుపద సరసిజమ్మూ దర్శింపారే॥ చిన్ని॥

## కీర్తన - హిందూస్థాని - బేహాగ్ రాగము.

పరమగురుని స్మరణంబె ధరలో పావనమైనదిగా । సారాసార విచారుల జేరుట సారంబైనదిగా॥ పరమ॥ యీవ లావలా లేని నట్టనడి దారినబోవలెగా । భావములందున సద్గురు నామము భజియింపగవలెగా॥ పరమ॥ కాయకవాచక మానస పూజలు జేయుచుండవలెగా । బాయక గురునీ అండజేరి భవభయము నణచవలెగా॥ పర॥ శృంగారంపూ బంగరు మేడ లోసంగతి గనవలెగా । మంగళకరుడగు మార్కండగురునీ మహిమ నెరుగవలెగా॥ పర॥

## కీర్తన - నాదనామక్రియ రాగము.

బ్రహ్మానంద మిఠాయిగొనరే బ్రహ్మవేత్తలారా । మహానంద మిఠాయిగొనరే మహాయోగులారా । ఆత్మానంద మిఠాయిగొనరే ఆత్మవేత్తలారా । తత్వవిమలకును తాయినొసగు యీ నిత్యమైన మిఠాయి । వేత్తల కెల్లను సత్తామాత్రము సత్యమైన మిఠాయి॥ బ్రహ్మ॥ ప్రజ్ఞచేత గురుయాజ్ఞనుచేసిన భోగ్యమైన మిఠాయి । సుజ్ఞానులకును సూటిగనుండును సులభమైన మిఠాయి॥ బ్రహ్మ॥ అధములకెల్లను అందరాదు యీయందమైన మిఠాయి । బుధవరులెల్లను భోగించెటి యతి మధురమైన మిఠాయి॥ బ్రహ్మ॥ లింగదేహమును భంగముజేసెటి శృంగారపు మిఠాయి । నింగి వెలుగు పంచరంగులుగల యీమంగళకరమిఠాయి॥ బ్రహ్మ॥ చల్లామార్కండ గురువరుపాదా పల్లవమందీతాయి । కొల్లగాను గోపాలయోగి తావల్లవించు మిఠాయి॥ బ్రహ్మ॥

## కీర్తన.

మోక్షంబూ గావలసియుంటే తక్షణమే రండీ । రక్షించేటి గురుని జేరీ రక్షణ నొందండి॥ మో॥ తనుమన ప్రాణా ధనములు గురునకు ధారాబోయండీ । వినయముతో గురుచరణమె గతియని

ననయము దలచండీ॥ మో॥ కులగోత్రా నామాదూలానూ కూల్చి వేయండీ । వలగొని సద్గురునాకెరగీ వరమూలడుగండి॥ మో॥ గురు శిశూశ్రిసాసరణీ యొక్కా గురుతూ దెలియండి। పరమాపద సోపానము లను బాగుగనెక్కండీ॥ మో॥ గురుడే త్రిమూర్తులనుచూ గురిచేనుం డండి । గురుడూ నరుడని భావములందున నరయాబోకండీ॥ మో॥ తానూ నేననెటీభ్రమను తగనూ విడువండీ । మానీతముగా భ్రాంతి రహితామార్గా మెుందండీ॥ మో॥ నీటిబుగ్గావంటిది దేహమునిజము గ నమ్మండీ యిది దాటీపోతే వేరే తెరవు లేదానుకోండీ॥ మో॥ అభి మానములుడిగీ గురునీయండ జేరండీ । దురభి మానాముచేతానెవరికి దొరకదు పరమండీ ॥మో॥ త్రివిధ ప్రాసాదము గురునిచె చేకొనవలె నండీ । వివిధాత్మైక భేదములనూ విడువావలెనండీ॥ మో॥ వరగోపా లుని పరగురుమార్కండ గురునీనమ్మండీ । తిరిగిరానీ పథమును వేగమె చేరాదలచండీ ॥మోక్షంబు॥

## కీర్తన.

(యక్షప్రశ్నలమెట్టు)

గురుసేవా విధులను నెరుగవలెరా । నితరమూ సేవలు. సేయవలెరా । తోరముగ శ్రీ గురునిగొల్వని వారలెవ్వారైన మో క్షద్వారమార్గం బెరుగకను భవపారవారమునందు బడెదరు॥ గురు॥ పరతత్వార్థ సిద్ధిని జేయూనట్టీ । పరమగురునెడ భక్తుడైనట్టీ। వరవివే కుడుబోధగొని నూ । స్థిరముగను భేదములు మానీ । పరమపదమం దిరమునందున నిరతమును సుఖయింపుచుండును॥ గురు॥ ఆత్మానాత్మ విచారీయైనట్టీ । ఆర్యాడగుగురునీ । పదయుగమూబట్టీ । అహారహ ము సేవింపుచుండగ నట్టివారీ మనసుకరగీ । అద్వైతబ్రహ్మను భవ మగు । నార్య మార్గంబెరుగజేతురు॥ గురు॥ గురుడు పరుడనుచు మది నెన్నావలెరా । పరిపూర్ణుండనుచు । భావింపవలెరా । నరుడు దైవము కరసిపూజలు సరసముగ నొనర్చువిధమున పరమగురునీ భక్తిచేతను।

నిరతమును బూజింపవలయును॥ గురు॥ గురుచరణ తీర్థము నంద వలెరా । గురు పాదాంభూళిని దాల్చవలెరా । గురుని భుక్తశేష భోజ్యము । గురుతుమీరగ నారగించీ । పరిపూర్ణసమాధి నిష్టను గురునిచే బడయుంగవలయును॥ గురు॥ గురువరుని యిల్లే కాశీపురమూ। గురుచరణ తీర్థమె పుణ్యజలమూ । గురుడె విశ్వానాథు డనుచును గురుసుమంత్రమె తారకంబని । గురునికంటే వేరులేదని గురుతు దెలసీ మనగవలెధర॥ గురు॥ గురుమూర్తికి పరిచర్య । లొనరించీ। నరనతనుమనుధనమూలర్పించీ । కరముత్రివిధ ప్రసాదములనూ పరగ నొందిన భక్తవరునకు స్థిరసుబోధామృతము ద్రాపీ । మరమపద సుఖప్రాప్తి జేయును ॥గురు॥ మహినిగోపాలాయోగీ యీవిధమూ । మార్కండాగురునీ మహనీయూపదము । మోదమెుమవగ సేవ జేసీ ముక్తినొందినట్టి మార్గము మానసంబుల సంతతంబును మరువకను పఠియింప వలయును ॥గురు॥

కీర్తన.

దేశికేంద్రా । సద్గురురాజేంద్రా । దేశికేంద్రా॥ దేశికేంద్ర మీసేవజేసెదను । భాసురాంగ మీదానునిబ్రోవవే ॥దేశి॥ పరమా తారాకా । మంత్రారాజామూ । పరమాగోప్యమానీ పరమవేత్త లూబల్కుచు నుందురు । పరంధామ యీమరుగుదెల్పవే ॥దేశి॥ దాసావార్యా । సద్గుణధుర్య । దాసావార్యా । యీశుడుపార్వతికెరి గించినయీ । భాసురబోధను పరగదెల్పెదను ॥దాసా॥ యింతంతన రాక । యంతనమునకా । యంతూహోచకా । వింతగనాపోజ్యోతి రూపమైకాంతిచేత ననంతమైనదీ ॥దాసా॥ పాతాకాహరణా । పరమ కల్యాణా । దాతాసీవేగానా । జ్యోతియుచటనేరీతిగ నుండునో । ఖ్యాతిదెలపి ననుగడతేర్పగదే ॥దేశి॥ కనులూమూశిమీరీ । కనుబొమ లానాడీ ఘనభాటలోజేరీ । అనయము నద్వాదశాంతరంగమున । మన సునిల్పి యీమహిమ గాంచుము ॥దాసా॥ దారిజోచదూ ।

తారాకాజ్యోతి జాడా తెలియాదూ । శారదవినినేకష్టము నొందగ । తీరముజేర్చే భారముమీదే ॥దేశి॥ ఆరూచక్రమూలా । మీరీనాన హస్రారమునజేరా । ఆరూషిగ దేవదారియున్నదీ । దారినబోవగఘేరుడ వగుదువూ ॥దాసా॥ తొమ్మిదీ రంధ్రములూ । గలవృత్తమ్మునకూపై గానూ । యిమ్మగత్రివిధబిలమ్ములనడి । బీలమ్మునవెలిగే నార్యుండె వడా ॥దేశి॥ యిదియేబ్రహ్మమూ । మార్కండాగురునీ నదమలా రూపమూ । యిదెగోపాలదాసను భవతత్వము । యిదెయోగాంత ఘనశోధనమూ॥ దాసా॥ శరణూమామాహేశ్వర । జదదాధారా । శరణూసద్గురూవారా । శరణజేయనను కరుణించితిరీ । స్థిరబోధనునే మరువ నెప్పటికి॥ దేశి॥

కీర్తన.

యెంత మంచీ గురువరుండు । ఇంతిరొజూడూ భవచింతలుడు పుటకును మనచెంతనున్నాడు॥ యెంత॥ భేదవాద రహితా పరబోధ రూపుడూ । ఆది మధ్యాంతములులేని యనాదిపురుషుడూ॥ యెంత॥ ఎరుకపొందు విడచునాట్టి తెరవుజూపెనే । పరిపూర్ణమునందు మనసు పరగనిల్పెనే॥ యెంత॥ కులగోత్రా నామములను కోసివేసెనే । పలు విధ సందేహములను బాయుమనెనే॥ యెంత॥ తనుమనధన దక్షిణాలను తానుగొనేనే । యనలేని ప్రసాదమూను మనకునొసగనే ॥ యెంత॥ గోపాలకృష్ణయోగికి ప్రాప్తియున్నాడూ దీపితమార్కండయచల గురు నేనన్నాడు॥ యెంత॥

కీర్తన – మలయమారుత ఏకతాళం.

పార్వతీపతీ । సర్వలోకగతీ। పార్వతీపతీ॥ నిర్వికల్పభాతీ । నిరుపామానమతీ॥ పార్వ॥ కరుణాకర పరమేశ్వర । పురాణపురుషార్థసార పరమార్థము దెలుపవేర । పరమశివాకరుణించర॥ పార్వ॥ ఫాలనేత్ర భసితగాత్ర । పాపహరణ వరపవిత్ర। పాలితజనభక్త స్తోత్ర । పాహిమాం మురహారుని మిత్ర॥ పార్వ॥ స్వప్రకాశ జగదీశ స్వానుభూతి స్వాదురసా । పరమేశ్వరగోపదాస । పాలిత కైలాస॥ పార్వ॥

## కీర్తన - నవరోజు ఆదితాళం.

మనసా మోహజాలామేలనే నీకు । మనసా మోహజాలామేలనే॥ నీ నిజమును నీ వనిశము నెరిగేను । జ్ఞానము నొందగలేకా॥ మనసా॥ మానమత్సరాదుల జెనగొనికడు । హీనతనొందగనేలే॥ వో మనసా॥ మందబుద్ధిచే । బంధములనుబడి । నిందలుబడ నీ కేటికే॥ మనసా॥ చిట్టచివరకును పుట్టని గిట్టని ! గుట్టును దెలియగరాదటే॥ మనసా॥ ఖండముగా కాఖండరూపమార్కండ గురుని యండజేరూ॥ మనసా॥

## కీర్తన - చాపుతాళము.

శ్రీమహాదేశిక స్వామీ పాదయుగళమే మారకకుదలచావే। ఆమహాన్నతు పాదయుగళము నీమముతో బూజింప సర్వభ్రామికలు విడిపోను మాయానామరూపా రహితమగునూ॥ శ్రీమ॥ సుత సహోదరాత్మ హిత బంధుమిత్రాదు । లతిచంచలంబనుచూనూ । మతిని స్పష్టంబుగను నెరుగుచు, సతతమును గురుమంత్రరాజమె । గతియటంచును నమ్మి యదియే పతితపావనమనుచు నెప్పుడు॥ శ్రీమ॥ స్వానుభూతి రసామృతమున బ్రహ్మానందమును గ్రోలూచూ । నేను నీవనుభ్రాంతి నొందక । మేను గుణములు విడచి సర్వము నేనుగానిది యేమిలేదని । పూనికతో పరతత్వములు గని॥ శ్రీమ॥ బహిరంతర వ్యాప్తసహజా బ్రహ్మానందమహితా మార్కండా గురునీ చరణల హారహము గోపాలకృష్ణుడు విహితమున సేవించి విషయా గహనమును దహియించి మించిన మహిమనెన్నుచు మమత లుడుగుచు॥ శ్రీ॥

## కీర్తన - మలయమారుతము - ఏకతాళము.

శరణుజేసెద। వరగురూరూవరునాకూను । శరణుజేసెదా । అరమరలులేక పరిపూర్ణా భక్తిచే నిరతామూ వేడూచూ నిర్గుణునకునే॥ శర॥ ప్రజ్ఞానం బ్రహ్మనెటీ । నంజ్ఞానూ దెల్పినా । యజ్ఞానా ముడిపీనా యూ దివ్యామూర్తికి॥ శర॥ అహంబ్రహ్మాస్మినీ । యూరూఢీ

జేసీ ఇహా । మోహాంమెడబాపీన మహనీయూనాకూనే॥ శర॥ తత్వమ స్యార్థము నిశ్చయము బోధించి । వే త్తనుజేసిన వేదవేద్యూనాకూను॥శ॥ అయమాత్మా బ్రహ్మానుభావము నందించి । భయమెడలించినా భవ్యతేజూనాకూను॥ శర॥ అంతా బ్రహ్మంబానూ । సంతానెరిగించి నా । చింతాబాపిన మా । నంతునకనయము॥ శర॥ ఆదిసి త్రివిధప్రసా దమూలామాతాభేదాముం బాపీనా బోధాగురునాకూనే॥ శర॥ మహి గోపాలకృష్ణయోగిమానసవాసీవై మహిమాజెల్పినయట్టి మార్కం డాగురునాకు॥ శర॥

కీర్తనా - మలయమారుత - ఏకతాళం.

దారి జేరవే । పాపిష్టిమనుస నీవు । దారి జేరవే॥ గురిచేత మీారీ । పరమాగురుని జేరీ । అరమరలుదీరీ। పరమూంచేరగోరీ॥ దారి॥ గురుభక్తిలేసి పా । మరులపొత్తు మాని । గురుసుతులగోని । స్థిరసు నిష్టబూని॥ దారి॥ భేదవాదమూడి । సాధుజనులగూడి । సరసవాక్కు తోడీ సద్గతిని వేడీ॥ దారి॥ పుట్టీ గిట్ట నట్టీ । వట్టీ మొసకబట్టీ । పుట్టీ ముంచునట్టీ । గట్టీగురుతుబెట్టీ॥ దారి॥ కన్న తిన్న వన్నె సున్నాయ నుచు దన్నీ । నున్నాదన్నదాన్నీ । పన్నాగాను నెన్నీ॥ దారి॥ అకుటిల తనుబొందీ । ఆర్యాకరుణ నొందీ । అన్ని వృత్తులడిందీ । అచల సుఖము నొందీ॥ దారి॥ మహిసీగోపదాసు । మానానానివాసు । మార్కండాచలేసు । నీమమత వీడజేసు॥ దారి॥

గురుశిష్య సంభాషణము - మహావాక్యవిచారము.

శ్రీ గురునాథా శరణుజేసెదను । శీఘ్రమెనను కరుణించుమా । దేవా బాగుగానుమన్నించుమా॥ తాపత్రయముల దావాగ్నిసినే । తల్ల డమందితి స్వామీ । వేగ కాపాడుము యంతర్యామీ॥ సుగుణాకర నీనూత్మతకలరితి తగుబోధను నెరుగింతూ । నీ భయమెల్లను విడి పింతూ॥ సులభమైన మార్గంబుచేత నాచలనమెల్ల బోజిమ్మా । యాచల భావము నాకిమ్మా॥ మహావాక్య విచారజీవ పరమాత్మైక్య

మె మోక్షంబు యిది మలిన రహిత మార్గంబూ॥ మహా వాక్యంబన నాత్మైక్యంబన మరుగు నెరుగ గురుమూర్తీ । నీమరుగు జెప్పుసూక్తీ॥ ప్రజ్ఞానం బ్రహ్మంబనగా ప్రజ్ఞయె బ్రహ్మంబాయే । యది ఋగ్వేదపు రుక్కాయె॥ ఆబ్రహ్మంబే నేననుభావము । అహంబ్రహ్మాస్మియానా । యది యలరె యజుర్వేద మూస॥ సమరసమున తత్వమసి వాక్యము సాధనజేయుచు నుండూ । యది సామ వేదమున నుండూ॥ అయమాత్మా బ్రహ్మంబను వాక్యము అధర్వణమున నుండూ యది అంతా తానై యుండూ॥ యీచతుర్విధ వాక్యార్థములచే నింపుగ నను కడతేర్చూ । మీ పుత్రులలో నను జేర్చూ॥ మూడవ వాక్యపు ముసుకుదీసి నీ మూర్ఖత మాన్పద నోయీ । యా భావము గనుగొనవోయీ । తత్పద త్వంపద యసిపదములు । గణియింప పదములూ మూడూ । వానిభావము దెల్పనచూడూ। త్వంపదార్థమే జీవుండగు మరితత్పద మీశుపరంబూ । చూడనశిపదార్థమైక్యంబూ॥ జీవేశ్వర రూపంబులు తేటగ భావమునకు తగబల్కూ । నిర్భావులలోననుగల్పూ॥ అధిష్టానచైతన్యారోపిత అల్పత్వాది గుణంబూ । లవి యాజీవుని రూపంబూ॥ మాయాధిష్టత బ్రహ్మప్రతి ఫలితమది సర్వజ్ఞత్వంబూ । కననీశ్వరు నీరూపంబూ॥ అసియనగా జీవేశ్వరైక్యమని యలరుచు తెలియగదోయీ । నిభావము స్థిరపరుచోయీ॥ స్వల్పగుణునకును సర్వగుణునకును సంధియెటుల వర్తించూ। పరసంధి దెల్పిరక్షించూ॥ చిన్నితనయనీకున్న కుశలతకు నెన్నరాని ముదమయ్యే। నాకున్నధనమునీదయ్యే॥ వాచ్యార్థమువిరోధమైనచో లక్ష్యార్థము యోచించూ।యదియైక్యమందు బోధించూ; లక్షణలక్ష్యము లెరుగనినాకు కటాక్షమునను వివరించూ । యాసూక్ష్మముతగవర్ణించూ॥ విడచిన విడువని । విడచి విడువని లక్షణములు మూడుండూ వాని నడవడులను వినుచుండూ॥ కడుముదమున గంగాయాంఘోషన విడచిన లక్షణమందూ । దాని బోధించెదనికముందూ॥ కడువడిమంచాః క్రో

శంతనగను । విషువని లక్షణమవ్వనూ దీని నడవడినిక తెల్పేనూ॥ సోయం దేవ దత్తాయనగను సారది విడచి విషువసిదీ । యీభావము తానై యుండి। గంగయందు గొల్లపల్లెయున్న దన గనుటకు బహు చోద్యంబూ । దాని దరినున్నది నిజంబూ॥ మంచ విషువకను మంచ మీదివాడంచితముగ ఘోషించూ । నని నెంచి మదిని పరికించూ ॥ దేశకాల రూపంబుల ద్రోసిన వాసిగ దేవదత్తుండూ । వాడేనునివలెనే యుండూ॥ దేవదత్తునీ లక్షణ భావమె జీవేశ్వరయైక్యంబూ । యీ భావము బహు గోప్యంబూ॥ దృశ్యము నెరిగే చైతన్యమె ప్రత్యగాత్మని తలచగదోయీ యీవశ్యమునిదె నీవోయీ॥ సర్వజ్ఞుండవు, సర్వాత్ముండవు, సర్వమయుండవు నీవూ । యీబోధను నికమర చేర్చూ॥ చల్లామార్కండ గురుబోధను నెగజల్లెను గోపాలుండూ । భువిపల్లవించె చేకొండూ॥

అచలకీర్తన - భైరవిరాగము.

అచలమహిమ దెలియనందరి తరమా నే నార్యులదయ లేకనూ। సచరాచరములెల్ల సర్వమూ తానై వచియించుటకు యిట్టిదనుచు తెలియరాని ॥అచల॥ సత్యాసత్యము లేక సాక్షియు తాగాక యే యుక్తిచే దెలియబడక । నిత్యనిరామయ । నిర్మల। నిర్గుణవృత్తిరహితమైన ప్రత్యక్షదైవము ॥అచల॥ పుట్టుట పెరుగుట గిట్టుటలును లేక చట్టువలె తానుండూనూ । అట్టిట్టిదనుచూపలవిగాదు తెలియా । వట్టి భ్రమలచేతా । పట్టుపడనియట్టి ॥అచల॥ పెరుగదు విరుగదు । వొరుగదు । తరుగదు । కరుగదెప్పటికైనా । నిరతము నొకరీతిగానే యున్నదిబయలూగురుని సూచనచే తామరుగు లేకనునుండు ॥అచల॥ స్త్రీపురుషరూపాదీ చిన్నె లేమియు లేక । సిద్ధముగనున్నాదీ । పాపపూదాపూ లేక రూపూ నామము లేక । నేప్రొద్దుజూచీ నాయేకమైవున్నాదీ ॥అచల॥ జగమావలనిదియే । జగమీవలనిదియే అగణితముగనున్నాదీ । మగువషండుడుగాక । పగలురాత్రియు లేక సకలవేదశాస్త్రం

బులుతాగానీ ॥అచల॥ అదియిదియని తెల్పనలవిగాకున్నాదీ యాదీ యంత్యము లేనిదీ । కదలక మెదలక । వదరక నెప్పుడు సకనాతీతం బగు సద్గురుపదమైనా ॥అచల॥ కర్మూ రాగ్నులురెండుకలసీ తామేక మైకానూపించని విధమూనా । గురుశిష్యులనిగోటి గురుతు తెలియ కుండా పరగుచున్నది యీపరిపూర్ణ బ్రహ్మము ॥అచల॥ యీవృత్తిబట్ట బయలే మీ లేదనుచూ । నేద్వాదశాక్షరి తెల్పానో । ఆయెత్తుగురు నీచేస్వాయత్తాపరచీనా । పైయెత్తూతానేనై బ్రహ్మమైనిలచూనూ ॥అచల॥ అంతూ లేనిదీని నెంతని వివరింతు వింతాదోచుచున్నాదీ । వం తములాడదే చింతలడగులడు అంతట నిండియానంతమై యున్నాదీ ॥అచల॥ మహినీగోపాల కృష్ణయోగీవరునకును । మహనీయాచల మార్కండగురుడూ । విహితసూచనచే తావిరళించీదెల్పినా బహుగో ప్యమైనట్టి భావరహితమగు ॥అచల॥

పాటలు బువ్వము పంక్తిపాట

కూటస్థాచైతన్యాబువ్వమూ । బోటీరోచిద్విలాసా నై భవమూ । దీటూ లేనీస్వప్రకాశమూ। మేటీగురుకృప నీబోధాగనుమూ॥కూ॥ప్రణ వరనమంగళ తూర్యములూ। గణనాతీతయోగాభోగ స్త్రీలూ।మణినూ పుర అంతర్నాదములూ।ప్రణుతీగనరే యీపెండ్లీభోగములూ॥కూట॥ చీదాభాసాంగనలూ చెలరేగి।చిత్రచిత్రపూ ముగ్గులుదిర్చి। చిత్సమా ధీయను పీటాలూపరచి। సత్సమాధీయను విస్తర్లూ వేసీ॥ కూట॥భగవ ద్భక్తులు పరగనొకపంక్తి విగతరాగులు వేరొకపంక్తి।ఆగామార్గవిచా రులొకపంక్తి। యోగాభోగాదూలలరా నొకపంక్తి॥ కూటస్థా ॥ తత్వ జ్ఞానానందాదీపములూ । నిత్యతత్వమూ తోడా వెలుగా । వృత్తీరహి తా కాంతా తెల్లా । వేతృత్వముతో వడ్డన జేయా ॥ కూటస్థా ॥ స్వాను భావానందామనెటి । శాల్యాన్నాసూపాదూలుంచా । మాన్యతతో నోంకారాఘృతమూ మననములలరా వేయూచుండా ॥ కూటస్థా ॥ భక్తీ వైరాగ్యంబూలోనూ । పచ్చళ్లూ వడ్డించాగానూ । ముక్తీయనెటి

కూరా లెల్లా । శక్తికొలదీవడ్డనసేయా ॥ కూటస్థా ॥ దీక్షాత్రయంబూలనెటి భక్ష్యభోజ్య । లేహ్యములనూ । పక్షా పక్షా రహితమనెటి । లక్ష్యముచే వేయూచుండా ॥ కూటస్థా ॥ ఆత్మజ్ఞానానందా మనెటి । అతిరసము లొడ్డించాగానూ । అహారహితంబను అప్పడాలొడియాలూ ఆత్మలలరానటు వడ్డింపా ॥ కూటస్థా ॥ గురుబోధామృత క్షీరాన్న । ములూ । గురుతుచభరలొడ్డనసేయూ । అరుదైనాయూ నూభావమున ఆర్యులెల్ల నానందమునొంద ॥కూట॥ కొల్లాగా గోపాలాయోగీ । యుల్లామూనా వెలసీ యున్న । చల్లామార్కండ గురుపాదములు । యుల్లమానుటు వినుతీసేయా॥ కూట॥

బువ్వముపంక్తిపాట.

పరమాత్మానీ బువ్వముపంక్తికి । భోంచెయ్యారాండీ । తరుణులు । భోంచెయ్యారాండీ । పరసాధనపరులగుచూ మీరూ ప్రబలీయుండండీ॥ పర॥ పంచాముద్రాలను పన్నీటను బాగుగ గృహములికీ । చేడాలు । బాగుగ గృహములికీ । పంచావన్నెలముగ్గులు పలువిధ । సంచుగనూచిర్చి॥ పర॥ దశవిధమండల జ్యోతులకాంతులు । దిశలెల్లనువెలుగా । కాంతులు । దిశలెల్లను వెలుగా । దశవిధ నాదములను పాటలు బహు । విశదముగను బాడా॥ పర॥ రాగద్వేషారహితా మనెటి । యోగాపీటలునూ । మంచీ । యోగాపీటలునూ । ఆగామాను విచారంబను యరిటాకులు బరువగనూ॥ పర॥ ఉపదేశంబను పాత్రభికరణము । సఫలతత్లో జేయూ । మంచీ । సఫలతతో జేయా । తపసాధనమను పంచాభూతా పచ్చళ్ళా వేయూ॥ పర॥ అమనస్కమను శర్కరలెల్లను । సుమనోహరముగనూ । జిహ్వాకు । సుమనోహరముగనూ । కమనీయంబగు తరుణులు వేడుక । సమముగవేయగనూ॥ప॥ స్వానుభవంబనుపక్వాన్నములూ। పూనికెవడ్డించాయన్నము పూనికెవడ్డించా। మనములలరసుజ్ఞాన సూపశాకాదులునందుననచా॥పర॥ అతు. రదూపునిధలచుచు।దొప్పలచోష్యంబునునునచి। ముదముప।చోష్యంబు

నునుసచీ।లక్షణాల క్ష్యవిలక్షణాలనుమధుభక్ష్యము లొడ్డించీ॥ పర॥ ఆత్మ జ్ఞానానందాకరమనునతిరసములు వేయా।త్రియ్యని।అతిరసములు వేయా। అహరహితంబను నప్పాడా లొడియాల్బహుగతులను వేయా॥ పర పంకేరుహాలోచనలు చెలగి । తమశంకలువిడనాడీ । తమ । శంకలు విడనాడీ । ఓంకారంబను సద్యోఘృతమును జంకక వడ్డించా॥ పర॥ సారా సారా విచారంబను క్షీరాన్నము నొడ్డించా । క్షీ । రాన్నము నొడ్డించా । తారకయోగా సారమనెడిదధి కోరికెనందునచా॥ పర॥ మలినా రహితా గురుబోధనటీ సలిలాధారలనూ । బోధా । సలిల ధారలనూ । మలినరహితమైన యచల మందిర మందుననూ॥ పర॥ కొల్లగా గోపాలహృదయా । పల్లవనివసితుడూ । హృదయా । పల్ల వనివసితుడూ । చల్లామార్కండేయాగురుపద సరసిజముల గను చూ॥ పర॥

గొబ్బిపాట - నాదనామక్రియ రాగము - ఆదితాళం.

(శ్రీ)కరామార్కండా గురునీచేకొని గొబ్బాడారే । గొబ్బియ ళ్లో । గొబ్బీయళ్లో॥ అకళంకుండగు । గురునీజేరీ ఆత్మాబోధా బడ యరే॥ గొ॥ గొబ్బియళ్లో । గురుడేబ్రహ్మా । గురుడేవిష్ణు । గురుడే పురహరుడాయనే॥ గొ॥ గొబ్బీయళ్లో అట్టిగురునీ కరుణమనపై దిట్టా ముగనూకలిగెనే॥ గొ॥ గొబ్బియళ్లో॥ నిరుపమ నిర్గుణ బ్రహ్మాము నందీ నిఖిలలోక భ్రమగలిగెనే॥ గొ॥ గొబ్బీయళ్లో॥ ప్రకటిత శుక్తి కర జితంబనుచును భ్రాంతి దోచినటులాయెనే॥ గొ॥ గొబ్బీయళ్లో॥ అర యగస్థాణువుజూచి నరుడనుచునమ్మిన చందంబాయానే॥ గొ॥ గొబ్బి యళ్లో॥దాహవుగనియిదిదంతియనుచు బహుతహతహపడినటులాయెనే॥ గొ॥ గొబ్బీయళ్లో॥ యీరీతిగనూ భ్రాంతులు కలిగీ యింత నిజముగా దోచెనే॥ గొ॥ గొబ్బీయళ్లో॥ సద్గురుమూర్తి కరుణచేతనే । సంశయ రహితంబాయనే॥ గొ॥ గొబ్బీయళ్లో॥ నిత్యుండగు మన గురుదేవునిచే నిజము నిజముగా దెలిసెనే॥ గొ॥ గొబ్బీయళ్లో॥ కావున సర్వాదిష్ట

నంబగు కారణుడే పరుడాయెనే॥గో॥ గొబ్బియళ్లో॥ నీవే నేనికనితరము లేదని నిజమిదియనుచును దెల్పేనే॥గో॥ గొబ్బియళ్లో॥ జీవుడు నేననిభ్రాంతియెన్నటికి జెందకుమని బోధించేనే॥గో॥ గొబ్బియళ్లో॥ నీవేజగములు నీవేసర్వము నిశ్చయ మిది యని బల్కేనే॥ గో॥ గొబ్బియళ్లో॥ సంతతబ్రహ్మానందోహంబను స్వానుభవము మన మందితిమే॥గో॥ గొబ్బియళ్లో॥ కరుణచేత గోపాలయోగి తమ గురుబోధను మన కొసగేనే॥ గో॥ గొబ్బియళ్లో॥

తారహారతి - అసావేరి.

తారాహారతులివ్వారే । జిల్లెళ్ళాపాట్పుర । రాములాభ్రమాలజేర రే॥ పారావారగభీరుని మనమునజేరీ । సారాసారవిచారుల సంగతి జేరీ । గురిఖ్యారీ । తమిడేరీ॥ తారా॥ సగుణనిర్గుణా నాకారాదులు లేనీ । సర్వావస్థల సకలము తానగు వానీ । మదిబూనీ । లోగోనీ॥ తారా॥ జలజపత్రమున సలిలమునంటనిభాతీ । వెలుపల లోపల నిండిన వానికి బ్రీతీ । తగురీతీ బహునీతీ॥ తారా॥ సకల యత్నముల సాధనసందప గలిగీ । అకలంకుండగు దేశికు సన్నిధి మరిగీ । కడు నెరగీ । అహముడిగీ॥ తారా॥ ధరగోపాలుని హృద్గుహాంతరాఖేలీ । మార్కండగురు పద । పంకజమధుగ్రోలీ । యెుకజోలీ । మానిపోలీ॥ తారా॥

హా ర తి పా ట.

హారతివ్వారో నిర్వి । కారగురూనాకు శ్రం । గారవతులు బం । గారు పళ్లెరముల॥ హార॥ తారకయోగవీ । చారముచేతను । ఘోరకలుష సం । హారునకనయము॥ హార॥ బూటకనటనలగోటను, మీటేస్త్రీ । కూటవాసునీ । సూటిగా వేడుచు॥ హార॥ కాయకవాచక। మానసములనొాతక్షు । దాయిసేవవీ । ధాయక మెరుగుచు॥ హార॥ చండకోటి మార్తాండ తేజమున । నిండివెలుగుముని మండలనుతునకు హార॥ పుట్టి పెరుగనట్టి । రట్టడిమాయను । తట్టివేసియసలాగట్టు॥

నా జేరీ॥ హార॥ మహినీ గోపాలకృష్ణమానస వాసీయై మమతలుడిపి నట్టి మార్కండగురునకు॥ హార॥

శ్రీరామనామామృత రసాయనము.

1. శ్రీకరంబుగ పరమశివు సుస్థిరసమాధియౌ రామనామము
2. ప్రాకటంబుగ పార్వతమ్మకు పట్టుపలయగు రామనామము
3 పంచరంగుల మించియున్నా పరమపదమగు రామనామము
4. సంచితాగామములను ద్రుంచివేసెటి రామనామము
5. భక్తజనహృదయంబులందున పాదుకొన్నది రామనామము
6. జీవభావ రహితుడగు పరదేవుడే శ్రీరామనామము
7. ఈషణామల జిక్కువారల గాసిపెట్టెటి రామనామము
8. పాశములలో దగులువారల పాడుజేసెటి రామనామము
9. మనసునిల్కడ లేనివారికి మర్మమగు శ్రీ రామనామము
10. గురుని కృప జెందేటివారికి గురుతుజిక్కను రామనామము
11. ధర్మ కర్మంబులనురోసిన తత్వమే శ్రీ రామనామము
12. నిర్మలంబగు పరమపదమున నిత్యసౌఖ్యము రామనామము
13. ఇహవాంఛలనెల్ల నొదలిన విహితమగునది రామనామము
14. చూపులోన జూడ లోపలిజూపుయే శ్రీ రామనామము
15 మండలత్రయంబు దాటిన మరుగులేనిది రామనామము
16. మోహమడచెటి వారికెల్లను మోక్షమొసగెటి రామనామము
17. శత్రువర్గము ద్రుంచువారికి శాశ్వతంబగు రామనామము
18. మనసు మర్మము దెలిసినిల్పిన మహిమయే శ్రీరామనామము
19. పరరహస్యము దెలియువారికి బ్రహ్మమగు శ్రీరామనామము
20. ఎల్లతనువులయందునను విలసిల్లియున్నది రామనామము
21. ప్రాణనాథుని జాడ నెరిగిన బట్టబయలగు రామనామము
22. మాయమానని వారినెల్లను మాడ్చివేసెటి రామనామము
23. కాయముల శాశ్వతంబటన్నను కానరానిది రామనామము